# ఆచార్య రంగా
## — వివిధ దృక్పథాల్లో

మాలికా రచన

కిసాన్ శ్రీ



"రైతులోకమునకు రంగన్న, నీ సేవ
సాటిలేంది వేయిమాట లేల."

"నిన్ను దెలియనోడు, నీపేరు విననోడు
వుండబోడు తెలుగు మండలంలో"

శివారెడ్డి

కిసాన్ పబ్లికేషన్సు
బుర్రిపాలెం, తెనాలి.

# మా మాట

ఇది మా రెండవ ప్రచురణ. శ్రీ నర్రావుల సుబ్బారావుగారిచే రచించబడ్డ 'జర్నలిజం' మా తొలిప్రచురణ. ఈ గ్రంథాన్ని తెలుగు పాఠకలోకం ఆదరించి పుస్తక ప్రచురణ సంస్థలో కాలు నిలదొక్కు కునేందుకు మాకు అవకాశాన్ని కలిగించింది. భారత రైతాంగ వుద్యమ పిత ఆచార్య రంగాగారిని గురించి పలుప్రాంతాలలోని ప్రజానీకం యొక్క అభిప్రాయాలను స్వీకరించి ఒక గ్రంథంగా ముద్రించాలనే అభిలాష ఎప్పటినుండో మాలోవుంది. ఆ అభిలాష ఈనాడు కార్య రూపంలో పెట్టగలిగి, తెలుగు పఠితలకు ఈ గ్రంథాన్ని అందించ గలుగుతున్నందుకు ఆనందిస్తున్నాము.

భారత రైతాంగం ఆచార్య రంగాగారికి ఎంతగానో ఋణ పడివుంది. మన గ్రామాల అభివృద్ధికి ఆయన చేసిన కృషి రైతాంగ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించవలసివుంది. మేము ఈనాడు చేసిన కృషి ఆయన సేవను దృష్టిలో పెట్టుకుంటే, ఇది చంద్రునికి ఒక నూలుపోగు లాంటిది. రంగాజీ దృక్పథం ఏమిటో అనేకులు ఈ గ్రంథంలో వివరించారు. తెలుగు పాఠకలోకం మా ద్వితీయ గ్రంథాన్ని కూడా ఆహ్లాదంతో ఆహ్వానిస్తారని ఆశిస్తున్నాం. పుస్తకం సకాలంలో ముద్రణకు బాధ్యులయిన సౌమ్యహృదయులు శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్‌గారికి మా కృతజ్ఞతలు.

6—2—61
బుర్రిపాలెం

మా విధేయులు
కిసాన్ పబ్లికేషన్సు

# అంకితం



జీవితం తొలిమలుపులో వెలుగుబాటను చూపించిన పూజ్యులు
పెదనాన్న, పెదతల్లి శ్రీ సత్రావుల అంజయ్య
శ్రీమతి రాజ్యలక్ష్మి గార్లకు

# పీఠిక

భారత రాజకీయాలలో కనుపించిన ప్రముఖ రాజకీయ వ్యక్తులలో ఆచార్య రంగాజీ జీవితం అత్యంత ఆశక్తికరంగా వుంటుంది. పుట్టింది పల్లెటూరులోని రైతుకుటుంబంలో, చదివింది పాశ్చాత్య దేశాలలో అయినా ఆయన రాజకీయ జీవితానికి పునాదులు అప్పుడే ఏర్పడినవి. సిద్ధాంత ఘర్షణతోనే రాజకీయాలలో ప్రవేశించారు. దాదాపు నలభై సంవత్సరాల ప్రజాసేవ చరిత్ర వారికి వున్నది. ఇన్నేండ్లు ప్రజారంగంలో జీవితం గడపిన ఒక మహావ్యక్తిని ఆయన అభిమానులలోనేగాక ఆయన ప్రత్యర్థులలోగూడ ఆయనను గురించి ఒక అభిప్రాయము అనుకూలంగానో ప్రతికూలంగానో ఏర్పడి వుంటుంది. అటువంటి అభిప్రాయాలన్నీ చెదురుచెదురుగా వున్నప్పుడు వాటినన్నిటినీ పేర్చికూర్చి ఒక గ్రంథంగా తయారు చేయబూనటం ఎంతో ముదావహమైన విషయం.

రంగాజీ భారతదేశానికి ఒక వినూత్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. గ్రామాలలో తిరిగి వివిధ వృత్తులవారి ఆర్థిక స్థితిగతులను పరిశీలించి వారి వృత్తి స్వాతంత్ర్యానికి పరిరక్షణ కలిగించేందుకు చేసిన ప్రయత్నమే వారి వినూత్న సిద్ధాంతానికి దోహదమిచ్చింది.

అమాయకులైన గ్రామీణ ప్రజలను ఎవరు దోచుకుంటున్నారు, ఎలా దోచుకుంటున్నారు అనే విషయాలను ప్రప్రథమముగా ప్రజలలో లెక్కలతో – ఋజువులతో సహా విడమర్చి చెప్పిన వ్యక్తి రంగాజీ. వారికి అర్థమయ్యేటట్లుగా చెప్పటానికి వారితో సమ్మిళితమై నిరాడంబర జీవితం గడపుతూ వారిలో దాగివున్న నాయకత్వ లక్షణాలకు జీవంపోసి, చలనం కలిగించి, చైతన్యం పురిగొల్పిన ఆచార్యుడు రంగాజీ.

తన ఉద్యమాలకు మూలస్థంభాలను తయారు చేయటంలో ఆయన నూటికి నూరుపాళ్లు కృతకృత్యుడయ్యాడు. వేసంగి రాజకీయ పాఠశాలలు, రైతాంగ విద్యాలయం; ఆయన కళాశాలలు. వాటి ద్వారా వందలు వేలుగా ఆయన కార్యకర్తల్ని తయారుచేశారు. ఎన్నో ప్రజోద్యమాలు నడిపారు. ఒకవైపున బ్రిటిషు ప్రభుత్వంలో

మరొక వైపున జస్టిస్ పార్టీలో, ఇంకొక వైపున జమీందారులతో ఆయన నిత్యఘర్షణను నడుపవలసి వచ్చింది. అదే సందర్భంలో భయభ్రాంతులతో ఆర్థిక దుస్థితితో సతమతమౌతున్న గ్రామీణ ప్రజల్ని సంఘటిత పర్చటం సామాన్యంగా ఊహాకందని విషయము. అయినా సంఘటిత పరిచారు. అయితే ఆయన చేసే ప్రతి ప్రయత్నంలో తోడునీడగా భారతీదేవిగారు ధైర్యసాహసాలతో నిలబడి ఉండకపోతే అంత స్వల్పకాలంలో ఆయన భారతదేశమంతటిని గాలించగలిగి వుండేవాడు కాదేమో.

సామాన్య మానవుని దగ్గరనుంచి మహాత్మాగాంధీవరకు వున్న అనేక మంది ప్రేమ ఆదరాభిమానాలను చూరగొన్న ఆదర్శమూర్తి ఆచార్యరంగా. అటువంటప్పుడు వారందరికీ ఆయునపై వున్న అభిప్రాయాలను ఒక పూదండగా కుట్టటానికి శ్రీ కిసాన్ శ్రీ గారు ఈ సాహస కార్యక్రమాన్ని చేబట్టారు.

సాహిత్యానికి తగినంత ప్రోత్సాహంలభించని యీ రోజుల్లో అందులో రాజకీయ సాహిత్యానికి నిరుత్సాహం - నిస్పృహ ఏర్పడిన ఈ వాతావరణంలో ఈ సాహసకార్యం ఎంతైనా అభినందనీయము. ఈ ఉద్గ్రంథంలో శ్రీ కిసాన్ శ్రీ గారి ఆశయం నెరవేరిందని నా అభిప్రాయం. వారి కృషికి తగినంత ప్రోత్సాహం లభిస్తుందని నేను గాఢంగా నమ్ముచున్నాను. ప్రత్యర్థులనుంచికూడా ఇంకా హెచ్చుగా అభిప్రాయాలు వచ్చియున్నట్లయితే ఇంకా బాగుండేది.

ఈ విషయం అనుకున్నంత ఆశాజనకంగా లేకపోయినప్పటికీ ఉన్నంతలో తృప్తికరంగానే వున్నది. ఇలాంటి పుస్తకం ఎప్పుడో బయటికి వచ్చివుండవలసినది. వీలైనంతవరకు చర్విత చర్వణము గాకుండా సంకలన కర్త కృషి చేశారు.

వివిధ దృక్పథాలలో రంగాజీని అర్థం చేసుకోవటానికి ఇటీవల కాలంలో వెలువడిన రచన లన్నింటిలో కంటె ఈ పుస్తకము ఆంధ్ర పాఠకలోకానికి అతిముఖ్యమైందిగా వుండగలగటం నిస్సందేహం.

యడ్లపాటి వెంకట్రావు

4—2—1961.

# ముందుమాట

భారత కర్షకోద్యమ పిత ఆచార్య రంగాగారిని గురించి ఆంధ్ర దేశంకన్నా, ఆంధ్రేతరులు ఎక్కువగా ఎరుగుదురు అనేమాట మనకు తరచుగా వినిపిస్తూ వుంటుంది. ఇందులో సత్యం లేకపోలేదు. కాని ఆంధ్రులు, ఆంధ్రేతరులు రంగాగారిని గురించి ఏలాంటి అభిప్రాయాలు కలిగివున్నారో తెలుసుకోవాలనే కుతూహలం ఈనాడు రాజకీయ పరిజ్ఞానంగల అనేకమందిలో వుంది. దానికి అనేక కారణాలు వున్నవి. భారత దేశంలో రైతు సమస్యలపట్ల నిరంతరం ఆందోళన చేస్తున్న వ్యక్తులలో ఆచార్య రంగాగారు అగ్రగణ్యులనే విషయం నిర్వివాదం. ఆయన నడిపినన్ని ప్రజావుద్యమాలు ఈ దేశంలోనే కాదు, ప్రపంచంలోని ఏప్రాంతంలోకూడ ఎవ్వరు నడపలేదు. గ్రామీణ వ్యవస్థకు మూలకందమైన రైతువద్దనుండి, చేనేత, చేతిపరిశ్రమ, బుద్ధిజీవుల, కళాకారుల, శ్రామికుల యిబ్బందుల నన్నిటిని దృష్టిలో పెట్టుకుని ఆయన రాజకీయ రంగంలో కృషి చేసారు. రైతులు చైతన్యవంతులని నిరూపించటమే కాకుండా స్వయంపోషకులైన ఈ తరగతులవారి స్వేచ్ఛామనుగడకు తను ఏలాంటి విమర్శలకు గురి అయినా లెక్క పెట్టకుండా, నిరంతరం శ్రమిస్తున్నారు. ఈ దేశంలో రైతు స్వామ్యం పునాదులు కదలకుండా, దాని సుస్థిరతకు రైతులంతా కృషి చేయాలని విజ్ఞప్తి చేస్తున్నారు.

జమీన్ రైతు వుద్యమంనుండి నేటి స్వతంత్రోద్యమం వరకు వారు నడిపిన వుద్యమాలు అనేకం. వారి కృషిఫలితంగా జమీన్ దారీ రైతుల యిక్కట్లు తొలగిపోయినయ్. వారి కృషిఫలితంగానే కంట్రోళ్ళపీడ వదలి పోయింది. వారి దూరదృష్టిలో లోపం లేనందు వల్లనే 1955 లో ఈ ఆంధ్ర దేశం కమ్యూనిస్టుల పీడనకు గురికాకుండా వుండిపోయింది. కాని రంగాగారు ఎన్ని చేసినా ప్రజలు మాత్రం ఆయనకు అధికారం యివ్వలేదు. ఎన్ని వుద్యమాలు నడిపినా వారి శిష్యులు మాత్రం వారిని అనుసరిస్తూనే వున్నారు. ఎన్ని పార్టీలు స్థాపించినా ఒకటే సిద్ధాంతంవారు మొదటనుండీ ప్రవచిస్తున్నారు.

ఆశేష ప్రజల ఆదరాభిమానాలుగల ఆచార్యరంగాగారు ఏ లోపం వల్ల అధికారంలోకి రాలేక పోతున్నారు? తాను ప్రవచిస్తున్న సిద్ధాంతాని కనుగుణంగా భారతదేశంలో రైతురాజ్యం ఏర్పాటుకు వారికి అవకాశం ప్రజానీకం ఎందుకు యివ్వలేదు. దీని కంతటికి కారణాలు ఏమిటి? ఆయన ఎన్నో వుద్యమాలు నడిపారు. అన్నీ జయప్రదంగానే ముగిసినాయి. కాని ఆచార్యరంగాగారి అసలు దృక్పథంమాత్రం ఆంధ్రదేశం అర్థంచేసుకోలేదు. ఆయన సిద్ధాంత ధోరణిపైన అనేకులు దురభిప్రాయాలు కలిగివున్నారు. దీనికి కారణం ఆయన శిష్యులు ప్రజల మధ్యకువెళ్ళి రంగాగారు ఏమి చెబుతున్నారో వివరించక పోవటమే.

వివిధ రాజకీయ పక్షాలకు చెందిన వ్యక్తులు ఈ గ్రంథంలో రంగాజీని గురించి తమ అభిప్రాయాలను వ్యక్తంచేసారు. అనేక వ్యయ ప్రయాసలకోర్చి ఈ గ్రంథాన్ని కూర్చడం జరిగిందిగాని, వివిధ రాజకీయ పార్టీల, పత్రికారచయితల సహకారం అంతగా అందనందున గ్రంథాన్ని ఇంకా ఆశాజనకంగా వెలువరించక పోవడం జరిగింది. గ్రంథంలో రచయితల భాషను మార్పు చేయకుండా వుంచాను. ఒక ప్రాంతపుభాష మరో ప్రాంతీయునికి సులభగ్రాహ్యం కాకపోవచ్చును. వివిధ ప్రాంతాల భాషాధోరణిని గ్రహించేందుకు పాఠకులకు అవకాశం యివ్వాలనే వుద్దేశ్యంతో ఇలా చేయడం జరిగింది.

'అబ్బాయీ' అని ఆప్యాయంగా పిలుచుకుంటూ, అనురాగంతో నన్ను చూచుకుంటూ, నా జీవితపు తొలిమలుపులో వెలుగు బాటను చూపించిన పూజ్యులు– పెదనాన్న, పెదతల్లి గార్లయిన శ్రీ నర్రావుల అంజయ్య, శ్రీమతి రాజ్యలక్ష్మి గార్లకు ఈ గ్రంథం అంకితమిచ్చి నా కృతజ్ఞతలు వెల్లడించుకుంటున్నాను. ఈ గ్రంథం పాఠకుల హస్తాలంకరణకు కారకులైన అందరికి నా నమస్సులు. పీఠిక వ్రాసి యిచ్చిన మా తాలూకా రైతునాయకులు శ్రీ యడ్లపాటి వెంకట్రావు చౌదరిగారికి నా వందనాలు.

బుర్రిపాలెం
6–2–71

కిసాన్ శ్రీ

# విషయసూచిక.

# రైతాంగానికొక అభేద్య కవచం

## శ్రీ పి. రాజగోపాలనాయుడు

రైతాంగ శ్రేయస్సు, రైతాంగ రక్షణ, రంగాగారి ప్రధాన ఆశయాలు. ఈ ఆశయాలకు భిన్నమైన ప్రతి సిద్ధాంతాన్ని, ప్రతి కార్యక్రమాన్ని వారు ఎదిరిస్తారు. తీవ్రంగా ప్రతిఘటిస్తారు. అలా ప్రతిఘటించడంలో ఎలాంటి త్యాగమైనా చేస్తారు. ఈ విషయాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకొన్నవారు మాత్రమే రంగాగారి రాజకీయాలను అర్థం చేసుకోగలరు.

రైతాంగమంటే రైతులు, వ్యవసాయకూలీలు, వారితోపాటు గ్రామాలలో నివసిస్తూ వారి వృత్తికి తోడ్పడుతూ వుండే వృత్తులవారు. ఈ ముగ్గురి సమిష్టి శ్రేయమే రంగాగారి ధ్యేయము. రంగాగారి రాజకీయ విధానానికి ఇది గీటురాయి. ఈ లక్ష్యాన్ని ముందుంచుకొనే రంగాగారు వ్యవహరిస్తుంటారు. ఏ విధానమైనా, ఏ కార్యక్రమమైనా రైతాంగ సమిష్టి శ్రేయస్సుకు కాకుండా వారిలో వారిని విడదీయడానికి చిక్కులు పెట్టి వారిని బలహీనపరచడానికి పన్నబడిన పన్నాగమని వారు భావిస్తే వెంటనే ఆ విధానానికి, ఆ కార్యక్రమానికి వారు ఎదురు తిరుగుతారు. రంగాగారి రాజకీయాలను గూర్చి అర్థం చేసుకోవాలనేవారు ఈ విషయాన్ని గూడ గుర్తుంచుకోవాలి. లేకుంటే పెడదారిని పడుతారు.

ఏ రాజకీయ సిద్ధాంతమైనా, ఏ రాజకీయ పార్టీయైనా, ఏ శాసనమైనా, పై రెండు సూత్రాలకు అనుకూలమా? ప్రతికూలమా? అనే ప్రశ్న ముందు వేసుకోవాలి ఎవరైనా? ఆ సూత్రాలకు అనుకూలమని తోస్తే రంగాగారు గూడ వాటిని తప్పనిసరిగా బలపరుస్తారు అని వెంటనే తేల్చుకోవచ్చు. ప్రతికూలమని తోస్తే వారు వాటిని తప్పని

సరిగా ప్రతిఘటిస్తారు అని వెంటనే చెప్పివేయవచ్చు. రంగాగారి రాజకీయాలను అర్థంచేసుకోవడం అంతసులభం.

ఈదృష్టితో రంగాగారి రాజకీయాలను మనం పరిశీలించాలి.

కాంగ్రెసు భారతదేశ స్వాతంత్ర్యసంపాదనకోసం పోరాడ సాగింది. ఆనాడు సంస్థానాధీశులకు, జమీందార్లకు బ్రిటిష్ సామ్రాజ్యం ఒకపెద్ద అండగావున్నది. సంస్థానాధీశుల, జమీందార్ల దుష్పరిపాలన నుండి రైతులు విముక్తినొందాలంటే వారికి గొప్ప అండగానున్న బ్రిటిష్ ఆధిపత్యం ముందు తొలగిపోవాలి. ఆతరువాత వారిని తొల గించడం చాల సులభం. అందువల్ల కాంగ్రెసు నిర్వహిస్తున్న స్వాతంత్రోద్యమాన్ని రైతులు బలపరచాలి. గాంధీగారి పిలుపును రైతులందుకోవాలి. అదీ స్వాతంత్రోద్యమాన్నిగూర్చి రంగాగారి దృక్పథం.

స్వాతంత్రోద్యమాన్ని రంగాగారు హృదయపూర్వకంగా బల పరచినా, కాంగ్రెసు సంస్థమీద ఏనాడూ వారికి సంపూర్ణమైన విశ్వాస ముండేదికాదు. ఆసంస్థ రైతాంగానికి పూర్తిగా సాయం చేస్తుందనే నమ్మకం వారికిలేదు. అయినా స్వాతంత్రోద్యమం రైతాంగ ఉద్యమానికి అత్యవసరం గనుక వారిముక్తికి దోహద మిచ్చేదిగనుక వారు ఆఉద్యమాన్ని మాత్రం బలపరిచారు.

ప్రపంచ స్వాతంత్రోద్యమాల చరిత్ర రంగాగారికి తెలియని విషయంగాదు. ఆ ఉద్యమాల విజయంకోసం రైతాంగం ఎన్ని మహత్తరత్యాగాలు గావించిందో వారికి తెలుసు. ఆత్యాగాల ఫలితం వారికి దక్కకుండా వారి శత్రువర్గాలకు ఎలాదక్కిందో వారికి తెలుసు. అందువల్ల రైతాంగం ఎలాంటిబాధల ననుభవించవలసి వచ్చిందో గూడ వారికి తెలుసు. కాబట్టి ఈస్వతంత్రోద్యమఫలితం విషయమైగూడ వారికి సందేహాలు లేకపోలేదు.

ఫ్రాన్సుదేశంలో రాజులకు వ్యతిరేకంగా విప్లవంవస్తే దాని విజయంకోసం రైతాంగం ఎంతో త్యాగంచేసింది. కాని పెత్తనం

నెపోలియన్ చేతుల్లోకి వెళ్లి నియంతృత్వంగా మారింది. అలాగే జర్మనీ రైతాంగ త్యాగఫలంవల్ల వచ్చిన పెత్తనం హిట్లరు హస్తగతమై ప్రపంచానికే ముప్పు దెచ్చిపెట్టింది. రష్యాలో జారుచక్రవర్తులకు వ్యతిరేకంగా వచ్చిన విప్లవంలో రైతాంగం చేసినంతత్యాగం ఏవర్గమూ చేయలేదు. కాని ఆత్యాగఫలితం కమ్యూనిస్టుపార్టీకి దక్కింది. దక్కడమేగాక రైతాంగవిప్లవమే సమూలంగా నాశనం గావింపబడింది. ఈ చరిత్రానుభవాలు రంగాగారి కున్నందువల్లనే భారతస్వాతంత్ర్యోద్యమాన్ని బలపరుస్తూనే రైతాంగాన్ని రెండో పోరాటానికి సంసిద్ధంగమ్మని ఆనాటినుంచి హెచ్చరిస్తూవచ్చారు. రైతాంగ రక్షణకోసం రైతు కాంగ్రెసును నిర్మాణంచేశారు. రైతాంగ ఎన్నికలప్రణాళికను ప్రచురించి ఆప్రణాళికను అంగీకరించిన కాంగ్రెసు అభ్యర్థులనే గెలిపించమన్నారు. అంతేగాక స్వాతంత్ర్యోద్యమంతోపాటు జమీందారీ వ్యతిరేకపోరాటాన్ని నిర్మించుకొంటూ వచ్చారు.

రంగాగారి ఈదృక్పథం, ఈపోకడ, వారుచేసిన రైతుకాంగ్రెసు నిర్మాణం, వారునడిపిన జమీందారీ వ్యతిరేకోద్యమం కాంగ్రెసు అగ్రనాయకుల కిష్టంలేకపోయింది. వారు రంగాగారి ఉద్యమాన్ని ఆశీర్వదించకపోగా వారిని తీవ్రంగా వ్యతిరేకించారు. వారి ఉద్యమాలను నిరుత్సాహపరిచారు. రైతుకాంగ్రెసును రద్దుచేయాలన్నారు. కాని రంగాగారు వారికి లొంగలేదు. ఆమీద ఈసమస్యపై పెద్ద వాగ్వివాదం చెలరేగింది. గాంధీగారు కల్గించుకోకపోతే ఈమహా నాయకులు ఆనాడే రంగాగారిని కాంగ్రెసునుండి వెలికినడిపి వుండే వారే. కాని గాంధీగారి వ్యతిరేకతవల్ల వారి పన్నాగాలు ఫలించక పోయినవి.

ఈవాగ్వివాదం ఫలితంగా 'రానున్నరాజ్యం ఎవరిది కాబోతున్నది?' అనే సమస్య ప్రజలముందుకు వచ్చింది. అప్పుడు గాంధీగారు ఆవిషయాన్ని ప్రజలకు స్పష్టంగా తెలియజేయవలసివచ్చింది. రానున్నరాజ్యం 'రైతుకూలీ ప్రజారాజ్యమని' గాంధీగారు ఎన్నో

ప్రార్థనాసమావేశాలలో తెలిపి రైతాంగ భయసందేహాలను నివారించగలిగినారు. స్వాతంత్ర్యసంపాదనకు ముందు అలాగా నడిచింది రంగాగారి రాజకీయం. తత్ఫలితంగా రానున్న రాజ్యం రైతుకూలీ ప్రజారాజ్యంగా వుండాలన్న హామీని ప్రియతమ బాపూజీ దేశానికివ్వడంజరిగింది.

స్వాతంత్రం వచ్చింది. కాంగ్రెసు ఒక ఉద్యమ రూపాన్ని వదలి రాజకీయపార్టీగా మారింది. ప్రభుత్వాన్ని హస్తగతం చేసుకొన్నది. యుద్ధావసరంకోసం బ్రిటిష్‌వారు అమలుపరచిన కంట్రోళ్ళను ఇంకా బిగించి రైతాంగాన్ని యమయాతనలు పెట్ట నారంభించింది. వారి అవసరాలతో నిమిత్తంలేకుండా తమ యిష్టంవచ్చిన ధరలకు ధాన్యాన్ని బలవంతంగా గుంజనారంభించింది. అలా తెచ్చిన ధాన్యాన్ని వ్యవసాయకూలీలకు గాని, వృత్తులవారికి గాని ఇవ్వకుండా పట్టణప్రజలకుమాత్రమే పంచిపెట్టింది. అందువల్ల గ్రామీణ ప్రాంతాలలో నిరుత్సాహం ప్రబలి వ్యవసాయంమీదనే అయిష్టత ఏర్పడింది. తత్ఫలితంగా ఆహారోత్పత్తి పెద్దగా దెబ్బతినింది. ఆకంట్రోళ్ళవల్ల గ్రామీణప్రజలేగాక పట్టణప్రజలుగూడ ఎన్నో కష్టనష్టాలకు గురికావలసివచ్చింది. అధికారుల్లజులుం, లంచగొండితనం, నైతికపతనం దేశమంతటా వ్యాప్తిచెందింది. ఆదుష్పరిణామాల ఫలితాలనాయలు ఈనాడుగూడ దేశాన్ని అల్లాడిస్తూనే వున్నాయి.

ఈకంట్రోళ్లవల్ల దేశానికి వచ్చిన ఆపదను, రానున్న ప్రమాదాన్ని రంగాగారు సులభంగా గ్రహించారు. రైతాంగం పడుతొన్న యమయాతనలు వారిని ఉద్రేకపరిచినవి. అందువల్ల "కంట్రోళ్లు తొలగింపబడాలి" అని కేకబెట్టినారు రంగాగారు. 'కంట్రోళ్లు' ఆనాటి కాంగ్రెసుపార్టీ విధానం. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా వారు ఈ విధానాన్ని నిర్భయంగా ఎదిరించారు. ఈవిధానాన్ని తీవ్రంగా ప్రతిఘటించాలని, అవసరమైతే వీటితొలగింపు కోసం సత్యాగ్రహం చేయవలసినదని వారు రైతాంగానికి సలహాయిచ్చారు.

కాంగ్రెసు కొనసాగిస్తున్న కంట్రోళ్లు చాలవని, యింకా వాటిని హెచ్చించాలని, గట్టిగా బిగించాలని కమ్యూనిష్టుపార్టీ తదితర రాజకీయపార్టీలు ఘోషించినవి. కాంగ్రెసును త్వరపరచినవి. కాని ప్రజలెవరూ ఆవిధానాలను హర్షించలేదు. రైతు కాంగ్రెస్ ద్వారా దేశవ్యాపితంగా కంట్రోళ్ల వ్యతిరేక విధానాన్ని జరిపించడం ద్వారా ఈ విధానాలకు ప్రజలందరూ వ్యతిరేకంగా వున్నారని రంగాగారు ఋజువు చేయగలిగారు. కాని కాంగ్రెసు అగ్రనాయకులు వినలేదు. పైగా రంగాగారిని కాంగ్రెసునుండి బహిష్కరించాలని, వారిని అరెస్టు చేయాలని వారు పట్టుబట్టినారు. రంగాగారు ఈ కంట్రోళ్లు రైతాంగానికి వ్యతిరేకమైనవని, అందువల్ల ఇవి తొలగించే వరకు ఆగబోమని ప్రకటించారు. అందువల్ల కాంగ్రెసు వారికి ఒక గడ్డుసమస్య అయింది. ఆతరుణంలో గాంధీగారు ఈ విషయంలో జోక్యం పుచ్చు కొని ఈ సమస్యను పరిష్కరించవలసి వచ్చింది. ఆనాడు కంట్రోళ్లను తీసివేయవలసిందని గాంధీగారు కాంగ్రెసువారికి సలహానిచ్చారు. అదే రంగాగారి ఉద్యమంలోని బలాన్ని, దానియొక్క వాస్తవిక భావాన్ని తెలియజేస్తున్నవి. ఈ అనుభవం రంగాగారికి కాంగ్రెసు పైవున్న కొద్ది విశ్వాసాన్ని గూడ పూర్తిగా సడలించివేసింది. కాని గాంధీగారి మీదవున్న ప్రగాఢమైన విశ్వాసంవల్ల, వారిమీదనున్న అమితమైన భక్తివల్ల వారు కాంగ్రెసును విడిచి వుండలేకపోయారు.

ఆ తరువాత కొన్నినాళ్లకే గాంధీగారు చనిపోయారు. అది రైతాంగానికి తీరని నష్టమైపోయింది. గాంధీగారి నిర్యాణానంతరం రంగాగారిమీద కక్షసాధించడానికి కాంగ్రెస్ అగ్రనాయకులకు అదను చిక్కింది. ఆంధ్రకాంగ్రెసులో రంగాగారికున్న ఆధిక్యతను తగ్గించ డానికి వారి అనుచరులు చేసిన కుట్రకు ఎలావారు మద్దతు నిచ్చారో, ఏ విధంగా ఎన్నికలు జరగడానికి ముందు సుమారు 30 ఓట్లు పోల్ గాకుండా ఇంజంక్షన్ ఆర్డరు తెచ్చి ఆంధ్రకాంగ్రెసును పట్టుకొన్నారో ఆ విషయాలన్ని దేశానికి తెలుసుగనుక నేనా విషయాల్ని గూర్చి యిచ్చట చెప్పనవసరంలేదు. ఆఎన్నిక తరువాత రంగాగారికి కాంగ్రెసు

కె. ఎల్. పి. బయటేవుండి వారి ప్రభుత్వానికి సహకారమిస్తూ వచ్చింది.

రాజాజీకి రంగాగారు సహకారమిస్తూ ప్రజలకు ముఖ్యంగా రైతాంగానికి చాల కష్టదాయకంగావున్న కంట్రోళ్లను తీసివేయమని కోరినారు. రాజాజీ వారుకోరినట్లే కంట్రోళ్ళను తీసివేసి దేశానికి మార్గదర్శకులయ్యారు. కంట్రోళ్ళను తీసివేయడంతోటే రాష్ట్రంలో ధరలు తగ్గినాయి. నిర్బంధాలు తొలగిపోయినాయి. ప్రజలెంతో ఆనందించారు. ఆవిధంగా రంగాగారు తన రాజకీయ చాతురతద్వారా కమ్యూనిస్టుప్రభుత్వ మేర్పడకుండాచేసారు. తనకు ప్రాణప్రదమైన రైతాంగాన్ని కంట్రోళ్ళబారినుంచి రక్షించారు. ఆతరువాత కేంద్రప్రభుత్వంగూడ చెంపలువేసుకొని కంట్రోళ్ళను తొలగించివేసింది. అప్పుడు దేశమంతా శని విరగడయినట్లుగా భావించి సంతోషించారు.

ఒకసారి కాంగ్రెసు నెదిరించి వెంటనే ఆసంస్థకు సహకారమివ్వడమంటే గొప్ప సాహసముండాలి. ఎంతో నైతికశక్తి వుండాలి. చాల త్యాగంచేయాలి.

రాజకీయంగా నిద్రాణులైవున్న ప్రజలకు రంగాగారు ఏమిచేస్తున్నారో తెలియలేదు. అయినా రంగాగారు సాహసించి తన ప్రతిష్ఠకోసం చూడకుండా దేశాన్ని రక్షించారు. లేకుంటే ఆనాడే ఈరాష్ట్రం కమ్యూనిస్టులచేతుల్లో పడివుండేది. ఈవిషయాన్ని ప్రజలు గుర్తించకపోయినా, కాంగ్రెసువారు అలక్ష్యంచేసినా కమ్యూనిస్టులుమాత్రం మరచిపోలేదు. వారెన్నడూ ఈఘట్టాన్ని మరువలేరు.

అలాంటి విషమఘట్టమే 1955 లో ఆంధ్రరాష్ట్రాన్ని మరొకసారి ఎదుర్కొన్నది. ప్రకాశం మంత్రివర్గం కె. ఎల్. పి. నాయకుడైన శ్రీ లచ్చన్నగారు తెచ్చిన విశ్వాసరాహిత్య తీర్మానంవల్ల పడగొట్టబడింది. అప్పుడు ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీఎన్నికలు వచ్చాయి.

కాంగ్రెసు, కె. ఎల్. పి., కమ్యూనిస్టు పార్టీలు వేర్వేరుగా పోటీ చేస్తే కమ్యూనిస్టుపార్టీ ప్రభుత్వానికి వస్తుందని రంగాగారు సూక్ష్మంగా గ్రహించగలిగినారు. కాంగ్రెసుతో ఏమాత్రం పొత్తు కలుపుకోరాదని తన అనుయాయులు తీర్మానించినారు. "కాంగ్రెసుతో గాని పొత్తు గలపకపోతే కె. ఎల్. పి. ఎన్నికలలో పాల్గొనకుండానైనా వుండాలి. లేదా తన్నుతాను రద్దైనా చేసుకోవాలి. కె. ఎల్. పి. అడ్డుపడినందు వల్లనే కమ్యూనిస్టుపార్టీ వచ్చిందని ప్రజలు కలకాలమూ [illegible] నిందించకుండా వుండాలంటే వేరుమార్గం లేదు. కమ్యూనిస్టులు, కాంగ్రెసు పోటీపడి కమ్యూనిస్టులే గెలిస్తే అందుకు కాంగ్రెసువారే బాధ్యత వహించవలసి వస్తుంది" అన్నారు రంగాగారు. కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడడానికి రంగాగారు అంత వ్యతిరేకంగా వుండేవారు.

కాంగ్రెసుగూడ తుదకు తన బలహీనతను గుర్తించింది. కె. ఎల్. పి., ప్రజాపార్టీలతో కలిసి ఐక్యసంఘటనను నిర్మాణం చేయడానికి పూనుకొన్నది. రంగాగారుగూడ కాంగ్రెసుతో సహకరించారు. ఐక్యకాంగ్రెసు ఎన్నికల ప్రణాళికను తానే రచించారు. దానిమీద కాంగ్రెసు, ప్రజాపార్టీ సంతకాలు పెట్టినవి. దీనిద్వారా రైతుల, కూలీల, వృత్తిదారుల హక్కులకోసం పోరాడతామని అన్నిపార్టీలు దేశానికి హామీనిచ్చినవి. ఈ హామీలనుచూచి రైతాంగం సంతోషంతో ఉప్పొంగిపోయింది. కమ్యూనిస్టు నియంతృత్వపోకడల నెదిరించి పోరాడింది. కమ్యూనిస్టులను చిత్తుచిత్తుగా ఓడించింది. గెలుపువచ్చిన మరునాడే కాంగ్రెసు ఐక్యసంఘటనను మరచిపోయింది. కాని కమ్యూనిస్టులుమాత్రం ఈనాటివరకు ఆ ఓటమిని మరచిపోలేరు. ఆవిధంగా రంగాగారు రెండవసారి దేశాన్ని కమ్యూనిస్టుల బారినుండి రక్షించారు.

ఇన్నిదెబ్బలు తిన్నతరువాతనైనా కాంగ్రెసు తన కార్యక్రమాన్ని సరిదిద్దుకొని తనకండగా నిలచిన రైతాంగాన్ని రక్షిస్తుందని రంగాగారు నమ్మినారు. అందువల్ల కె. ఎల్. పి. ని రద్దుచేసి

అందరూ కాంగ్రెసులో నిర్నిబంధంగా కలిసిపోవాలని వారు తన అనుయాయులకు సలహానిచ్చారు. అలాగే వారందరూ చేసారు. కాని కాంగ్రెసువారు బలం తెచ్చుకొన్నాంగదా అనే ఆలోచనలో మరలా రైతులమీద దాడిని కొనసాగించడానికి పూనుకొన్నారు. 10 రూపాయలలోపు శిస్తు తీసివేస్తామని చెప్పినవారు రైతులమీద ఇష్టమొచ్చినన్ని శిస్తులు వేయ నారంభించారు. రంగాగారెంత చెప్పినా వినిపించుకొనకపోయారు. కడకు నాగపూరులో తమకున్న రైతాంగ వ్యతిరేకతను కాస్తా బయటపెట్టినారు. రైతాంగాన్ని బానిసత్వంలో దింపగల ఉమ్మడివ్యవసాయాన్ని ఈ దేశంలో అమలుపరచాలని తీర్మానించారు.

ఈతీర్మానాన్ని చూడడంతో ఓ రంగాగారికి తీవ్రమైన కోపం వచ్చింది. ఏ రైతాంగాన్ని కాపాడడానికి రంగాగారు 30 ఏండ్లనుంచి ఎనలేని త్యాగాలు చేశారో, వ్యక్తిగత ప్రతిష్ఠనుగూడ సరకుగొనకుండా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని రానివ్వకుండా చేశారో, ఆ రైతాంగ వినాశనానికే కాంగ్రెసు దారితీసినందువల్ల వెంటనే కాంగ్రెసుకు రాజీనామా యిచ్చివేశారు. రాజాజీతో కలసి రైతాంగరక్షణార్థ స్వతంత్రపార్టీని నిర్మాణంచేశారు. కాంగ్రెస్ రైతాంగ వ్యతిరేక విధానాల నెదిరిస్తున్నారు.

1955 నాటిలాగా గాకుండా రైతులు రాజకీయంగా కొంత మేలుకొన్నారు. రానున్న విపత్తును గ్రహించారు. అందువల్ల స్వతంత్రపార్టీ జండాక్రిందికి వస్తున్నారు. ఈవిధంగా రంగాగారు రైతాంగరక్షణకోసం అనవరతమూ ఎన్నో కష్టాలను భరిస్తూ, బలవత్తరమైన శక్తుల నెదుర్కొంటూ ముందుకు సాగిపోతున్నారు. వారు చేస్తున్న ఈమహాప్రయత్నానికి మనమందరంగూడ ఉడుతాభక్తిగా తోడుపడడం చాల అవసరం. అప్పుడే రైతాంగం రక్షించబడగలదు.

# నే నెరిగిన రంగా

## శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి

ఆచార్యరంగా పేరు నేనుగాయకం మెరిగిన దగ్గరనుండీ వింటున్నాను; నాకు వారు తెలిసి యిరవైయేళ్ళు అయింది. వారిని నేనెరిగి ఒక పుష్కర కాలంగడిచింది.

మేము కాలేజీలో చదువుకునే రోజుల్లో కేంద్ర ఎసెంబ్లీకి రంగాగారు, కొసరాజు రామయ్యగారు పోటీచేసారు. రంగాగారే గెలిచారు. కాని, గుంటూరులో ఆ ఎన్నికల్లో ఎంతో వినోదం జరిగింది. 'జమీన్ రైతు' రంగాని 'స్వతంత్ర' రామయ్యగార్ని బలపరుస్తూ మాటలు, పాటలు జాతర్లు పలికించేవి. అప్పుడు రంగాగార్ని మొదటసారిగావిన్నాను. ఆ యాసగావున్న ధోరణి, పోతనలోని పద్యాలు, రైతుగేయాలుచూస్తే, ఆహాలులోని మీటింగే సాహిత్యగోష్టిగా, రాజకీయ రంగంగా కలిసి కనపడింది. మనిషి పొట్టివాడైనా మంచిపలుకుబడి గలవాడనుకున్నాను, విద్యార్థిగా.

తర్వాత అనేకసార్లు విన్నాను. అరండల్‌పేట హాస్టలులో ఒకసారి యిష్టాగోష్టిలో పాల్గొన్నాము. మనిషిలో యేదోనిత్యం కదులుతున్నట్లు, ఆవేదనా పూరితమైనట్లు, తానేదో గొప్పమార్గాన్ని లాగే ప్రయత్నంలో వున్నట్లు నాకానాడు వ్యక్తమైంది. ఆయన చేసికొన్న రుజువులు లోకానికే తెలుసు.

నా చిన్నతనంలో జాతీయవాద ప్రచార వీచికలు అనంతంగా అల్రులుచాస్తున్న రోజులు. పెద్దలపేర్లు, జాతీయనాయకులపేర్లు 'జిందాబాద్'లతో జోడించి, గుదిగుచ్చి ప్రచారించే రోజులు 'ఆచార్యరంగాకిజై' 'రైతురంగాకిజై' 'కూలిరంగాకిజై' 'రైతుబాంధవునికిజై' అంటూ కేకలు వూరూరా వినబడేవి. అందరికి ఒకే జిందాబాద్

అయితే యీాయనకు యిన్నిరూప భేదాల్లో సంబోధనలేమిా అని బహుశోతల్లాం యీాయనలో యేమైనావుందేమోనను కొనేవాళ్ళం. అది మాచిన్నతనం.

నేను పెరిగిన తర్వాత, వారి గ్రంథాల్ని, వ్యాసాల్ని, కర పత్రాల్ని చూడటం మొదలుపెట్టాను. అంతకుముందు నచ్చినంతగా రంగా రచయితగా నాకునచ్చలేదు. వారి యింగ్లీషు పదాలు అణాల తెలుగు వాడింగ్లీషులాగ కనిపించేది. వారి తెలుగు హృద్యంగంగా వున్నా రాయలసీమ పొలాల్లో మొలిచి యిక్కడ చేరదీరినదిగా కన పడేది. నాకు బాగానచ్చలేదు; నన్నంతగా ఆకర్షించలేదు. వారు మాట్లాడినట్లే వ్రాసేవారు; వ్రాతలన్నీ అట్లాగే వుండేవి. అందువల్ల, సాహిత్యపాకం అందులో దొరక్కపోతే, నాకు అంటిన రుచితగ్గేది.

వారు పక్కానికి వచ్చిన తర్వాత రచనలలోనైనా, అతొందర పోలేదు. కాని, కుదురు హెచ్చింది. అయినా, రంగాగారిని నేను రచయితగా మెచ్చుకోలేదు. అయితే మంచి భావుకుడు.

రచనల్లో రాజకీయజ్ఞత జోలికిపోక, భూమినివదలక, రైతు కూలీప్రజారాజ్య స్థాపనాచార్య ధోరణిలోనే వ్యాసంగమంతా గడుపుతారు. గ్రామీణ ఆర్థికతకు అందవేసినచేయి; గ్రామీణ రంగంలోని సమస్యల్ని మథించి ఆకళింపు చేసుకున్న గ్రామీణ వ్యక్తి; గ్రామీణ సంబంధాల్ని అన్వయించటంలో. సమన్వయించటంలో ఆయన రచనలకు, కుమరప్పలాంటి వారు పోటీపడ యత్నించినా లాభంలేదు.

రంగాగారి రచనలన్నీ ఒక్కసారిగా చదివితే అదో ప్రపంచంగా వుంటుంది. దక్షిణాది కార్మిక సమస్యలు, చేనేతవృత్తుల స్థితిగతులనుగాని నల్లజాతుల విముక్త్యోద్యమాల విషయంగానే వుంటాయి. ఇక రైతు సమస్యలు అద్యంతాలు వుంటాయి. రైతుకు ఎక్కడ యీాగకుట్టినా, రంగా నిస్వానాలు రేగుతై. అది రైతులకు తెలియవచ్చు; తెలియక పోవచ్చు. వారి మీాద యీాగవాలకూడదు; దోమకుట్టకూడదు. అవే

కాదు, జాతీయోద్యమ కథలు, శాంతిసభల ప్రసంగాలు వుంటాయి. గాంధీప్లానువుంటుంది. విద్యార్థి వుద్యమాల కథలు వుంటాయి. అదీ రంగా సాహిత్యం. ప్రాయికంగా రైతుకూలీ సమస్యలు వుంటాయి.

ఎవరెన్ని చెప్పినా చెప్పకపోయినా రంగా జాతీయుకోసకు చెందిన నాయకుడు. ఆంధ్రలో నేడు ఆయనకు దీటైన నాయకుడు లేడు. ఏగ్రామంలోనైనా, ఆయనకోసం ఆత్మహత్య చేసుకోవటానికి సిద్ధంగా వుండేవాడొకడన్నా కనీసం వుంటాడు. ఆయన కున్నంత మంది మూఢభక్తులు మరోనాయకునికి ఆంధ్రలో లేరు. ప్రకాశం, పట్టాభి పెద్దలైనా, కొన్నివిషయాల్లో ప్రకాశంతప్ప అన్నిటా వారు దీటుకారు.

కారణం, రంగాకు నమ్మిన ఒక ఆత్మవిశ్వాసం వుంది. తతిమ్మా వారికి అవిఅంతగా లేవు. కాని రంగాజనాలు నిర్మాణం కానిజనాలు; చైతన్యం లేని జనాలు. అందువల్ల, వారికన్నా ఎక్కువ తప్పులు చేసిన వారి మీదలేని దుమారం ఆయన మీదికి వస్తుంది.

రంగాగారు ఆకాశం గగనంశూన్యం అన్నదానిలోనుంచి కూడా, కొంత తైలంతీసి, రంగురాసి ఒక నిర్మాణాన్ని నిలబెడ్తాడు. ఆ నిర్మాణచాతుర్యం అనంతం. అయితే అందులో చేరిన శిష్యకోటి, అవసరాల కొద్దీ అదృశ్యమౌతూనే వుంటారు. క్రొత్తపుంతలకు పోతూనేవుంటారు. ఈయనాకొత్తరీతుల్లోకి వెళ్ళుతూనేవుంటాడు; కథ శూన్యమైనా యానం సాగుతూనేవుంటుంది.

అబ్బ! రంగాగారెన్నిసంస్థల్ని సాగించారు!! ఎన్నివుద్యమాలను లేవదీసారు! ఎన్నిమాత్రం యిప్పుడునైన్నా!! కాని మనిషిలో నిరుత్సాహంరాదు; నిస్తబ్దత చేరదు. ప్రతిభోపేతంగా కొత్తదానిని చేరుస్తాడు. అది సాహసోపేతంగా చేస్తాడు. అదొక వాహిని!

అధ్యాపకుడుగా ఈ దేశంలో జీవితాన్ని ప్రారంభించినా అంతకు ముందే విద్యార్థిగానే చేనేతసమస్యలమీద దృష్టి కేంద్రీకరించాడు. అందరూ స్వరాజ్యంరావటమే, బ్రిటిష్‌వాడు పోవటమే ముఖ్యంగా

యెంచి బ్రిటిష్ వ్యతిరేక జాతీయోద్యమంలో పాల్గొంటే తానూ పాల్గొంటూ, రైతుసంఘాల్ని 1923 నుంచి పెట్టనారంభించాడు. రైతుకూలీ రాజ్యస్థాపన బ్రిటిష్‌వారిస్థానే జరగాలన్న నిర్మాణదృష్టి యితని ఒక్కనిలోనే వుంది. అది రంగాప్రతిభకు తార్కాణం.

గాంధీలాంటివాణ్ణి బ్రిటిష్‌వాళ్లు పోయినతర్వాత యేమిటి అంటే వారు వెళ్ళినతర్వాత చూస్తామని 'స్వరాజ్యం' అన్నమాటను మబ్బుల్లో అట్టిపెట్టాడు. యం. యన్. రాయ్ స్వరాజ్యమంటే నిర్వచనాల్ని యిచ్చి నిర్మాణదృష్టిని జాతీయోద్యమంలో చూప యత్నించి గాంధీవల్ల విఫలుడైనాడు. రంగాకూడ అట్లాగే కాంగ్రెసు చేత తన రైతుకార్యక్రమాన్ని అంగీకరింపచెయ్యాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు. కాని తన నిర్మాణపు పునాదులను శాఖలను అట్లాగే వుంచుకుంటూవచ్చాడు. సంస్థకు సంబంధించిన విషయాల్లోని యీవ్యక్తిత్వమే రంగాలోని విశేషం.

గ్రామీణ ఆర్థికజీవితాలను ఆకళింపుచేసుకున్నవాడు గనుక సన్నకారు రైతులు, కూలీలు, కళాకారులు యితర చిన్నకారు స్వంతవృత్తులవారంతా జనాభాలో నూటికి 75 పైగా వున్నారని గ్రహించి వారల ఆర్థికత చెడకుండా బాగాబాగుపడుతూ, వారికున్న స్వేచ్ఛ చెడకుండా మనగలగాలి గనుక వారిని నిలబెట్టే సావకాశాల పరిశోధనకోసం 40 ఏళ్ళ రాజకీయజీవితాన్ని వెచ్చించి 'స్వయం పోషక వృత్తుల'కు రక్షణకావాలన్న సిద్ధాంతాన్ని లేవదీసాడు. అది రంగా అనుభవానికి, మేధాసంపత్తికి తార్కాణం. అది రంగా సృష్టి. అందుకనే ప్రయివేటు, పబ్లిక్ రంగాలతోపాటు ఆర్థిక రంగంలో యీ స్వయంపోషకవృత్తుల భాగంగూడా వుండాలంటారు. దాంతో ఆయన అసలుసూత్రాన్ని కనిపెట్టాడు. ఆయన రాజకీయ పుటాలోచన పరాకాష్టచెందింది. అది సంఘానికి ఆయనపెట్టిన భిక్ష, యిచ్చినదానం.

1923 నుంచి, రైతు కూలీసమస్యల్నీ అంగాంగి న్యాయంగా నిర్మించి, సంస్థకావాలని తాపత్రయంవుంది. కాంగ్రెసులో చేరికయే

ముందు యిష్టంలేదు. చేరినా కాంగ్రెసునే రైతుకూలీ ప్రజారాజ్య సంస్థగా పరివర్తితం చెయ్యాలన్న భ్రాంతివుంది. అది జరుగుతుందే మోననే అనేకవత్సరాలు గడిపాడు. కుదరలేదు.

ఒకప్పుడు అందులోనేవుండి కాంగ్రెసు శాసనసభ్యులు తన కిసాన్ ప్లెడ్జిమీద సంతకం చెయ్యాలన్నాడు. తర్వాత కాంగ్రెసును వదలి సంధులుదాటి కృషీకార్ లోక్ పార్టీని హృద్గతరీతుల్లో పెట్టారు. అదీసాగలేదు.

కమ్యూనిస్టులు రైతులోక హంతకులు. అందువల్ల వారి నోడించటానికి ఐక్యకాంగ్రెసు కట్టి ఓడించి కాంగ్రెసే కమ్యూనిస్టుగా మారడంచూచి బెంగపడి, అదీవదలి యిప్పుడు స్వతంత్రపార్టీ మహా రథుల్లో ఒకడుగావున్నాడు.

ఎన్నిమారినా దానికోసరమే! రైతుకూలీ రాజ్యస్థాపన సావకాశంకోసం. వికారాలు లేకపోలేదు. కాని మనిషితత్వం రాజ కీయాల్ని వదలదు. అధికార రాజకీయాలకు అవసరమైన 'అవినీతి' గాని 'కుట్ర'దారీతనంగాని లేదు. అందువల్ల అధికార రాజకీయాల్లో దెబ్బతిన్నాడు. తినకతప్పదు.

అధికార రాజకీయాల్ని వదలనూలేదు. ఇక వదలివేస్తే సాంఘిక రాజకీయాలు మిగులుచేసుకొని దానికై నిబ్బరంగా, హృద్యంగా పనిచేసుకోవచ్చు; పని ప్రధానంగాని, అధికారమే ప్రధానంకాదు. అధికారరాజకీయాల్ని అధిగమించి రంగాగారు రాజకీయాల్లో వ్యవహరించాలి. చూద్దాం.

# ఆచార్య రంగా - భూసంస్కరణలు

## శ్రీ చీకటి పరశురామానాయుడు

అతడొక విప్లవాగ్ని. పల్లెల ప్రవక్త. రైతాంగ సిద్ధాంతి. వ్యవసాయ సమాజమునకు మూర్తీభవించిన ఏకైక ప్రతినిధి. ఎల్ల కాల ఎల్ల వేళలయందు, వివిధావస్థలలోను, రైతాంగ, కళాకారుల జీవిత విశిష్టతను ప్రపంచమునకు చాటి, విసుగువిరామం లేక కృషి చేయుచున్న స్వేచ్ఛాపిపాసి రంగాజీ. ఉత్తరమునుండి మహాప్రళయాగ్నివలె మండుకొస్తూయున్న మార్క్సిస్టు సిద్ధాంతమున కాహుతి కాకుండ, భారత దేశము రక్షింపబడవలెనంటె, భారతాత్మస్వరూపము గోల్పోకుండయుండవలెనంటె, పురాతన భారతజాతి తననాగరిక సంస్కృతుల ప్రత్యేకతను గోల్పోకుండాలంటే, స్వేఛ్ఛారాధకుడయిన రైతు తనస్వేఛ్ఛా జీవితమును కోల్పోకుండా కాపాడుట ప్రతియొక్కని ప్రథమధర్మమనినమ్మి, జాతీయ అంతర్జాతీయ వేదికలపై ఘోషించుచున్న ఘనుడు రైతురంగా. మార్క్సిజముకు ప్రతిసృష్టిని ప్రకటించి, విప్లకార్గమనుకున్న వారికి విజ్ఞాన మార్గము చూపించి, వ్యక్తిత్వము గలిగిన రైతును పదిలపెట్టుకుని, ధృవపరచుకుని, బలపరచుకుని, వారిసేవకు తగుఫలితము, గౌరవమునిచ్చు నూతన సమాజనిర్మాణము నిజవిప్లవ మార్గమని వారిబోధన. వ్యక్తిత్వముకొరకు, వ్యక్తి స్వాతంత్ర్యము కొరకు, తనస్వేచ్ఛ, సమాజస్వేచ్ఛాకోరి, ఎన్నో విప్లవపోరాటములు చరిత్రలో రైతుజరిపిన విషయములు మనకు విప్పిచెప్పి, తాను స్వాయముగా నట్టిభావములకు మూసగట్టినమూర్తియై వర్ధిల్లుచున్నారు మన రంగాజీ. ఈ భావప్రభావమే భూసంస్కరణలయందు వారికుండిన నిజస్వభావమును రూపొందించినది.

స్వేచ్ఛను రైతు గోల్పోయిన నాడు, ప్రజాస్వామ్య సమాజమున కేముప్పు అని ఏనాడో చెప్పిచాటినారు రంగాగారు. భూసంస్క-

రణయను నినాదవాదుల ఊహాలనిట్టి కొలబద్దతో, అత్యున్నత స్థాయిలో పరీక్షించి, వాని లోపముల నవలీలగ గుర్తించి రంగాజీ ఖండించినంతనే స్వల్ప ఆలోచన పరులు దాని నిజతత్వమును తెలుసుకోలేక, రాజకీయ అవకాశవాదబుద్ధితో వారిగూర్చి పెట్టి మొర్రి పలుకులు పలికినారు. కాని అజ్ఞాన తిమిరమెంతకాలము సరస్వతీ పీఠ వెలుగును ఆపగలుగును.

తుదకీనాడు రంగా సిద్ధాంతమే భారత రైతాంగమునకు శరణ్యము అయినది. స్వతంత్రపార్టీకి ప్రధాన పునాదియైనది. దేశ మేధావులలో ప్రధానమై స్వతంత్ర సమర అగ్రనాయక శ్రేణికిచెంది, ఈనాడు మరల నూతన స్వాతంత్ర సమర మవసరమని గుర్తించి శంఖు చక్రమూని, యుద్ధసన్నద్ధుడై, కదన రంగమునకు దూకిన రాజాజీకి ముఖ్య సాధనకారియై మన రంగాజీ వెలుగుచున్నారు. నిక్కముగా రంగా సిద్ధాంతములనే రాజాజీ వరించి నూతనోద్యమమును సాగించుచున్నారు. భూసంస్కరణలు అని ఎందరో వెలుగెత్తి కేకలు పెట్టుచున్నారు. అయ్యది వోట్ల కనువగు కేకయైనది. ఆశలను రేకెత్తించి, మనసును మారగొనుట కయ్యది సాధనమైనది. ఉన్నవారినుండి భూమిని తీసుకొని, లేని వారికి పంచిపెట్టు దామని కొందరు, వ్యక్తి క్షేత్రము లేకుండ భూమిని సమాజపరముచేసి సమిష్టి వ్యవసాయము చేయుదమని కొందరు గాలివలెనే భూమికూడ సహజ సంపదగాన గాలిని పీల్చినట్లుగా మనుష్యులు సమిష్టిగా భూమి అనుభవించవలెనని కొందరు, విప్లవవేషదార్లు పరిపరివిధముల కేకలు వేయుచున్నారు. ఈ వెర్రి కేకలను సమర్థించక ఖండించినంత మాత్రమున ఈ మూఢమూక రంగాగారిపై విరుచుకుపడి, అభ్యుదయ వ్యతిరేకి యని నీలాపనింద ప్రచారం చేయుచున్నారు.

ఉత్తమసమాజ మూలసూత్రముల నూహింపక కట్టిన యిల్లును కూలవేయుటే విప్లవమని పొరబడినవారే ఈ నిందానిష్ఠురములు పలుకుచున్నారు. చిరకాలమునుండి మానవసమాజ చరిత్రలో జరిగిన అన్యాయములలో రైతుకు జరుగుచున్న అన్యాయము

ఘోరాతిఘోరమైనది. మానవజాతి తన అభ్యుదయముకొరకు కని పెట్టిన ప్రకృతివింతలలో అతిముఖ్యమైనది వరిమొక్క. పశుస్థితినుండి మనిషిస్థితిని పొంది నివాస, నిలకడకలిగి ఆలోచనావకాశమును మానవుడు పొందెనంటే, ఈవరిమొక్కయే అందుకు బీజము. అనాటనుండి సమాజమునకు సర్వపోషకుడై, రక్షకుడై, నాగరిక కారకుడై యున్న ఈ రైతుకూలీ నేడు లేకుండాజేయుటయే అభ్యుదయసమాజమునకు పునాదియని కమ్యూనిస్టు వాదన. అట్లున్నపుడు జరుగుటకు వీలులేదని రంగాగారంటే తప్పా? సంఘసేవలలో రైతుసేవ అమూల్యము. ఐనను విప్లవకాలములందు వానిసేవకు విలువలేదు. గుర్తింపులేదు. వానిజీవితమునకు విరామములేదు. పట్టణసమాజము వానిని వాడుకొనుటకికనైనా ఆగాలి. రైతు దినుసుకు తగుమూల్యము లభించాలి. గిట్టుబాటుధర కావాలి. పట్టణ పల్లెలమధ్య ఉండిన అపరిమిత తారతమ్యములు పోవాలి. భారతావనిలో ఈమాటలకు రాజకీయవిలువను కలుగుగ జేసినది రంగాజీయనుటకు సంశయములేదు. ఇది అభ్యుదయ వ్యతిరేకమా?

భూసంస్కరణాల పేరిట విప్లవనినాదములు సరుచుచు మాన మిడిమిడిజ్ఞానులు చెప్పునదేమిటి? అయ్యది నిక్కముగ సంస్కరణయేనా? సమాజ ఉద్ధరణయేనా?

సహకార వ్యవసాయము! భారతదేశములో నవసమాజ నిర్మాణముకొరకు నాగరికసమాజ నూతనవికాసము కొరకు, ఇయ్యది దివ్యౌషధమని పండిత నెహ్రూ దిక్కులు పిక్కటిల్లునట్లు నాగపూర్ లో చాటారు. క్షేత్రాలు చిన్నవి. రైతు పేద. ధనము, యంత్రము ఉపయోగించి భారీగా వ్యవసాయముచేసి విరివిగా పండించలేడు. ఆధునిక ఉత్పత్తిశక్తి వృథాగా పోవుచున్నది. తక్షణమే పంట పెంపొంది ఆహారసమస్య సాధ్యముకావాలి. కాన సమిష్టిక్షేత్రములు ద్వారా సమిష్టివ్యవసాయము స్వేచ్ఛా సహకారమార్గమున తిరిగి చూపులేకుండా ప్రారంభించాలి, పూర్తిచేయాలి. ప్రయోగ పరిశోధనలుకూడ ఇక నవసరములేదు. సత్వర కార్యాచరణకు రైతాంగము

దూకి ఉన్నూతనూతన సహకారమార్గమున వ్యవసాయ పునర్నిర్మాణము అవలీలగ జరిగిపోవాలి. పంటలు పొంగిపోవాలి.

ఇది జరగనిపని. పంట శూన్యము. రైతుప్రాణముకు ముప్పు. సమాజముకు సంక్షోభం అని రంగాగారు జవాబు చెప్పారు. తప్పు! ధనముకావాలి. కావలసినంత పరపతి కలుగజేయవచ్చు. యంత్రములను పయోగించాలి. సేవాసహకార సంఘములద్వారా ఎన్నైనా అందజేయవచ్చును. పెద్దక్షేత్రా లవసరములేదు. ప్రపంచ వ్యవసాయ పరిశోధన ఈవిషయము నిరూపణ చేయుచున్నది. 2½ ఎకరాలకంటె పెద్దకమతాలు జపానులోనే లేవు. అచ్చటి ఎకరాకు పంట ఎక్కువ. నిపుణతకావాలి. సమిష్టి సేద్యంవల్ల నిపుణత పెరిగేది లేదు. అయ్యది పరిశోధనవల్ల, పరిశ్రమవల్ల కలుగునదిగాని మాటలవల్ల కుదురునదికాదు. స్వంతబాధ్యతలతో స్వేచ్ఛా ఉత్సాహములతో తనశక్తిని, యంత్రశక్తిని రైతు నిండైన శ్రమచేసి ఎక్కువపంట పండించ కలుగుతాడా లేదా ఇంకొకరి తాబేదారుగా జీతము, కూలి కొరకు పెదవారి ఆజ్ఞానుసారము రైతు ఎక్కువ శ్రమచేసి పంట బాగా పండించగలుగుతాడా? భూమిపై హక్కుపోయి సమిష్టి మూకలో మిళితమైపోయి, స్వాతంత్రముపోయి, బానిసస్థాయి ఎంతోమాత్రము రైతు సమాజోద్ధరణ ఫలితాన్ని పెంపొందించలేదు గదా? భారతదేశములో అధికసంఖ్యాకులు ప్రభుత్వ కూలీలైననాడు ప్రజాస్వామ్య మేతీరుననిలుచునని రంగాజీ ప్రశ్న. మానవ నైసర్గిక గుణములను మరచి అందుకు వ్యతిరేక పద్ధతిలో మనుష్యుని పోటుపడు మనుటకంటె తెలివితక్కువ ఇంకెక్కడున్నది. కాన స్వేచ్ఛా సహకారమునే మరుగు తెరవెనుకను నిర్బంధము నిక్కముచేయు సమిష్టి వ్యవసాయము వలదని రంగాగారి వాదన. భూస్వామిని బంట్రోతు చేయవద్దని ఆయనగోల.

కమతాలకు పరిమితులు నియమించుటొక భూసంస్కరణ. కమ్యూనిష్టులు, సోషలిష్టులు, వారి అనుచరులుగా బయలుదేరిన కాంగ్రెసు వాదులు రైతాంగరాబడి 3600 రూ॥ కు సం॥కు మించ

కూడదని అంటున్నారు. ఒకనికైనా, ఐదుగురి అన్నదమ్ములకైనా, వారితో 20 మంది ఆడవారు కలిసివున్నా 3600 రూ. కే పరిమితి. అందుకు సరిపోయే భూమికంటే ఎక్కువ వైశాల్యము వుండ కూడదు. ఒక నోటిని పైముగ్గురు కలిసి బంట్రోతుకైనాసరె కనీసం నెలకు 100 రూ. రాబడి వుండాలంటారు. కార్మికునకు 500 రాబడి నెల కుండాలని వాదించుచున్నారు. కాని రైతుకు మాత్రము నెలకు 100 రూ. కంటే ఎక్కువ రాబడి ఉండకూడదని ఆనోటనే వాదించు తున్నారు. 60 రూ. కంటె ఎక్కువ వుండకూడదని కొన్ని సందర్భము లలో వీరివాదన. ఇది విప్లవన్యాయము. ఇట్టిఘోర అన్యాయ సినాద మును అభ్యుదయ వాదమని అనుటకైనా వీరుసిగ్గుపడరు. అట్టి పక్ష పాత వాదన తగదంటె రంగాగారు అభ్యుదయ వ్యతిరేకి అంటు న్నారు. ఇతర రంగములలో నెంతెంతో రాబడులు ఉన్నా బాధ లేదు. ఆస్తులు కోట్లైనా అభ్యంతరములు లేవు. ఇతర రాబడి 10000 రూ॥ ఉన్నవారికి భూమివుండ కూడదని తీర్మానము చేసిన కమ్యూనిష్టు వారు నెలకు 500 రూ॥ జీతము వరకు కార్మికునికి పరిగణించవలెనని పార్లమెంటులో తీర్మానము ప్రతిపాదించిన కమ్యూనిష్టువారు, సోష లిష్టులు, వారి ప్రస్తుత స్నేహితులగు నియోసోషలిష్టు కాంగ్రెసువారు రంగాగారిని, స్వతంత్రపార్టీని అభ్యుదయ వ్యతిరేకులనుట గుండెనిబ్బ రము. విపరీతము. వ్యవసాయ దారుడొక సమాజోద్ధరణ మహత్తర వ్యక్తి. ప్రజాస్వామ్య రాజ్యాంగనిండు పునాది. చిరకాలమునుండి వీని సేవగుర్తు లేకుండ పోవుచున్నది. వీని ఆస్థితో చెలగాటము ఆడ డం, వీని కన్యాయముచేయుట సంకుచిత బుద్ధిఅని రంగాగారు ఎదు రించుట న్యాయము, సరసము, సమంజసము కాదా ?

గిట్టుబాటు ధరలు కావాలి. పైరు పంటధర ఎట్లావుండాలి. ఇది ఒక బ్రహ్మాండమైన సమస్య. జీవిత ప్రమాణాల తారతమ్య అవ గాహనతో మిళితమైన ప్రశ్న. సమాజ సమన్యాయము పేరను ఎన్నో నినాదాలని గొంతునిండా అరుచువారు వ్యవసాయదారునికి కావలసిన న్యాయవాదన చేయుటకు నచ్చరు. గింజలు చౌకగా

కావాలి. జీతాలు ఎక్కువ కావాలి. సౌకర్యాలు దినదినము పెరగాలి. ఇది పట్టణవాసులకు కార్మికులకు మంచిది. మరి గ్రామసీమలో అంటే నోరు కట్టుకుంటారు. వీరికి కనీస జీవిత ప్రమాణాన్నిచ్చే సరసధర ఉండొద్దా అని రంగాగారి ప్రశ్న. ఇయ్యేదే నిజవిప్లవాత్మక మైన ప్రశ్న. ప్రాథమిక ఉత్పత్తిదారుకు ప్రాథమిక న్యాయము కలుగ జేయక వానిని నిరంకుశముగ ప్రయోగించుకొని విషవిలాసము లేకుండా కష్టపెట్టి పారిశ్రామిక, వాణిజ్య, కార్మిక, పట్టణవర్గములు నిర్దాక్షిణ్యముగా ఉపయోగించు కుంటున్నారన్న యథార్థమును రంగాగారు ఎలుగెత్తి చాటుచున్నారు. తాను పండించిన పంట తాను కడుపార సుఖముతీర తినుట కర్షకుడు కాడా? బట్టలు, కోళ్లు, పరుపు, రేడియో, నూనె, నెయ్యి, కారు, విమానము, గొప్ప రైలు, హోటు, సూటు, బూటు, అన్ని పట్టణాలకు చెందాలి. గ్రామాని కెల్ల కాలము రెక్కల విరుపుండాలి. మట్టితినాలి. ఇది తగదు; వ్యవసాయ రంగమునకు కూడా ఇతర రంగములవలె న్యాయం కావాలని రంగాగారి వాదన. నోరున్న వారిమాట, కూటికున్న వారి పలుకు పలకడము మహాసులభువు. నోరూ, వాయిలేక, ఐక్యతలేక తనబాగు కూడ గుర్తించ లేని రైతు మాటాడుట గుండెధైర్యము.

అట్టి ధైర్యశాలి విప్లవవాది, నిష్కామకర్మ ఆచరించు త్యాగి మన రంగా పదవిని లెక్కించక నిరంతరము తన సిద్ధాంతము కొరకు ఎల్ల త్యాగములు చేయు రైతు ఆరాధకు డతడు. జవహర్లాల్ నెహ్రూ వ్యతిరేక వాదన కావగించుంత సహనం చూపినా ఉన్నత స్థానము నొంది యుండును రంగాజీ. పదవికంటే ఆశయమే ముఖ్యమనుకొని, మేధావిగాన తన సిద్ధాంత వాఙ్మయమును పెంపొందించి, స్నేహితులు, శిష్యులు ఎందరెందరో వస్తూపోతూవున్నా తానుమాత్రము చలించక, భూసంస్కరణముల పేరను రైతును నాశనము చేయు విధానాలను హిమత్పర్వతమంత వ్యక్తివలె బలముతో ఎదురించు చున్నారు.

రంగాగారు భూసంస్కరణలు కోరలేదా? అందుకేమి ఆటంకము లేదు. క్రమవిధానమున జరగాలనియే వారివాదన. వ్యవసాయ కూలీకి వీలుంటే భూమినందజేయవచ్చును. లేనినాడు వానికి సాంఘిక న్యాయము కావాలి. గిట్టుబాటుధర లెక్కలో అతనికికూడ సరసమైన కూలి ఉండాలనియే వారి లెక్కల పంపిణీ. జమీందారీవిధానము నశింపుకు దారితీసినవారిలో రంగాగారు అగ్రగణ్యులు. భూస్వామికి ప్రభుత్వమునకుమధ్యను మూడవమనిషి వుండకూడదనివారువాదించారు. గెలిచారు. నేడు జమీందారీవిధాన మంతరించిందంటే వారి ప్రభావమేఅనాలి. ప్రముఖు లనేకులుకూడ పాటుపడ్డారు. ముఖ్యపాత్ర వారిది. స్వయముగా భూమిని కృషిచేసి పంటపండించువానిపై ఇంకెట్టి పెద్దరికము లుండకూడదనే వారెల్లప్పుడు సిద్ధాంతీకరించినారు. వ్యవసాయము ఆధునికపద్ధతులను అమెరికా, ఐరోపామార్గాలను, వ్యక్తిప్రోత్సాహ సామర్థ్యముల నుపయోగించి పెంపొందించాలని వారినిర్ణయము. అందు కనువగు ఏకఖండ కమతములను ఐచ్ఛికముగా కూడ దీసి తగినంత పంట ఎక్కువగజేసి యంత్రములను జోడించి వాటిని సమృద్ధిజేసి నిపుణత్వమును అందజేసి రైతును భూమిపై విడిచితే అతడే భూతలమును సస్యశ్యామలముచేసి పుష్పశోభాయమానముగాజేసి స్వర్గలోకమును సర్వజన సౌఖ్యముకొరకు అవతరింపజేస్తాడు. వానికి తగుమార్కెట్టు కావాలి, సరసధర ఉండాలి. ఎగుమతి, దిగుమతి అవకాశాలు పెంపొందించాలి. వ్యవసాయ అనుబంధ పరిశ్రమలు స్థాపితమివ్వాలి.

ఇది నూతనసమాజ నిర్మాణ ప్రథమఘట్టము. కాని అభ్యుదయవాదులనేవారు వచ్చిరాని వెర్రి వెర్రి తప్పుడుపోకడలకు దారితీసి, ఉన్నది తారుమారుచేసి లేనిది తేలేకపోయి సర్వసంఘమును కంగారుజేసి జిత్తులు విరబోయు విధానముకాదుగాన మన రంగాజీయే రైతులకు శరణ్యము. ఈపాటికే రైతులకు ముప్పువాటిల్లివుండును. చక్రము రాజాజీ, రంగాజీ అడ్డువేసినారు. ఇక మనము మేల్కోవాలి.

# దీక్షాదక్షత గల యోధుడు

శ్రీ కె. ఈశ్వర దత్తు

40 సంవత్సరాల నిరంతర రాజకీయ జీవితం అనంతరం, నాలుగు దశాబ్దాల తీవ్ర రాజకీయ పోరాటం అనంతరం ఈనాటికీ ధైర్యోత్సాహాలను అదేవిధంగా నిలుపుకొన్నారు. ఆశ్చర్యంగా; అదే ఆయనలోని ప్రత్యేకత. ఆదినుంచి ఈ నాటికివరకు ఆయనపై రాజకీయరంగంలో వాదోపవాదాలు రేగుతూనే ఉన్నవి; అదే ఆయన శక్తిసామర్థ్యాలకు నిదర్శనం.

వాదోప వాదాలలోనే, పోరాటాలలోనే ఆయన గుణగుణాలు శక్తి యుక్తులు చక్కగా వ్యక్తమైనవి; ఆయన ధైర్యసాహసాలు దేశానికి సుపరిచితమైనవి. విలియం కేబట్ వలె ఆచార్యరంగా ఆరంభంలో తన ఆంధ్ర ప్రదేశ్ లో వ్యావసాయక వాదిగా తలఎత్తారు; వాట్ టైలర్ వలె అనతికాలంలోనే రైతునాయకుడుగా దేశదృష్టిని ఆకర్షించారు. ధైర్యంతో, దీక్షతో గ్రామీణ సమస్యలను రాజకీయ చర్చావేదికపై ప్రవేశపెట్టగలిగిన విశిష్టత వారికే దక్కింది. ఇప్పటికి ఆయన నరాలకు భూదేవి సువాసనలే చక్కని ఔషధమిచ్చి ఆయనను ముందువరుసలో నిలబెడతాయి. వ్యావసాయక భ్రాతృత్వ ఆయన మనసులో కలిగిన ఆందోళనే కాంగ్రెసు విధానాలమీద ఆయనచేత తిరుగుబాటు చేయించింది; భారత స్వాతంత్ర్య ఆధ్యాత్మిక నాయకుడుగా ప్రపంచ ప్రఖ్యాతిగన్న నాయకునికి గౌరవం తెచ్చిన తిరుగుబాటు ఇది.

రాజకీయ సమరరంగంలో నిలవడంకంటె ఆయనకు మరేదీ సంతోషాన్ని ఇయ్యలేదు. ఆయన ప్రధానంగా తిరుగుబాటుదారుడు; యోద్ధ! పెత్తందారులపై తిరుగుబాటుదారుడు; సామాన్య ప్రజల తరఫుననిలిచి పోరాడే యోధుడు. రాజకీయంగా రాజీపడి, వ్యక్తి

గతంగా అణగిమణగి ఉండగలిగితే ఎంత పదవినిఅయినా అధిష్ఠించటానికి అవకాశమున్న రోజులలోకూడ తన శతఘ్నులలో ప్రత్యర్థులను ముంచగలిగిన ధైర్యశాలి ఆయన. ఆయన రాజకీయాలు అనిశ్చితమైనవన్న విమర్శకు నాటికి నేటికి ఆయన వాదంలో స్థిరంగా నిలిచివున్న తత్వమే సమాధానం. ఆయన ఏ మార్గాన నడక ప్రారంభించినా గమ్యానికి చేరేవరకు అది సాగవలసిందే; ఆయనకు అడ్డదారులు, మజిలీలు లేవు; భయంచేతనో, తొందరలలో తలదాచుకొనటానికో ఆయన ఎవరి ఆశ్రయం కోరడు. ఎప్పుడు ఏ పనిచేసినా త్రికరణశుద్ధిగా, చివరకంటా చేయటమే ఆయనతత్వం.

అలాంటి ఆచార్యరంగా ఈనాడు ఏడవ దశాబ్దంలో అడుగిడుతున్నాడు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అపహాస్యంపాలు చేస్తున్న ఈనాటి ప్రభుత్వ హస్తాలనుంచి దేశాన్ని విడిపించటానికి ప్రారంభించిన మహాసమరంలో ఆచార్య రంగా నా పక్షకఆయుధమని రాజాజీ అంతటివ్యక్తి బహిరంగంగా ప్రశంసించి సంతోషించటంకంటె రంగా గారికి ఇంకేమి కావాలి? ఎన్నికలలో ఈ స్వాతంత్ర్యోద్యమ సమరం అదృష్టం ఎలావున్నా రాజాజీ ఉద్యమానికి దేదీప్యమానమైన చిహ్నంగా ఆచార్యరంగా దేశదృష్టినే కాక ప్రపంచదృష్టినికూడ ఆకర్షించగలరనటంలో ఏమాత్రం సందేహం లేదు.

ఆయన స్నేహితులు, అభిమానులు ఆయనను నిరంతరం పోరాటంసలిపే వీరుడుగా ప్రశంసిస్తారు.

ఆచార్యరంగా దీనావస్థలు, తరిగిపోని శక్తిసంపదగల వీరుడు. ఆయనతరం వారిలో ప్రముఖవ్యక్తిగా ఆయన జీవితంలో ఇక ముందున్నదే ఉత్కృష్టదశ అన్న విశ్వాసంతోనే ఆచార్య రంగాకు మన జోహారు లర్పిద్దాము.

# అసాదృశ్యమైన ఆందోళనాకారుడు

## శ్రీ ఖాసా సుబ్బారావు

ఆచార్య రంగాకు రెండే రెండు మహోన్నతమైన ఏకాగ్రతాగల ఆకాంక్షలున్నాయి. అవి ఒకటి కార్యకర్తలు, గ్రామీణులు – రెండు భారతీదేవి రంగా. మనకు తటస్థించే వారందరిలో అత్యంత సంతోష కరమైన వైవాహిక జీవితంగలవారిలో వారొకరు. భారతీదేవి రంగా గారి మనస్సును, మేధస్సును, సుగుణాలను గురించి ఆయన ఎంతో ఆప్యాయంతో పుప్పొంగే వుత్సాహంతో ప్రశంసిస్తుంటారు. "భారతీ దేవి గారంటే ఏమనుకున్నారు..." యిలా సాగిపోతుంది ఆయన అభినందన. మహామహా రాజకీయవేత్తలకంటె ఆమె ఎక్కువ వివేక వంతురాలని ఆయన విశ్వాసం.

శ్రీమతి భారతీదేవి రంగా వస్తుతః ఎలాంటి ఆడంబరాలు, హంగులు గిట్టని, అతిప్రశాంత స్వభావంగలవారు. కాని తమ భర్త పట్లగల అత్యంతానురాగ ఫలితంగా ఆమె స్వభావంలో సంపూర్ణ మైన పరివర్తనం జరిగింది. హృదయానురాగం [illegible] ప్రజ్ఞావిశేషాల విరాగంతో పొందిక కలిగివుంటుంది.

రంగాదంపతులు విభేదాలను ఎరుగరు. భావాలు, హృదయాలు రెండింటియొక్క చక్కని పొందిక [illegible] పిస్తుంది. శ్రీమతి భారతీదేవి రంగా తమ భర్తయొక్క ఆదర్శాలు, అభిమానాలు అన్నీ అనువర్తించుకొన్నారు. ప్రతి చిన్న విషయం లోను రంగాగారికి విశ్వాసపాత్రురాలైన అర్థాంగిగా వుండటమేకాదు ఆమె గృహిణిపద్ధతి నివేదనద్వారా తమను తాము సుశీలగా యిముడ్చు కొన్నారు.

స్వంతానికి సంబంధించి ఆర్థికంగా ప్రయోజనరహితమైన ప్రజా సేవ కార్యకలాపాల విషయమై యింట్లో పెనుకోపాలను ఎదుర్కో-

నాల్సిన యిబ్బంది లేని కొద్దిమంది అదృష్టవంతులలో ఆచార్యరంగా గారొకరు. రాజకీయవాదుల వుత్సాహ. ప్రోత్సాహాలను వికలంచేసే గృహపరిస్థితుల ప్రభావం – రంగాగారి విషయంలో ఆయన కార్యక్రమాలన్నిటి స్థాయిని తీవ్రతరం చేసేదిగాను, ముందుకు నడిపించే శక్తిగాను రూపొందినది. సహాయకారులైన బంధువర్గం ఆయనకు గలదు.

విస్తృత ప్రచారకుడుగా ఆయనకు జనుకట్టుగలిగిన విపరీతమైన ఘనతకు యిది వివరణ కల్పించగలదు. శారీరకంగా ఆయన దుర్బలుడు. ప్రజాసమూహాలను ఒకచోటికి చేర్చటం, తమ అభిరుచికి అనుగుణ్యమైన సిద్ధాంతాలపై ఆవేశపూరితమైన వుపన్యాసాలు కావించటం పట్ల ఆయనకు గల అత్యుత్సాహం తరగనిది. అది ఆయనకు సుఖ-భోగాలకై అర్రులు చాచటాన్ని అదిగమించే అలసట ఎరుగని దృఢనిర్ణయ శక్తిని ప్రసాదించింది. అంతులేని తీరున సామూహిక ప్రసంగాలు కొనసాగించటంలో ఆయన ఎలాంటి సంకోచం లేకుండా తమ కాలం గడుపుతారు. ఒక్క ప్రకాశంగారు మినహా– రంగాగారిలాగా ఆంధ్రదేశంలోని అన్ని గ్రామాలు సందర్శించి భూమిపై శ్రమించే జనాలతో అంత సన్నిహిత, విస్తృత సంబంధాలు స్థిరంగా ఏర్పరచుకున్నవారు మరెవ్వరూ లేరు. అనుమాన పూర్వకంగా రంగాగారు చక్కటి, సమర్థవంతమైన వక్త కాగలిగారు. ఆయన త్యాగచరితవలన, ఆడంబర రహితమైన అతిసాధారణ, సేవావ్రతమైన జీవితం మూలంగాను జీవితంలో ఉన్నతోన్నత ఆదర్శానికి తమ్ముతాము అంకితం చేసుకోవటం కారణంగాను. రైతుజనుల సమస్యలతోను వారి కష్ట – నష్టాలతోను, అభాగ్య జీవితాలతోను, తాదాత్మ్యం పొందాలనే ఆతురత వలనను, ప్రజా హృదయాలను ఆకర్షించగల ఆయన శక్తి బలవత్తరమైనది సమీకృతమైంది. ఆంధ్రదేశంలోని యువరాజకీయ వేత్తలలో ఆయన గుర్తించాల్సిన శక్తి. ప్రజావశీకరణ, వ్యక్తిగత పలుకుబడి, ప్రతిష్టలలో ఆయన పాతతరం నాయకులను త్వరితగతిన అధిగమిస్తున్నారు.

శ్రామికుల, రైతుల సమస్యలెల్లప్పుడూ రంగాగారి పెదవులపై మెదలుతుంటాయి. అందువలన కలిగిన ఒక ఫలితమేమంటే పలు విషయాలపట్ల ఆశక్తిగలవారు పరిమిత సమస్యలను మాత్రమే పరికించేవారు రంగాగారిని కొన్ని ప్రత్యేక వర్గాల అభిమాని మాత్రమే నని వర్గీకరించటం జరుగుతుంది. కేంద్ర అసెంబ్లీలో ఆయన ప్రసంగించటానికి లేచారంటే చాలు – ఇక చర్చల్లోకి కార్మికులు, రైతుల విషయాలు రాబోతున్నాయని తదితర సభ్యులు తమ అలవాటు చొప్పున ఊహించుకొనేవారు. వారి ఊహలను ఎల్లప్పుడూ రంగాగారు యదార్థం చేసేవారు. ఆయన మరో విషయాన్ని పరిశీలించని మనస్సుగలవారని విస్తారమైన ప్రశంస పొందారు. రైతాంగ ప్రాముఖ్యత పట్ల ఆయనకు దూరదృష్టి గలదు. అలాంటి దూరదృష్టి లోపించిన సహచర శాసన సభ్యులచే ఆయన విమర్శలను గురి అవుతుంటారు. తమ విశ్వాసాలను కొనసాగించే ఆయనశక్తి యువకులను సయితం యీర్ష్యనొందగల. సంపద; భాగ్యం, రాజకీయ వాగ్వాదాల సందర్భంగా రేకెత్తే ఉద్రేకం, ఉద్వేగంలో యువకులను నొప్పించకుండా సున్నితంగా వ్యవహరించగలరు.

ఆక్స్‌ఫర్డ్ విద్యార్థిగా ఆచార్యరంగా బహుముఖ విద్యాపారంగతుడు. రాజకీయ, ఆర్థిక విషయాలు కూలంకషంగా అవగాహన చేసుకొన్నారు. శ్రీరంగా చక్కటి నిర్మాణకర్త. స్వాతంత్ర్య భావుకుడు. మంచి వాదనాపటిమ గలవారు. అసాధ్యశక్యమైన ఆందోళనాకారుడు. ఏదైనా ఒక భావానికి అంకితమైనారంటే అది ఒక తీవ్రమైన సవాలుగా పరిగణించగల స్వభావం ఆయనకు వుంది. అందుకు అనుకూలురను తయారు చేసుకోవటంకోసం దాన్ని వెంటనే ప్రజాస్వామిక కార్యక్రమంలోకి అనువర్తించటం జరుగుతుంది. నిర్విరామంగా సాగిస్తున్న ఆయన రాజకీయ సమరంలో – తన భావాలకు అనుకూలురుగా మార్చే కార్యదీక్ష ఆయనకున్నది. ఆయన లోపాలు ఏమైనా కాని– ఆయనచేసే ప్రతిపనికి చిత్తశుద్ధి వెన్నంటి ఉంటుంది.

# పీడిత ప్రజలకు రంగాజీ సందేశం

## డా॥ యం. ఎడ్వర్డ్సు

అది వర్షాకాలము. అతివృష్టిచేత ప్రజల అలజడి అంతు లేనిదిగా ఉండెను. సంపన్నులు సంతోషంగా మేడల్లో ఉండగా బీదలు పనిపాటలులేక పూరిగుడిసెల్లో పస్తులు పరుండిరి. అట్టిసమయములో రంగాజీ ఆగమనము బెజవాడకు ఆరాత్రి పదిగంటలకని తంతిద్వారా సమాచారము వచ్చెను. రంగాజీ వస్తున్నాడనెడి వార్త అక్కడుండెడివారందర్ని ఆనందపరవశులచేసినది గాని రంగాగార్ని స్టేషన్ లో కలసికొనుటకు అక్కడి ఫ్యూన్ దస్తగిరి అనువాడు ఒక్కడే బయలుదేరాడు. రైలుబండి దిగగానే తడచిపోయిన దుస్తులలోని దస్తగిరిని తిలకించి రంగాజీ తనపైనున్న హాటక్ కోట్ తీసిదస్తగిరినికప్పి బండిలో ఆఫీసున కేతెంచెను.

'యదార్థి లోకవిరోధి' అను సామెత కలదు. మన రంగాగారు సత్యవాది. తాను సత్యమని నమ్మిన విషయముపై నిలబడి గట్టిగా వాదించేబుద్ధి మన రైతుబాంధవునిది. ఏల్ పాల్ సభలో అన్ని పార్టీలవారు కలసి సమిష్టి సేద్యానికి ఓటుచేశారు. అదితప్పని రంగా వాదించారు. అంతేనా – అధికారుల అండలేనను పోయినను పరువా లేదన్నారు – తాను పోషించి పెంచి దానిలో పెద్దగా ఎంచబడిన కాంగ్రెస్ సంస్థకు దూరమైనను పరువాలేదన్నారు. పెద్దపెద్ద ఉద్యోగాలు అశాశ్వతమన్నారు. దేశము పాడైపోవుట–అందు రైతు చితికిపోవుట చూస్తూ ఊరకుండ లేనని ఈ సంపత్తులేని సహకారాన్ని ప్రభుత్వాన్ని అమలుజరుపకుండు నిమిత్తము ఒక ఉద్యమాన్ని నడుపవలసి వచ్చినది.

రైతాంగ ఉద్యమ పిత మనరంగాజీ – రైతుకు ఇతరుల పోషించే బుద్ధి మెండు. రైతుబాచే రాజ్యభోగమని నమ్మి రైతు కూలీల సమి

కరించి రాజ్యాన్ని బాగుపరచుటకు కంకణధారియైనాడు. చరిత్రలో రాజ్యాధినేతలు ఎందరినో చంపిగాని, హింసించిగాని రాజ్యము చేబట్ట లేదని చదివాము. వ్యక్తులను పార్టీలను కూనీలుచేసి గద్దెనెక్కిన ఘనులను గురించి నేడు వినుచున్నాము. గాని మన ఆచార్యుడు రంగా గారైతేనో ఇప్పుడు 60 సం॥ వయస్సుగలవాడ్డు తన 20-వ ఏట రాజకీయాలలో ప్రవేశించి నిండు 40 సంవత్సరములు తన సర్వస్వము త్యజించి ఇతరులు తనను హింసించినను ప్రతీకారము చేయబూనక నేడు నవయువ్వనునివలె దేశసేవ చేయుచున్నాడు.

గుంటూరు జిల్లాలో నిడుబ్రోలను గ్రామము రంగాగారిది. అందు రైతాంగ విద్యాలయం అను నొకదాన్ని స్థాపించి సాంఘిక శాస్త్రము—ఆర్థిక శాస్త్రము, రాజకీయాలు వేనకువేలు యువ్వనులకు నేర్పి, నాయకులుగా సిద్ధపరచి ఆంధ్ర దేశ నలుమూలలకు పంపాడు. అది కాంగ్రెస్ పార్టీయా—కమ్యూనిష్టు పార్టీయా—సోషలిస్టా అదేమి ఇదేమి, ఏ పార్టీలో వెదకినను రంగాగారి శిష్యత్వము పొందనివారు ఒకరో, ఇద్దరో లేక వందలలోనో ఉంటారు. ఆయన వ్యక్తి కాదు. ఒక మహాసంస్థ.

ఒక విచిత్రము! ప్రేమిస్తారు, కౌగిలించుకొంటాడు, నేర్పిస్తాడు, పోషిస్తాడు. ఎందరో ఆయన చేతిలో మెలగి పెద్దవాడై తుదకు ఆయన్ని త్యజిస్తారు. కారణం విడిపోయినవారికే ఎరుక. ఏమయినా రంగాజీఅంటె ఆశ్చర్యపోతాడు. ఆ మహాత్మునినోట తనను తిరస్కరించి పోయినవారిని పల్లెత్తు మాటైన అని యెరుగడు. ఒకనాడు తనకు కుడిభుజముగాఉండి వేరైపోయి మంత్రిగద్దె ఎక్కిన ఒక నాయకునుభావున్ని చూడపోతుండగా తన సహచరులలో ఒకరు ఎందుకు పోతావని ప్రశ్నించగా, ''నాఅబ్బాయిని చూడవద్దా'' అని కారెక్కి వెళ్లాడు. ఎంతటి ఉదాసీనము?

ఒకనాడు రంగాగారు, గాంధీ, పటేల్. నెహ్రూగార్లతో సరి సమానంగా అధిష్టాన వర్గములో వుండినవాడే. గాంధీ, పటేల్ చని పోయిన తరువాత నెహ్రూనాయకత్వములో, సహకారసేద్యము, దండుగమారి ప్రణాళికల విషయములో అభిప్రాయ భేదాలతో పోట్లాడు

చుండ నాబోటి గాండ్రు ఎందరమో తనను సమీపించి "రంగాజీ తాము సత్యవాదివి నిజమే. కాని నిన్ను నమ్మిన నాబోటివాండ్రు ఎందరమో చితికిపోవుచున్నారము. ప్రస్తుతము చలామణిలో ఉండు అందరివలె నీవుకూడా—ఊ—ఊ బసవన్న అనరాదా! రేపు మంత్రివో లేక ప్లానింగ్ కమిషన్‌లో మెంబరువో అయ్యెదవే—నాడు మేముకూడా పర్మిట్లు—రూట్లు సంపాదించుకొని సుఖజీవనము గడిపెదమే" అని వినయంగా వచించగా! "నాటి పదవుల వేటకాదు. ప్రజాసేవ" యని ప్రత్యుత్తర మిచ్చెను. ఎంతటి నిస్వార్థి?

నేను క్రైస్తవుడను — క్రీస్తు దేవునిగా ఎంచి పూజిస్తాను. ప్రేమ—సత్యా—అహింసలజ్యోతి ఆయన. బైబిలు అను గ్రంథము చదివి నా పితరులు అనుసరించిన మతములో ఉన్నాను. గాని మహాత్మా గాంధీని స్వయముగా చూచి ఆయనలో ఆ అహింసాజ్యోతి ఉన్నదని ఆయన అనుచరునిగా కాంగ్రెసులో చేరినాను. గాంధీ శిష్యుడను నేను. రంగాగారిని ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షునిగా ఒకనాడు విజయవాడలో చూచితిని. తన వేష భాష విధానాలు నన్నాకర్షించినవి. మహాత్ముని పోలిన ఆశాజ్యోతి ఆయనలో ఉన్నదని నాడు గ్రహించితిని. రైతు సేవే రాజ్యసేవ యని గ్రహించితిని. నాటి రంగాయే నేటి రంగా కూడ—మార్పు కొంచమైనను కానరాదు. రైతు బాగుకొరకే ఆయన తపిస్తాడు. కూలి బాగుపడవలెననే ఆయన కోరిక. కళాకారుల కొరకు ఆయన కలలు కంటుంటాడు. ప్రజాసేవే ప్రభు సేవ యని నమ్మి, నమ్మిస్తాడు. ఈ ప్రేమమూర్తి, ఈ సత్యవాధి, ఈ అహింసాజ్యోతి, ఈ మహాసంస్థ, ఈ ఉదాసీని, ఈ నిస్వార్థి, ఈ మహానాయకుడు నవంబరు 7—వ తేదీని నిండు అరువది సంవత్సరముల వయస్సుగలవాడై తన ముద్దుబిడ్డను 'వాహినీకి' ఇరువదియైదు సంవత్సరముల పెండ్లి వయస్సు వచ్చుట చూచి సంతోషించు భాగ్యము భగవంతుడు వారికి అనుగ్రహించాడు. ఈ నాయక శిఖామణికి శతవర్ష ఆయువు—'వాహిని'కి చిరాయువు భగవంతుడు ప్రసాదించుటకు ఎల్లరము ప్రార్థింతము.

# శ్రమజీవుల సిద్ధాంత పురుషుడు

## శ్రీ పి. తిమ్మారెడ్డి

ఆచార్య రంగా భారత ప్రజాజీవితములో (Public life) ఒక నాయకుడంటే అది సరికాదు. ఆయన ఒక సంస్థ (institution) "రామానీడు" విద్యాలయం వారు స్థాపించిన "రైతాంగ విశ్వవిద్యాలయము". రైతాంగదృష్టితో అక్కడ ఆర్థిక, సాంఘిక, రాజకీయ సమస్యలపై పరిశోధన సాగుతుంది. రైతుసేవకుల (నాయకుల) కక్కడ ప్రారంభ విద్యనుండి డిగ్రీవరకు బోధన జరుగుతుంది. 'రైతు వుద్యమాని' కక్కడ రూపురేఖలు దిద్దబడినది. దాదాపు 30 సం॥ కావస్తుంది యీ కార్యక్రమం ప్రారంభించి శ్రీ రంగాగారు.

ఆంధ్ర దేశములో వుజ్వలముగా నడచిన స్వాతంత్ర్యపోరాటానికి రంగాగారు వ్యక్తిగాగాక ఒక సంస్థగా తోడ్పడినారు. నాయకత్వము వహించినారు. రైతులలో, కూలీలలో, వృత్తుల వర్గాలలో ప్రత్యేక చైతన్యము కలిగించి స్వరాజ్య వుద్యమాన్ని సర్వప్రజా వుద్యమంగా నడచునట్లు చేయగలిగిన కీర్తి ఆంధ్ర దేశానికి గలుగ చేసినది రంగాగారు.

రంగాగారి నోటనుండి రాజకీయపు మాటలు నేర్చుకొని, ఆయన జాడననడచి, తూర్పు పడమరలు, లోతు పొడుగులు తెలిసికొని నేడు రాజకీయరంగములో పదిమంది ముందర పెద్దలుగా తిరిగే వారు పెద్ద సంఖ్యలో నున్నారు. 25 సం॥గా చూస్తున్నాను—రంగాగారి ఆచార్యదీవెనలు లేకపోతే నేటి వ్యవహార దక్షులలో ఎంత మంది ఎక్కడ వుండేవారో అని ఆశ్చర్యమేస్తుంది. ఒక రైతుకూలీలలోనేగాక విద్యార్థుల్లో, యువకుల్లో, పారిశ్రామికుల్లో, వెనుకబడిన కులాల్లో, కుమ్మరి, కమ్మరి. వడ్రంగి, బంగారు మొదలగు వృత్తుల్లో,

వైద్యుల్లో ఆయా వృత్తి వర్గాలవారికి ఆత్మగౌరవము పెంచుటకు సంఘాలుపెట్టి వారి బ్రతుకు బాగుపడుటకు, వృత్తులు వృద్ధిపొందుటకు వుద్యమాలు నడిపి బలపరచి తోడ్పడిరి.

సిద్ధాంత పురుషుల జీవితమెప్పటికి సులువుగా నడువదు. రంగాగారి జీవితం మిందులకు నిదర్శనము. ఇంటినుండి మింటివరకు వారి ప్రతిదీ శాఁనుగా పరిష్కరించదగిన సమస్యగానే కన్పడుతుంది. పదిమందితో చర్చించనిది, దొరికిన పుస్తకాలతో సంప్రదించి కొంత కాలము అనేకచోట్ల ఆ సమస్య గురించి వుపన్యసించి సాధారణ ప్రజచలనము (Reactions) తెలుసుకోనిదే ఆయన సిద్ధాంతీకరించరు. కాని ఆ సమస్యలపై ప్రవీణులమనుకొన్న వారితో ఘర్షణ తప్పలేదు. సోషలిస్టు, కమ్యూనిస్టు సిద్ధాంతాలద్వారా సాధించలేనిది తన ''భారత రీతుల్లో'' సాధించగలనని వారి విశ్వాసము. అందుకనే ఏ సమస్యను గురించి ఆయన వ్రాసినా, మాట్లాడినా వారి 'ముద్ర' ప్రత్యేకత, కనపడుతుంది. ఎవరు ఏకీభవించక పోయినా వారికి చింత లేదు.

రంగాగారు, భారతీదేవిగార్లవద్ద రైతాంగ విద్యాలయ విద్యార్థులుగా నుండిన ప్రతి యువకుడూ, యువతి వారికి బిడ్డలుగా మనము పుట్టియుంటే ఎంత బాగుండేదో అని అనుకొనని వారులేరు. కన్న తల్లిదగ్గర దొరకని మాతృత్వము భారతీదేవిగారి దగ్గర కన్పడుతుంది. కన్నతండ్రి చూపలేని ఆతురత రంగాగారు చూపగలరు. వారి దగ్గరున్నంతసేపు తలిదండ్రులకు దూరముగా నున్నామను కొరత కన్పడదు. ''గోభూమి'' ఎందరికో పుట్టినిల్లు. వారు ఆదర్శదంపతులు. వారి సంతు అశేషము.

''ఆచార్య రంగా'' అంటే ''జై'' అన్నాయి రాయలసీమలో ''రాళ్ళు'' కూడా. రంగాగారి రైతు సభకు వుత్సవయాత్రగా, దూరములో నిమిత్తము లేకుండా, బండ్లు బయలుదేరేటివి, సర్కారు

జిల్లాల్లో. స్వర్గీయ శెట్టిపల్లి, నెల్లూరు వెంకట్రామానాయుడు మొదలగు మిత్రులు వ్రాసిన 'రైతుభజనావళి' పాటలుపాడు కుంటూ ''పొలములో రైతుండి పొలికేక పెట్టగనే, జయభేరి మ్రోగినట్లైతే జగతి నిండకపోతే'' ''నీవు నాగలిబట్టి నేల దున్నకపోతే రాజుల గింజలకు రాలదొక గింజయిన'' అని అట్లూరి అప్పారావు హెచ్చరిస్తే గంగ జాతర్లో ''బలి'' కేకలు వేసినట్టు వంతపాడుతూ గుంపులు గట్టి పాడేవి. అవన్నీ 1950 కి ముందు రోజులు. గొట్టుకు కట్టిన ముస్తీలు సమయాను చూపుతో అడుగులో, మలుపులో, కొంప్రేలో పొరపాటు లేకుండా అదును, పదును సరిచూచుకుంటూ వుద్యమము నడిపింది. కష్టపు రోజుల్లో కలిసి నడచింది; అనుభవపు రోజుల్లో ముసలంపుట్టింది.

రంగాగారి ''వ్యవసాయార్థిక వాదము'' రైతాంగానికి అమృతప్రాయము, ప్రాణప్రదము. ఎంతో వుత్సాహము రైతుల్లో పుట్టించింది. ఎంత త్యాగానికైనా సిద్ధపడింది, తమకు న్యాయము సంపాదించుకొనేందుకు. భూమిపై ఆధారపడి కష్టించి బ్రతికేజనానికి రంగాగారు ఆదర్శనాయకుడు, సిద్ధాంత పురుషుడు.

రైతురక్షణ యాత్రలు, రైతురాయబారాలు, రైతుదినోత్సవాలు కలిగించిన చైతన్యము అపారము. రైతు భజనావళి—రైతు ''గీత''

ఒకప్పుడు ''రైతుకూలీ ప్రజారాజ్య'' నినాదము ఆంధ్ర దేశములో సమ్మోహనాస్త్రముగా పనిచేసింది. అన్ని పార్టీలు ఈ కేకను మననము చేసినవి.

భారత జాతీయ నాయకులలో రంగాగారిది ఒక ప్రత్యేకత. వృత్తుల్లో, వర్గాలలో చైతన్యాన్ని నూరిపోయడములో వారు సిద్ధహస్తులు. ఆర్థిక, సాంఘిక రాజకీయ విధానాలను, కమ్యూనిస్టులు (Proleteriate) శ్రామిక దృష్టితో చూస్తే, రంగాగారు గ్రామీణ రైతాంగ దృష్టితో చూస్తారు. కాంగ్రెసు విధానాలు అన్నిటితో వారు ఏకీభవింపలేదు. అందుకు సహేతుకమైన కారణాలుకూడా

వారికి ఉన్నవి. కాంగ్రెసుకు రైతుదృష్టి కొంతలోపము. అది రంగా గారికి చిరాకు. రంగాగారిది తీర్చిన వ్యక్తిత్వము. గడచిన మూడు దశాబ్దాల కాంగ్రెసు నాయకత్వముతో వారి వ్యక్తిత్వము కుదిరిక పొందలేక పోయినది. పొందు కుదరక దెబ్బతిన్నది. శ్రీసుభాష్ చంద్ర బోసుతో పాటు శ్రీ రంగాగారుకూడ.

రంగాగారికి దివ్యమైన (Instinct) అంతర్వాణి వుంది. ఎప్పుడు ఏ చిక్కు సమస్య వచ్చినా వారికి వెంటనే ఒక పరిష్కారం కనపడేది. కానీ, ఆ పరిష్కారాన్ని చుట్టునున్న చిన్న, పెద్దలు పదిమందితో సంప్రదించి, దిద్దనిది వారు ప్రకటించరు. ఈ లోపల దానిరూపమే మారిపోతుంది. చూచేవారికి తృప్తినివ్వలేదు. రంగాగారికి (Reference) పుస్తకాలు తన చుట్టునున్నవారు. ఒకప్పుడు యీ సలహాదారులు ప్రమాదములో దించడముకూడ జరుగుతుంది. ఎవరి మూలాన ముంపువచ్చినా బాధ్యతను మట్టుకు తనమీదనే వేసు కుంటారు. ఆపని కొద్దిమంది నాయకులుమాత్రమే చేయగలరు. అట్లా చేసేందుకు ఎంతో మానసిక స్థయిర్యము కావాలి.

అధికారములేకనే, అధికారములోనున్న వారితో వాదు నడుపుతూనే దేశనాయకులలో ఒక ఉన్నతస్థానంలో నున్నారు రంగా గారు. పూజ్యబాపూజీకి వారు చాలా ఆప్తులు.

పెద్దలందరి దీవెనలు, శుభాకాంక్షలు వారికున్నవి. వారికి శిష్యుడుగా, కార్యకర్తగా నేచేయగలిగినది భగవంతుడు ఆ దంపతు లకు చిరకాలాయురారోగ్యముల నిచ్చి రైతుకూలీ ప్రజాసేవలోనే వారు జీవితము గడుపునట్లు ఆశీర్వదించవలెనని ప్రార్థించుట మాత్రమే!

3)

# వారి ఉద్యమాలు—వాటి ఉద్దేశాలు

శ్రీ పసుపులేటి కోటేశ్వరరావు

మూడుపుష్కరాలక్రితం భారత రాజకీయాకాశంలో ఒక ఉజ్వల ధృవతార మెరసింది. ఉద్దీపకాంతులతో యీ కాలంలో యీతార ప్రసరించిన వెలుగు బాటలకు, ప్రజాహిత కార్యరంగాలలో మరేదీ దీటురాలేదు—సర్వరంగాలను సర్వదృక్పథాలను సమ్మోహనపరచి తన పరిధిలోకి ఆకర్షించి అన్నింటికీ ఆలంబనమై విరాజిల్లింది.

యీ ధృవతారే — రూపకల్పనలో ఆచార్యరంగా! యీ కాలంలోని ప్రజాజీవనప్రగతికి రంగాజీ ప్రభావం జీవనదిలాంటిదిగా సాగింది. యీ కాలంలో సాగిన ఉద్యమాలలో, పోరాటాలలో—నవనవ సంస్థలలో, సారథ్యాలలో రంగాజీ జోక్యం, ప్రమేయం లేని అంశమే లేదు. ఒకరకంగా యీ కాలంలోని ప్రజాఉద్యమచరిత్ర రంగాజీ చరిత్ర. అమాయకత్వం, అజ్ఞానం, నిరక్షరాస్యత, దారిద్ర్యం, బానిసత్వం, మూఢత్వం, అలముకొని గాఢాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న గ్రామప్రజాజీవితానికి, విజ్ఞానంలోకి, విద్యలోకి, వికాసంలోకి, స్వయంశక్తిలోకి, స్వేచ్ఛలోకి, వెలుగులోకి దారిచూపిన మహోజ్వల మార్గదర్శిక జ్యోతులు రంగాజీ సాగించిన ఉద్యమాలు, సాధించిన ఫలితాలు! ఈఉద్యమస్థాయి, నైపుణిధోరణి ప్రజాఉద్యమాలకే ఒక క్రొత్తవరవడి తీర్చిదిద్ది—ప్రజాహృదయాలలో సరిక్రొత్త ఆవేశం అభిరుచి, ఉత్సాహప్రోత్సాహాలు సమకూర్చి ముమ్మరముగ నడిపాయి. ప్రజలమధ్య మొదలి, నిలచి, బ్రతికి, పెరిగిన దాదాపు అన్ని ఉద్యమాలకు ఆయన ఆచార్యుడు...అక్షరాలా ఆచార్యుడు! వివిధ ఉద్యమాల కార్యకర్తలు, నాయకులు, వేసంగి రాజకీయ పార్టీలు మూసలో ఆయన ఆచార్యత్వం క్రింద అచ్చులు తీర్చుకుని బయటకువెడలిన వారే! ఒక మహా జీవనదినుండి, ఆనదీ జలాలతో వివిధ ఉప-

లకుసాగి వివిధ క్షేత్రాలనూ సారవంతం చేసిన కాల్వల లాగా, ఆయన ఆచార్యత్వం క్రింద అధ్యయనం చేసిన యీ రాజకీయ పాఠశాల విద్యార్థులంతా ఆయన ప్రబోధించిన సిద్ధాంతం, ప్రచారించిన పరతత్వం, మనస్సులలో, హృదయాలలో, సర్వాంగాలలో నింపుకొని— నిక్షేపం లాగు భద్రపరచుకొని— వివిధప్రదేశాలలో, వివిధ రంగాలలో, వివిధ ఉద్యమాలలో ప్రజాహితమే పరమావిధిగా కార్యనిర్వహణకు ఉద్యుక్తులై కృషిసల్పారు...ఇలా సారవంతమైన క్షేత్రాన్నుండి పండి పెరిగిన ఫలితమే యీనాడు భారతావనిలో ముఖ్యంగా ఆంధ్ర ప్రజాజీవితంలో ద్యోతకమౌతున్న పరిపుష్టి త్రోక్కే— రాజకీయచైతన్యం.

రంగాజీ అధ్వర్యాన సాగిన అన్ని ఉద్యమాలను పేర్కొనడమంటే దేశచరిత్రను వ్రాయబూనడమే, కాగా, ప్రధాన ఉద్యమాలు కొన్నింటిని మాత్రమే అవలోకించడం సాధ్యం—!

దేశం ప్రముఖంగా వ్యావసాయకమైనట్టిదైనప్పుడు, సహజంగానే, రైతుకు, రైతుపలుకుబడికి హెచ్చుప్రాధాన్యత లభ్యం కావాల్సివుంటుంది. "యీ దేశానికి ఒక రైతు అధ్యక్షుడు కావాలి" అన్న గాంధీజీ ప్రవక్తృత్వమందలి సమర్థనయిదే. కార్మిక నియంతృత్వమే ధ్యేయమైన సిద్ధాంతాన్ని ఆరాధించే కమ్యూనిస్టులు యీ వాస్తవికతను గుర్తించ నిరాకరిస్తారు. కాగా, ప్రధాన ఉత్పత్తిసాధనమైన వ్యవసాయక సమృద్ధిలో, అత్యధిక సంఖ్యాకులైన రైతుల పురోభివృద్ధిలో యీ దేశపు భవిష్యత్పురోభివృద్ధి అనివార్యంగా ముడివడివున్నదని గుర్తించి కృషిసల్పిన తొలి ఆంధ్రుడు ఆచార్య రంగా. ఆనాటినుండి యీనాటివరకూ ఆ ధ్యేయం విస్మరించకుండా, అందుకోసమే అహర్నిశలూ కృషిసల్పుతూ, తన రాజకీయ జీవితం యావత్తూ రైతుక్షేమం కోసమే అంకితం చేసిన ఏకైక భారతీయ నాయకుడు రంగాజీ !

రైతుకు భూమికి గల అనుబంధం రైతును అభివృద్ధి నిరోధకుడుగా రూపొందిస్తుందనే మార్క్సిస్టు విశ్వాసానికి విరుద్ధంగా—

రైతుకు భూమికి గల అనుబంధం శాశ్వతమైనదన్న సర్వస్వభావం రైతులో కల్గించటంవల్లనే యీ దేశం అభివృద్ధిపథాన పురోగమించటం సాధ్యమౌతుందని రంగాజీలోకల అచంచల విశ్వాసమే—వారి యీ అవిరామకృషికి మూలం. 1920–1925 ప్రాంతాల్లో అండదండలు, ఆదుకునే నాథుడు, కష్టాలు చెప్పుకోగలచోటు, నివారించుకోగల మార్గంలేక అంధకారంలో అజ్ఞానములో కొట్టుమిట్టాడుతున్న రైతులు క్రమక్రమంగా సంఘటితపడి ఒక 'శక్తి'గా రూపొందటానికి బాటలు తీర్చింది యీ కృషి. యీ సంఘటిత సమన్వయాలతో సమకూరిన స్వయంశక్తితో, బలంతో, మందితో, సునావిశ్వాసాలతో—రంగాజీ మొదట యీ ఉద్యమాన్ని ఆంధ్రలో ఆరంభించి, అచిరకాలంలోనే అఖిలభారతానికి అందజేశారు. 1928 లో స్థాపితమైన ఆంధ్రరాష్ట్ర రైతుసంఘానికీ, 1935 లో మద్రాసులో నిర్వహితమైన అఖిల భారత కిసాన్ మహాసభకూ—పునాదులాయి ఆచార్య రంగా. 1931 లో రంగాజీచే స్థాపితమైన రైతురక్షణసంఘం యీ ఉద్యమాన్ని వినూత్న రీతులతో ప్రజలమధ్యకు మనోవేగంతో గొంపోయింది. యీ సంఘ అధ్వర్యాన జరిగిన రైతురక్షణ వారాలు, రైతురక్షణ యాత్రలు, రైతుభజనా ప్రచారాలు—రైతుఉద్యమ చరిత్రలో ప్రత్యేకాధ్యాయాలు, ఆంధ్రలో ఆరంభించబడిన యీ తీరుతెన్నులు అఖిలభారతంలోని మూలమూలలూ అందిపుచ్చుకున్నాయి. యీ అఖిలభారత సమన్వయంవల్ల, ఒకే కార్య విధానం, పరస్పర సహాయ సహకారసానుభూతులు, సక్రమ ప్రణాళికాబద్ధ ఆందోళనలు సాధ్యమై రైతు ఉద్యమం బలసౌష్టవాలు కూర్చుకుని, తద్వారా దేశ సౌభాగ్యాన్ని సమకూరుస్తుందని గుర్తించటానికి కాంగ్రెసు అధిష్ఠానవర్గానికి తర్వాత మెన్నో సంవత్సరాలు పట్టింది. అప్పటికైనా జరిగిన యీ కనువిప్పు ఆచార్య రంగా ప్రావీణ్యతా ఫలితమే!

రంగాజీ సాగించిన యీ ఉద్యమం విస్తృత ప్రాతిపదికగలది. ఒక్క-రైతు క్షేమమేకాక, కవులుదార్ల, వ్యవసాయకూలీల క్షేమం

సహితం యీ ఉద్యమ ప్రాంగణంలో ఆశ్రయం పొందాయి. యీ ఉద్యమ ప్రాంగణంలో మహోధృతంగా రైతుశక్తినీ త్యాగబలాన్ని ప్రదర్శించిన ఆనాటి రైతురక్షణ యాత్రలు మొదలు యీనాటి సహకార వ్యవసాయ వ్యతిరేకతవరకూ — రైతు సమస్యలపట్ల కనిపించే తొలి ఆశక్తి, వినిపించే తొలికేక ఆచార్య రంగాదే! పేరులు మారినా, రూపాలుమారినా, సంస్థలుమారినా— యే పేరు కైనా, యే రూపానికైనా, యే సంస్థకైనా, మూలమూ ఆలంబనమూ అయిన దేశానికే వెన్నెముకగావున్న రైతుకు, రైతు ఉద్యమానికీ, ఆలంబనం ఆనాటికీ, యీనాటికీ ఆచార్య రంగాజీ యే!

## జమీందారీ వ్యతిరేకోద్యమం

మన దేశ చరిత్రలో జమీందారీలు తిరిగిపోయిన పుటలు. కాని యీపుటలు తిరిగిపోవటానికి యెంతటి ఉద్యమం, యెంతటి త్యాగం అవుసరమైనదో యీ పుటలతో పరిచయమున్నవారికిగాని గ్రాహ్యపడదు. ఇంతటి ఉద్యమాన్ని, ఇంతటి త్యాగాన్ని అవుసర పరచిన యీ పుటలను త్రిప్పివేసిన వ్రేళ్లు ఆచార్య రంగావి.

1802 లోని పర్మినెంటు సెటిల్మెంటు ప్రకారం మద్రాసు రాష్ట్రంలోని జమీందార్ల వశంలో వున్న భూమియందలి రైతులు చెల్లించవలసిన శిస్తు 75,00,000 రూపాయలు మాత్రమే. ఇందులో రు. 50,00,000 ప్రభుత్వానికి చెందవలసినది. మిగతాది జమీం దార్లది. కాని, రానురాను జమీందార్లు రైతుల్ని పీల్చి పిప్పిచేసి రు. 75,00,000 లకు మారుగా దాదాపు రు. 3,00,00,000 గుంజి — రు. 75,00,000 ప్రభుత్వానికిపోగా, మిగిలిందంతా తమ విలాస భోగ జీవితాలకు వినియోగిస్తూ, నిర్దాక్షిణ్యంగా రైతు నెత్తి మొత్త డం సాగించారు. దీనికి అవరోధం లేదు. జమీందారీ రైతు బానిస కంటె హీనమైన, హేయమైన పరిస్థితికి దిగజారి పోయాడు. ఒళ్లు గుల్లచేసుకొని పండించిన పంటంతా, గింజ మిగల్చకుండా, జమీం దార్ల గాదెలు నింపగా, కటిక దరిద్రంతో, గంజికి దిక్కులేక మల

మలమాడి పోయేవాడు. యీ ఆర్తనాదం కోటగోడలను దాటలేక పోయేది. ప్రభుత్వపు చెవి చాయలకైనా పో వీలులేకపోయేది. ఈ స్థితిలో రంగాజీ జమీందారీ వ్యతిరేకోద్యమాన్ని చేపట్టారు.

రంగాజీ యీ ఉద్యమ నిర్వహణకు పూనుకొనకముందే జమీందారీ రైతులలో కొంత చైతన్యం కల్గించే యత్నాలు కొన్ని సాగాయి గాని, అవన్నీ స్థానికంగానే వుండిపోయాయి. రంగాజీ ప్రవేశంతో యీ ఉద్యమానికి సౌష్టవం, పరిపూర్ణత, ఆత్మవిశ్వాసం చేకూరాయి. చెదురు మదురుగావున్న యీ ఉద్యమాన్నంతటినీ సమన్వయపరచి ఒక ఉద్ధృతి స్వరూపమిచ్చి - ఇందుమూలంగా ఉద్భవించిన జమీందారీ వ్యతిరేకనినాదం దేశం నలుమూలలలో మహోగ్రంగా ప్రతిధ్వనింప చేశాడు రంగాజీ. ఈ ఉద్యమ తాకిడికి కోటగోడలు కదలిపోయాయి. ప్రభుత్వం బధిరతనుండి బయటపడి కదలసాగింది — ఇన్నినాళ్ళుగాను అణచిపెట్టబడివున్న జమీందారీ రైతులు విప్లవమూర్తులై, సాహసపోతులై, చైతన్యస్వరూపులై, రంగాజీ నాయకత్వాన ముందుకు ముందు నడక సాగించారు. నిశ్చలతతో. సమర్థతతో ప్రావీణ్యంతో రంగాజీ నడపించిన యీ ఉద్యమం, అదను రాగానే జమీందారీ వ్యవస్థను కూకటి వేళ్ళతో పెళ్ళగించిన పథకానికి మూలస్తంభం.

1931లో వెంకటగిరి జమీందారీ రైతుసమస్యలపై రంగాజీ రూపొందించిన నివేదిక. అదే యేడాది ప్రథమ ఆంధ్రరాష్ట్ర జమీందారీ రైతు మహాసభ అధ్యక్షస్థానంనుండి, యే పరిహారము లేకుండగనే జమీందారీ విధానం రద్దుకావాలని ఆయన వేసిన కేక. ప్రత్యక్షంగా తానై వెంకటగిరి అటవీ సత్యాగ్రహం నడిపినతీరు. 1933లో ఏలూరులో యేర్పాటైన ద్వితీయాంధ్రరాష్ట్ర జమీందారీ రైతు మహాసభకు అధ్యక్షుడుగా రంగాజీ ప్రకటించిన కనీస కోర్కెల ప్రణాళిక 1933లోనే యేర్పడిన జమీందారీ రైతువిచారణ కమిటీకి తానుగా అధ్వర్యం వహిస్తూ, ఊరూరా తిరిగి వివిధ జమీలలో నిరాటంకంగా, అమానుషంగా సాగుతున్న అక్రమాలు, అన్యాయాలు,

దౌర్జన్యాలు విచారణజరిపి ప్రకటించిన నివేదిక "రైతును రక్షించు" అన్న శీర్షికతో జమీందారీ విధానంవల్ల కలుగుతున్న అనర్థాలను అరటిపండువల్చి చేతబెట్టినట్లు నిరూపించి చూపే ఆయన వ్యాసావళి, ఆయన ఆశీర్వాదబలంతో, ప్రోత్సాహ ప్రోద్బలంతో, జమీందారీ రైతులపాలిటి ఆప్తబంధువుగా ఇంటింటికీ, గడపగడపకూ యెక్కి, నెన్నుతట్టి సత్కరించిన "జమీన్ రైతు" పత్రిక — అన్నీ యేకమై జమీందారీ నిర్మూలన విధానం కాంగ్రెసు అధిష్ఠానవర్గం ఆమోదం పొందేలా, కాంగ్రెసు యెన్నికల ప్రణాళికలో స్థానం పొందేలా..... కాంగ్రెసు ప్రభుత్వాలు అధికారం హస్తగతం చేసుకున్న అనంతరం జమీలను రద్దుపరచిన చట్టాన్ని నిర్మించి అమలుపర్చేలా—చేశాయి.

ఈనాటి ప్రజాజీవిత గ్రంథంలో జమీలు త్రిప్పివేయబడిన పుటలే అయినా, రంగాజీ రాజకీయ జీవితాన్ని స్మరణకు తెచ్చుకున్నప్పుడల్లా ఆపుటల్లోని బాధ, కష్టం, అన్యాయం, దౌర్జన్యం — ఆవేగం, ఆవేశం, పోరాటం, ఉద్యమం, త్యాగం అన్నీ కళ్ళకు కట్టినట్లు మెదుల్తాయి మనో నేత్రం ముందు.

మరుద్దామన్న మరుపుకురాని ఉద్యమం ఇది!

## సెటిల్‌మెంటు ఉద్యమం

19వ శతాబ్దపు సెటిల్‌మెంటు ప్రకారం పంటలో సగంవంతు శిస్తుక్రింద చెల్లించవలసివుండేది రైతు. ఆరవవంతు మాత్రమే వసూలు చేసిన హిందూరాజుల పరిపాలనకూ, మూడవవంతు వసూలుచేసిన ముసల్మాను ప్రభుత్వ పరిపాలనకూ— యీ సెటిల్‌మెంటుకే పన్ను వసూళ్ళలో యెంతో వ్యత్యాసముంది. దీనితోనే అష్టకష్టాలు పడుతున్న రైతుల నెత్తిన 1928లో రీసెటిల్‌మెంటు అంటూ పన్నును యింకా అధికంగా వేసే కార్యక్రమం తలపెట్టింది ప్రభుత్వం. ఇందుకోసం నియమింపబడిన "హోద్సువర్తు" అన్న ఉద్యోగి రూపాయకు మూడణాల చొప్పున పన్ను హెచ్చింపమని సిఫార్సులు చేశాడు.

ఈ శిఫారుసు రైతుల్ని గగ్గోలపరచింది. దీనితో సర్వత్రా రేగుతున్న ఆందోళనను సమయింప చేసేందుకు యీ సిఫారుసుల భాగోగులు విచారించడానికి ఒక ప్రత్యేక సంఘాన్ని నియమించింది ప్రభుత్వం. యీ సంఘానికి కార్యదర్శిగా రంగాజీ కృష్ణా ఉభయ గోదావరి జిల్లాలలోని మారుమూల గ్రామాలను సహితం సందర్శించి, రైతుల సాధక బాధకాలను సాకల్యంగా విచారించి, ఇప్పుడున్న పన్నే రైతులపై అధిక భారంగా వున్నదన్న నివేదికకు పునాది సమకూర్చాడు.

ఈ నివేదికను బుట్టదాఖలా చేసి 'హోడ్సువర్తు' సిఫారుసులమలు జరుప ప్రభుత్వం తలపడింది ... ఈ స్థితిలో రంగాజీ రైతుల తరఫున రైతులమధ్యన నిలబడ్డారు. ఈ రీసెటిల్ మెంటుకు వ్యతిరేకంగా వాడవాడలా ఉద్యమం లేవనెత్తారు. రైతులు రంగాజీ అడుగుజాడల్లో కదలి ఒక మహా ఉప్పెనలా ప్రభుత్వ రైతాంగ వ్యతిరేక విధానాలపై విరుచుక పడ్డారు. 1931 నవంబరు 1-వ తేదీ రీసెటిల్ మెంటు వ్యతిరేక దినంగా ప్రకటించబడి, ఊరూరా రంగాజీ స్వాతంత్ర్య శంఖారావం మారుమ్రోగింది ... ఈ ఉద్యమం ఉవ్వెత్తున సాగుతున్న దినాల్లోనే శాసనోల్లంఘన ఉద్యమం దేశాన్నంతటినీ కప్పివేసింది. ఫలితంగా ఈ ఉద్యమంకూడా ఫలించి అధిక శిస్తువసూళ్లు ఆగిపోయాయి.

ఈ ఉద్యమ కారణంగా రంగాజీ దృక్పథంలో అత్యంత విలువైన రైతు సమైక్యత, సమన్వయం సాధ్యపడటమే కాక—గ్రామగ్రామాన పటిష్టమైన రైతుసంఘాలు సహితం ఘటుసపడ్డాయి.

### కూలీ ఉద్యమం

ప్రముఖంగా వ్యావసాయక దేశమైన మన దేశంలోని ముఖ్య వర్గాలలో కూలీవర్గం ఒకటి. వీరిని సంఘటితపరచి, యితరవర్గాలతో సామరస్యం కూర్చనిదే 'సాంఘిక న్యాయం' అన్న పదానికి అర్థం లేదని రంగాజీ 1925 ప్రాంతాల్లోనే ఉద్బోధించారు. ఆనాటినుండే

దేశంలో కూలీ ఉద్యమవ్యాప్తికి, వారి ఆర్థిక రాజకీయ పురోభివృద్ధికి మన దేశంలోనే కాక విదేశాల్లో సహితం కృషి సాగించారు రంగాజీ. 1939లో బర్మాలో అత్యంత విజయవంతముగా జరిగిన అఖిల బర్మా కూలీమహాసభకు అధ్యక్షతవహించి, కూలీల సమస్యాపరిష్కారానికై సామరస్య ప్రాతిపదికైన వాస్తవిక కార్యవిధానం సూచించి, ఆ వెంటనే బర్మాఅంతటా నెలరోజులపాటు పర్యటించి, ఆదేశంలో కూలీ ఉద్యమ నిర్వహణ పద్ధతిని పర్యవేక్షించారు. తొలుత ఈ ఉద్యమాన్ని వ్యతిరేకించిన బర్మా మేస్త్రీలు సహితం తుదకు రంగాజీ ప్రభావ పరిధిలోకివచ్చి తలలొగ్గారు. ఆయన ధ్యేయమైన రైతు కూలీ ప్రజారాజ్య స్థాపనకు, ఈ కూలీ ఉద్యమం ఒక విశిష్ట సోపానం.

## రైతుకూలీ సామరస్యోద్యమం

వర్గప్రయోజనాల నిమిత్తం, సిద్ధాంత ప్రచారనిమిత్తం, రాజకీయ చైతన్యనిమిత్తం, వర్గసంఘస్థాపనావశ్యకత యెంతైనావున్నదని తొలినుండీ రంగాజీ విశ్వాసం. వర్గసంఘాలస్థాపన కమ్యూనిస్టుల ప్రచారవిధానంలోకూడ కన్పిస్తుంది. కాని మూలంలో రంగాజీకి కమ్యూనిస్టులకు మధ్య తూర్పుపడమరలంత భేదం వుంది. సిద్ధాంత రీత్యామార్క్సిజం వర్గాలమధ్య సంఘర్షణగాప్రవర్తించి వాంఛిస్తుంది; ఇందుకు భిన్నంగా వర్గాలమధ్య సామరస్యసాధనద్వారా సమాజ పురోభివృత్తి సాధ్యమని ప్రవర్తించాడు రంగాజీ... యీ సిద్ధాంత ఫలితమే, వృత్తుల ప్రాతిపదికగా వివిధవర్గసంఘాలస్థాపనకు ఆచార్య రంగా అధ్వర్యం, స్థాపనకంటే, యీ వర్గాలమధ్య సామరస్యంసరళి కోసం రంగాజీ సాగించిన ఉద్యమం మరింత యెన్నతగింది. ఆ ఉద్యమ భాగమే యీ రైతుకూలీ సామరస్యోద్యమం.

దీనికి ప్రత్యేకించిఒకవిశిష్టతవుంది. నూటికిఎనభైవంతులుగావున్న వ్యవసాయవృత్తిలో ప్రధానభాగస్వాములు రైతులు, కూలీలు. ఇరువురూ పొలాలపై నడుంవంచి శ్రమించేవారే. అయితే భూమిపై హక్కు ఒకరికివుంది, రెండవవారికి లేదు. యీ కారణంగా సమకూడే

అవకాశాన్ని భూతద్దాలక్రిందవుంచి, యిరువురిమధ్య సమన్వయ సామరస్యాలను రూపుమాపి, సంఘర్షణను ప్రకోపింపచేసి తద్వారా తమ పార్టీ ప్రాబల్యాన్ని విస్తరింప పూనుకునే కమ్యూనిస్టు ఎత్తు గడలకు విరుగుడుగా, రైతులకు కూలీలకు మధ్య సామరస్యసాధన సాధ్యపరచి, యిరువురి ప్రయోజనాలను పరస్పరం సానుభూతితో గౌరవించుకుని రక్షించుకోవటంద్వారా వ్యవసాయవృత్తికి, ఉత్పత్తికి హెచ్చు ప్రమాణాలు, పరిమాణాలు సమకూర్చడమే యీ ఉద్యమ నిర్వహణలో రంగాజీ సంకల్పం. ఈ సంకల్పఫలితమే 1933 లో రైతుసంఘసభ్యులంతా, రైతుకూలీ సామరస్యానికై కృషిసల్ప ప్రతిజ్ఞ చేయాలని ఆయనచేసిన ప్రబోధం. 1935 లో కార్మిక కర్షక సమ్మేళనస్థాపనజరిగి, రైతుకూలి ఆర్థిక రాజకీయ అభివృద్ధికై పాటుబడుటే ధ్యేయమై, రంగాజీ కార్యదర్శిత్వంతో కొనసాగిన కార్యక్రమఉద్దేశం యీఉద్యమమే! యీ సామరస్యంలో యే ఒక వర్గానికీ కష్టనష్టాలు కల్గరాదనే దృష్టితో— ఆదిలోనే ధాన్యానికి కనీసధరలు, కూలీలకు కనీస జీతభత్యాలు నిర్ణయింపబడాలనే సూత్రాన్ని సిద్ధాంతీకరించాడు రంగాజీ. 1931 లో ప్రకటితమైనది "దక్షిణభారత కార్మికులు" అన్న రంగాజీ గ్రంథం, యీ సామరస్య ప్రాతిపదికగా కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ ఆవశ్యకతను— సిద్ధాంతాలు సహితం అచ్చెరువొందే వాస్తవిక తర్కంతో నిరూపిస్తుంది. వ్యవసాయకూలీల కనీసవేతన నిర్ధారణపై 1935 లో రంగాజీ రూపొందించిన ప్రణాళికను, ఇందుకు మూలమైన రైతుకూలీ సామరస్యతత్వాన్ని సిద్ధాంతాన్ని—తర్వాత యెన్నోయేండ్లకు కళ్ళువిప్పిన కాంగ్రెసు యెన్నికల ప్రణాళికలో చేర్చుకుని, తనదిగా చేసుకుంది. వ్యక్తికీ వ్యక్తికీమధ్య, సామరస్యం ప్రబోధించాడు గాంధీజీ. వ్యక్తికీ వ్యక్తికీ మధ్య వర్గానికీ వర్గానికీ మధ్య సంఘర్షణకు నూరుగా, సామరస్యం సాధించి సాగించాడు రంగాజీ. గాంధీజీ ప్రబోధించిన మానవతత్వపు విలువలదృష్ట్యా, రంగాజీ సాగించిన యీ మహోద్యమం మహోజ్వల మైనది— అసమానము, అపురూపమూ అయినది.

## వలసప్రజ స్వాతంత్ర్యోద్యమం

పారతంత్ర్యంలో, బానిసత్వంలో మ్రగ్గుతున్న అన్ని దేశాల సమస్యలు దాదాపుగా ఒకటే—అది ఆసియా కానీ, ఆఫ్రికా కానీ! సామ్రాజ్యవాదుల ఇనుపపాదాలకు యీ విషయమై విచక్షణ లేదు. అయితే ఇట్టి యినుప పాదాల క్రింద నిర్దాక్షిణ్యంగా నలిగిపోయినది అధికంగా రంగుజాతులవారు— కాగా, పీడితజాతుల ప్రతినిధుల నందరినీ సంఘటితపరచి ఒక 'శక్తి'గా రూపొందించగలిగితే, వివిధ దేశాలలో సాగుతున్న స్వాతంత్ర్యోద్యమాలకు అధిక పటిష్టత చేకూరుతుందన్న యోచన 1931 లో రంగాజీకి లండన్‌లో వుండగా కల్గింది. ఫలితంగా అచిరకాలంలోనే, రంగాజీ ఆధ్వర్యాన 'రంగుజాతుల లీగు' అన్న సంస్థ లండన్‌లో స్థాపితమై నిలచింది. వలసప్రజల స్వాతంత్ర్యోద్యమాలకు చేయూతనివ్వడం యీ సంస్థ లక్ష్యం. ఆ తర్వాత వలస ప్రజాస్వాతంత్ర్యసంఘటన అన్న పేరుతో అత్యంత ప్రాముఖ్యంలోకి వచ్చి, ప్రపంచం నలుమూలలా యీ ఉద్యమ ప్రభావాన్ని ప్రసరింప జేసినది యీ సంస్థే. యీ ఉద్యమస్వభావం రంగుభేధాలకు పరిమితమైనదన్న అపార్థానికి అవకాశం లేకుండా యీ పేరు మార్పటం జరిగింది. యీ ఉద్యమ ప్రభావమే 1945 బొంబాయి అఖిలభారత కాంగ్రెసు కమిటి 'క్విట్ ఇండియా' తీర్మానానికి రంగాజీ చేర్చ యత్నించిన 'ప్రపంచపతిత ప్రజలారా, ఏకం కండు' అన్న నినాదం యీనాటికీ పారతంత్ర్య దేశాలలో, పాలితప్రజల హృదయాలలో మార్మ్రోగుతూవుంది. సర్వమానవ సౌభ్రాతృత్వంకోసం విశ్వశ్రేయస్సుకోసం సాగిన యీ పవిత్ర ఉద్యమం, అవధుల్లేని రంగాజీ వ్యక్తిత్వానికీ, హృదయ సరళత్వానికీ, విశ్వమానవ ప్రేమకూ నిదర్శనం.

## చేనేతోద్యమం

అగ్గిపెట్టెలో మడతపెట్టగలంతటి సున్నితవస్త్రాలను తయారించిన అసమాన శిల్పచాతుర్యం మన చేనేతవారి సొత్తు. దేశఆర్థిక స్వాస్థ

వానికే యీ శిల్పచాతుర్యం చేయూతనిచ్చింది. అయితే అది ఒక నాటిమాట. బ్రిటిషువారి హయాము వచ్చాక, మిల్లుల స్థాపన దినదినం వృద్ధిపొందాక, విదేశవస్త్రం అనవరతం దిగుమతి జరగటం ఆరంభించాక—యీ చేనేతకళాకారులు రానురాను దుర్భర దారిద్ర్య పరిస్థితులకులోనై, క్రమేపీ క్షీణించజొచ్చారు. అయినా, ఇంతజరిగినా 1930 నాటికి దేశంలో లక్షకుపైగా మగ్గాలున్నవి. కోటికిపైగా చేనేతవారున్నారు. దేశానికి అవసరమైన గుడ్డలో మూడోవంతు వీరినుండి వస్తున్నది— వృత్తివర్గాలరీత్యా, కూలీలతర్వాత, రైతుల తర్వాత వీరిదే అగ్రస్థానం అయినా అప్పటివరకూ వీరు లోనౌతున్న దుర్భర, దైన్య పరిస్థితిగూర్చి పట్టించుకుని శ్రద్ధతీసుకున్న నాయకుడే లేకపోయాడు, యావద్భారతదేశంలో—ఒక్క రంగాజీ తప్ప!

చేనేత పరిశ్రమకు, రంగాజీకి ఒక ఆంతరంగిక అనుబంధం వుంది—ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంనుండి ఆయనపొందిన బి. లిట్ డిగ్రీకి మూలమైన ఆయన థీసిస్ దక్షిణభారత చేతిపనులవారి చేనేత పరిశ్రమవారి ఆర్థిక పునర్నిర్మాణ ప్రణాళికను గూర్చినదే! చేనేతవారి సమస్యగూర్చి రంగాజీకిగల సాకల్యతను ఆయన ఆంగ్లంలో రచించిన "చేనేతపరిశ్రమ" "చేనేతవారి ఆర్థికశాస్త్రం" అన్న గ్రంథాలు నిదర్శిస్తాయి. ఈ సాకల్యతపునాదిగా ఆయన నడిపిన యీ ఉద్యమమే యీనాడు వృత్తిరీత్యా, రాజకీయ చైతన్యంరీత్యా, సంచలనంపొందిన ఒకశక్తిగా చేనేతవారు రూపొందగలగడానికి కారణం. రంగాజీ అధ్యక్షతక్రింద 1936 లో జరిగిన ఆంధ్రరాష్ట్ర చేనేత మహాసభ,

తత్ఫలితంగా స్థాపితమైన ఆంధ్రరాష్ట్ర చేనేత పారిశ్రామిక సంఘం. దానికి అనుబంధంగా స్థాపితమైన జిల్లా, తాలూకా, గ్రామ సంఘాలు ఆయన ఆధ్వర్యాన్నే 1937లో కలకత్తాలో జరిగిన అఖిల భారత చేనేత పరిశ్రమ సేవకుల సభ, 1939లో గుంటూరులో జరిగిన చెన్నరాష్ట్ర చేనేత పారిశ్రామిక సభ— అన్నింటికీమించి ఆచార్య రంగా మార్గదర్శకత్వం— అన్నీకలసి చేనేతవారిలో సంఘటిత శక్తి పెంచి, చైతన్యం తెచ్చి, ఆర్థిక రాజకీయ హక్కులకై పోరాడగల

శక్తినిచ్చి, మిల్లుల పోటీనుంచి, ప్రభుత్వపు కంట్రోళ్ళ విధానంనుంచి తమ్ము తమ స్వయంవృత్తిని రక్షించుకుని నిలబడగల స్తోమత కల్పించి, చేనేత ఉద్యమానికి ఒక విశిష్ట వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దాయి. ఆంధ్రలో ఆరంభమైన యీ ఉద్యమం అఖిల భారతానికి ఆచార్య రంగా ఆధ్వర్యంలోనే విస్తృతపడింది. 1945లో నాగపూరులో జరిగిన అఖిల భారత చేనేత కాంగ్రెస్ తొలి మహాసభకు, 1947లో చాందాలో జరిగిన తృతీయ మహాసభకు, రంగాజీయే అధ్యక్షులు. అఖిల భారత చేతి పరిశ్రమ విచారణ సంఘ నియామకం, అఖిల భారత చేనేత బోర్డు స్థాపన ఆయన కృషి ఫలితమే.

ఈ ఉద్యమ వైఫల్యంకొరకు పోటీసంఘాలు స్థాపించి, చేనేత వారిని పెడత్రోవల పట్టించ యత్నించిన కమ్యూనిష్టుల యెత్తుగడలను యెదిర్చి, నిలిచి, నిలద్రొక్కుకున్న యీనాటి యీ ఉద్యమ జాతీయ లక్షణం రంగాజీ ప్రభావ ఫలితమే. యీనాడు చేనేతవారు దేశంలో ఒక సంఘటిత శక్తిగా పరిగణించబడగలంతటి కార్యదీక్షను, దక్షతను ప్రదర్శించ గలుతున్నారంటే— అందుకు ఆచార్యత్వం రంగాజీదే!

వారు నిద్రిస్తున్నప్పుడు తన అపూర్వ చైతన్య గీతాలాపనతో వారిని మేల్కొలిపి చైతన్య ప్రపూరితులుగా చేసిన తొలి వైతాళికుడు రంగాజీ!

## మహిళా ఉద్యమం

నిన్న మొన్నటివరకూ మన సమాజ దృక్పథంలో స్త్రీ ఒక భోగ్య వస్తువు. పడకటింటి పనిముట్టు. వంటింటి పాత్రసామాను... యీ దృక్పథం మార్పించి, అన్ని దురాచారాలలోనూ బలిపశువవుతున్న స్త్రీని రక్షించడానికి— సమాజ మనస్తత్వం మార్చడానికి పంతొమ్మిదవ శతాబ్దపు తుదిభాగంలోనూ, ఇరవైవ శతాబ్దపు తొలి భాగంలోనూ మహాత్ములైన కొందరు మహనీయుల ఆధ్వర్యాన సామాజిక సంస్కరణోద్యమాలు సాగాయి.

అయితే సామాజిక దౌర్జన్యాలనుండి స్త్రీలను కాపాడటం ఒక భాగమైతే—స్త్రీలలో సంచలనం, చైతన్యం కలిగించి తాము పురుషులతో సమానులమనే ఆత్మవిశ్వాసం, సవ్యప్రోద్బలం కల్గించే కృషి మరొక భాగం. ఇది రాజకీయమైనది...దీనికి ఆధ్వర్యం వహించిన వారు ఆచార్య రంగా. స్త్రీలు ఘోషాలువిడి, అబలలమనే సంకోచం వదలి, ధైర్యస్థైర్యాలతో ప్రజాహిత కార్యాలలో పాల్గొనే చైతన్యం కలిగించిన రాజకీయ మహిళా ఉద్యమానికి ఆచార్యుడు రంగాజీ. తాను నడిపిన, కొనసాగించిన ప్రతి ఉద్యమంలోనూ, మహిళలకు ప్రముఖ సక్రమ ప్రాతినిధ్యం కల్పించటమేకాక—మహిళా లోకంలో రాజకీయ చైతన్యం, ఆత్మవిశ్వాసం కల్పించే సంకల్పంతో, మహిళా కార్యకర్తలకు ప్రత్యేక శిక్షణలిచ్చి, వారిద్వారా మహిళా ఉద్యమ నిర్వహణ కొనసాగించారు రంగాజీ. యీ కార్యక్రమంలోనిది [illegible] ఆయన ఆధ్వర్యాన నడచిన ఆంధ్రరాష్ట్ర మహిళా రాజకీయ శిక్షణ శిబిరం; అందులో ఆరితేరిన మహిళా ఉద్యమ మహిళా కార్యకర్తలు. యీనాడు కొంతవరకైనా సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో స్వేచ్ఛతో, స్వాతంత్ర్యంతో, సమర్థతతో, నేర్పుతో, ఆత్మవిశ్వాసంతో మహిళలు ముందడుగు వేస్తున్నారంటే—అది రంగాజీ సాగించిన రాజకీయ ఉద్యమ ఫలితమే.

## విద్యార్థి ఉద్యమం

విద్యార్థులు భావి పౌరులు. దేశ భవిష్యత్స్వరూపం విద్యార్థుల రూపకల్పనపైనే ఆధారపడివుంది. యీదశలో విద్యార్థులు పొందే విద్య, శిక్షణ, దేశకళ్యాణానికి తోడ్పడగలవా, లేదా అన్నదే విద్యార్థులు పొందే రూపకల్పనకు పునాది. యీ పునాది [illegible] వక్రమార్గం త్రొక్కిందనీ, యీ మార్గాన్నే విద్యార్థులను వదిలితే భవిష్యత్ దేశస్వరూపానికే వక్రం అబ్బుతుందనీ యీ వక్రవిద్యాభ్యాసఫలితం, విద్యార్థులకీ, దేశానికీ, భవిష్యత్తుకూ అవసరమైన మనోవికాసంకానీ వివిధ వృత్తులలో రంగాలలో ప్రావీణ్యతకానీ

కాదనీ— బ్రిటిషు ప్రభుత్వానికి అవసరమయ్యే గుమస్తాల సృష్టి మాత్రమేననీ; ఆదిలోనే గ్రహించగలిగిన విషయగ్రహణ విశిష్టతను, వివక్షతను పొందిన కొద్దిమంది రాజకీయ నాయకులలో రంగాజీ ప్రథమ శ్రేణిలోనివారు.

పైగా 1947కు ముందున్న రోజులు స్వాతంత్ర్య పోరాటదినాలు. దేశంలోగల సర్వశక్తినీ సమీకరించి పరాయి ప్రభుత్వాన్ని మొదిరిస్తున్న తరుణం. ఈ శక్తి గూడుకట్టుకునివున్న విద్యార్థులలో రాజకీయ చైతన్యం రేకెత్తించి, ఈ శక్తిని ప్రజ్వలింప చేయనిదే స్వాతంత్ర్య పోరాట స్వరూపం, శక్తిస్తోమతలు పూర్ణత్వం పొందజాలవని తొలినుండీ కేకవేసి చెప్పిన మేధావి రంగాజీ

కాగా ఈ ఉద్యమానికి ఆయనే పట్టుకొమ్మ అయ్యాడు. అటు డిటెన్షన్ వ్యతిరేకతలాంటి విద్యార్థి సమస్యలతోనూ, ఇటు భారత దేశ స్వాతంత్ర్య సమర సమస్యతోనూ, ఈ ఉద్యమం ముందుకుసాగి రంగాజీ ఆధ్వర్యంక్రింద కొంతకాలం దేశాన్ని ఉర్రూతలూగించింది. రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్య సింహాపుజూలు పుచ్చుకుని ఊగించగల పోటు ఈ ఉద్యమానికి రంగాజీ యిస్వాగా తిలకించినవారు విస్తుపోయారు. త్యాగనిరతిలో పెద్దలకు ఆదర్శప్రాయంగా నివ్వగల త్యాగధనుల్ని ఈ ఉద్యమం దేశానికి అర్పించగా చూచినవారి మనసులు ఉద్వేగంతో, ఆవేశంతో గగుర్పొడిచాయి.

విద్యార్థి ఉద్యమంతో రంగాజీకిగల అతి సన్నిహిత అనుబంధమే సమ్యగ్నిష్ఠ మొట్టమొదలనుండి విద్యార్థి ఉద్యమాన్ని రక్షించి – జాతీయవిద్యార్థి సంఘంగా రూపొందించింది. 1927లో ఆంధ్రవిద్యార్థి సంఘానికి ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా విద్యార్థి ఉద్యమంతో ఆయనకు ఆరంభమైన సన్నిహిత్యం – క్రమక్రమంగా మరింత బలపడి, తుదకు ఆయన రాజకీయ కార్యక్రమాలలో ఒక భాగంగా ఐక్యమై పోయింది. 1927లో, 1931లో, 1934లో, 1938లో, 1939లో, 1945లో, 1946లో దేశంలోని మొన్నొన్నో రాష్ట్రవిద్యార్థి

మహాసభలకూ అఖిలభారత మహాసభలకూ, అధ్యక్షత వహిస్తూ, అధ్వర్యం వహిస్తూ ఈ ఉద్యమ స్వరూప లక్షణాలను తీర్చిదిద్దారు ఆయన. 1945లో బొంబాయిలో ఆయన ప్రధానాచార్యత్వంక్రింద నడచిన పౌరసత్వ కళాశాలలో ఈ ఉద్యమ కార్యకర్తలు శిక్షణ పొంది దేశం నలుమూలలకు వ్యాపించారు. రంగాజీ సిద్ధాంతీకరించిన రైతు కూలీ ప్రజారాజ్య స్థాపనా సూత్రాల్ని ప్రథమంగా ఆమోదించిన సంస్థ విద్యార్థి కాంగ్రెసు. ఎంత అనుబంధమో ఇది!

విద్యార్థి ఉద్యమానికి అక్షరాల ఆచార్యుడు ఆచార్య రంగా!

## యువజనోద్యమం

వ్యక్తి జీవితంలో విలువైన కాలం యౌవ్వన సమయం. అలాగే సమాజ జీవితంలో విలువైనభాగం యువజనులు. సమాజానికి వెన్నెముక వంటివారు వీరు. ఈ వెన్నెముకకు పటుత్వం లేకపోతే సమాజ పురోభివృద్ధి కుంటువడుతుంది. అందువల్లనే, యువజనులందరినీ ప్రత్యేకం ఒక వర్గంగా యెంచి, వీరిలో మనోవికాసం, జాతీయభావం రాజకీయ చైతన్యంకల్గించ పూనాడు రంగాజీ.

## సహకారోద్యమం

సహకారం ప్రాణికోటికి సహజమైన లక్షణం. అవసరమైంది కూడాను. సమాజ జీవితం ప్రవృత్తిగాగల మానవులకు, 'సహకారం' తమకు తెలియకుండానే అను దిన చర్యగా పరిణమిస్తుంది.

అయితే 'సహకారం' అన్న పదానికి వ్యక్తులుగా మానవులు ప్రత్యేక వ్యక్తిత్వాలు కల్గివున్ననాడే, అర్థం అవకాశం వుంటాయి. సమాజ జీవితానికి మారుగా సమిష్టి జీవితం రూపొందితే, యీసమిష్టి వ్యవస్థలో భిన్న ప్రత్యేకతలకు ఆస్కారమే లేదుకనుక, భిన్న ప్రత్యేకతల వ్యక్తిత్వాల మధ్య 'సహకారం' అనే అంశానికి ఆస్కారమే వుండదు.

ఇందువల్లనే వ్యక్తివికాసానికి, భిన్నత్వానికి అవకాశాలు వుండగల వ్యవస్థ అవసరం. అయితే సమాజ జీవితం సాఫీగా సాగిపోవటానికి, యీ భిన్నత్వంలో ఏకత్వం—భిన్నత్వమే లేని సమిష్టి తత్వం కాదు—అవసరం. దీన్ని సాధించగలిగిందే 'సహకారం.'

యీ ధ్యేయంతోనే సహకారోద్యమానికి మూలంవేసి పోషించారు రంగాజీ. రైతులు, చేనేతవారు, కార్మికులు, వడ్రంగులు— అన్ని రకాల వృత్తులవారు, తమతమ వృత్తుల్లోని తమ స్వాయం ప్రవృత్తిని కోల్పోకుండానే, తమవృత్తి పురోభివృద్ధికి, వ్యక్తి వికాసానికి అవసరమగు హంగులను సమకూర్చుకోవడం కోసం, పరస్పర సహకారంతోనే సాధ్యపడే యీ హంగులను సాధించుకోవటంకోసం— సహకార సంఘాలుగా యేర్పడి కృషిసల్పే యీ పద్ధతి రంగాజీ గత మూడు పుష్కరాలనుండి ప్రబోధించి, ప్రచారించి పోషిస్తున్నదే—

భిన్నత్వానికి—భిన్నత్వంద్వారా లభ్యమయ్యే వ్యక్తి పరిణితి అవకాశానికి—ఆస్కారమివ్వని సమిష్టి వ్యవస్థను రూపొందించే సహకార వ్యవసాయ విధానానికి వ్యతిరేకంగా ముప్ఫైసంవత్సరాల క్రితమే రంగాజీ వ్యవసాయ దారులకు 'సేవా సహకార సంఘాలు' (Service Co-operatives) యేర్పడాలని ప్రబోధించారు. యీనాటికీ ప్రబోధిస్తున్నారు. యీ సేవాసహకార సంఘాల ద్వారా రైతులకు సక్రమ సమయంలో విత్తనాలు, యెరువులు, అప్పులు, శాస్త్రీయ జ్ఞానం, శాస్త్రీయ పరికరాలు సమకూర్చగలిగితే—రైతుకు 'తనది' అన్న అనుబంధంతో పెల్లుబికే ప్రోత్సాహానికి యివి తోడ్పడ— దేశంలో ఆహారోత్పత్తి యిబ్బడికిబ్బడిగా యినుమడిస్తుందని రంగాజీ సూత్రీకరించిన విధానంలోని వాస్తవిక దృక్పథం, ఉజ్జ్వలసత్యం, అనుభవజ్ఞులకు ద్యోతకమౌతుంది.

యీనాడు దేశంలో అన్నిరంగాలలోనూ దర్శనమిస్తున్న యీ సహకార సంఘాలకు సృష్టి, పుష్టి యిచ్చింది రంగాజీ. 1930 ప్రాంతాల్లోనే దేశంలోని గ్రామగ్రామం సంచరించి, యీ ఉద్యమ వ్యాప్తిని

కొనసాగించారు. ఆయన సహకారోద్యమంలో ఆయనకు గల సన్నిహిత సంబంధం—'సహకారం' అన్న పదానికి ప్రతిభాష్యం యిస్తూ యీనాడు ఆయనపై వినవస్తున్న ప్రతి విమర్శలను సమాధానం.

అఖిల భారత సహకారోద్యమ సంస్థకు ఉపాధ్యక్షులుగా రంగాజీ యీ ఉద్యమ నిర్వహణలో ప్రదర్శించిన కార్యదక్షత— అనతి కాలంలోనే ప్రభుత్వ యంత్రాంగంలో సహకార సంఘ నిర్వహణాభాగం ఒక ప్రముఖ విభాగంగా రూపొందడానికి కారణం!

యీ పూనిక ఫలితమే ఆంధ్రలో యువజనోద్యమసృష్టి — అఖిల భారతంలో యువజనోద్యమ సంరక్షణ.

యువజనోద్యమం మరొకందుకు కూడా అత్యంతావసరం. వృత్తుల ప్రాతిపదికగా విభిన్న వర్గ సంఘస్థాపన జరిగాక, యీ సంఘాలలో సహజంగా అతివాదులుగా, విప్లవ మార్గులుగావుండే యువజనుల నందరినీ సమీకరించి, సమన్వయపరచి; యేకధ్యేయము చూపగల సంస్థలేకపోతే—వివిధవర్గ సంఘాలకు వర్గ ప్రయోజనాలు మాత్రమే ధ్యేయమై, సామరస్యం కొరవడే ప్రమాదంవుంది. యువజనోద్యమం యీ సమీకరణకు, సమన్వయానికి సాధనం. యీఉద్యమ వ్యాప్తిద్వారా యువజనులందరిలోనూ రేకెత్తే జాతీయభావమే అందరికీ "యేకైకధ్యేయమైన దేశశ్రేయస్సు" వైపుకు దారి చూపుతుంది. రంగాజీ యువజనోద్యమం ద్వారా సాధించిన అమూల్య ఫలితం ఇదే!

యీ ఉద్యమ భాగాలే రంగాజీ ఆధ్వర్యాన జరిగిన యువజన కాంగ్రెసు స్థాపన, ఆటలపోటీల, రాజకీయ విద్యాలయాల నిర్వహణలు. 1947 లో రంగాజీ అఖిల ఆసియా యువజనశ్రేణి ప్రతినిధుల సభకు అధ్యక్షత వహించినపుడూ, 1948 లో యు. పి. రాష్ట్ర యువజన మహాసభను ప్రారంభించినపుడూ, 1944 లోనూ అంతకు ముందున్నూ దేశమందలి నాల్గు మూలలలోనూ యువజనోద్యమానికి అండదండగా, బాసటవై నిల్చినపుడున్నూ—దేశ సౌభాగ్యానికి

వెన్నెముకలాంటి వారైన యువజనులందరినీ రాజకీయ చైతన్య ప్రపూరితులుగా చేయసమకట్టిన ఆయనకృషి ప్రభావం అద్వితీయ కాంతులతో—దేశంలోని యువజనులందరిపైనా వెల్లివిరిసింది.

## కంట్రోళ్ల వ్యతిరేకోద్యమం

1952 కు ముందు ప్రభుత్వ కంట్రోళ్ల విధానంవల్ల ప్రజలు నానాయాతనలకు గురైన అనుభవం యిప్పటికీ అందరి మనసుల్లోనూ మెదల్తూనే వుంటుంది. క్రింది ప్రభుత్వోద్యోగులు చూపిన కాగితపు లెఖల నాధారం చేసుకుని, వాస్తవిక పరిస్థితిని గుర్తించకుండా, ప్రభుత్వం యీ కంట్రోళ్ల విధానం అమలు జరపబూనడంతో, దేశంలో వస్తూత్పత్తి సమృద్ధిగా వున్నప్పటికీ ప్రజలకు ధారాళంగా బాహాటంగా అందుబాటులోకి రావీలులేని కృత్రిమ వస్తుకొరత సృష్టిపొందింది. ఫలితంగా అవినీతి, లంచగొండి తనం, బ్లాకు వర్తకం విజృంభించి సమాజ ఆర్థిక జీవితంలో స్వైరవిహారం చేసి, బలహీనుల్నీ, పేదల్నీ, మధ్యతరగతివారినీ పీల్చిపిప్పిచేసింది. యీ పరిస్థితిని గమనించిన గాంధీజీయే కంట్రోళ్లు రద్దుకావాలని నినాద మిచ్చారు. అయినా అధికారం చేపట్టిన కాంగ్రెసు నాయకులు గాంధీజీ నినాదంకంటే—క్రింది అధికారుల లెఖలకే హెచ్చువిలువ, ప్రాధాన్యత యిచ్చారు.

రంగాజీ అప్పట్లో ఆంధ్రకాంగ్రెసు అధినేత. రాష్ట్రంలోవున్నది కాంగ్రెసు ప్రభుత్వమే. అయినా ప్రజాహిత విరుద్ధమైన యీకంట్రోళ్ల విధాన విషయమై కాంగ్రెసు ప్రభుత్వాన్ని తీవ్ర ఆందోళనతో కదిలించసాగారు. ప్రజల మధ్యకు వెళ్లి వారి కష్టసుఖాలను ప్రత్యక్షంగా పరిశీలించి కంట్రోళ్లవల్ల సమాజంలోని అన్ని వృత్తులవారు, అన్ని వర్గాలవారు బాధలకు, కష్టనష్టాలకు గురౌతున్నారని యెలుగెత్తి నినదించారు. యీ నినాదాన్ని అందుకున్న దేశంలోని పల్లెపల్లెల్లో, మూలమూలల్లో సమావేశాలద్వారా, నిరసనసభలద్వారా, తీర్మా నాలద్వారా, యాత్రలద్వారా రాయబారాలద్వారా యీ ఉద్యమ

ఘోష ప్రతిధ్వనించింది. తుదకు ఆచార్యరంగా అధ్యక్షత క్రిందనే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు, కాంగ్రెసు ప్రభుత్వ కంట్రోళ్ళ విధానాన్ని వ్యతిరేకిస్తూ, తీవ్ర నిరసన ప్రదర్శిస్తూ తీర్మానించినపుడు—కాంగ్రెసు వారైవుండి, కాంగ్రెసు ప్రభుత్వాన్నే విమర్శిస్తారా అన్నప్రశ్నకు రంగాజీ యిచ్చిన సమాధానం "ఇంటి దీపమని ముద్దుపెట్టుకుంటామా" అని. ఇలా స్వపర భేదంలేకుండా ప్రజాహితమే పరమావధిగా రంగాజీ నడిపిన యీ మహోజ్వల ఉద్యమం తుదకు 1952 లో రాజాజీ ప్రభుత్వం అధికారం చేబట్టాక కాని ఫలింపునొందలేదు—అదీ రంగాజీ పట్టుదల, కృషివల్లనే!

ఒక ప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త పేర్కొన్నట్లు అన్ని రికార్డులు చూపే అన్ని హంశాలకు భిన్నంగా కంట్రోళ్ళ రద్దుకు ఉద్యమం నడిపి రద్దుచేయించగల సాహసం ఒక్క రంగాజీకే వుంది; రద్దు చెయ్యగల విచక్షణ ఒక్క రాజాజీకేవుంది; రద్దును ఆమోదించగల పాలనా దక్షత కేంద్ర ఆహారమంత్రిగా ఒక్క రఫీ అహమ్మద్ కిద్వాయ్ కేవుంది.

ప్రభుత్వయంత్రాంగానికి అతీతంగా ప్రజానాడిని పట్టి నడపగల మహోత్క్రంగల ప్రజానాయకులు యీ ముగ్గురూ. ఈ ముగ్గురి సాహస ఫలితమైన యీ ఉద్యమ విజయం ప్రజాప్రభుత్వ యుగమైన యీ కాలంలో, ఒక విశిష్ట మార్గదర్శిని.

## ప్రజాస్వామ్య రక్షణోద్యమం

1952 లో ఆంధ్రదేశంలో ప్రజాస్వామ్య మనుగడకే విపత్తు వచ్చింది. ప్రజాస్వామ్య పక్షాలైన కాంగ్రెసు, కృషికార్ లోక్ పార్టీ, ప్రజాపార్టీలు చీలిపోయిన అవకాశంతో కమ్యూనిస్టులు ఒక బలమైన వర్గంగా యెన్నికల ఫలితాల్లో రూపొందారు. కాంగ్రెసుపార్టీకి ప్రభుత్వాన్నేర్పరచగలిగిన అధిక సంఖ్యా బలంరాలేదు—యీ స్థితిలో ప్రజాపార్టీవారు కమ్యూనిస్టులతో చేతులుకలిపి అధికారం హస్తగతం చేసుకుని, ప్రభుత్వంలోకి కమ్యూనిస్టు ప్రవేశానికి ద్వారాలు తెరువ

సిద్ధపడ్డారు. ఈ పరిణామంతో ప్రజాస్వామ్యవాదుల గుండెలు అవిసి పోయాయి. కాంగ్రెసు చేష్టలుడిగి చతికిలబడిపోయింది. అంతటా అంధకారం ఆవరించినట్లే అన్పించింది. ఈ స్థితిలో, ప్రజలపట్ల తనకు గల బాధ్యతను గుర్తించి నియంతృత్వ శక్తులనుండి వారిని రక్షించాలని, ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించడంకోసం ప్రభుత్వం యేర్పరచి తీరాలని కాంగ్రెసును ఆదేశించిన ప్రజానాయకుడు రంగాజీ! ఇందుకోసం కాంగ్రెసు చేయి అందించి, ఆసరాయిచ్చి, కృషీకార్ పార్టీ అనురూప సహకారం సమర్పించి, వారిచేత ప్రభుత్వాన్ని యేర్పరపించీ, కమ్యూనిస్టుల బారినుండి ప్రజాస్వాతంత్ర్యాన్ని కాపాడిన ప్రజాస్వామ్యరక్షకుడు రంగాజీ. ఈ అనురూప సహకార ప్రధాన ఫలితంగా ఆయన అధికారంలో భాగం కోరలేదు. అంతవరకూ ప్రజల్ని పట్టి పీడిస్తున్న కంట్రోళ్ళ రద్దును మాత్రమే కోరారు. ఫలితంగా 1952 లో చారిత్రాత్మకమైన రాజాజీ మంత్రివర్గం మద్రాసులో అధికారంలోకి వచ్చింది.

1955 లో ఈ ఉద్యమం మహోధృత రూపంలో తిరిగి దర్శనమిచ్చింది. ఇదే అసలైన ఉద్యమం. 1954 లో ఆంధ్రరాష్ట్రంలో కాంగ్రెసు ప్రభుత్వం పతనంచెందిన కారణసాధనం కృషీకార్ పార్టీ తెచ్చిన విశ్వాసరాహిత్య తీర్మానమే అయినప్పటికీ—1955 లో యెన్నికల సంరంభం ఆరంభమైన నాటినుండీ కాంగ్రెసుతోగల విభేదాలకంటే, ప్రజలపట్ల ప్రజాస్వామ్యంపట్ల తమకు గల బాధ్యత గొప్పదన్న తమ ప్రగాఢ విశ్వాసాన్ని తమ అనుచరులకు, దేశ ప్రజలకు కార్యరూపేణా నిదర్శించారు రంగాజీ. ఈ కాలంలో ఆయన ఆధ్వర్యానసాగిన ఈ ఉద్యమం అపురూపమైనది. మరపురానిది. ఆంధ్రలోని ప్రజాస్వామ్య పక్షాలన్నీ ఆయన అధ్వర్యం క్రిందనే యెన్నికల పొత్తులోకి వచ్చాయి. ఏకంగా ప్రజాస్వామ్య పక్షాలు ఒకవైపున, నియంతృత్వశక్తులు ఒకవైపున—మహోధృతంగా యెన్నికల రంగంలో హోరాహోరీ పోరాడాయి. ప్రజాస్వామ్య పక్షాల సారథి, సర్వసేనాధిపతి రంగాజీ. ఆంధ్రదేశంలోని ఆ మూలనుండి

ఈ మూలవరకూ నిర్విరామంగా అహోరాత్రాలుగా సంచరిస్తూ ఈ ఉద్యమం కొనసాగించారు ఆయన. జీవన్మరణ సమస్యగా యెంచి ప్రజ ఈ ప్రజాస్వామ్య రక్షణోద్యమంలో మహోత్సాహంతో పాల్గొన్నారు. పార్టీపరిధి అంచులనుమించి, ప్రజాప్రవాహం ఉప్పెనలై ప్రవహించి ప్రజాస్వామ్య పరిరక్షణా పవిత్ర కర్తవ్యంలో భాగస్వామ్యం పొందిన మహోజ్జ్వల ఉద్యమం యిది.

రంగాజీ పూరించిన యీ ఉద్యమ శంఖారావము ఒక ఆంధ్రలోనే కాక, యావత్ భారతంలో, యావత్ ప్రపంచంలో ప్రతిధ్వనించింది. ఈ ఉద్యమం సఫలీకృతమౌతూ 1955లో ఆంధ్రలో నియంతృత్వ శక్తులు పతనమై, ప్రజాస్వామ్యం భద్రంగా పరిరక్షితమైనప్పుడు, ఈ ఉద్యమ నిర్వహణను పరిశీలించిన రాజకీయ పరిశీలకులు, రంగాజీ ప్రదర్శించిన విశ్వాస పటిమను, కార్యదీక్షను, సమరశీలతను సుశిక్షిత నాయకత్వ తీరును అచ్చెరువొందిన మాటలు ఉగ్గడించారు.

ఈనాడు ఆంధ్రప్రజ అనుభవిస్తున్న ప్రజాస్వామ్యం ఆనాటి రంగాజీ భిక్షే!

## సహకార వ్యవసాయ వ్యతిరేకోద్యమం

అక్కడ 'ఏ ల్వోల్'లో భారత అగ్రనాయకులంతా కూడి సహకార వ్యవసాయ విధానానికి ఆమోద ముద్ర వేశారు.

ఇక్కడ బందరులో 'ఇదికుట్ర' అని బహిరంగసభలో నిశ్చలమైన కంఠస్వరముతో సింహానాదం చేశాడు రంగాజీ.

అదే మొదలు ఈ సహకార వ్యవసాయ వ్యతిరేకోద్యమానికి. అనాడు బందరులో రంగాజీ వేసిన కేక యావత్ భారతంలోని రైతు కూలీలోకానికి మేలుకొలుపై వినిపించింది. వ్యక్తిగత కమతాలను కుటుంబాలను సర్వనాశనం చేసే కమ్యూనిస్టు విధానమైన ఈ సహకార వ్యవసాయం రైతాంగ వ్యవస్థనే కూకటివేళ్ళతో పెళ్ళగించి వేయగలదన్న రంగాజీ ప్రబోధం దేశంలో మారుమూల గ్రామాల్లో

వాడవాడలా ప్రతిధ్వనించింది. అన్నింటినీ పెడచెవిని పెడుతున్న ప్రభుత్వం కన్ను విప్పటానికి 108 మంది కాంగ్రెసు పార్లమెంటు సభ్యులతో ఈ విధాన వ్యతిరేకతను వ్యక్తీకరిస్తూ రంగాజీ ప్రకటించిన నివేదికను సహితం తిరస్కరించి, అఖిల భారత కాంగ్రెసుసభ నాగపూరులో ఈ విధానం అమలును సిద్ధాంతీకరిస్తూ తీర్మానించినప్పుడు— ఈ ఉద్యమ నిర్వహణకు వీరావేశంతో రంగాజీ దేశంపై విరుచుకపడ్డారు. ఫలితంగా అదనులో రైతులు కళ్లు తెరిచారు. కూలీలు కళ్లు తెరిచారు. స్వాతంత్ర్యాభిలాషులు, స్వయంవృత్తి రక్షణోత్సాహులు కళ్ళు తెరిచారు. అంతా చేరి, పరవళ్ళు త్రొక్కుతూ ఈ ఉద్యమ రంగంలోకి ఉరికారు. రైతును బానిసగా, పరతంత్రజీవిగా, అధికారుల క్రింది తొత్తుగా మార్చే ఈ విధానానికి వ్యతిరేకంగా ఈ నాడు దేశం మొత్తంలోనూ మహోధృతంగా ఈ ఉద్యమం కొనసాగుతూ వుంది. ఈ ఉద్యమానికి జీవం రంగాజీ—

ఈ ఉద్యమం ఫలిస్తుంది. అనతికాలంలోనే ఫలించితీరుతుంది. వృత్తిస్వేచ్ఛ, వ్యక్తిస్వాతంత్ర్యం ప్రాతిపదికగా రంగాజీ ప్రబోధం నుండి వెలువడుతున్న ఈ ప్రజాస్వామ్యప్రకాశ వికాసాలు, ఉదయభానుని అరుణకిరణాలై అచిరకాలంలోనే రైతులోకాన్నావరిస్తున్న చీకట్లను పటాపంచలు చేసి వెయ్యగలవు!

## స్వతంత్రోద్యమం

స్వాతంత్ర్యం సిద్ధించి గాంధీజీ అంతరించాక స్వాతంత్ర్య భారత ప్రభుత్వం గాంధీజాన్ని సహితం అంతరింపచేయ సమకట్టింది. సమాజ స్వరూపానికి పునాదిగా గాంధీజాన్ని తిరస్కరించి సోషలిజాన్ని ఆమోదించింది. ఫలితంగా విత్తునాటితే చెట్టు యెలాతప్పక మొలుస్తుందో, అలాగే సోషలిజ స్థాపనా దృక్పథం కల్గటంతోనే ప్రభుత్వ ధోరణులలో నియంతృత్వ ఛాయలు ద్యోతకం కానారంభించాయి. వ్యక్తి స్వేచ్ఛ, వ్యక్తి స్వాతంత్ర్యం, సమాజ స్వయంశక్తి సంపూర్ణంగా నాశనమై సర్వస్వమూ ప్రభుత్వాధీనంలోకి వెళ్ళిపోయే ప్రమాద

పరిస్థితి తాండవమాడ నారంభించింది. స్వయం వృత్తిదారుడైన రైతును సహకార వ్యవసాయం ద్వారాను, స్వయం పోషకుడైన, వ్యాపారస్తుని జాతీయకరణద్వారాను, మధ్యతరగతి ప్రజలను ద్రవ్యోల్బలం ద్వారాను, సమస్త ప్రజానీకాన్ని హెచ్చుపన్నుల విధింపు ద్వారాను—ప్రభుత్వ దయాదాక్షిణ్యాలపై ఆధారపడే పరతంత్ర జీవులుగా మార్చే నియంతృత్వధోరణి కనుచూపు మేరలో కన్పించడం మొదలైంది. వ్యక్తి జీవితంలో, కుటుంబ మనుగడలో, సమాజ విధులలో ప్రభుత్వజోక్యం దినదినం అధికమౌతూ—అంతటినీ ఆక్రమించుకునే అవధుల్లేని ప్రభుత్వాధికారం పొలిమేరలనుండి తొంగి చూడ నారంభించింది.

ఇట్టి భీకర భీభత్సమయంలో రంగాజీ మళ్ళీ మరొకసారి ప్రజలకు అండగా, యేడుగడయై నిలిచాడు. యెంతో త్యాగఫలితంగా లభ్యమైన స్వాతంత్ర్యాన్ని తృటిలో కబళించివేయ పొంచివున్న ఈ బ్రహ్మరాక్షసి బారినుండి ప్రజల్ని కాపాడేందుకు, గన స్వాతంత్ర్య శంఖారావం పూరించి, సర్వప్రజలను నిద్రనుండి, మత్తునుండి తట్టి మేల్కొలిపి, సంచలనం వైపుకు చైతన్యంవైపుకు దారిచూపుతున్నారు రంగాజీ. రైతులను, కూలీలను, వ్యాపారస్థులను, ఉద్యోగస్థులను, తదితర యావన్మంది ప్రజలనూ. గాంధీజీ ప్రసాదించిపోయిన తమ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోగల హక్కులవైపు పురిగొల్పుతున్నారు. గ్రామాలపైన, గ్రామీణప్రజలపైన ప్రముఖంగా ఆధారపడివున్న ఈ దేశ రాజకీయ ఆర్థిక సౌష్టవానికి పటిష్టత చేకూర్చ గలిగేది ముమ్మాటికీ గాంధీజ మేనని ఉద్బోధిస్తూ, కాంగ్రెసు సంస్థ వక్రగతిపట్టి చేపట్టిన సోషలిజంవల్ల అప్పుడే కన్పించ ప్రారంభించిన అనర్థాలను ప్రజల కళ్ళముందు విప్పివుంచుతూ—అదను మించకమునుపే అందరికళ్ళూ తెరిపించే అపూర్వ సంకల్పముతో సాగుతున్న మహోద్యమం ఇది. చేతులు కాలకమునుపే ఆకులు పట్టుకోవాలనే ఆతృతతో సాగిస్తున్న ఉధృత ప్రచారం ఇది—ఇదే ఈనాడు స్వతంత్రపార్టీ పేరుతో దేశమంతటా మహాద్భుతంగా వ్యాపి

స్తోన్న స్వతంత్రోద్యమం. అఖిలభారతస్థాయిలో ఈ ఉద్యమ అధినేత ఆచార్యరంగా. ఆయనవాక్కు, సందేశం, ఆదేశం, స్వతంత్ర శంఖారావం దేశంలోని మూలమూలన, పల్లెపల్లెన, వాడవాడన, గడపగడపన మారుమ్రోగుతోంది ఈనాడు!

స్వాతంత్రాభిలాషియైన మానవుడికి, ఈ ఉద్యమం రక్తంలో జీర్ణించిపోయిన జన్మలక్షణమనీ, ఈ ఉద్యమ విజయం మానవ పురోభివృద్ధిలో అనివార్యఘటన అనీ యిదివరలో అనేకదేశాల చరిత్రలు నిర్ద్వంద్యంగా రుజువుపర్చి వున్నాయి—అచిరకాలంలోనే మనదేశ చరిత్ర రుజువుపర్చనున్నది!!!

ఈపై పేర్కొన్న ఉద్యమాలుకాక మరెన్నో ఉద్యమాలు రంగాజీ ప్రాపకంలో ప్రజాహిత కార్యసాధనాలుగా ఉపకరించాయి. కొండజాతుల, హరిజనుల, అడవుల రక్షణోద్యమాలు అందులోకొన్ని మాత్రమే! అన్ని ఉద్యమాలలోనూ ఒక విశిష్టగుణం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. అది రంగాజీ స్ఫూర్యాఫలితం. ప్రతి ఉద్యమం—రంగాజీ సాగించిన యెన్నోయేండ్ల అనంతరం—యెంతో ఆలస్యంగా కాంగ్రెసు అధిష్టానవర్గం కన్నువిప్పి ఆయన బాటకు మరలివచ్చిన తీరును చాటుతుంది. కాగా, ఉషఃసమయమందే, మధ్యాహ్నతీవ్రతను గుర్తించి, అందరికంటె ముందుగా అదనులో మేలుకొల్పులు వినిపించే రాజకీయ వైతాళికుడుగా ఆయనకు ఆయనేసాటి.

ఈ ఉత్తమలక్షణమే ఆయన నాయకత్వానికి అపూర్వతను ప్రసాదించింది!!!

# జమీన్ దారీ రైతుసమరంలో

## శ్రీ తూమాటి కృష్ణమూర్తి

ఇప్పటి మాటగాదిది. షుమారు 25 ఏండ్ల క్రిందటి సమాచారం. రంగాగారి నామధేయం వినియుండుటేగాని వారి ప్రథమ సందర్శనం మా ప్రాంతవాసులకు (1936 లో) కాలినడకన ఊరూరు పల్లెపల్లె చైత్రయాత్ర జరిపినప్పుడు లభించినది.

మా కనిగిరి ఎక్కువ భాగం జమీన్ దారి ప్రాంతం. పాలన వెంకటగిరి కుమారరాజావారిది. రాజుగారు తలచుకున్నదల్లా జరిగితీరవలసినరోజులవి. రంగాగారికి ఆశ్రయమిచ్చినా, అన్నము పెట్టినా చివరకు త్రాగేందుకు దాహమిచ్చినా, ఆ గ్రామస్థ రైతులపై గ్రామాధికారులు పగసాధించేరోజులవి. అనధికార పూర్వకముగా తాలూకా ఆఫీసునుండి సర్కులర్లు గ్రామాధికార్లకు రావటం ఆ మర్నాడే పశువులను బందెల దొడ్డికి తోలించి గ్రామకంచెలను నిలగొట్టి శిస్తుబాకీలక్రింద అక్రమముగా జప్తులుజేసి రైతులను హింసించుకాలమది. తలచుకుంటె ఆ జమీన్ దారులేమైనారో, వారి అధికారములేమైనవో అనిపిస్తుంది. వేళకు అన్నము లభించినా, లభించకపోయినా ఎన్ని అవాంతరములువచ్చినా వెనుదీయక పట్టుబట్టి రైతులకండమై "రంగా" "రంగా", యనెడి నామస్మరణతో ఒక యుగ పురుషునివలె పాలుత్రాగు పసిపాపలకుగూడా వారి లేత హృదయాలలో గుర్తింపబడి అంధకారములో ఆశాజ్యోతి వెలిగించి వెలుగు జూపినది మాకు ఒక్క రంగాగారేనని చెప్ప సాహసించుట అతిశయోక్తి కానేరదు. "జమీన్ దారీ రైతు" అను పేరుతో మొదట స్థాపించబడి తదుపరి "జమీన్ రైతు"గా మారిన వార పత్రిక సంపాదకులు శ్రీ నెల్లూరు వెంకట్రామానాయుడుగారిని ప్రోత్సాహపరచి వారిని వెంటబెట్టుకొని ఉద్యమమును నడిపి కుంకటి

వ్రేళ్ళతో జమీందారీ విషవృక్షమును పెకలించ ఎన్నికలలో మహా రాజాను ఓడించి చరిత్రనే మార్పుచేయించిన మహా పురుషులను మరచుటకు సాధ్యపడదు.

అయితే రంగాగారంటే గిట్టనివారు ఈనాడు పెద్దలై పెత్తనము వెలిగించు అధికార వ్యామోహ ప్రబుద్ధులు నిరంతరము "రంగాని" విమర్శించుట మనకు క్రొత్తగాదు. 'కులాభిమాని, అధికార వ్యామోహ పరుడని, తమకుగల దుర్గుణంబుల కప్పిపుచ్చుటకు యితరులపై రుద్ద బూనుటతప్ప అందులో ఆవంతయు సత్యములేదు.

యీనాటికిగూడా పదవీకాంక్షలేక ప్రజాసేవయే పరమార్థముగాఎంచి రైతులోకమునకు దారిచూపనున్న రైతుబాంధవుని ఒక్క భారతదేశమేగాక ఇతర దేశములు సైతం గుర్తించుకాలము త్వరలో రాకపోదు. "కులాభిమాని" యని విమర్శించుటలో అర్థము లేదు. వారి ఉద్యమములో నిజముగా కులము అనునది "రైతు" కులముగా వర్ణించవచ్చును. ఆ రైతుకులము ప్రపంచమే నిండి యున్నది. ఈనాడు గాకున్నను ఏనాటికైనను "రైతేరాజ్యము నేలగావలెను" అని వారి ఆశయము గనుక "పదవి వ్యామోహము" గల బిరుదముగూడా కొందరు గుర్తించినను తప్పులేదు.

రైతురాజ్యంబు నెలకొల్ప "రంగ" యనెడు
కీర్తినందగ దేవుండు కోర్కెతీయుయ్యు
ఆయురారోగ్యములతోడ యశమునిచ్చి
కాచి రక్షించి "రంగాను" బ్రోచుగాత

# దీనజనుల నుద్ధరించే దీక్షాపరతంత్రుడు

## శ్రీమతి గొర్రెపాటి మహాలక్ష్మమ్మ

పవిత్ర హృదయము, దేశభక్తి, కార్యదీక్ష, స్వార్థరాహిత్యముతో అలరారుచున్న రంగాజీని గురించి దీనజనుల నుద్ధరించు దీక్షా పరతంత్రుడని తోచక మానదు. ఎందుచేతననగా ఆయన రైతులని; కూలీలని, చేనేత, పారిశ్రామిక, యువజన, విద్యార్థి, మహిళోద్యమాలలో వీరు వారనక అన్ని ఉద్యమాలలోను పని చేసారు. గాన వారిని దీనజన రక్షకుడనే భావించవలెను. అందరు సౌఖ్యవంతులుగా నుండవలెనని ఆయన తలచినట్లు అర్థమవుతుంది. అందులకే కొందరు ప్రజలను దేశభక్తులుగా తయారుచేయుటకు రైతాంగ విద్యాలయాలు ఏర్పాటుచేసి తద్వారా తగు శిక్షణ యిప్పించి ఎంతమందినో తయారు జేసారు.

తయారైన పిదప పదవీకాంక్షచేత కొందరు, భిన్నాభిప్రాయములు కలిగి కొలదిమంది ప్రతికూలురైనారు. మరికొంతమంది అనుకూలురై వర్తించువారున్నూ గలరు. రంగాజీ రైతుకూలీ ప్రజారాజ్యము ను దృష్టిలో పెట్టుకుని నిష్కపటముగా వర్తించెదరుగాని లోపల ఒకమాట వెలుపల ఒకమాట చెప్పి అసత్య దోషమును పొందినవారు కారు. త్రికరణశుద్ధిగా పనిచేసినవారు కాబట్టి కుటిల రాజనీతిజ్ఞుల యొక్క మాటలను ఒక్కొక్కసారి నమ్మి మోసపోయి అనుభవపూర్వకముగ కొంతకాలమునకు గ్రహించి బైటపడి రైతుకూలీ ప్రజారాజ్యమునకు అనుకూలమైన ఉద్యమములు సాగించినారు కాని ఆయన నడిపినది పార్టీలుకావు.

ఆయన రాజకీయ ధోరణి ఎప్పుడును మారలేదు. ఆయన తలపెట్టిన దీనజనోద్ధారణకొరకు రైతుకూలీ ప్రజారాజ్యముకొరకు వివిధ

ముగ ఎప్పుడు ఏఉద్యమము ఎట్లు నడుపవలయునో అట్లు నడిపించును గాని మరియొక అభిప్రాయము ఆయనకు లేదని విచారించిచూచిన విదితమగును. ఒకప్పుడు కాంగ్రెసునుండి విడిపోయారు. అప్పుడు పదవీకాంక్ష చేత విడిపోయినారని కొందరు భావించారు. కానీ అది సరియైనది కాదు. రంగాజీ వ్యతిరేకుల కుటిల రాజతంత్రములు నెరింగి రైతుకూలీ ప్రజలసేవ కాంగ్రెసులోనుండి దాని కుతంత్రములమధ్య చేయుట దుర్లభమని భావించి, బయటకువచ్చి ఉద్యమము సాగించారు.

రంగా భావాలు ప్రజలు అతిత్వరితముగా గుర్తించలేక పోయారు. ప్రచారముద్వారా నిజస్థితి ప్రజలకు తెలుపుటకు వ్యవధ తగినంతగా లేకపోవుటచేతను వెంటనే ఎన్నికలు వచ్చుటచేతను తగినంతగా విజయము సాధించుటకు వీలులేకపోయినది. సరిగదా కాంగ్రెసువారికిగూడా అపజయము కలిగి ఇతర పార్టీలకు జయము కలిగినది.

మరల ఎన్నికలు వచ్చుసరికి టాండన్ కాంగ్రెసు ప్రెసిడెంటుగా నుండుటచేత ఆల్ ఇండియా కాంగ్రెసులో అభిప్రాయ భేదము కలిగి, నెహ్రూ సహకారములతో మరికొందరు కుటిల రాజనీతిజ్ఞులు డెమోక్రాటిక్ ఫ్రంట్ను పేర రంగాజీతో రాజీ ప్రయత్నాలు జరిపి నిష్పాక్షికముగ కృషి జేయుదమని ఒక నిర్ణయమునకు వచ్చినారు.

కాని వారి కుటిల రాజనీతి పవిత్రహృదయములోనున్న రంగాజీకి తెలియక పైకి నిష్పాక్షికముగ కృషి జేయుదమని వచ్చినారుగదా యని వారి మాటలను నమ్మి, వారితో ఏకమై, ఎన్నికలు జరిపించగా జయము గలిగింది. ఇతర పార్టీలు పడిపోయినవి. కాని రంగాపైన ఇసుమంత విశ్వాసంలేక వారివారి కుటిలస్వభావమైన పనులనే చేయుచుండగా రంగాజీ రోసి, కాంగ్రెసులోనున్న లాభములేదని గ్రహించి, బయటకువచ్చి నిస్వార్థసేవ చేయనుపక్రమించారు. కాని ఇప్పుడు మరల కాంగ్రెసులో ఎప్పటికైనా రంగా కలియునేమోనని కొంత మంది అభిప్రాయపడవచ్చును. కాని ఒక్కసారి ఆయన నిష్కపట

బుద్ధిచేత నమ్మిననూ మరలమరల నమ్ము స్వభావముగలవారు కారు. ప్రతికూలుర భావములు బాగుగా అర్థము చేసికొనియున్నారు కాబట్టి ఇంక ఎప్పటికి అట్లు జరుగనేరదని భావించవలయును.

రంగాజీకి గాంధీసిద్ధాంతమందు చాలానమ్మకము గలదు. గాంధిగారు కుటీరపరిశ్రమలకు చిన్న యంత్రములకు ప్రాధాన్యమిచ్చి భారీపరిశ్రమలు మన దేశమునకు పనికిరావని చెప్పిరి. మన దేశములో జనాభా హెచ్చుగానున్నారు. భూమి తక్కువగానుండుటచేత యంత్రములు పెద్దపెద్దవి నెలకొల్పినయెడల వేయిమంది చేసేపని ఒక్క యంత్రము చేయునుగాన ప్రజలకు పనిపాట్లు దొరకవుగనుక భారీయంత్రములు పనికిరావుఅని అన్నారు.

ఇప్పుడు గాంధేయులమని చెప్పుకుంటూ కాంగ్రెసుపేర పోటీలుజేస్తూ గాంధీసిద్ధాంతమును మరచి భారీయంత్రాలు, సహకార వ్యవసాయములు కావాలంటున్నారుగాని రంగాజీమాత్రము గాంధీ సిద్ధాంతాలను అనుసరించాలని అంటున్నారు. గాంధీ తత్వమునకు భిన్నములేకుండా దేశమును పరిపాలించాలని అభిప్రాయము ఆయనకు గలదు.

రైతులకు ఎప్పుడు ఏదిఅవుసరమో దానికొరకువిరామంలేకుండా కృషిచేయుటకు ఆయన వెనుదీయడు. చేనేత పారిశ్రామికరంగాలలో ఆయనచేసిన కృషి సాటిలేనిది. యువజన విద్యార్థి మహిళాసంఘాలలో గూడ బాగాపనిజేసారు. ప్రస్తుతము స్వతంత్రపార్టీని నెలకొల్పి, స్వతంత్రపార్టీనాయకుడై ప్రభుత్వపుపార్టీకి వ్యతిరేకమైన ఉద్యమము నడుపుతున్నారు. సహకార వ్యవసాయ సమస్యలనుగురించి ఆయన తీవ్రముగా తన అభిప్రాయము వెల్లడించుచున్నారు. మన దేశములో తిండికొరత లేకుండాఉంటాలంటే అధికాహారోత్పత్తి కావాలంటే రైతులకు నీటిసౌకర్యము బాగుగాకలిగించి, ఎరువులు సప్లయిజేసి, మంచిమంచి విత్తనాలు అందించి, పండించినవారికి బహుమానాలు ప్రకటించితే అధికాహారోత్పత్తి అగునుగాని సహకార వ్యవసాయము

వల్ల అధికోత్పత్తి కాదు సరిగదా పంటలు తగ్గునని వాదిస్తున్నదిట్ట ఆయన. ఇంకనూ ప్రజలకు సౌకర్యము తగ్గునని తెలియపరచే ధీరుడు. చాకలి మంగలి వ్యవసాయ కూలీ వడ్రంగి మొదలైన ఇతర వృత్తుల వారు రైతులపై ఆధారపడి వారివారి అత్యవసర కార్యములు చేసి కొనుటకు రైతులవద్ద అప్పుతీసికొని వారి కార్యములు జరుపుకొని వారికి పనులు కలిగినప్పుడు తీర్చుకుంటారు. సహకారవ్యవసాయమైతే ప్రభుత్వపు అప్పులైతే ఎందరో ఉద్యోగుల పరిమిషనులు అయితే కాని డబ్బు ఇవ్వరు; కార్యసిద్ధి కలుగదుగాన చాలకష్టమని చెప్పి సహకారవ్యవసాయము రైతులకేగాక ప్రజలందరికి గొడ్డలిపెట్టు అని విశదీకరిస్తున్నారు. గాన వారిచ్చిన శిక్షణనుబట్టి వారి అనుయాయులలో కొందరు పదవీకాంక్ష ననుసరించే వ్యతిరేకపార్టీలో చేరినను రైతుకూలీ ప్రజారాజ్యమంటే అభిమానముతోనున్నట్లే కన్పడతారు. గాన వారుగూడ ఇతర రాజకీయనేతలకంటే నీతిపరులే కావచ్చును. ఆయన సతీమణిగూడ ఆయనకు అన్ని విధముల సహకారిణిగా నుండును.

# మానవోద్యమ నాయకుడు ఆచార్య రంగా

శ్రీ ఆవుల సాంబశివరావు.

రంగాని రైతురంగా అని పిలవటం పరిపాటి. మన రైతును రాజకీయోద్యమాలలో ప్రవేశపెట్టినవారు మన రైతును రాజకీయ వేదిక నెక్కించినవారు మహాత్మాగాంధీ, ఆచార్య రంగా—వీరిద్దరే. రైతులోకపు శ్రేయస్సు రంగా తపస్సు. కృషీవళుల జీవిత వికాసము, వారి సౌభాగ్యము రంగా మొదటి గమ్యస్థానము. అందుకు సందేహము లేదు.

అయితే, రంగా ఆశయాలు, కార్యరంగం. అంతవరకే కేవలము, రైతులోకమువరకే పరిమితమై లేవు. ఆయన దృష్టి మానవాళి యంతటిమీద నిబిడీకృతమైయున్నది. అనగా. మానవులు ఏ తెగకు చెందినవారైన, ఏ వృత్తికి సంబంధించినవారైన, ఆయన దృష్టిలో, ఆదరణీయులు, మాననీయులు. మానవుని వ్యక్తిత్వము, మానవుని వికాసము, మానవుని ప్రగతి, ఆయనకు కావాలి. వాటిని పెంపొందించడానికే ఆయన అవిరళమైనకృషి. ప్రతి మానవుడు సమాజములో సభ్యుడై ఉన్నప్పటికి, 'అతనికి విశిష్టమైన వ్యక్తిత్వమున్నది. హృదయమున్నది, ఆలోచన ఉన్నది' అని రంగా గుర్తించారు. గౌరవించారు. అందుచేత వ్యక్తిగతమైన మానవుని ప్రాదిపదికగా అంగీకరించి, మానవుడు తన జీవితాన్ని తాను తీర్చి దిద్దుకోగల శక్తిమంతుడని విశ్వసించి, అందుకు కావలసిన వ్యక్తిగతస్వేచ్ఛను వికాసాల్ని, స్వాతంత్ర్యాన్ని నెలకొల్పడానికే, రంగాగారి బహుముఖ ప్రజ్ఞాసత్కృషి, రంగాగారి విశిష్టమైన వ్యక్తిత్వం రూపొందినవి. పర్యవసానంగా, ఆయన సిసలైన మానవతను ప్రతిబింబించే, మనిషిగా మానవోద్యమానికి మహానాయకులుగా రూపొందారు.

ఆయన జీవితవిశేషాలను వేటిని పరిశీలించినప్పటికీ, మనకీ సత్యము ద్యోతకమవుతుంది.

ఆయన పుట్టినది రైతుకుటుంబములో. చిన్ననాడు పెరిగినది, యాభై ఏళ్ళనాటి, అజ్ఞాతమైన ఆంధ్రదేశపు వాతావరణంలో. పేద రైతులమధ్య, నిరాస్యులమధ్య ఆయన బాల్యం గడిచిపోయినది. కాని వారి చదువుసంధ్యలు, ఆనాటి ప్రపంచ సంస్కృతికి, నాగరికతకు కేంద్రమైన ఇంగ్లండులో. వారు నాయకుడుగా వ్యవహరించినది, ప్రజాప్రతినిధిగా వ్యవహరించినది; ఉన్నతాధికారులమధ్య శ్రీమంతులమధ్య మహానాయకులమధ్య, ప్రజాసముదాయంమధ్య. ఈ విభిన్నమైన అనుభవాలు ఆయన సంస్కృతికి అమోఘమైన వెలుగు నిచ్చినవి. ఈనాడు రంగా కృశ్చేవ్, జవహర్‌లాల్‌గార్ల వద్ద ఎలా ప్రవర్తిస్తారో, అతిసామాన్యుడైన పౌరునివద్దకూడ, సరిగ్గా అలాగే. అదే మానసిక సమతాభావాలతో ప్రవర్తిస్తాడు. మానవతాస్థితిని పొందినవారు మాత్రమే చూపగల సమతే యిది.

రంగా రాజకీయపక్షాలు ఇష్టంవచ్చినట్లు మారుస్తారని ఒక విమర్శవుంది. అవును, ఆయన రాజకీయ కులాలకు పరిమితమై వుండలేరు. ఈ కులస్పర్థలను పెంచుకోలేరు. ఆత్మను చంపే ఆ శిక్షణకు బద్ధులుకాలేరు. అధికారంకొరకై జరిగే ఆ ప్రాకులాటలలో, ఆ చదరంగపు ఎత్తులలో పాల్గొనలేరు. ఆయన మానవత వీటిని అధిగమించినది. ఆయన మహానాయకులకు 'జోహుకుం' చెప్పలేడు. ఎవరి వద్దా శిరస్సువంచని మొగవాడు రంగా. వంచలేని వ్యక్తిత్వము ఆయనిది.

రంగాకి వర్గస్పర్థలో విశ్వాసంలేదు. సమాజంలోని భిన్న వర్గాలవారు పోట్లాడుకుంటేనే, ఆ పోట్లాటలలో కొన్ని వర్గాలుజయిస్తేనే, కొన్ని వర్గాలు నాశనమయితేనే ప్రగతి సాధనమవుతుందనే వాదనకు రంగా పూర్తిగా వ్యతిరేకులు. వర్గాలమధ్య సామరస్యముండవలెనని ఆయన ప్రగాఢ విశ్వాసము. మానవ చరిత్ర పరిశీలిస్తే, కనుపించడం

లేదు. సమాజంలో అట్టి సామరస్యభావము, సమాధానభావము బలకరంగా, శక్తివంతంగా లేకపోయినట్లయితే, ఈనాటికి వచ్చిన తగవులతో, మానవ సంఘం ఛిన్నాభిన్నమైపోయి ఉండవలసినది. ముక్కలు, ముక్కలైపోయి ఉండవలసినది. కాకపోగా, ఈనాడు ఐక్యప్రపంచంకొరకు, సహజీవనంకొరకు మానవులు ప్రాకులాడుతున్నారు. ఉవ్విళ్ళూరుతున్నారు.

ఈ సత్యంమీదనే రంగా కార్యక్రమం నిర్మాణమైనది. ఆయన అహర్నిశాదులు కృషిచేసేది సామాన్య ప్రజలకు. కృషీవళులు, ప్రజలమధ్యనే అయినప్పటికీ, పై తరగతులవారిని ఆయన ద్వేషించరు. ద్వేషించలేరు, ఆయన సంస్కృతి అందుకు అతీతమైనది. ఇది గమనించక, కొంతమందిని ఆయన భూస్వాముల పక్షాభిలాషిఅని అప్పుడప్పుడు పొరబడుతున్నాము.

ప్రజాసముదాయానికి వికాసము, ఆత్మగౌరవము, ఆత్మవిశ్వాసము కలిగిన రోజున, సమాజముయావత్తు నైతికంగా, ఆర్థికంగా, ఔన్నత్యాన్ని అందుకుంటుంది. అందుకనే, చిన్ననాడు వెంకటగిరి సంస్థానములో ఆరంభించిన జమీనురైతు ఉద్యమం నుండి, ఈనాటి ఉద్యమాలవరకు, రంగాదృష్టి ప్రజాసామాన్యం మీదనే కేంద్రీకృతమై ఉన్నది. ఆంధ్రదేశంలో, యావద్భారతంలో రంగా నడిపిన ఉద్యమాలు ఎన్ని ? అవి అన్నీ రైతులవరకే పరిమితమైనవి లేవు. చేనేత పరిశ్రమ, వెనుకబడిన జాతులు, సహకారోద్యమం, కవిత్వం, రచన, సంగీతం—ఎన్నెన్ని రంగాలలోనో రంగా కృషిచేశారు. ఉద్యమాలు నడిపారు. ప్రోత్సాహమిచ్చారు.

కాకపోతే, వ్యవసాయ రంగంమీద వారు ప్రత్యేక శ్రద్ధ చూపెట్టారు. ఎందువల్ల ? అది పక్షపాతబుద్ధితో కాదు, దేశంలో నూటికి 70, 80 మంది వ్యవసాయ క్షేత్రంలో పనిచేస్తున్నారుగనుక. జీవనోపాధికి దానినే నమ్ముకొని ఉన్నారుగనుక. మిగతా వృత్తులన్నీ, మిగతా పరిశ్రమలన్నీ, దేశసౌభాగ్యమంతా, వ్యవసాయక్షేత్రం

సస్యశ్యామలం కావటంమీదనే ఆధారపడి ఉన్నవిగనుక. అందు చేతనే రంగాకి రైతుమీద, భూమిని నమ్ముకున్న వానిమీద, ప్రత్యేకమైన శ్రద్ధ. అభిమానము.

ఆయన నియంతృత్వాన్ని సహించలేరుగనుక, వర్గస్పర్థను వ్యతిరేకిస్తారు గనుక, సామరస్యభావములో విశ్వసిస్తారుగనుక, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఆశిస్తారుగనుక, కమ్యూనిజం, సోషలిజం మొదలైన సిద్ధాంతాలనుగాని, ఆ తీరులలో నడిచే వ్యవస్థలనుగాని, ఆయన తీవ్రంగా ప్రతిఘటిస్తారు. ప్రతిఘటిస్తున్నారు.

ఆయన కోరేది ప్రజలందరు కలసి చేసుకునే యాజమాన్యం. కొంతమందిని మాలకాకులలాగా వెలివేయని ఔన్నత్యం. అనగా రైతులు, కూలీలు, ప్రజలు కలసి చేసుకునే రాజ్యం. అనగా రైతు, కూలీ, ప్రజారాజ్యం. త్రివేణీ సంగమం. ఫలప్రదమైన స్రవంతి. ఈ మహోద్యమం, ఈ మానవోద్యమం ఫలప్రద మగుగాక !

# భక్తుల్ని బాధ పెడతారు

## శ్రీ ములుకుట్ల వెంకటశాస్త్రి

రంగాగారి పరిచయభాగ్యం నాకు చాలా కొద్దికాలం క్రిందట లభించింది. ఇంచుమించుగా 1930 నాటినుండీ రాజకీయాలలో ఏదో ఒకరకంగా సంబంధమున్నప్పటికీ వారి దరిదాపుకు రావడంకూడా జరుగలేదు. యమ్. యన్. రాయ్ సహచరుడుగా తిరుగుతున్న రోజుల్లో వారి శిష్యకోటిలో కుశాగ్రబుద్ధులైన కొంతమందితో నాకు పరిచయం కలిగింది. మేము సహచరుల మయ్యాము. వారిలో ముఖ్యులు గుత్తికొండ నరహరి, లావు అంకమ్మ! అంకమ్మ మాతోనే వున్నాడు. నరహరి ఇప్పుడు ఎక్కడ వున్నాడో తెలుసుకోవడం కూడా కష్టమవుతోంది. నరహరి ఉపన్యాసకౌశలం, కార్యదక్షత రంగా శుశ్రూషా ఫలితమేనని అనుకుంటూ వుండేవారు. ముఖ్యానికి కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఏ పార్టీలో చూచినా – కమ్యూనిస్టు పార్టీలో సహితం పేరుపొందిన కార్యకర్తల రాజకీయ శైశవం రంగా గారి శుశ్రూషతో ప్రారంభమైనట్టుగానే వింటూ వుండేవాళ్ళం. పైకి వెళ్ళిపోయిన వారందరూ గురువుని మించిన శిష్యులుగానే తయారైనారు. కొందరు పంగనామాలు పెట్టినారేమో కూడా! ఇప్పటికీ రాష్ట్రమంతటా వారి శిష్య పరంపర మిగలకపోలేదు. వారంతా భక్తులు. "రంగాజీ" అని తప్ప మరోకలాగు సంబోధించరు. ఆ నామ స్మరణే వారికి ఆనందాన్ని కలిగిస్తుంది. భక్తపరాధీనత్వాన్ని గోచరిస్తుందికాని భగవంతుని శక్తి సామర్థ్యాలు భక్తుల్లో ప్రసన్నం కావు. రంగాలోని వైచిత్ర్యమే ఇదేమో! భక్తపరాధీనుడని చెప్పలేం. భక్తుల్ని కావలసినంత బాధ పెడతారు. అగ్ని పరీక్ష చేస్తారు.

రంగాగారికి వ్యక్తిత్వం లేదేమోననిపిస్తుంది. అది వారి ఉదాత్త లక్షణమేమోకూడా. అంటే ఒక ఉద్యమంలో సాగిపోతున్నప్పుడు ఆ ఉద్యమ లక్ష్యానికే ప్రాధాన్యత ఇస్తారు. వ్యక్తిగతంగా తన స్థానం

సుస్థిరం చేసుకోవడానికి ఉపకరించే కృషి తెలియనే తెలియదేమో. మన రాష్ట్రంలో కమ్యూనిస్టుపార్టీని రూపుమాపి, కాంగ్రెస్‌ను అమోఘమైన అధికార స్థానంలోనికి తెచ్చినది రంగా కృషియేనని ఆయన శత్రువులుకూడా ఒప్పుకుంటారు – విమర్శకులు చెప్పి పొడుస్తారు. అయితే ఈనాటి కాంగ్రెస్‌లో ఆయనకు స్థానం లేకపోవడమే ఆయన వైశిష్ట్యం తెలుపుతుంది. మన రాష్ట్రంలోని ఈనాటి అగ్ర కాంగ్రెస్ నాయకులు మంత్రులు ఏ విధంగా చూచినా ఆయన కన్న తక్కువవాళ్ళే! అందుచేతనే ఏమో వారికా అగ్రస్థానం. తక్కువ పనులకు దిగరీయన – కష్టజీవి!

స్వతంత్రపార్టీ స్థాపనకు ముందు నేనూ శ్రీకాళోజీ పత్రికాముఖంగా చేసిన ఒక ప్రకటనను వారు హర్షిస్తూ బొంబాయిలో జరిగిన ప్రథమ సమావేశానికి రావలసినదిగా నన్ను ఆహ్వానించారు. ఆ సమావేశానంతరము బొంబాయిలోనే వారితో నాకు పరిచయమైంది. వారిని చూచినప్పుడు నాకు కలిగిన భావాలు దాపరికం లేకుండా చెబుతాను. ఆయన్ని టోపీ లేకుండా చూచాను. భక్తిభావం నాకేమీ కలుగలేదు కాని ఆరోగ్యంగా కనిపించారాయన. అంతవరకూ గాంధీ టోపీతో వున్న రంగా చిత్రాలే చూచాను. తన్మూలంగా వారితో పరిచయం చేసుకోవాలనే అభిలాష కలుగలేదు సరికదా తగ్గిందని కూడా చెప్పాలి.

స్వతంత్రపార్టీ సభ్యత్వం కారణంగా వారితో రానురాను కొంత సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఆయనకు అరవై ఏళ్ళునిండియున్నాయంటే నమ్మడం కష్టమవుతోంది. మధ్య వయస్సులో వున్నట్టు కనబడతారు. భేషజం ఏమాత్రం లేదు. సరికదా కుర్రవాడి లక్షణాలు – చంటివాడి లక్షణాలు అన్నా తప్పేమీ లేదు. ఎన్నో కనిపిస్తాయి. ఏమి ఓపిక – ఎంత తిరుగుతారో, యం. పి. రైలు టికెట్టు ఆయన చేసినంత వినియోగం అందులో సద్వినియోగం ఇంకొకరు చేస్తున్నారనిగాని చేయగలరనిగాని నేను అనుకోను. నేను గ్రహించకలిగినంత వరకూ కార్యకలాపాలు, కృషి అంటే ఆయనకు

ఆసక్తి, ఉత్సాహం, తొందరపాటు ఎక్కువ. బద్ధకమంటే ఏమిటో తెలియనంతగా సంచరిస్తారు. ఆలోచనకు కూడా విరామం [illegible] లేనంతగా కనిపిస్తుంది.

భారతీదేవి ఆయన భార్య అవడం ఆయన అదృష్టం. [illegible] అడ్డంపడే భార్యలుంటే నాయకులు ఎంత ప్రతిభావంతులైనా [illegible] ఉద్యమానికికూడా నీళ్ళు వదలుకోవలసిందే. రంగాగారు [illegible] పట్టకపోవడానికి ముఖ్యకారణం ఆయన సహధర్మచారిణి [illegible] నని విజ్ఞుల అభిప్రాయం.

వీరికి కులతత్వముందంటే నేను నమ్మను. వారి కులానికి చెందినవారు ఆయనను గొప్పచేసుకుంటే ఆశ్చర్యమూ లేదు. అది వారి తప్పూ కాదు. రాష్ట్రేతరంగా ఆయన సంపాదించుకున్న పలుకుబడి ఏకులతత్వముమీద ఆధారపడింది గనుక?

స్వతంత్రపార్టీ నాయకత్వం వహించడానికి తగ్గ లక్షణాలు వీరికి వుందా అని కొందరంటారు. ముఖ్యంగా మనరాష్ట్రంలోనే ఈ శంకలు ఎక్కువ—పెరటిచెట్టు మందుకి పనికిరానట్టుగానే. అఖిల భారత రాజకీయ కక్షకి ఒకదానికి అగ్రనాయకత్వం వహించడానికి కావలసిన సాధనసామగ్రి వారిలోవుందా? ఆకక్ష నెలకొల్పిన ఉద్యమం నడపడానికి తగిన విశాలదృక్పథం ఆకళింపు వీరికి వున్నాయా? అని కొందరంటారు. మేధావులు దిగ్గజల్లాంటివాళ్ళంతా వుండగా [illegible] స్వతంత్రపార్టీకి రంగా నాయకత్వమేమిటని కొందరిభావం. అయితే వ్యక్తిత్వమనే ధోరణేలేకుండా పార్టీకి అంకితం కాగలిగినందుకే ఆయనకే నాయకత్వం ప్రసాదించిందని తోస్తుంది. పార్టీని అనుగమించిన ఉద్యమానికి సహజమైన నాయకత్వం రాజాజీదే! పార్టీ నాయకత్వం మనవారిదైనా ఉద్యమనాయకత్వం గాంధీజీదైనట్టు. [illegible] అంతా తీసికట్టే. అంతమాత్రంతో ఆంజనేయుని ప్రభావం తక్కువదని ఎవరంటారు. అంతటిదీక్ష పూనిక రంగాజీలో వున్నవనడానికి ఏ మాత్రం సందేహంలేదు.

# మా రంగాజీ!

## శ్రీ వి. యల్. సుందరరావు

భారత స్వాతంత్ర్యోద్యమ చరమ అధ్యాయం కాంగ్రెసు నాయకత్వాన దీప్తి జెందింది. బాలగంగాధర తిలక్, మహాత్మా గాంధీ, నేతాజీ సుభాసులు యుగములో ఒక్కొక్క పర్వం సృష్టించి చరితార్థులయ్యారు. కాంగ్రెసును జాతీయ సంస్థగా రూపొందించి స్వాతంత్ర్యం మాజన్మహక్కు అన్న నినాదమిచ్చినమూర్తి బాలగంగాధర తిలక్. కాంగ్రెసు పరిషత్తును విస్తృత సంస్థగా—స్వాతంత్ర్య సాధనకు ఏకైక సంస్థగా నిర్మాణం చేసిన మహోజ్వలమూర్తి, ధృవతార బాపూజీ. భారత జీవనజ్యోతిగా, యుగపురుషునిగా అవతరించారు మన బాపూజీ. ఆయన మన నోములపంట. అయితే, ఆంగ్లేయ పాలనకు అంతిమ ఉద్వాసనం చెప్పించింది నేతాజీ. భారత సైనికుల్లో విప్లవ బీజాలునాటి, జ్యోతి రగిల్చి—స్వాతంత్ర్య యోధునిగా తయారు చేసి—సామ్రాజ్యవాదుల్ని చావుదెబ్బలు గొట్టింది నేతాజీ సుభాస్ చంద్రబోసు.

దేశంలోని వివిధసమస్యలు, ఉద్యమాలు యీకాలంలో వేరు వేరు రూపాలలో భారత యితిహాసానికి సంపూర్ణత్వాన్ని ఆపాదించి పెట్టాయి. మహానాయకుల్ని, ప్రజాసంస్థల్ని సృష్టించాయి. ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రముఖఘట్టంగా చరిత్రలో వాసికెక్కాయి.

భారత దేశమంటే గ్రామసీమలు. గ్రామజీవనానికి పునాది రైతు. స్వయంపోషకుడు, నిస్వార్థానికి మచ్చుతునక రైతుకుటుంబం. అణగారివున్న యీ రైతు కుటుంబానికి ప్రేమకాంతులు, ఆశాజ్యోతులు ప్రసరింపజేసి—తిరిగి గౌరవస్థానాన్ని సంపాదించుటకు మేలుకొలుపులు పాడింది ఆచార్య రంగా. విద్యాగంధము లేక — మారుమూల పల్లెల్లో అనాగరికతా చిహ్నంగా — నిరాదరణగా పడాయి

ప్రభుత్వంచే నిర్లక్ష్యంచేయబడిన రైతాంగాన్ని — జాతీయ సమరంలో చేతులుగలిపి, ముందంజవేసి, భాగస్వామ్యం పొందుపరచి శంఖనాదం చేసింది ఆచార్య రంగా.

బార్డోలీ—ఛాంపరాన్—వంటిచోట్ల గాంధీజీ—మున్నగువారు కొన్ని రైతు ఉద్యమాలు ప్రారంభించి—బాపూజీ గ్రామసీమలపట్ల తమ నిండు ప్రేమను ప్రకటించారు. అప్పటినుండీ బాపూజీ ప్రేమాభిమానాలు, దాక్షిణ్యాన్ని చూరగొంటూ ఆచార్యరంగా రైతు ఉద్యమ మార్గదర్శిగా, పితామహుడుగా ఖ్యాతిగాంచారు. ఆనాడు వారు నెలకొల్పిన వేదిక అఖిలభారత కిసానుసభ రైతుల వేదిక. స్వామీ సహజానంద సరస్వతి, యిందూలాల్ యాగ్నిక్, రంగాజీత్రిమూర్తులు దానికి నాయకులు. ముగ్గురూ రైతుబిడ్డలు. పల్లెవాసులు. లోకానుభవంగలవారు. మహా వక్తలు, రచయితలు, నిస్వార్థ దేశభక్తులు, నిరాడంబరులు, జాతీయ వాదులు, ప్రజానాయకులు. యిందూలాల్జీది గుజరాతు, స్వామీజీది గుజరాతు. రంగాజీది దక్షిణభారతం. యీ ముగ్గురి సంగమం నిడుబ్రోలు. ఆనాటి కిసానుసభ ఆఫీసు, వాఙ్మయం, పత్రికలు, ధనం, కార్యక్రమాలు, కరపత్రాలు, ప్రణాళికలు, వర్కర్సు నిడుబ్రోలు 'గోభూమి' నుండే! రైతు ఉద్యమసేవకుల శిక్షణాలయం నిడుబ్రోలు 'రామానీడువిద్యాలయం'. ఆనాటి రైతు ఉద్యమ సాహిత్యం, సరంజామా వెలువడింది 'క్రాంతి' 'వాహిని' పత్రికలద్వారానే!

ఉత్సాహం, త్యాగం, సాహసం, శీలంగల విద్యార్థుల్ని యువకుల్ని ప్రోగుచేసి రాజకీయ పాఠశాలలు నడిపేవారు. విభిన్నసమస్యలు, విధానాలు, ప్రణాళికలపైన సిద్ధహస్తుల్ని తయారుచేసేవారు. జాతీయ ఉద్యమ నిర్మాణానికి, రైతుల సంఘటనకూ కావలసిన నైపుణ్యం, రాజకీయ పరిజ్ఞానం యీ వేసంగి పాఠశాలలు పంచేవి. ఈ పాఠశాలలు నడపటంలో రంగాజీ భారతదేశ రాజకీయాలకే అగ్రగాములయ్యారు. శ్రీ అన్నాప్రగడ కామేశ్వరరావుగారు నడిపిన కమ్యూనిస్టు ప్రేరేపిత కొత్తపట్నం, మంతెనవారిపాలెం విద్యాలయాలు చేసేన విద్యాలయాలకు వరవడి పెట్టాయి.

రైతు సంక్షేమమే రంగాజీ ధ్యేయం. స్వాతంత్ర్య సముపార్జనదానికి ప్రధానస్థానం. అందుకుగా జాతీయోద్యమంలో ప్రథమ శ్రేణిలో ఉండాలి రైతు, రైతు సేవకులు కనుక, రైతుబిడ్డలను, స్వాతంత్ర్యయోధులుగా తయారుచేయడమే ఆనాటి రంగాజీ తహతహ. ఆయన ఉపన్యసించని పట్టణంగానీ, పల్లెగానీ లేదు. ఉత్సాహం, ఉద్రేకం కలిగించని విద్యార్థి, యువకుడు లేడు. ఆయన సహకారం ఆశీస్సుపొందని సంఘాలు లేవు. నాటి ఆంధ్రరాష్ట్ర విద్యార్థి యువజన ఉద్యమాలన్ని ఆయన కనుసన్నల్లో మెలిగాయి. చేనేత వ్యవసాయ కూలీ ఉద్యమాలకు ఆయనే నాంది ప్రస్తావన చేశాడు.

రైతు ఉద్యమానికి అవసరమైన, సాహిత్యం పత్రికలు, నర్కుల్లు, అన్ని హంగులూ సృష్టించాక, అన్ని రాష్ట్రాలలో, జిల్లాలలో, గ్రామాలలో కిసాను సభలు యేర్పాటైనాయి. ఎక్కడచూచినా జనసందోహాలే! అశేష రైతుప్రజా బాహుళ్యం కిసానుసభ పతాక చ్ఛాయల్లో ముందుకుసాగిపోయింది. పోరాటాలు, సత్యాగ్రహాలు, సభలు, ప్రభుత్వంతో సంఘర్షణలు నిత్యకార్యక్రమాలైనాయి. నిండుస్వరూపం దాల్చింది రైతుఉద్యమం. యిక్కడనుండి అన్ని రాజకీయపార్టీలవారూ రైతుసంఘ శ్రేయాభిలాషులయ్యారు. అందరికీ యీ సంస్థలో పలుకుబడి, నాయకత్వం అవుసరమైంది.

రైతు ఉద్యమం యింతలో మరొక అంతస్థునందుకొంది. రంగాజీ వెంకటగిరి సత్యాగ్రహాలు, జమీందారీ రైతుసంఘ నిర్మాణాలు, ఉద్యమాలు నడిపారు. అప్పటినుంచీ కిసాను సభ తీవ్రవాదులు వేదికగా, పేదరైతుల ఉద్యమంగా రూపొందింది. జమీందారులు, భూస్వాములు, ధనవంతులూ విరోధులయ్యారు. రైతు విప్లవతత్వంపై విశ్వాసంలేని కమ్యూనిస్టులు కిసాను సభలో ప్రవేశించారు. వారి రాజకీయ విధానాలకు వేదికగా కిసాను సభను ఉపయోగించుకో సాగారు. కాంగ్రెసు, కాంగ్రెసు పోరాటాలు ధనవంతుల స్వార్థం కోసం నడిపేవని తూలనాడుతూ కమ్యూనిస్టులు తప్పుడు భాష్యాలు

తుంది.'' అని కమ్యూనిస్టు ఉవాచ. యిది ప్రపంచ కమ్యూనిస్టు మూసలనుండి దిగుమతి చేసిన కారల్ మార్క్సు సిద్ధాంతం. ''భారత దేశంలోని పతిత ప్రజల విప్లవానికి [illegible] నాయకత్వం వహించి తీరుతాడు'' అని రంగాజీ [illegible]. ఆనాటి తీర్మానాలు, రచనలు, గ్రంధాలు సర్వస్వం [illegible] స్పష్టం చేస్తాయి.

1941-42 సంవత్సరాలనాటి చరిత్ర. ప్రపంచ యుద్ధం తీవ్రంగా విజృంభించింది. అంతిమ జాతీయ నాయకత్వాన్ని గురించి మన జాతీయనాయకులు క్రిందుమీదు పడుతున్న రోజులు. వ్యక్తిగత సత్యాగ్రహం విరమించబడింది. నేతాజీ సుభాష్ [illegible] నేతలతో గలసి బ్రిటిషు సామ్రాజ్యవాదుల గుండెల్లో సింహస్వప్నంగా మెలగుతున్నాడు. రష్యా యుద్ధంలో ప్రవేశించింది. యిది ''ధర్మ యుద్ధ'' మని, ''ప్రజాయుద్ధ'' మని కమ్యూనిస్టులు [illegible] బజార్ల వెంట బాకాలూదారు. బ్రిటిషు యుద్ధప్రయత్నాలకు [illegible] డాలని పండిట్ నెహ్రూ, అబుల్ కలాం [illegible] ఆలోచనలు చేయదొడగారు...సర్ స్టాఫర్డు క్రిప్సుతో [illegible] ప్రాకులాడారు. రాజీ సాధించాలని రాజాజీ [illegible] లన్నీ ప్రయోగించారు.

''యిది చెల్లని చెక్కు'' అని [illegible] బాపూజీ. ''పోరా – చావో'' అని [illegible] ఆయత్తం చేస్తున్నాడు బాపూజీ. [illegible] ఆగస్టు విప్లవ రణగర్జనలు దిక్కులు పిక్కటిల్లేటట్లు వినిపిస్తు తున్నాయి.

ఈ సమయంలో అఖిలభారత కిసాను మహాసభలు బీహారు రాష్ట్రంలో భీటా అనేచోట ఏర్పాటు చేశారు. అది 1942 మే మాసం. మరి మూడుమాసాల్లో ఆగస్టు విప్లవం [illegible]. భీటా—అనేక జమీందారీ రైతు పోరాటాలు—సత్యాగ్రహాలు—[illegible] రక్షణ యాత్రలకు కేంద్రం. అటువంటి రైతుప్రజాపోరాటాన్ని [illegible]

ఖాపుటా క్రిందచేర్చి స్వామిజీ రైతుబాంధవుడుగా 'సెభాష్' అనిపించుకొన్న స్థలం. 1937లో ప్రథమంగా కాంగ్రెస్ ఎన్నికల్లో పాల్గొంది. రైతుల కనీస కోర్కెలపై కిసానుసభవారు ఒక ప్రణాళిక తయారుచేశారు. కాంగ్రెసు ఎసెంబ్లీ ప్రతినిధులచే రైతుల ప్రణాళికపై సంతకాలు పెట్టమని కోరారు. ఆంధ్ర తరువాత బీహారులో హెచ్చుమంది సభ్యులచే స్వామిజీ సంతకాలు పెట్టించగలిగారు.

అయితే నాడు స్వామిజీ కమ్యూనిస్టుల చేతుల్లో కీలుబొమ్మ అయిపోయాడు. ఆయన పలుకుబడి, పరివారం, ఉపన్యాసాలు, సాహిత్యం, కమ్యూనిస్టుల ప్రజాయుద్ధానికి అంకితంచేశాడు. క్రమేపీ యాజ్ఞిక్ గూడా అంతే పోరాటం ప్రారంభించాడు.

యాజ్ఞిక్... శ్రీమంత కుటుంబానికి చెందినవాడు. రంగాజీ వలె ఉన్నత పాశ్చాత్య విద్యల నభ్యసించాడు. బొంబాయిలో ప్రథమంగా సినిమా స్టూడియోను స్థాపించాడు. శాంతారాంను కళాకారుడుగా చేర్చుకొన్నాడు. వాటన్నిటికీ తిలోదకాలు వదిలాడు. గాంధీజీ శిష్యులుగా చేరి సాబర్మతి ఆశ్రమంలో అతి నియమ నిష్ఠలతో జాతీయ సేవకు జీవితం అంకితం చేశాడు. తన యావదాస్తిని దేశసేవలో త్యాగం చేశాడు. నిరాడంబరుడు. మహావక్త. రచయిత. ఈ మధ్య మహాగుజరాత్ ఉద్యమ నాయకుడై, పార్లమెంటు సభ్యుడుగాకూడా ఎన్నికైనాడు.

ఖేటా కిసాను మహాసభలకు యిందూలాల్‌జీ అధ్యక్షులు. ప్రజాయుద్ధ నినాదంతో యీ ఖేటా మహాసభల నాటికి ఎలుకలు కలుగుల్లోనుండి బయటపడ్డట్లు—జైళ్ళు, నిర్బంధాలు, అజ్ఞాతవాసా (అండరు గ్రౌండు)లనుండి—కమ్యూనిస్టు నాయకులంతా బయటపడ్డారు. ఎటుచూసినా రైతుమహాసభలో ఎఱ్ఱజెండాల రెపరెపలే కనిపించాయి.

ఇహా ముగిసింది రంగాజీ. రంగాజీ వెంటవున్న ఆంధ్ర ప్రతినిధులు "ప్రజాయుద్ధ" నినాదానికి పూర్తి వ్యతిరేకులు. శ్రీయుతులు

నిర్ణయం మార్చుకోవడం జరిగింది. ఇదే కిసాను మహాసభలలో రంగాజీ ఆఖరిసారిగా పాల్గొనడం.

ఇంతలో ఆగస్టు ఉద్యమం బాపూజీ శంఖారావం. జాతీయ ఆంతిమసమరం. రంగాజీ, రంగాజీ సైనిక సేవకులు, ఆంధ్రదేశంలో చేయని త్యాగం— చూపించని సాహసం— లంఘించని కార్యక్రమాలు లేవు. రహస్య పత్రికలు విప్లవచర్యలతో జైళ్ళల్లోను జైళ్ళబయటా విప్లవజ్యోతిని వెలిగించాయి. యీ విప్లవపోరాటం జైళ్ళజీవితం రాజకీయ భావనాధోరణులు అనేకమార్పులు తెచ్చాయి.

ఈ సంధికాలంలో రంగాజీలో ఉన్న సోషలిస్టు వాసనలు, కార్యక్రమాలు, ఆలోచనలు, క్రమేపి ఒకటివెంటఒకటి దూరమౌతూ వచ్చాయి. కమ్యూనిజాన్ని పూర్తిగా నిరసించసాగారు. రంగాజీ జైల్లో ఉన్నప్పుడు 1943లో చెవులో పోటువచ్చింది. మద్రాసు పోలీసుల కాపలాతో తెచ్చారు. రోజూ జనరల్ ఆస్పత్రికి తెచ్చేవారు. సుదీర్ఘమైన చర్చలు— ఉత్తరప్రత్యుత్తరాలు నడిచాను పది రోజులపాటు. రంగాజీ ఏవిధంగా జాతీయవాదిగా, గాంధేయ అనుయాయులుగామారింది యీ కాలంలో ద్యోతకమైంది. ఆ ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రచురిస్తే చిన్న గ్రంథమౌతుంది. వాటిని ఎప్పుడైనా విడిగా ప్రకటించాలని సంకల్పంగూడా గలదు.

దూరంగా— చిన్న కుటీరంలో కూర్చొని— పెదవిమెదపకుండా — కనుసైగలతో— ఊపు అని వ్రేలుచూపుకొంటూ— కాంగ్రెసు సారథ్యం చేస్తున్నాడు. తనలోతానే హెచ్చువేతలూ, భాగారాలు గణించుకొంటూ— మనిషిలోని శక్తిసామర్థ్యాలు పరీక్షించుతూ— ఒకర్ని కాంగ్రెసు గద్దెనెక్కించుతూ మరొకర్ని దింపుతూ ఉన్నాడు. ఎన్నో అంతరాయాలు దూరానఉన్నవార్ని ఆయన మందహాసం ఎంతో సన్నిహితుల్ని చేస్తుంది. హృదయంలో దాచుకొని ఉన్న తీరని సందేహాలను బట్టబయలుచేస్తుంది. ఒకసారి ఆయనతో పరిచయం, సంభాషణ, ఎన్నో శతాబ్దాలు మాసిపోకుండా నిలచి

కొలది మాసములకే బొంబాయిలో అఖిలభారత విద్యార్థి కాంగ్రెసు మహాసభలు జరిగాయి. "రైతుకూలీ ప్రజారాజ్యమే మా ధ్యేయం, అని విద్యార్థి కాంగ్రెసు ఆశయం" గా ఉండాలని నేను ప్రతిపాదించి అంగీకరింప చేశాను. దేశంలో నలుమూలలా – ప్రతి కాలేజీ, హైస్కూలులోని సమయమున్న జాతీయవిద్యార్థి దళం – రైతుల సందేశాన్ని అందరికీ అందించారు. అఖిలభారత వేదిక దొరికింది. యిది కలిసి వచ్చిన అదృష్టం. మరికొన్ని మాసాలకే రైతు కూలీ ప్రజా రాజ్య నినాదం రంగాజీ జాతీయ కార్మిక మహాసభలలో అంగీకరింప జేశారు.

రంగాజీ నాయకత్వం జాతీయ అగ్రనాయకస్థాయి నందుకొంది. రైతు ప్రజాబాహుళ్యానికి ఏకైక నాయకులయ్యారు. రైతుల రాజకీయ సిద్ధాంతానికే, ఆర్థిక ప్రణాళికలకూ రంగాజీది తుదిమాటగా స్థిరమైంది. అంతర్జాతీయ రైతుసంఘాలకు—మహాసభలకు యీయన నాయకత్వం అనివార్యంగా భావించ సాగారు. రంగాజీ వ్రాసిన అనేక నూతన గ్రంథాలు బహుళ ప్రచారంలోనికి వచ్చాయి.

రంగాజీకి యిచట నూతన రాజకీయాలు ఎదురౌతున్నాయి. స్వాతంత్ర్యసిద్ధి, కాంగ్రెసు అధికార కైవసం చేసుకోవటం జరిగింది. ఆంధ్ర కాంగ్రెసు అధినేతగా – అఖిలభారత కార్యవర్గ సభ్యులుగా పరిపాలనా బాధ్యతలు రంగాజీ పంచుకొన్నారు. కాంగ్రెసు—రైతు సమస్యలకు ప్రధాన పరిష్కారమార్గాలు చేపట్టక—రైతుల ఆందోళనకు, అసంతృప్తికి గురైనారు. రైతుజనాళి శ్రేయస్సును గురించిన ఆలోచనేగదా రంగాజీకి ముఖ్యమైనది? ఈ కారణంగా రంగాజీకి తిరిగి జాతీయనాయకత్వంలో సంఘర్షణ అనివార్యమైంది. రైతుల ధాన్యంపై ప్రభుత్వం విధించిన కంట్రోళ్ళు తొలగింపజేయడానికి ఎంతో ప్రయత్నించారు రంగాజీ. కాంగ్రెసుతో సంఘర్షణ పెరిగి బయటికి రావటం అనివార్యమైంది. కిసాన్ మజ్దూర్ పార్టీలో చేరారు. "రైతుకూలీ ప్రజారాజ్య నినాదం" అంగీకరింప జేశారు.

దాన్నుండి విడిపోయి కృషికార్ లోక్ పార్టీని స్థాపించారు. మళ్ళీ దాన్ని కాంగ్రెసులో విలీనీకరణ చేశారు. యిప్పుడు తిరిగి కాంగ్రెసును వదలి స్వతంత్రపార్టీ వ్యవస్థాపకుల్లో ప్రధానులై, అఖిలభారత స్వతంత్రపార్టీ అధ్యక్షులయ్యారు.

ఈ మార్పులకు మూలం రైతు సమస్యలే! కాంగ్రెసులో ఉండి సాధించుటకు వీలైనకృషి నెల్లా చేయటం. [illegible] చలేననుకొన్నప్పుడు విడిపడటం. నియంతృత్వ [illegible] ప్రజాస్వామ్యపరిరక్షణ అవసరమైనప్పుడు [illegible] కాంగ్రెసును బలపర్చటం. సాధారణ రాజకీయ [illegible] మాటల వాదంలాకనుపించుతుంది. ఒకవిధంగా నిజమే కావచ్చు. ప్రజాస్వామ్య దేశంలో యీ రాజకీయాలు [illegible] దూరంగామనంలేం. అధికార పార్టీలో [illegible] డలేం. యిచ్చి పుచ్చుకోటం, పరిస్థితుల కనుగుణ్యంగా [illegible] అవుసరం. రంగాజీలో లౌక్యం లేదు. [illegible] చెప్పే అధికారవర్గం వారి మాటలకే [illegible] సహకార వ్యవసాయ క్షేత్రాల గురించిన [illegible] తార్కాణం.

అతి వేగంగా ఆలోచించటం, పరుగెత్తటం రంగాజీ సహజలక్షణం. పరుల విమర్శలు, [illegible] చేయరు. [illegible] ఒక క్షణంలో అవతలి వాడ్నుకు [illegible] మేపాలు లెక్క పెడతారేమయ్యా అని [illegible] చూస్తూ ఉండగనే చిటికలో ఆవలవాడ్ని [illegible] ల్లాగా చూస్తూ నిలుచున్నారేమయ్యా అంటారు. [illegible] ఎంత బాగుంది—ఎంతటి అనుభవం సంపాదించారు. [illegible] ఆనందిద్దురు రండయ్యా అంటే రారేమయ్యా అని [illegible] తాడు. మీరు రాకుంటేమానె నేను యింకా ముందుకుపోవాల్సి ఉంది పొమ్మంటూరా లేదా అని, తన వారికోసమై ప్రత్యేకంగా

చూస్తాడు. వీళ్ళు రాక పోయినాగాని లేక అదనంగా పరివారంగా వా లన్నా కాని – నా వెంటవచ్చే వాళ్ళు ఎవ్వరైనా ఉంటే రాండయ్యో అని అక్కడే ఒక పొలికేక పెట్టుతాడు. ఆచుట్టూ, గుట్టల్లో పుట్టల్లో దాగి ఉన్నవారిని పోగుచేసి కావలసిన దండును తయారుచేస్తాడు. ఇది ఆయనకు ఉగ్గుతో పెట్టిన విద్య. తన ఆలోచనలు, భావాలు, ఆశయాలు, సాధించుటకు కావలసిన సంఘాలు, సంస్థలు, ప్రచార యంత్రాంగం, సుశిక్షిత సేనకల్ని తయారు చేయటంలో – భారత దేశంలో రంగాజీకి సాటి మరే నాయకుడూ లేడంటే అతిశయోక్తి కానేరదు.

మన జాతీయనాయకుల్లో – వామపక్ష అగ్రనాయకు లందరితో నాకు ప్రత్యక్ష సంబంధంగలదు. వామపక్ష నాయకులే ఎప్పుడైనా సర్వశక్తి సమన్వితులై సర్వగుణ సంపన్నులై ఉంటారు. కమ్యూనిస్టు, సోషలిస్టు, ఫార్వర్డ్ బ్లాకు మొదలగు తీవ్రవాద పార్టీ నాయకులతో నాకు పరిచయాలు గలవు. రంగాజీలో ఉన్న అన్ని శక్తులూ కలిసి ఉన్న మరొక నాయకుడు నాకు కనిపించలేదు. తెలుగు భూమిపై – మనకు సన్నిహితులై – పిలిస్తే పలుకుతూ ఉన్నందువలనా – మనకు ఎప్పుడూ నాయకుల లోపాలే ఎత్తిచూపి సల్లెవేయటం ప్రధాన అలవాటు కావటం కారణంగా – రంగాజీని తక్కువ అంచనా వేయదలిస్తే అది పొరపాటే అవుతుంది. వారితో సాధించటం దుస్తరం.

రంగాజీ మాదిరి ఛంగున చిటికలో అంతటి కాల్వలు దూకటంగాని, ఆ అనుభవం సంపాదించటంగాని అందరికీ సాధ్యంగాదు. ఆ నిర్మల హృదయం— శ్రమజనాళిపట్ల ఆ ప్రగాఢ ప్రేమ, వారి కోసమై తన వ్యక్తిత్వాన్ని పలుకుబడిని క్షణంలో వొడ్డగల సాహసం. —నోరు లేని శ్రమజనాళితో కూనిరాగాలు తీసుకొంటూ— పల్లె సీమల్లోనుండి వచ్చే మలయమారుతానికి ప్రతిక్షణం తబ్బిబ్బౌతూ— వారి మాటలన్నా సమాచారమన్నా హృదయగీతికలు ఆలపించే సంకల్పసిద్ధి, నైతిక సంపత్తి కావాలి. అది ఆయన సొత్తేగనుక, ఏశక్తి ఆయన్ని అడ్డుకోలేదు.

రంగాజీకిగూడా అట్లు విశ్వాసం ఉన్నట్లు వ్యక్తంగా లేదు. ఈ సందర్భమున రంగాజీని పరామర్శ చేసినట్టామని నిడుబ్రోలు వెళ్ళాను. అంతకు కొద్దికాలక్రితమే రంగాజీ అమెరికా పర్యటన చేసి వచ్చారు.

భవిష్యత్ రాజకీయాలేమిటి? ఏ కార్యక్రమంమీద రైతు ప్రజాభిమానాన్ని సంఘటిత పరచాలి? వారి ప్రత్యేక నినాదం, ఉద్యమం ఎలా ఉండాలి? వారి గమ్యస్థానం ఏమిటి? అని నా ప్రశ్న పరంపరలతో ఆయనలోని ఆలోచనలన్ని కదిలించాను.

"మన దేశ రాజకీయాల్లో రైతువర్గానికి ప్రత్యేకస్థానం వుంది. ఉండితీరాలి. ఆర్థిక సమస్యలపై సంఘటిత రాజకీయ నాయకత్వం సృష్టించాలి. వీరికి సన్నిహితులైన వ్యవసాయకూలి, చేనేత, యితర చేతివృత్తులవారూ, గ్రామీణ ప్రజలూ సామరస్య సూత్రంపై ఎప్పటికైనా సమీకరించబడతారు. సమీకరించాలి. ఆ విశ్వాసంతోనే నేను పాతిక సంవత్సరాలుగా పనిచేస్తున్నాను".

"నేటి కల్లోలిత రాజకీయ వాతావరణంలో రైతులు పెడదార్లు పట్టినమాట నిజం. యిది తాత్కాలికమే! తిరిగి వారే ఆత్మవిమర్శన చేసుకొంటారు. ఒక గొడుగుక్రింద సంఘటితమౌతారు. చైతన్యవంతులై శాస్త్రీయ బాటను పయనం చేస్తారు. వారిలో అప్పుడు వర్గచైతన్యం కలుగుతుంది. అప్పుడు తీర్చిదిద్దిన బలీయమైన రైతు ఉద్యమ ప్రాకారాలు ఏర్పడుతవి. భారత రాజకీయాల్లో వారి స్థానం ప్రధానమైనదిగా, ప్రముఖంగా భాసిల్లుతుంది".

"నాడు రైతు సమాఖ్యకు ఒక ప్రణాళిక రూపొందుతుంది. మన ప్రణాళికలోని హెచ్చుభాగం, అధికారంకోసం పోటీచేసే ఏ రాజకీయ పక్షం అంగీకరించితే వారితో ఒడంబడిక చేసుకొంటాం. శాసనసభా సీట్లు ఒడంబడికలో భాగంగా కొన్ని మన ప్రతినిధులకు సంపాదించుకొంటాం. మన అభ్యర్థులు లేనిచోట ఆ పార్టీ సభ్యున్ని బలపరుస్తాం. క్రమంగా మన ఎసెంబ్లీ బలంగూడా పెంచుకొంటాం" అని అన్నారు.

రైతుసమాఖ్య సంపూర్ణ అధికారం చేపట్టే అవకాశం, అద్యత భావిలో కనిపించుటలేదుగదా. ఏదైనా ఒక పార్టీకి ఒక అంగం గానే యీ రైతు సమాఖ్య ఉండాల్సిందేగదా, అన్న నాప్రశ్నకు 'అవును' అన్నారు. అదీ వారికి యిష్టంలేక, వేరే సమాధానంలేక అన్నమాట. రైతు సంపూర్ణాధికారం పొందలేదా ? అనే ఆశ్చర్య సంభ్రమాలు ఆయన సమాధానాలు చెప్పకనే చెప్పుతున్నాయి.

ఉదయం గడచింది. సాయంత్రం పొర్లింది. రాత్రి కనుపించ లేదు, మధ్యమధ్య భారతీదేవిగారు పాల్గొంటున్నారు. ఫలహారాలు అందించుతున్నారు. మరునాడు మధ్యాహ్నమైంది. యింతకాలం రంగాజీతో సుదీర్ఘ చర్చలు జరిగెనా అనిపించింది. పరామర్శ చేసి వెళ్ళుదామని వచ్చిన నాకు—రైతు సమస్యలలో చారిత్రక, రాజకీయ, ఆర్థిక విషయాలలోనిధి, నిష్ణాతుడు అయిన ఆచార్యునితో అనేక విషయాలపై సింహావలోకం జరిగింది. అది నాకు పర్వదినం. ఎన్నో నూతనానుభూతులు గలిగాయి. రైతుజనాళిని రక్షించుటకు కంకణం కట్టుకొన్న ఒక దివ్యజ్యోతిని ఆయన మూర్తిలో చూడగలిగాను. ఇంతకాలంగా, తాను నమ్మిన సర్వస్వంవొడ్డి సేవచేసిన రైతుజనం, తనన్నీ, తనపార్టీనీ వోడించి నామూషీపరచిన వాళ్ళు పొరబడ్డారని రంగాజీ విచారం వెలిబుచ్చారేగాని, కోపగించుకోలేదు. ఆయన వోటమిని స్వయంగా స్వీకరించనూలేదు. ఆయన ఉత్సాహం ఉపాధ్యాయధోరణి—వర్కర్లపట్ల శ్రద్ధ—రైతు సమస్యలపట్ల తీరని ఆలోచన, విశ్వాసం, అపారం అంతులేనిది !

యీ చర్చలు 1952 సగంలో జరిగాయి. అప్పటికిసరిగ్గా పదిహేనుసంవత్సరాలనాటి రంగాజీతో ప్రథమ పరిచయరోజులు జ్ఞప్తికివచ్చాయి. అప్పుడు 'గోభూమి' ఒక పెంకుటి పాకా, మిగిలింది పశువులకొష్టం, మధ్యలో హాలు, ఒక చిన్నగది రంగాజీ భారతీదేవిగారల రహస్య మందిరాలు, చర్చావేదికలూ యివే! ఊరిబయటి పొలాలలో మోకాలులోతు బురదలో ఉండేది 'గోభూమి'. అక్క

రాలా గ్రామీణ రైతు అనిపించుకొనేవారు. విద్యార్థి యువజనోద్య మాలలో, జాతీయ సంరంభములో సైనికుల్లా తర్ఫీదు పొందుతున్న కాలం. మా ఉత్సాహానికి ఆలోచన్లకి అవధులులేవు, నాయకులతో పరిచయమంటే చెవి కోసుకొనేవారం. వారిమీది భక్తిశ్రద్ధలు చాలా విశిష్టమైనవి. ఆనాడు రంగాజీ రైతు, విద్యార్థి, యువజన రంగాలకు ఏకైక నాయకులు. అతివాద వర్గంలో తిరుగులేని నాయకులు. వివిధ వామపక్ష ఐక్యతకు సూత్రధారి. ఈయన హాజరుకాని మహాసభలు, ఉపన్యసించని వేదిక కళావిహీనంగా ఉండేది. అటువంటి మధురస్మృతులు యెన్నో ఈరోజు జ్ఞాపకం చేసుకొన్నాను.

మా తండ్రి పోలీసు ఉద్యోగి. నేను ఒక్కడనే పుత్రుడను. దేశభక్తి, రాజకీయాలు నన్ను ఆకర్షించాయి. ప్రజాసేవనే నూతన జీవితానికి రంగాజీ, భారతదేవిలు నన్ను ఆహ్వానించారు. ఆశీర్వదించారు. ఆనాటి రైతు సేవకులంతా మద్దతిచ్చారు. సర్వానికి కర్తలయ్యారు. వీరి చల్లని ప్రేమాశీస్సులు నావంటి ఎందరో యువజన జీవితాలకు నూతన వెలుగును ప్రసాదించాయి.

ఈనాటి అధికార రాజకీయాలు నాయకుల విలువలను, వ్యక్తి విలువలను తారుమారు చేశాయి. ఆలోచనలే తలక్రిందైనాయి. మంచి చెడూ విడదీసి గ్రహించటమే దుస్సాధ్యంగా కనుపించుతూంది. దేశ భవిష్యత్తును చక్కదిద్దవలసిన యువకులు ఈ తికమకలనుండి విడిపడి పనిచేయాలి.

మరొక మరపురాని సంఘటన. రంగాజీ పార్లమెంటు ఎన్నికల్లో 1957లో పనిచేశాను. ప్రజాసోషలిస్టు పార్టీని వదలిపెట్టాను. తిరిగి ఆయన ఆలోచన్లు పంచుకో సాగాను. ఒక సంవత్సరం దొర్లింది. ఆయన అనుయాయులని చెప్పబడే మిత్రులు శాసనసభా నాయకులు, అధికార కాంగ్రెసువర్గంలో హైకమాండుతో దాగుడు మూతలు ఆడుతున్నారు. శ్రీ సంజీవరెడ్డి సనేమని దూరంగా ఉంచాడు. రంగాజీ వేరే ఆలోచనలో నిమగ్నమై ఉన్నాడు.

నెహ్రూజీ ప్రణాళికా మోజు, సోవియట్ సౌహార్ధం, సహకార వ్యవసాయానికి దారితీసింది. రైతు స్వాతంత్ర్యాన్ని హరించి-ఉద్యోగులకు ప్రభుత్వ యంత్రాంగానికి శాశ్వత బానిసల్ని చేస్తుంది. రాష్ట్రంలో, కేంద్రంలో స్టీము రోలరు మెజారిటీతో కాంగ్రెసు పరిపాలన సాగిస్తోంది. రైతు ప్రజానీకం నిద్రాణమై వుంది. రైతుల్ని యీ ప్రమాదంనుండి తప్పించే దెలా? ఉపయుక్తంగా ఉండవలసిన తన అనుచరులు ఆశతో అధికారంకోసం కాంగ్రెసుతో దాగుడు మూత లాడుతున్నారు. ఏమిచెయ్యాలి? కాంగ్రెసును, నెహ్రూను ఎదిరించి రైతుల ప్రమాదం తప్పించుటకు తనశక్తి ఒక్కటే చాలదు. రంగాజీలో ఆందోళన రోజురోజుకు అధికమవుతోంది. ఢిల్లీలో, నిడుబ్రోలులో పుస్తకాలు వ్రాసుకొంటూ ఆవేదనతో కాలం దొర్లించుతున్నాడు. మనశ్శాంతి లేదు.

ఆయన చెప్పేది న్యాయమైన మార్గం. పరిస్థితులు వ్యతిరేకంగా బలీయంగా ఉన్నాయి. అయినా ఆయన ప్రవాహానికి ఎదురీద నిశ్చయించుకొన్నాడు. గొంతుకలో ఊపిరున్నంతవరకూ తన పొలికేక వేయదలచాడు. బలమైనది ప్రవాహం. కారు చీకట్లు, దారి తెన్నూ అస్పష్టం. ఏమైనాసరే నేను ఆహుతి అగుటకు నిశ్చయించుకున్నాను. నన్ను నమ్ముకున్నవారి పనైనా అంతే! సమిష్టి వ్యవసాయం పేరుతో తన కబంధహస్తాన్ని రైతుల కుత్తుకలపై బెట్టదలచిన నెహ్రూవిధానాన్ని నేను ఎదిరించి తీరుతానని-గంటల తరబడి, రోజుల తరబడి అనేకరీతుల ముచ్చటించ దొడగారు.

రైతుల మందబుద్ధి ఒక్కొక్కప్పుడు ఆయనకు విసుగు పుట్టించేది. "సహకార వ్యవసాయం అమలు జరిపిన పది, పదిహేను సంవత్సరాల తరువాతైనా రైతు జనావళి తిరుగుబాటు తథ్యం. మనం వ్రాసిన గ్రంథాలు చేసిన హెచ్చరికలు వేదవాక్కులుగా అప్పుడు పరిగణిస్తారు. అప్పుడుగాని మనల్ని ఒక నాయకుడుగా కీర్తించుకొంటారు. మన జీవిత తదనంతరమైనా రైతుల్లో యీ జాగృతి మేలుకొలుపు తప్పదు." అని మందహాసం చేసేవారు. తన మేలుకోసమైనా

అన్యాయానికి తలవొగ్గి, స్వార్థంతో ప్రాకులాడుదాం అనే నిరుత్సాహ ధోరణి రవంతైనా కనిపించేది గాదు.

కాలం కలసివచ్చింది. సహకార వ్యవసాయానికి వ్యతిరేకంగా యీాయన వేసిన పొలికేక అనతికాలంలో దేశంలోని నాయకులు అందుకొన్నారు. అది దశదిశలా ప్రతిధ్వనించింది. రాజాజీలాంటి ప్రజ్ఞాశాలి మేధాసంపన్నుడు యీాయనను ఆశీర్వదించాడు. రైతుల రక్షణ, ప్రజాస్వామ్య స్వాతంత్ర్య రక్షణ కల్పించే నిమిత్తం అఖిల భారత స్వతంత్రపార్టీ నిర్మాణం చేశారు. యీా పార్టీకి అధ్యక్షు లయ్యారు.

రంగాజీ ఒక వ్యక్తి కాదు. ఒక మహావ్యవస్థ. రైతుజనుల ఆశా జ్యోతి. ఆయన జీవిత చరిత్ర రైతుఉద్యమ చరిత్ర. తన జీవితాన్ని కర్షక శ్రేయస్సాధనకు అంకితంచేసిన ధన్యజీవి. ఆయన అత్యున్నత ఆశయాలుగా, విశిష్టలక్ష్యాలుగా అనతికాలంలోనే సఫలంకాగలవని మా అందరి ఆశ, విశ్వాసమూను.

# ఎప్పుడూ చెప్పిందే చేస్తున్నారు

## శ్రీ దామెర్ల రమాకాంతరావు

ఆచార్య రంగాగారంటే మాకు గురుభావం. నేను కాలేజీవదలి రాజకీయాలలో ప్రవేశించినపుడు ఆచార్య రంగాయే నాకు మొట్ట మొదటి అవకాశం కల్పించింది. అప్పటికే ఆయన చేనేత పరిశ్రమను గూర్చి పరిశోధన చేశాడు. బిల్ పుస్తకంకూడా వ్రాశాడు. అందులో ఆనాడు ఆయన ఏమిచెప్పాడో ఇప్పుడూ అదే చేయడం జరుగుతుంది. ఆయన ఏమిభావిస్తాడో అది చేస్తాడు. ఆయనలో ఆలోచనకు కార్యాచరణకు సన్నిహిత సంబంధం. ఆయన చేనేతవారికి ఒక సంఘాన్ని నిర్మించాలనుకున్నాడు. అచ్చటచ్చట చేనేతవారి సభలు జరిపించాడు. నిడుబ్రోలులో జరిగిన చేనేతవారి సభకు నేను వెళ్ళాను. నేను చిన్న వాడినైనా నన్ను ఎంతో ఆదరంతో చూచారాయన. నాకొక 'రత్నం' దొరికిందని ఆయన నన్ను హృదయానికి హత్తుకున్నాడు. ఆవిధంగా రాజకీయాలలోకి యువకులను ఆహ్వానించే రాజకీయ నాయకులు అరుదుకాదా?

అప్పటికి ఆయనకు ఎర్రజెండాపై అభిమానం ఉన్నది. జాతీయ జెండాతోపాటు ఎర్రజెండా కూడా ఆయనవున్న సభలలో ఎగురుతూ వుండేది. తర్వాత ఎర్రజెండాపై అభిమానంపోయి విరోధభావం ఏర్పడింది.

అప్పటి ఉత్సాహం, ధైర్యం, సాహసం, త్యాగనిరతి—ఈ నాడు ఊహించుకుంటూంటే అదొక ఊహాస్వప్నంలాగా గోచరిస్తూ వుంటుంది.

ఆనాటి స్వాతంత్ర్య ఉద్యమం అందరిని ఊగిసలాడించింది. అందరికంటే రంగాగారిని ఎక్కువగా కదలించింది. ఆయనొక తుఫాను లాగా రాజకీయరంగంలోకి వచ్చారు. అన్ని రంగాలలోను రంగాగారే కన్పించారు. అనేక సంఘాలు వెలిసాయి. ఆ తుఫాను అనేక పాయలుగా చీలి అనేక రంగాలను ఉజ్జీవపరచింది.

రంగాజీ రైతుకుటుంబంలో పుట్టినవాడు. పాశ్చాత్య సంస్కారం సంపాదించినాడు. కాని ఆయన రైతుగానే వుండిపోయినాడు. ఆయనలో ఇప్పటికీ రైతుభావాలే. ఆయన వామపక్షీయుడుగా వున్నా, కాంగ్రెస్ వాదిగా ఉన్నా ఆయన ఈ రాజకీయ పక్షాలన్నిటిని తన రైతు దృష్టితోనే చూచాడు. తాను చిత్రించుకున్న రైతుకు ఆపక్షాలు విరుద్ధంగావున్నవని తాను తలచినపుడు తన దారిని తానుపోతాడు.

ఆయన రాజకీయమంత్రం—రైతు, కూలీ, ప్రజారాజ్యం. ఈ మంత్రాన్ని గాంధిజీయే తనకు అందిచ్చినాడని రంగాజీ అంటాడు. ఈ మంత్రంలో ప్రధానమైనది; రైతురాజ్యం. ఈదేశంలో రైతును పునాదిగా రాజ్యాన్ని నిర్మించాలని ఆయన ఆశయం.

గ్రామీణ జీవితంలో రైతు సూర్యుడువంటివాడు. ఆ సూర్యుని చుట్టూ వున్న ఉపగ్రహాలు—మిగిలిన చేతి వృత్తుల వారందరూను. కనుక ఆచార్యరంగాగారికి చేతి వృత్తులవారు సన్నిహితులు. రైతులుగాని, చేతివృత్తులవారుగాని కార్మికులవలె యజమానులక్రింద పని చేసెడివారు కారు.

వారు సర్వస్వతంత్రులు. వ్యక్తిస్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో వుంటారు. తమబుద్ధి బలాన్ని ఉపయోగించి తాము జీవించగలరు. రంగా ఈస్వతంత్ర జీవులనుచూచి సంతోషిస్తారు. వారిని ఆనందంతో ఆహ్వానిస్తారు. భావి భారత దేశం ఇటువంటి సర్వస్వతంత్రులైన ప్రజలతో నిండిపోవాలని ఆయన ఆశయం.

ఆయన ప్రతిభ బహుముఖమైనది. ఆయన వ్యాపకము అనేక రంగాలలో. ఏదో ఒక రంగములోనే వుండి, అందులోనే రాణించిన వారు అనేకమంది వున్నారు. రంగా అట్లుకాదు. పలురంగాలలో పలువురు వ్యక్తులను రాణింపచేటట్లు చేసినాడు. ఆయన ఏకైక నాయకుడుగా వుండుటకు ప్రయత్నించ లేదు. అనేక నాయకులకు సృష్టికర్తగా మాత్రమేవుండి తనసృష్టిని చూచుకుంటూ తాను సంతోషించినాడు.

ఆయనకు ఎవరిమీదను ఈర్ష్య లేదు. ఎవరినీ అమర్యాదగా మాట్లాడడు. ఎవరినీ నిర్లక్ష్యము చేయడు. ఎవరినీ కించపరచడు. అంతటి ఉదాత్తమైన హృదయము కలవారు అరుదు.

# వారు రైతులకు పెట్టిన భిక్ష

## శ్రీ నాదెళ్ల భవానీశంకర్

1959 సంవత్సరం మార్చి నెలనుకుంటాను. ఆంధ్ర రాజకీయాలకు పుట్టినిల్లయిన విజయవాడ పట్టణం రాజకీయ వేసవులతో భగ భగ మండిపోతోంది. సాయం సమయం. కిసాన్ సమ్మేళన్ కార్యాలయంలో రైతునాయకులందరు కూర్చొని ఉన్నారు. వారికి కొంచెం దూరంలో నేనూ కూర్చొని వారి నందరను పరిశీలిస్తున్నాను. వారి ముఖాల్లో నైరాశ్యం, నిర్వీర్యం తొంగి చూస్తున్నాయి. వేరొక భావం గూడా వారిలో వ్యక్తమవుతోంది. ఏమని? పూజ్య రంగాజీ కొద్ది సేపట్లో వస్తారని, వారున్నంతవరకు మనకు లోటురాదని, వారి యాశ అడియాశ కాగూడదు. అదుగో! పూజ్య రంగాజీ రానే వచ్చారు. అందరూ లేచి వందనము లర్పించి కూర్చున్నారు. రైతుల వలెనే రంగాజీ వదనంగూడా వెలవెల బోవడం చూచాను. ఏమిది? మున్నెన్నడూ కని విని యెరుగని వింత ఏమైనా జరిగిందా? రంగాజీ మాట్లాడుతున్నారు. ''జమీనురైతు'' ఉద్యమంలో తమకు కుడి భుజంగా పనిచేసిన శ్రీ నెల్లూరి వెంకట్రామానాయుడుగారి మరణ వార్త వారి కప్పుడే అందిందట. అందరమూ విచారం వెలిబుచ్చాము. శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు వారి దేశసేవను గురించి మాకు వివరించారు. శ్రీ వెంకట్రామానాయుడుగారి మనశ్శాంతికి గాను శ్రద్ధాంజలి సమర్పించాము.

రాజకీయ చర్చలు ప్రారంభమయ్యాయి. సహకార వ్యవసాయం అమలు జరుపడంలో కాంగ్రెసువారి పట్టుదలను గురించి రంగాజీ మా అందరకు వివరించారు. దానిని వ్యతిరేకించుచున్న రంగాజీ పార్లమెంటులో చేసిన ప్రసంగాలు మేము వార్తా పత్రికలలో చదివియే యున్నాము. దీని విషయమై మనము కాంగ్రెసునుండి

బయటపడి పనిచేయడమా! లేక కాంగ్రెసులోనుండియే వ్యతిరేకించడమా! అనే ప్రశ్న మాముందుంచారు. ఒక్కొకరిదే అభిప్రాయం అడుగుతున్నారు. ఒకరు కాంగ్రెసులో ఉండి సహకార వ్యవసాయం రాకుండా చూడాలని, ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసులో ఉంటూ మనం వారిని ఢీకొనగలమా అని తలకొక రకంగా సమాధానం చెప్తూవచ్చారు. వింటూ కూర్చున్నాను. వారు మాటల్లో తెగింపులేక నైరాశ్యం తాండవిస్తోంది. ఏమిది? తుఫానులకు గూడా లొంగని రైతులు నేడు గడగడలాడి పోతున్నారే! రంగాగారి చూపుడువేలు నేను కూర్చున్నవేపు నిర్దేశించింది. మెదలకుండా కూర్చున్నాను. "నిన్నే నయ్యా" నా వేపు చూస్తూ రంగాగారు అన్నది. 'నన్నే' విస్తుపోయాను. పెద్దపెద్ద రైతునాయకుల నందరను సలహాలడిగిన రంగాగారు నన్నూ సలహా అడిగారు. హృదయం ఉప్పొంగిపోయింది. వేరొక పార్టీ స్థాపించి కాంగ్రెసును ఎదిరించడం చాలా అవసరమన్నాను. "నన్ను రంగులు మార్చేరంగా అంటున్నారయ్యా!" వారి మాటల్లోగల బాధ నాకర్థమయింది. సభ ముగించి వారు ఢిల్లీ వెళ్ళిపోయారు.

నేను తిరిగి యింటికివస్తూ ఆలోచించు కుంటున్నాను. ఏమిటి రంగాజీ యింత భయపడి పోతున్నారు. వారిలో రాజకీయ చైతన్యం కుంటువడి పోతోందా! అట్లు జరుగరాదు. జరిగితే భారత దేశంలో రైతు వ్యవస్థ ఎంతోకాలం మనజాలదు. అప్పటికి కొన్నివారాల ముందు రంగా అనుయాయులు డెమాక్రటిక్ పార్టీ స్థాపించారుగదా! రంగాజీ ఆపార్టీలో చేరి కాంగ్రెసు నెదిరించగూడదా! ఒకవేళ రంగాజీ వేరొక పార్టీ పెడితే డెమాక్రటిక్ పార్టీ స్థాపించిన వారి అనుయాయులు దానిలో చేరుతారా? నేనే ఇంత ఆలోచనచేసి బాధపడుతూంటే రంగాజీ ఎంత బాధపడుతున్నారోమరి అని, అనిపించింది.

రంగాజీతో అప్పటివరకూ పరిచయం లేకపోయినా వారిని 1948 వ సం॥ రము దగ్గరనుండీ నే నెరుగుదును. కమ్యూనిస్టుల

దార్ఢ్యపూరిత పోరాటాన్నెదుర్కొనుటకుగాను సేవాదళములను స్థాపించి రాష్ట్రమంతటా శాంతిభద్రతలు నెలకొల్పారు. సేవాదళాలు అలనాటి బోసుబాబు అజాద్ హింద్ ఫౌజును జ్ఞప్తికి తెస్తూండేవి. అప్పటికి నేను చాలా చిన్నవాడి నయినా సేవాదళాల్లో నాకూ కొద్ది పాత్ర ఉండేది. ఎంత చక్కని యుద్ధ తంత్రాలు నేర్పబడ్డాయి! ప్రజలకెంత సేవ చేశాయి! రంగాజీ నిర్మాణాత్మక దృక్పథం వీటితో బయలుపడింది.

కమ్యూనిష్టుల హడావిడి తగ్గిపోయింది. 1952 లో ఎన్నికలు వచ్చాయి. ఈలోపలే కాంగ్రెసులో కొంత కుళ్ళు బయలుదేరింది. స్వార్థపరులంటే గిట్టనిరంగాజీ కాంగ్రెసునుండిబయటపడి కృషిక్ లోక్ పార్టీ స్థాపించారు. ఎన్నికలలో కాంగ్రెసు కెదురు నిలబడి తమబలం నిరూపించాలనుకున్నారు. కాంగ్రెసువారు కాళ్ళబేరానికొచ్చి మిశ్రమ మంత్రివర్గాన్నేర్పరచారు. కాంగ్రెసులోని విషశక్తులు మరల ఏదో చేదామనుకున్నాయి. ఫలితం లచ్చన్న విశ్వాసరాహిత్య తీర్మానం. కాంగ్రెసుసౌధం కూలిపోయింది. మరల 1955లో ఎన్నికలొచ్చాయి. కాంగ్రెసులోని బడానాయకులందరు రంగాజీని చుట్టుముట్టారు. ప్రజా స్వామ్య రక్షణకై తమతో చేతులు కలుపమన్నారు. రంగాజీ పరిస్థితి నర్థంచేసుకొని ఒప్పుకున్నారు. ఎన్నికల పొత్తు కుదుర్చుకున్నారు. అవిరామంగాకృషిచేసి ఐక్యకాంగ్రెసును గెలిపించారు. తరువాత కొద్ది రోజులలోనే కాంగ్రెసులో చేరిపోయారు. వారి విశిష్టత నర్థంచేసుకో లేని విషశక్తులు మరల విజృంభించాయి. రంగావర్గాన్ని సమూలంగా నాశనంచేయాలని వారి ప్రతిజ్ఞ. పోరాటం ప్రారంభమయ్యింది. దాని పరిణామమే డెమాక్రటిక్ పార్టీ. సహకార వ్యవసాయం అమలు జరుపటానికి నెహ్రూపండితుని తహతహ. పార్లమెంటులో నెహ్రూతో రంగాజీ, మసానీ సవాళ్ళు ఫలితానికి వేచియుండాలి. ధర్మం జయి స్తుందా! కలియుగ మనిపించుకుంటుందా!

కాలచక్రం తిరుగుతునే ఉంది. ఈలోగా ఆంధ్ర రాజకీయా లలో ఎన్నో మార్పులు డెమాక్రటిక్ పార్టీ సోషలిస్టు డెమాక్రటిక్

పార్టీగా రూపొందింది. తెనాలిసభలో రసాభాసయింది. దానికిక భవిష్యత్తు లేదనేది తేలిపోయింది. రాజకీయ చైతన్యత తగ్గిపోయింది. వార్తాపత్రికలు విస్తారంగా ఉంటున్నాయి.

1959 జూన్ 4వ తేదీ మహా పర్వదినం. హిందూదేశ చరిత్రలో మరొక శకం ఆరంభమయ్యింది. స్వతంత్రపార్టీ అవతరించింది. రైతు లోకముపాలిట కల్పతరువు మొలకెత్తింది. రైతుల కననేల స్వయంవృత్తుల వారందరకు రంగాజీ, రాజాజీలు కలసి ఆ కల్పతరువు నాటారు. ఆగష్టు 1, 2 తేదీలలో పార్టీసిద్ధాంతాలను రూపొందించుటకుగాను బొంబాయిలో సభ లేర్పాటు చేశారు. సభలకు నేనూ హాజరయ్యాను. జయప్రదంగా జరిగాయి. హిందూదేశమంతటా చైతన్యం గలిగింది. కాంగ్రెసు గుండెల్లో బెదురు పుట్టింది. తరువాత కొద్దిరోజులలోనే పార్టీ అన్ని రాష్ట్రాలలోనూ బలపడింది. ఆంధ్రలోని సోషలిస్టు డెమాక్రటిక్ పార్టీలోని రంగా అనుచరులందరు స్వతంత్ర పార్టీలో చేరిపోయారు. పార్టీ శరవేగంతో ప్రజల హృదయాంతరాళాల్లోకి చొచ్చుకు పోతోంది.

ఇదంతా రంగాజీ రైతులకు పెట్టిన భిక్ష. రైతు లెప్పటికి రంగాజీని మరువజాలరు. కొందరు స్వార్థపరులు రంగాజీని వదలిపోయినా రంగాజీ ఉన్నతికేమియు లోటురాదు. ఒక వేళ వారు రంగాజీకి ప్రతిపక్షంలో ఉన్నావారి ఆశయాలు రంగాజీ ఆశయాలుగానే ఉంటాయి. ఎలా అయినా ఇంగువకట్టిన గుడ్డగదా!

రంగాజీకి 60 సంవత్సరాలు వెళ్ళి 61వ సంవత్సరంలో అడుగు పెట్టారు. వారి షష్టిపూర్తి ఆంధ్రప్రజల కభిమానదాయకం. ఆంధ్ర మాత ముద్దుబిడ్డ. విశ్వసంచారి. అనన్య రాజకీయవేత్త. బహుముఖ గ్రంథకర్త. నిరాడంబర జీవి. రంగాజీ చిరకాలం జీవించి మా అందరకు నాయకుడై మమ్ములను జ్ఞానవంతులను చేయాలని నేను కాంక్షిస్తున్నాను.

# సాహిత్యరంగంలో రంగా

## శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

ఆచార్య రంగాను, ఆచార్యునిగా, ఆర్థిక వేత్తగా, దేశభక్తునిగా, కర్షకోద్యమ నిర్మాతగా. మహావక్తగా ఎన్నోవిధాల ఎంచుతారు.

అయినా ఆయనను, సాహిత్యారాధకునిగా ఎరిగిన వారెందరున్నారు. ఆయన ఒక గ్రంథద్రష్టే కాదు, బహుగ్రంథస్రష్ట. కవితాపోషకుడు. పెక్కు కవులకు కనకాభిషేకం చేసిన భాగ్యశాలి.

అందుచేతనే అన్నాడు అభినవ తిక్కన:—

"నిను దేశభక్తుగా మె
చ్చిన వారలు కలరు మహి నశేష ప్రజ నీ
వొనరించిన భాషాసే
వ నెఱింగినవార లెన్ని వందలు కలరో?"

ఆయన భాషాసేవ చేయుటయేకాదు, వేంకటశాస్త్రిగారివలె కవనార్థంబుదయించకపోయినా, కవియై పుట్టినవాడు రంగా.

ఆయన చందోబద్ధంగా కవిత్వం చెప్పకపోయినా, ఆయన పలుకే కవిత్వం. ఆయన జీవితమే ఒక రసకాండ. ఇదంతా కొందరకు ఆశ్చర్యం కలిగించవచ్చు, అసలు మన ఆంధ్రజాతి ప్రకృతి తెలుసుకొంటేనే గాని తెలియదు, ప్రపంచంలోనేమి, భారతభూమిలోనేమి ప్రతి జాతికి ఒక ప్రకృతి ఉంటుంది.

తమిళులకు కార్యదీక్షత, గుజరాతీయులకు వాణిజ్య మనః ప్రవృత్తి, మహారాష్ట్రులకు వీరత్వం, బెంగాలీలకు భావుకత, ఆంధ్రులకు నవ్యతవిశిష్టలక్షణాలు. ఆంధ్రజాతి ఉద్వేగపూరితమైన జాతి.

ఎల్లప్పుడు నవ్యత్వాన్ని కోరుతుంది. కనపడిన కొత్తదాన్ని చూచి, ఇంతలోనే అది పాతబడిపోయిందని పరిహసించి, మరొక కొత్తదాని కోసం పరాసుజాతివలె పరుగెత్తుతుంది. ఇదే మతంలోను, వాస్తుశిల్పం లోను పూర్వం జరిగింది.

భారతభూమిలోనే గాక, ప్రపంచంలోకూడా ఏ క్రొత్తది పుట్టినా తెలుగుగడ్డమీదకు రావలసిందే.

రాజకీయంగా, జస్టిస్ పార్టీ, అనంతరం సోషలిజం, కమ్యూనిజం, రేడికలిజమ్, ఫార్వర్డుబ్లాకు ఆంధ్రజాతిలో వ్యాపించినవి.

అట్లాగే మన సాహిత్యంలోకూడ ప్రపంచంలో పుట్టిన ప్రతి పద్ధతి మన కవులూ స్వీకరించారు. ప్రథమంగా రొమాంటిసిజం, అభ్యుదయ కవిత్వం, సర్రియలిజం, ఖ్లాంకువర్సు, ఫ్రీవర్సు.

ఈనవ్యతే మనది కవులజాతిగా రూపొందడానికి కారణం. తమిళులు గాయకులు. మళయాళీలు నాట్యనిపుణులు. ఆంధ్రులు అచ్చంగా కవులు. కవితలో కొత్తపోకడలు పోవుటలో మనకు మించిన వారు లేరు.

ప్రపంచమంతా లయబద్ధం. ఈ సంగతి ఆంధ్రులు గమనించినట్లు అన్యులు గ్రహించివుండరంటే అతిశయోక్తి గాదు. ఎందుచేతనంటే మన సాహిత్యమేగాదు, మనజీవితమే లయబద్ధం. మన మాటలన్ని లయబద్ధాలే. మన సామెతలే సాదృశ్యం. మన సామెతలే గాదు, మన మాటల్లోకూడా యతిప్రాసలధికంగా అప్రయత్నంగా వుంటాయి.

ఆంధ్రులు అలంకారశాస్త్రాన్ని గాని, వ్యాకరణాన్ని గాని ఎన్నడూ పాటించలేదు శ్రద్ధతో. వారు పాటించిందల్లా ఛందస్సు. అందుచేతనే ఛందస్సును గురించి అనేక గ్రంథాలు రచించారు.

సంస్కృత సంప్రదాయాన్ని పాటించినా, సంస్కృతంలో లేని యతిప్రాసలను మనం తెచ్చుకున్నాం.

వేయేల? పాశ్చాత్య, ప్రాచ్యభాషల్లోని కవితలో ఎక్కడా లేనంత ఛందో వైవిధ్యం మన తెలుగులో వుంది.

ఇది తెలుగువారు కేవలం కవులనటానికి మరొక నిదర్శనం.

శబ్దంమీద మనకున్నంత మోజు మరెవ్వారికీ లేదు. శబ్దాలంకారాలకు ఆంధ్రులు చెవికోసుకుంటారు, ఆంధ్రులకు భాగవతం అంతఇష్టం ఇందుకే.

నియమపాలనమనేది మనకు సంబంధించినకాదు. స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు మనకు జన్మతః వచ్చినవి. నిర్లక్ష్యమే మన లక్ష్యం.

వాస్తవికత మన దృక్పథంకాదు. అందుచేత బెంగాలీలవలె కలలు కనడమే మన జాతిలక్షణం. కనుకనే రాజకీయాల్లోను, వ్యాపార వాణిజ్యాల్లోను, పరిశ్రమల్లోను, మనం రాణించలేదు.

వాస్తవానికి భిన్నంగా చూడడమే మనజాతి లక్షణం. అందుచేతనే మనం కవులుగా రాణించకలుగుతున్నాం.

ఆంధ్రదేశంలో ఉన్నంత కవులు భారతదేశంలో ఏ ఇతర ప్రాంతంలోనులేరు. ఈ సంగతి కృష్ణశాస్త్రిగారిట్లా అన్నారు. "ఇప్పటి ఆంధ్రకవిత్వానికున్నంత వైవిధ్యం, సంపద మరి ఏ ఇతర రాష్ట్రకవిత్వానికి లేరని గట్టినమ్మకం. అసలు తెలుగునాటి సాహిత్య కేదారంలో కవిత్వపు పంట ఎప్పుడూ ఎక్కువే,"

ఈసంగతే ఆంధ్రులంతా కవులేనని పరిహాసంగా రాజాజీ అన్నాడు.

'మీ అంధ్రదేశంలో ప్రతివాడు కవిగానే కనపడతాడు.' అని హరినాంధ్రఛటోపాధ్యాయ్ వాస్తవంగా అన్నాడు.

"కొయ్య బొమ్మలను మెచ్చుకండ్లకు
కోమలులు సొ రెక్కునా?" —గురజాడ

లోకంలో పద్యం వ్రాసినవాడే కవి అని, గద్య రచయిత కవి కాడని సాధారణంగా అంటారు.

పద్యమంటే ఛందోబద్ధమైంది. ఛందోబద్ధమైనది కంఠస్థం చేయటానికి అవకాశమున్నది కనుక పూర్వకాలంలో ప్రతిదీ పద్యంలో వ్రాశారు. పద్యంలో చెప్పినంతమాత్రాన కావ్యంకాదు. ఆంధ్రనామ సంగ్రహం, లీలావతి గణితశాస్త్రం కావ్యాలని ఎవ్వరూ అనలేరు. అవి పద్యగ్రంథాలు. కనుక పద్యాలు చెప్పిన పద్యకర్త అవుతాడు గాని కవికాడు.

కాని పూర్వం గద్యం, పద్యం ఇంత విభేదంగా లేవు, గద్యంలో ఒకవిధమైన రీతి, గతి వుండేవి.

గురుతర పద్యకవితకు నన్నయ గురువైనట్లే, గద్యకవితకూ గురువు.

"గద్యం పద్యం చమిశ్రంచ కావ్యాదిత్రి విధంస్మృతమ్" గద్యము, పద్యము, గద్య పద్య మిశ్రమము అని కావ్యాలు ముత్తెరగు లన్నాడు పురాణ కర్త.

'A versifier can not be a poet, a poet may not be a versifier'.

"పద్యం వ్రాసినవాడు కవిగాడు. పద్యం వ్రాయనంతమాత్రాన కవికాకపోడు. కవి అంటే కవితాత్మ గలవాడు. పద్యం రాయనీ, రాయకపోనీ."—షెల్లీ.

'కవిత్వాన్ని నిర్వచించటం కష్టం; కాని కవిత్వాన్ని గుర్తించటం సులభం' అన్నాడు ఒక ఆంగ్ల విమర్శకుడు. కవిత్వం గణంలో లేదు, గుణములో ఉన్నదని గుర్తించాలి. 'రస సిద్ధాయః కవయః' రస సిద్ధులే కవులు.

పద్యరచన సులువు. రసవంతమైన వచనరచన చాలాకష్టం. కనుకనే "గద్యం కవనాం నికషంవదన్తి" గద్యం కవులకు ఒక పిడిరాయన్నారు.

మన ఆధునిక గద్యరచనలో అద్భుత కవితాకౌశలం చూప బూనిన కొద్దిరచయితల్లో చిన్నయసూరి, అనంతకృష్ణశర్మ, రామలింగారెడ్డి, శివరామశాస్త్రి, ముట్నూరి, బాపిరాజు, చలం, రంగా ప్రభృతులను చెప్పవచ్చును.

రంగాజీ గద్యకవితకు కొన్ని పసిడితునకలు—

"అందె సుబ్బారాయుడు ఆదర్శ శ్రమజీవి. ఆయన మా యింటి కొస్తే గో భూమి కొక సొంపు. భారతీదేవి కొక యింపు. నాకొక భావాల కెంపు యిచ్చిపోతాడు."—(వాహిని 22–1–1939)

"పల్కితినట పటుతరముగా! చెప్పితినట నూతన ధర్మాలను. ఆ గిల్డు సోషలిస్టు సిద్ధాంతముల, నిప్పితినట ధైర్యసాహసాలతో".

ఇట్లు క్రియపదం ముందుంచి 'పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట' మాదిరిగా పలుకను. పోతన ఆయన అభిమాన కవి. ఆయన భాగవతాన్ని బాగా చదివినవాడు. సందర్భానుసారంగా ఆయన రచనలను ఉదాహరిస్తాను. తెలుగు నుడికారము ఆయన సొమ్ము.

మనము మాట్లాడేది తెలుగుకాదు. తత్సమము, తద్భవ మాటలధికం. సంస్కృత శబ్దాలమీదవున్న మోజు తెలుగుమీద లేదు. కారణం, సంస్కృతం బాగాచదివినవారు తెలుగులో కవిత్వం చెప్పటమే. వైదికులు సంస్కృతంలోతప్ప తెలుగులో కవిత్వం చెప్ప లేరు. అసలు బ్రాహ్మణులకు తెలుగంటే శూద్రభాష. బువ్వంటే తప్పు, అన్నమనాలి. బువ్వేమిటిరా శూద్రునికివలె అంటారు. వారు అన్నంతినేటప్పుడు ఆంధ్రం ఉచ్చరించరాదు. ఉప్పు అనరాదు లవణం అనాలి. ఆవుపేడ గోమయం అనాలి. కొడుకుఅంటే తప్పు. కుమారుడనవలె. ఇట్లు సంస్కృత పదభూయిష్టం చేశారు తెలుగు భాషను. అందువల్ల అనేక తెలుగుశబ్దాలు లుప్తమై పోయినవి.

ఈనాటి రచయితలకు గ్రంథ రచనయందున్న అభిలాష, అర్హతా సంపాదనయందు లేదు. తెలుగువారమై యుండి తెలుగు నేర్చుకోవాలా? అన్న నిర్లక్ష్యమే అందుకు కారణం.

తెలుగు అనగా, తెలుగుమాటలు మాత్రంకావు. వాటి విన్యాసము, అన్వయము, దేశభక్తి, పలుకుబడి తెలుగుగా నుండుట.

ఆయన కేవలం గద్యరచయిత కాదు. ఆధునిక గద్య కవితా నిర్మాణానికి మెరుగులు దిద్దుతున్నవారిలో మేటి. ఆయన రచనలో తెలుగుదనము, కమ్మదనము కలిసి పసిడికి పరిమళ మబ్బినట్లుండును.

భావావిష్కరణంలో, వాక్యవిన్యాసంలో తెలుగుదనం తేజరిల్లుతుంది. తెలుగు వారకం తెలిసి వాక్యరచన చేయటంలో ఆయన ప్రతిభ అనన్యం.

తెలుగు నుడికారపు సొంపు ఆయన ఎరిగినంతగా ఎరిగినవారెందరో చెప్పటం కష్టం.

ఆయన పలుకుల పసందు, దానిని మించిన మనస్సు మంచితనం, ఆయనను మంచి కవిగా చేసినవి.

ఆయన సాహిత్య సంపదనుగురించి. ఆత్మార్పణము గావించి 'ధర్మజ్యోతి' వెలిగించి 'రాష్ట్రగానము,' ఉదయగానముచేసి 'ఆత్మకథ' అల్లి తపస్సిద్ధి గాంచిన గాంధీ ఆస్థానకవి, అభినవ తిక్కన ప్రశంస పరిశీలించ తగినది:—

"చక్రవర్తుల ముత్యాలశాలలందు
నగ్రహారాల నడిబొడ్డులందు గులుకు
కవులు కనలేని తెలుగు చక్కదనమ్ము
చూరలాడిన శారదాసుతుడవీవు."

"పల్లెటూరంబుట్టి పల్లెల సేవించి
బీదవారికులము పేదవారి
పలుకు గుబ్బెతింగి పసగల జాతీయ
రచనలు చేయు సుకవి రాజువీవు.

"తెలుఁగు నుడికారమందున్న మెలపు నెఱిఁగి
తెలుఁగు హృదయంబునందున్న తీపి నెఱిఁగి
తెలుగు సంస్కృతియందున్న చెలువ మెఱిఁగి
తెలుఁగునకు నీవు సరిక్రొత్త వెలుఁగు లిడితి."

ఆంధ్ర దేశంలో పత్రికలు ప్రజావార్తలకు రైతుల కష్టనష్టాలకు, వారి బాగోగులకు తగువిధంగా ఉపకరించటం లేదని భావించి ఆయన వాహిని, గోభూమి, క్రాంతి పత్రికలను స్థాపించి పత్రికా ప్రపంచంలో మార్పు తెచ్చాడు. అనేక యువకులను ప్రోత్సహించి రచయితలుగా చేశాడు.

మన సాహిత్యంలో కష్టజీవులను గురించిన కథలు లేనే లేవు. రాజులు, రాణులు, గంధర్వాంగనలు, కల్పిత మానవులు కావలసినంత మంది వున్నారు.

మహాత్ముడు గుజరాతీ రచయితలకు ఒక సలహా ఇచ్చాడు. వారు ఊహాగానం చేయక, రైతు జీవితానికి సంబంధించిన సాహిత్యాన్ని సృష్టిస్తూ, వారి ఆలోచనలు పవిత్రమగునట్లునూ, వారి సంపద పెంపొందునట్లు ప్రయత్నిస్తూ, సజీవమగు భాషలో వారికి పాటలు, పదాలు, రచించి అభివృద్ధి పంథాలోనికి తెమ్మని తెలిపారు.

రంగాగారు కోరేదీ ఇదే.

ఆయన రైతు గ్రంథమాలను నడిపించుటలో ఉద్దేశం, ఆంధ్ర కవులను ఆయన ఎట్లా ఆదరిస్తున్నది, ఆయన వాక్యాలను గమనించుదాం.

"నూతన సాహిత్యం కావాలంటున్నాం. దాన్ని ప్రసాదించే వారే అరుదగుచున్నారు. సృజియించిన వారిని గుర్తించువారంతకంటే కన్పించడంలేదు."

"ఎందుకీ నూతనపంథా? వినూత్న సాహిత్యం? ప్రజానీకపు జీవితాన్ని ఆశయాలను ప్రకటించడానికి! వానికి మెరుగు పెట్టుటకు!

జనసామాన్యానికి క్రొంగ్రొత్త భావ పరంపరలు, కార్యోత్సాహము, శక్తిసామర్థ్యాలను పురికొల్పుటకు.''

''రాజులు రాణులుగారు మనకు నాయకీ నాయకులుగా వుండ దగ్గవారు''.

''యీనాడు కష్టజీవులకథలు కావాలి! చెమట బిందువుల మాణిక్యంపు దధితులు ప్రకటించాలి! పొలములో భూమిపై పారాడు వారు, చేలల్లో చెరలాడువారు, బీళ్లల్లో గోమాతలకు తోడగువారు, డొంకలలో పచ్చిచొప్ప మోతల సంగీతాన్ని విరజిమ్మువారు, నదుల వెంట, కాల్వలప్రక్క, రాళ్లమధ్య, అడవులచెంత, పశుపక్ష్యాదుల కూరట కల్గించువారు, తోడి మానవులకు జీవితాశలను విజృంభింప చేయువారు, ఆ కోటానుకోట్ల క్రొలది సాధారణ ప్రజలు, కష్టించు కార్మిక కర్షకులు, అలసట నెరుగని బక్కజీవులు, సున్నితమగు జీవితాను భవ మెఱుగని సుతి మెత్తని హృదయాలవారు. ఈనాటి భావ కవులకు, నూతన రచయితలకు, జననాయకులకు, ప్రజాపాలకులకు, మహా ప్రపంచ గంధర్వులకు అర్హమగు నాయికా నాయకులు.''

''ఈ సత్యాన్ని మన ఆంధ్ర దేశపుకవులు, గాయకులు చాల నాళ్లనుండి గ్రహించిరి. 'గురజాడ' నుండి 'బసవరాజు' వరకు 'సాహితీ సమితి' నుండి 'విశ్వసాహిత్యమాల' వరకు 'రామిరెడ్డి' నుండి 'జాషువా' వరకు, 'శ్రీపల్లి' నుండి 'గొట్టిపాటి' వరకు 'చదల వాడ' నుండి 'నాగరాజు' వరకు 'వున్నవ' నుండి 'గరిమెళ్ల' వరకు యీ నవ్యభారత భావాలను వినూత్న కాంతుల విరజిమ్మ నూతన సాహిత్య సృష్టిలో ప్రకటించుచున్నారు. ఇందును భారత దేశమున ఆంధ్రకవి గాయకులదే ప్రథమ తాంబూలము.

''ఈ పంథాకు వడి, వేగము గన్పించుటకే 'రైతు గ్రంథమాల' ప్రథమపుష్పము' హరిజన నాయకుడు. ఈనాటికి ఆంధ్రులకు ఆదర్శ మగు వ్యక్తి. మనుష్యులలో 'సాహితీ ప్రపంచమాల' రెండవ పుష్పము. ఆంధ్రగ్రామ సీమలకు నూతన జీవకళల ప్రసాదించుచున్న

'రైతు భజనావళి' దాని 'సౌరభమాల' నానందించి యింకను ఆంధ్రులు తనవిజెందుటలేదు."

ఆకలి మంటలు పరిచయంనుండి.

మన భాషా సంప్రదాయాన్ని గమనిస్తే, ఇది గేయభాష అని తప్పక అందరూ తలలూపక మానరు. తనగీతి అరవజాతిని గాయకులుగ దిద్దినదని కవి అంటున్నాడు.

వాగ్గేయకారులగు త్యాగరాజు, దీక్షితులు ప్రభృతులు తెలుగులోనే గేయాలను రచించారు. అరవవారుకూడ కొందరు తెలుగులోనే గేయాలను రచించుట గమనింపతగినది. పాడేవారిని, వినేవారిని తన్మయం కలిగింపజేసేవి ఇవే. మన గేయాలు, లయబద్ధంగా వుండి, సంగీతంతో సన్నిహిత సంబంధం కలిగి ఉండటమేగాక, హర్ణ కవిత మాదిరి మూలాన్వయి, శబ్దాడంబరంలేక, తేట తెల్లంగా అందరకు అర్థమగును. అందుచేతనే ఇది ప్రజల పెన్నిధిగా పెరిగింది.

మార్గకవిత రాజకీయమై పెరిగితే దేశికవిత ప్రజాశ్రేయమై వర్ధిల్లింది. ప్రజల నిత్యజీవితం ఇందులోనే పరికించగలము.

ఈ సంగతి గ్రహించి మనరంగా అనేక కవులచే గేయాలను రచింపజేశాడు. వాటి నన్నిటిని 'రైతుభజనావళి' అను పేరుతో ప్రచురించాడు.

ఏ ఉద్యమసిద్ధికైనా సాధారణ ప్రజల కందుబాటులో వుండే మాటలు, పాటలు, గేయాలు అవసరం. ఆ అవసరం తీర్చటానికి రైతు భజనావళి 22-4-1934 న ప్రథమంగా ప్రచురణ అయ్యింది. అందులో గరిమెళ్ల సత్యనారాయణగారి 'అన్యాయకాలంబు దాపురించిందిపుడు, అందరము మేలుకోవాలండి' అనేది తలమానికము.

తర్వాత బయలుదేరాడు విప్లవకవి శెట్టిపల్లి. 'ఆగునా జీవాలు సాగునా లోకాలు, రాజుగా మనమెంచి రైతు గొల్వకపోతే' అని సవాలుచేస్తూ. "జయభేరి మ్రోగింప వో తెలుగురైతా, జయనామ

ముల బాడసాగిరమ్మింక' అని జయలక్ష్మిని సాక్షాత్కరింప చేయ సాగాడు.

అటుతరువాత వచ్చాడు వల్లమానిన ముసలాయన, ఈ దక్షిణా పథములో జమీందారి ఉద్యమయుగనిర్మాత నెల్లూరి వెంకట్రామా నాయుడు, 'మా కొద్దీ జమీందార్ల పొందు' అంటూ. ఈనినాదమే భారతావని అంతటా ప్రచారమై జమీందారీ విధానము రద్దుకు రాజబాట ఏర్పరచింది.

రైతాంగ భజనావళిలోని ఒక్కొక్క పాట పది ఉపన్యాసాల పెట్టు. ఇది దేశమంతట అంతులేని ప్రచారం చేసింది. 30 పేజీల నుండి 125 పుటలవరకు పెరిగింది. బుల్లిపదాలనుండి రణభేరివరకుపెరిగి ప్రఖ్యాతి గాంచింది. ఎన్నో ముద్రణలను గాంచింది. దీనినుండి ఎందరో గేయాలను వేరువేరుగా అచ్చొత్తించుకున్నారు.

ఇంతేకాదు, గోగినేని వెంకటసుబ్బయ్య 'బుర్రకథలవారు' 'చిట్టాల భజనసమాజము' వారు, దివితాలూకా 'బాందువారు,' 'హచ్చిన్నను' రికార్డులవారు, నానా ప్రచారకులు, రైతాంగ విద్యార్థులు, రైతురక్షకపాత్రదళమువారు, మూలమూలలకుకూడ తీసుకొని పోయారు.

"ఈ రైతాంగ మధుగుచ్ఛ మాధుర్యమును గాంచే" 'క్రాంతి గీతాలు' "కార్మిక భజనావళి" చేనేత భజనావళి" 'ఎన్నిక పాటలు' మొదలగునవి ఎన్నో బయలుదేరినవి.

రైతాంగ భజనావళిలోని కొన్ని గేయాలు దేశ విదేశ భాషల్లోకికూడా అనువదింపబడినవి. ఆంధ్రులకు అజరామరమైన కీర్తి ప్రతిష్టలు తెచ్చినది. కాంగ్రెసు కర్షకోద్యమాలకు అఖండ బల మిచ్చి యెన్నికలల్లో జస్టీసుపార్టీని చిత్తుచేసినవి.

'ఆకలిమంటలు' 'ఆంధ్రవిద్యార్థి' మొదలగు రచనలు ఈ రైతు గ్రంథమాలా సౌరభము లే.

నిత్యం నూతన పోకడలు పోవు ఆచార్య రంగాకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షపదవి (1946) అలంకరించిన అనంతరం సాహిత్యముద్వారాకూడా సేవచేయాలని అభిలషించారు.

అభ్యుదయకరమూ, విప్లవాత్మకము, జాతీయమునైన గాంధేయ సాహిత్యరచనకొరకు స్థాపింపబడినదే రాజకీయ విజ్ఞాన పరిషత్తు.

ఈపరిషత్తుద్వారా 'జాతీయ విజ్ఞానము' అనే సాహిత్య పత్రికను స్థాపించి తద్వారా సాహిత్యారాధన చేయ సంకల్పించి, ఆంధ్ర దేశమునందలి ప్రముఖ రచయితల వ్యాసములు సేకరించి ప్రచురించిరి. దాని సంపాదకుడు ఏటుకూరి వెంకటనరసయ్యగారు.

'దోయిలి పత్ర ఫలపుష్పతోయమైన
సీయనేరని దేశమందే విధాన
పుట్టగలరు, స్వతంత్రులౌ దిట్టకవులు
లేరు లేరంచు గినిసిన లేచిరారు,' —కవిరాజు.

ఆయన పర్యటనలో కనుపించిన కవులను ఆదరంతో పలకరిస్తూ ప్రోత్సాహమిస్తాడు. అమూల్యమైన సలహాలిస్తువుంటాడు. కొందరకు ఆర్థికంగా సహాయం చేయడంకూడాకద్దు. కవులను, వారి పుస్తకాలను చాలామందికి పరిచయం చేసారు. మహాసభలలోను పత్రికలలోను ప్రశంసిస్తూ ప్రోత్సాహమివ్వవలసిందని ప్రజలను కోరుతారు. ఇంతకంటే కావలసిందేమిటి?

సాహిత్యంలోగాని, సంఘంలోగాని, సానుభూతి లేకపోతే వ్యర్థం.

రంగాగారు అధికసానుభూతితో అనేక కవుల గ్రంథాలను చదివి పత్రికలలో ప్రచురించటం పత్రికా పాఠకులకు పరిచయమే.

ఏటుకూరి వెంకట నరసయ్య గారి సన్మాన సంచికలో వారు సాహితీ సమాలోచన చేశారు.

పైడిపాటి సుబ్బరామశాస్త్రి గీతాలను ఎంతో సానుభూతితో వాహిని ఆంధ్రప్రదేశ్ అవతరణ సంచికలో ప్రచురించారు. 'శ్రీమతి భారతిదేవితో ఒక ఆంధ్రయువతి "అమ్మా! మాటలే మంత్రాలు" అని చెప్పి వెళ్ళినారట. ఆనందడోలికలలో ఊగుతూ శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి 'గీతావళి' గానం చేస్తూవుంటే, పదేపదే ఆ మంచి మాట జ్ఞప్తికి వచ్చింది. ఈ గీతావళిలోని ఆలోచనలన్నీ ఎఱుకలో నున్నవే. యువహృదయాల్లో, ఉత్సాహపూరిత గళాల్లో, నవ్వులొలికే పెదవుల్లో యీనాడు కదలాడేవే. అయితే ఏం? సుబ్బరామ శాస్త్రి 'భారతికి' వినతిసేయుటలో హృదయాన్ని పాటలొలికించు కోవాలనే కుతూహలాన్ని నృత్యం చేయిస్తున్నై — వెలికి వస్తున్న యీ మణిమంత్రాలు. మనద్వారా జాతిని ఉత్క్రాంతగా నడిపిస్తున్నా మంటున్నై. ఈ పాటలతో మరల కాంతిచ్ఛాయలు మనలోని 'వీణెల' ను పలికిస్తున్నై. అనుక్షణమూ మన మనస్సులలో మెలగు చున్న కోరికల కెంతటి అందచందాలు వారు తీర్చి దిద్దిరో గమనిద్దాం," అంటూ వారి గేయాలను ఉదహరించి అందలి ఇంపుసొంపులను వీనులకు విందొనర్చునట్లుగా చెప్పి, చివరకు ఇట్లు ముగించారు. "ఇంతటి కమ్మని కవనాన్ని యీగీతావళి రూపంలో మన కందిస్తున్న శ్రీసుబ్బరామ కవీంద్రున కివే నా నమోవాకములు, శుభాశీస్సులు."

కవికి ఇంతకంటె మహద్భాగ్యం ఏం కావాలి!
రంగాజీ హృదయావిష్కరణ కింకా కావాలా పాఠకా?

"నవరసమ్ములు నాట్యమాడగ
చివురు పలుకుల చెవులు విందుగ
కవితలల్లె క్లాంత హృదయుల
గౌరవింపవె తుమ్మెదా!"

—రాయప్రోలు

రాజకీయాల్లో రాత్రింబవళ్ళు తేల్లాడే రంగాకు కవులతో సంబంధమేమిటి? వారిని సన్మానించడమేమిటని ఆశ్చర్యం కలగవచ్చు. అందుకు ఆయన సమాధానం.

"కవీశ్వరులు, రచయితల సహాయము, సహకారము, అమింతంగా కావలసియున్నది మన ప్రజోద్యమాలకు. అందులకే మహాత్ముడు, విశ్వకవి రవీంద్రుని అంతగా పూజించెడివారు. సరోజనీదేవిని అంతగా ప్రేమించెడి వారు." మాతృభూమి 3-4-1949.

అందుచేతనే రైతాంగ విద్యాలయమునందు 1935 నుండి కవి సన్మానం చేయజొచ్చిరి.

నిద్రాణమైన రైతాంగాన్ని మేలుకొల్పి సాయం చేయాలనే తలంపుతో 1938 లో ఆంధ్ర దేశములోని కర్షకకవులను సన్మానం చేసెను.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు దేశభక్తులైన, శ్రామిక ప్రజాభిమానులై సాంఘిక విప్లవమును సతురముగ నార్థించి నుత్సాహులైన, కవులను, గాయకులను, జాతీయాభిమానమనే సాధారణ ఐక్యతా వేదికపై చేర్చి, పరస్పరాభిమానం కల్గించి, పరస్పర భావపరిచయముల ద్వారా, భావ చేష్టల పొందికద్వారా, యెల్లెట్లో మన దేశాన్ని, ప్రజలను, సంఘమును అభివృద్ధి మార్గములో తీసుకొని వెళ్లుటకు వీలగునో ఆలోచన చేయుటకుగాను శ్రీయుత పెనుమచ్చ సత్యనారాయణరాజు గారి అధ్యక్షత క్రింద 1947 సెప్టెంబరు 10 తారీఖున మద్రాసులో అపూర్వముగా సభ జరిగినది. ఇందులో అనేక ప్రఖ్యాత కవులు, గాయకులు పాల్గొనుటతోపాటు సన్మానింపబడిరి.

అభినవ తిక్కన తుమ్మల సీతారామమూర్తిని నిడుబ్రోలులో 20 వేల కళాభిమానులు కనకాభిషేకం చేసిరి.

అందులో పాల్గొనిన ప్రముఖులలో ఆచార్యరంగా ప్రత్యేకత ప్రస్ఫుటమైనది. అందులో ప్రముఖపాత్ర ఆయనదే.

కవి గజారోహణముచేసి వూరేగుతూవుంటే, కవి యెడల గౌరవము సూచిస్తూ, ఆయన పాదచారియై ఆ ఉత్సవమునకు మరొక

శోభ కలిగించిన మనిషి మనరంగా. 'తపసిద్ధి'లో అభినవతిక్కన ఈ ఘట్టాన్ని ఇట్లా పేర్కొన్నాడు.

"రంగా యంతటివాడు రివ్వుమని చే
రన్వచ్చి యూరెల్ల మా
రంగ ప్రాగసరుండుగా వెలసి మ
త్కావ్య ప్రశంసల్ సభా
రంగంబెక్క వెలార్చి భూరి సుమనో
రాశిన్ ననున్ దేల్చి స
ర్వాంగణమ్మగు శోభ దెచ్చెను మద
యం బిమ్మహాలక్ష్మికిన్.
కడపన్ నిద్దుర లేచి హస్తిపురిలో
కాఫీని సేవించి చే
రెండురొట్టెన్ కెయిరో కడన్నమని, పా
రిస్ ఫ్రాంటకూ టింటిలో
గడుపున్నింపి హితోక్తులాడును ట్రుమన్
కన్పించు దర్బారులో
నిడుఁబ్రోవ సుతుఁ డెట్లొవచ్చె జననీ!
నీశక్తిఁ గాకుండినన్."

పలనాటి వీరభారత కర్త కవిబ్రహ్మ ఏటుకూరి వెంకటనర నరసయ్యగారిని సన్మానం గావించుటకై యెంతో పూనికతో ప్రయత్నం గావించిరి.

కాని మన దౌర్భాగ్యముచే, ఆకవి అకాలమరణము నొందెను. ఆయన దశాహమున జరిగిన సభకు అధ్యక్షతవహించి కవిబ్రహ్మ కవితా మాధుర్యాన్ని వేనోళ్ల ప్రస్తుతించి ఆయన స్మారక సంచిక ప్రకటించుటకు ఈ సాహిత్యారాధకుడు సూచించెను.

"కవితాపూజలు లేని దేశమున మౌర్ఖ్యం బుగ్రభేతాళతాం
డవ నృత్యం బొనరించు, మానవతయున్, నామావశిష్టంబగున్
కవిపూజా పరతంత్రమై నవయుగాంకంబైన మద్భారతం
బవతరించుత సత్యశాంతి సమతా బ్రాహ్మీస్వరూపంబునన్"

—జాషువ

వ్యాసాలమాదిరి, వచన రచనద్వారా వ్యక్తులను గురించి వ్రాయటం పదచిత్రమంటారు (Pen pictures). ఆంగ్లంలో ఇటువంటి పోకడకద్దు. ఇది మనకు నూతనమార్గం. ఈ పంథాను మనకు ప్రథమంగా పరిచయం చేయటమే గాక, ఇందులో పరిణతిగాంచిన రచయిత రంగా.

దేశధర్మాన్ని తమలో అంతర్నిహితం చేసుకొని, మానవుల వేదనలన్నిటినీ తమలో ఇముడ్చుకొని వారికొరకు ఒక దివ్య తేజస్సుతో బాధపడే మహనీయులను గుర్తించలేని స్థితిలో మనమున్నాం. ఆ స్థితిని పోగొట్టి, వారికి తగు గౌరవము, ఆర్థిక సహాయము చేయాలనే తలంపుతో ఆయన అనేక పదచిత్రాలను చిత్రించాడు.

1. భయమెరుగని ప్రకాశం, 2. స్వీకరు సాంబమూర్తి, 3. ప్రజల పండితుడు విజ్ఞాన చంద్రికా విరాట్ స్వరూపుడు హరిసర్వో త్తమరావు, 4. మన చెఱుకువాడ 5. మనశనివారపు 6. ప్రజల పాటల త్యాగయ్య మన గరిమెళ్ల 7. రైతాంగపల్కుల బ్రహ్మన్యాపతి 8. రైతులప్రాణం రామానాయుడు మొదలగు దేశారాధకులను గురించిన పదచిత్రాలు ఆంధ్ర సాహిత్యములో ఆణిముత్యాలు. ఆ నామకరణంలో ఎంత సార్థకత, సానుభూతి, సౌహార్ద్రము, సౌజన్యము వున్నవో గ్రహించ తగినవి. ఆచార్య రంగా ఆప్యాయత మాటల మార్ధవము, మంచి మనస్సు మనకు ఇందులో అధికంగా గోచరం కాగలవు.

ఆయన శైలి, సొంపును గ్రహించండి.

"ఎందరో పాటలు, పద్యాలు రచించినారు; పాడినారు. మరెందరో ఉపన్యాసాలిచ్చినారు. నాయకులైనారు. ఉద్యమము నడిపినారు. పెత్తనానికి వచ్చారు. అట్టివారిలో నే ఒక్కడనే కాని, అప్పటి మూలకందమగు పలుకులనిచ్చిన వారే ముఖ్యులు. అటుల తన పలుకే బ్రహ్మవాక్కుగా ప్రసాదించిన మహనీయుడు, ఆంధ్ర కవిశేఖరుల ప్రాణధనము మన రామానాయుడు... సొత్తున కేమి? ఆయనకు కోటీశ్వరుల కందరాని సొత్తు సంప్రాప్తమగుచున్నది. నాబోంట్లందరు ఆయనసొత్తే."

ఆచార్యరంగా రాజకీయ జీవితం 1923 లో ప్రారంభమైనది. ఆనాటినుండి ఆయన ఎందరనో కలుసుకొంటున్నాడు. ఎందరితోనో కలిసిపనిచేశాడు. వారితత్వాన్ని, దృక్పథాల్ని మార్చుటకెంతో కృషిచేశాడు. "కాంతులు వెలిగ్రక్కు విలువగల మణులెన్నో చీకటులచిమ్ము సముద్రగర్భమున దాగియున్నవి. సౌందర్యమున కాలవాలమగు కుసుమములెన్నో నట్టడవియందు నిరర్థకమగు చున్నవి," అని 'థామస్‌గ్రే' అనినట్లు ప్రతిభావంతులెందరో గలరు. వారు తమ కార్యాలను లోకానికి చాటాలని చేయరు. వారిది కేవలం సేవాధర్మమే. అందులో అనేకులు చేయూతలేక చిక్కి శల్యావశిష్టులైయుందురు. వారికి చేయూతనిచ్చి వారిసేవ పొందాలి.

ఇటువంటివారిని గురించి ఆయన అనేక వ్యాసాలద్వారా, లోకానికి వెల్లడించారు. వారికి చేయూతనివ్వ లోకాన్ని హెచ్చరించాడు.

"పేరమెరుగని రైతురక్షకులు" (1–10–1937 చిత్రగుప్త) అనే మకుటంతో గ్రామాల్లో ఉచితంగా దీక్షతో వైద్యంచేయువారి నెందరినో లోకానికి వెల్లడించారు. అందులో వడ్డూరు రాజులు, పిట్టపాలెపు వైద్యులు, నిడుబ్రోలులోని ఓరుగంటి రత్తయ్యాల దీక్షాదక్షతలు వేయిముఖాల వెల్లడించాడు. ఇటువంటి ఘనవైద్యు లెందరో మన గ్రామసీమలలో కలరు. వారు పేరుప్రఖ్యాతులకైగాని,

ధనధాన్యాదులకై గాని ప్రాకులాడక పలువిధముల పండితులకు సేవ చేయుదురు. అటువంటివారిని లోకానికి వెల్లడించి మన వైద్యాన్ని కాపాడుకోవాలి. పెద్దపెద్దవారినిగురించి, రాజకీయ నాయకులను గురించి వ్రాయువారు కలరుకాని, పల్లెల్లో అనామకులై, అనాధసేవ చేయుచున్న సేవకులను గురించి వ్రాయువారరుదు. అటువంటివారిని అభివృద్ధిపరచాలనే ఆచార్యుని అభిప్రాయము.

ఇటుల రైతురక్షకులు, నిరాడంబర ప్రజాసేవకులు, నామ రూపాలు లేక నశించిపోయిన కాంగ్రెసు సత్యాగ్రహపరులను గురించి, ఇంకా ఇతరసేవకులను గురించి విశేషంగా ఆయన చిత్ర గుప్తలో (1936–40) అనేక వ్యాసాలను ప్రచురించాడు. ఇంకా ప్రజాబంధు, వాహినిలోకూడా వ్రాశాడు. ఆ వ్యాసాలన్ని బహు ఇంపు, సొంపు గలవి. అవి నిజంగా వ్యాసాలవలెగాక, కథలుగా కనుపించును. పాఠకుని కెంతో ఆనందంకలిగించును, వర్ణనలలో ఆయనవన్నె గాంచాడు. శీర్షికలను పెట్టుటలో సిద్ధహస్తుడు. ఆవ్యాసాలన్నీ సమగ్రంగా సంగ్రహంగావుండి సౌజన్య, సౌహార్ధ ములతో రసన ముంచితములుగా వుండును.

ఉన్నవవారి మాలపల్లి మన నవలలో మకుటాయమానము.

భాషలో, భావంలో అది సరికొత్త సృష్టి. దానినిగురించి అనేకులు వ్రాశారుగాని మాలపల్లి హృదయావిష్కరణ చేసింది రంగాగారే. ఆంధ్రపత్రికలో 1944 జనవరిలో నాలుగు దీర్ఘవ్యాసాలద్వారా వ్యాఖ్యానించారు. వారి వ్యాసపరంపరలో ఫలశ్రుతి ఇట్లు పలికారు. 'ఇదియ లక్ష్మీనారాయణగారి సాంఘికతత్వము. ఇయ్యది తనంతట తాను, భారతీయ ప్రజాసామాన్యపు కష్ట పరంపరనుగూర్చి కరుణా భరితమగు శ్రీ లక్ష్మీనారాయణగారి హృదయము, సత్యమార్గాన్వేష ణలో కన్పడు సందేశము. శ్రీ లక్ష్మీనారాయణగార్కి అటు పాశ్చాత్య దేశములందలి సాంఘిక వాదము తెలియును. యిటు మన దేశపు ప్రజల మనస్తత్వమూ, అవసరములూ తెలియును. మధ్య

గాంధిమహాత్ముని దివ్యబోధ వారి హృదయమందు పీఠముగొని యుండెను. వీరి దీర్ఘవిచారపు ఫలితమే దూరదర్శకమగు, మార్గదర్శకమగు సాంఘిక తత్త్వము. ఇయ్యదియే యీకాలపు మన దేశమునకు అవలంబనీయము. రామదాసు, సంగదాసు, జ్యోతి వగైరాల ధర్మపథము ననుసరించి, వెంకటదాసుయొక్క కార్య చతురత, ఉత్సాహ పరంపర నుపయోగించి, రామానాయుని కార్య కారితనము చేయూతగొని, కార్మికులకు తగు సేవచేస్తే "నాది హృదయరాజ్యమని భారతీయ సాంఘిక సేవకుడు పలుకగలడు".

గ్రంథాలు చదివినందువల్ల ప్రయోజనం, దానిలోని పరమార్థాన్ని గ్రహించి తదనుగుణ్యంగా ప్రవర్తించటమే.

మాలపల్లి చదివి చేయవలసిన కార్యాన్ని బోధించి మాన్యత గాంచాడు మన రంగాజీ.

'కవితా వనితా లతా నిరాశ్రయ, నశోభయంతే' అన్నారు. అందుచేతనే ఆనాడు కవులు రాజులను ఆశ్రయించి వారి కంకిత మిచ్చారు. మన మార్గకవిత రాజులను ఆశ్రయించి అభివృద్ధి గాంచినదే.

నేడు గ్రంథకర్తలు పెద్దలచేత తమ గ్రంథాలకు పీఠికలను వ్రాయించుట పరిపాటైనది. ఇందులోను ఆయన ఆరితేరినవాడే. ఆయా పుస్తకాలను ఆమూలాగ్రంగా చదివి అందులోని మెరుగులను పాఠకులకు పరిచయం చేస్తూ రచయితలకు ఉత్సాహప్రోత్సాహ మిచ్చాడు. ఆకలిమంటలు, కష్టజీవి, కర్షకచరిత్ర, పల్లెపట్టున మొదలగు గ్రంథాల కెన్నిటికో పరిచయ వాక్యాలు పసందుగా వ్రాసిన ప్రసిద్ధుడు.

వివిధ గ్రంథాలపై అభిప్రాయానిచ్చి ఆయా గ్రంథకర్తలకు ఉత్సాహప్రోత్సాహ మిచ్చుట ఆయన సాహిత్యారాధనలోని మరొక మార్గము. 'మన స్వాతంత్ర్య సంగ్రామంలో పదకవితం' అనే

మకుటంతో ఒక గొప్ప వ్యాసాన్ని మాతృభూమిలో 29-3-49 న ప్రకటించాడు. సాహిత్యాన్ని విమర్శిస్తూ చక్కటి వ్యాసాలు అప్పు డప్పుడు పత్రికలలో ప్రకటిస్తు వుండేవాడు.

నిరంతర సంచారి అయిన రంగా, ఇన్ని రచనలు ఎట్లు చేశాడా అని ఆశ్చర్యం కలుగుతుంది. ఆయన తాపీగా ముట్నూరి కృష్ణారావు గారి వలె కూర్చుండే వ్రాయడు, పట్టాభిగారి వలె, మహాత్మునివలె, రైళ్ళలో ప్రయాణం చేస్తుండేటప్పుడు కూడా వ్రాస్తాడు. వ్రాసింది మళ్లీ మళ్లీ వ్రాయడు. వీరేశలింగంగారివలె ఒకేసారి, అదేచిత్తు అదేసాఫు. పూర్వం బాణుడు బహువేగంగా వ్రాసేవాడని ప్రసిద్ధి. అట్లాగే రంగా శరవేగంగా వ్రాయగలడు. అందుచేతనే అన్ని రచ నలు చేయగలిగాడు.

ఆయన గ్రంథాలు దాదాపు 30 వుంటవి. నాకు తెలిసినంత వరకు తెలిపెద.

'హరిజన నాయకుడు' ఇదొక నవల. ఈ హరిజన నాయకుడు సంఘంలో, సాహిత్యంలో ఆదర్శపురుషుడు. సాధారణ రైతాంగం కూడా సులభంగా గ్రహించేటట్లు వివిధ దేశాల రాజ్యాంగ వ్యవస్థ లను గురించి 'ఆధునిక రాజ్యాంగ సంస్థలు' అని రెండు సంపుటాలు రచించాడు. రాజకీయ విజ్ఞాన వికాసానికి ఇవి ఎంతో తోడ్పడెను.

పాకీస్థానును గురించినదే వీరి 'పాకీస్తాన్' ప్రపంచం నేడు రెండు భాగాలుగా విడిపోవు చున్నది. కొందరు రష్యాలోని కార్మిక నియంతృత్వాన్ని కోరుకొంటున్నారు. మరి కొందరు అమెరికా ఇంగ్లాండుల ప్రజాస్వామ్యాన్ని ఆకాంక్షిస్తున్నారు.

రష్యాలోని ఆర్థిక పద్ధతిని, అమెరికాలోని ప్రజాస్వామ్యాన్ని తీసుకొని 'రైతుకూలీ ప్రజారాజ్య' మనే తృతీయ పంథాను సూచించి సంక్షోభిత ప్రపంచమునకు ఆశాజనకమగు నూతన మార్గము వెలువ రించినదే వారి 'రైతుకూలీ ప్రజారాజ్యము' అనే రచన.

దీనిని మహాత్ముడు కూడా ఆశీర్వదించిన సంగతి సర్వజన విదితం.

రాజకీయ నాయకుల్లో గ్రంథకర్తలరుదు. ఆచార్యరంగా అనేక గ్రంథాలు రచించాడు. ఆయన గ్రంథాలు ఆయన వివిధ విషయ విజ్ఞానాన్ని విశదంచేయును. వాటిని స్థూలంగా ఇట్లా విభజించ వచ్చును.

ఆర్థిక పరిశోధనకు సంబంధించినవి.

ఆయన ఆర్థికవేత్త – ఆర్థిక పరిశోధనలో అందెవేసిన చెయ్యి. ప్రథమంగా ఆయన రచనలన్నీ ఆర్థిక పరిశోధనకు సంబంధించినవే.

డెల్టా ప్రాంతాలలోను, మెరక ప్రాంతాలలోను, జమీందారీ ప్రాంతాలలోను రైతుల స్థితిగతులేగాక, దక్షిణదేశంలో వ్యవసాయ కూలీల ఆర్థిక పరిస్థితులు, నీలగిరివారి ఆర్థిక పరిస్థితులు, చేనేతవారి ఆర్థిక పరిస్థితులు మొదలగు రచనలు చేశాడు.

1. Economic Organisation of Indian Villages I. (Deltaic villages) 1926
2. ,, ,, (Dry villages) 1928
3. The Tribes of Nilagiries — Their Economic and Social Conditions 1928.
4. The Hand-loom Industry, 1930.
5. The Economic condition of the Zamindary Ryots 1933
6. Labour in South India 1934.
7. A Guide to Rural Economics 1938.
8. Agricultural Indebtedness, Remedy etc. Measures.

రైతులకు సంబంధించినవి.

1. Modern Indian peasant 1936.
2. Kisan Speaks, 1937.
3. Peasants and Congress, 1937.

4. Philosophy of the Kisan Movement 1939.
5. Kisan Hand Book, 1939.
6. Whether Indian peasant? 1942.
7. Kisans and Communists, 1942.
8. The peasant and Co-operative Movement, 1959.

పి. ఆర్. పరుచూరి, రంగాగారు కలిసి వ్రాశారు. సహకార వ్యవసాయం రైతునాశనానికి మూలమని వివిధదేశాల్లో సహకార వ్యవసాయం ఎట్లు విఫలమైనదో వెల్లడించారు.

జాతివర్గ సూత్రసంబంధాలు.

1. World Role of National Revolution 1942–44.
2. Outlines of the National Revolutionary path, 1942–44.
3. Credo of World peasantry, 1942–44.
4. Colonial and Coloured peoples 1942–44.

మొట్టమొదట రంగా సోషలిస్టు. 1942లో జాతీయవాదిగా మారాడు. అప్పుడు మార్క్సిజాన్ని ఖండిస్తూ గ్రంథరచన నారంభించాడు. మార్క్సు జాతీయత పనికిరాదని అంతర్జాతీయత అవసరమని, కార్మికులే విప్లవకారులని, రైతులు విప్లవ వ్యతిరేకులని ప్రతిపాదించుచు దానిని ఖండిస్తూ ప్రపంచ మంతటను మనదేశంబును జాతీయత ఎట్లు విప్లవ పంథాయో వెల్లడించాడు పై రెండు గ్రంథాలలోను.

మూడవగ్రంథములో ప్రపంచంలోని రైతులు ఎట్లు ఉద్యమాలను నడిపి విప్లవకారులైంది వెల్లడించాడు.

నాల్గవ గ్రంథం వలసరాజ్యాల్లోని రంగుజాతులను గురించి పతిత ప్రజలను ప్రేమతో సహా తర్జుమా చేశాడు.

ఆయన జాతీయవాదే కాదు అంతర్జాతీయవాదికూడా. ఆయన వలసజాతుల స్వాతంత్రరంగం 1942 లో స్థాపించి, వివిధ దేశాల్లోని

ప్రజాభిప్రాయాన్ని, వలసదేశ స్వాతంత్ర సంపాదనకు సుముఖంగా కృషిచేశాడు.

ఈ పుస్తకాన్ని పాన్ ఆఫ్రికన్ కాంగ్రెసువారు ప్రత్యేకించి ప్రకటించుకొనుట దాని ప్రశస్థానన్ని చెప్పుచున్నది. 'దీనిని క్రైస్తవులు బైబులు ఎంత పవిత్రమని భావించుకొంటున్నారో అంత పవిత్రంగా పతితప్రజలు భావించి పూజించుకొంటునా' రని పాన ఆఫ్రికన్ కాంగ్రెసు నాయకుడు శ్రీ రాబర్టు పీటర్ అబ్రహామ్ ఉద్ఘాటించుతూ దీనిని ఆయన సమీక్షిస్తూ ఇట్లు అన్నాడు.

"భారతదేశపు సమరాంగణపు టంచునుండి రాజాజీ నూతన ఉద్యమానికి ఒక సిద్ధాంతాన్ని సృష్టించాడు.

వీరి అంచనాన్ననుసరించి ఈ నూతన ఉద్యమానికి వలసప్రజల నుండి వస్తున్న బలం బ్రహ్మాండంగా వుంది. నిజానికి ఈ రంగుజాతుల వలస ప్రజల స్వతంత్రోద్యమానికి అత్యద్భుతమైనస్తోమతు చిక్కింది."

'ఈ ఉద్యమం వలస దేశాలను కదలిపొండు' (Quit the Colonies) అనే నినాదాన్నిస్తున్నది.

'ప్రపంచ కార్మికులారా ఏకం కండు' అని మార్క్సు నాడు నినాదమిస్తే, 'ప్రపంచ పతితులారా ఏకం కండని' నేడు నినాదమిస్తున్నారు రంగాజీ.

ప్రపంచ పతిత దాస్య నిర్మూలనా మహాస్సృష్టి కర్తలలో ఆయన ముఖ్యుడు.

వి వి ధ ము లు

1. The Indian Adult education.
2. The Forests.
3. Why Kisans and Artisans support Gandhian plan.
4. Beware of American 'Manifest Destiny'.

5. Support for Basic Education Khaddar A. I. V. I. and hand Produced Rice etc.

6. Life and thought of a political Race etc.

6. Life and thoughts of political prisoner (స్వీయ చరిత్ర.)

7. Students Role in Colonial Revolution and National Congress.

8. Whether students?

ఆయన గ్రంధరచననుబట్టి ప్రథమదశలో ఆయన ఆర్థిక పరిశోధకుడు. ద్వితీయదశలో ప్రచారకుడు. తృతీయదశలో సూత్రకారుడు అని స్ఫురించును. ఆయన ప్రథమదశలోని గ్రంధాలవల్ల కర్షక కార్మికుల కష్టాలు—తన్నివారణోపాయాలు చెప్పి, లోకానికి కనువిప్పు కలిగించాడు.

ద్వితీయదశలో గ్రంధాలవల్ల రైతుఉద్యమ ఆవశ్యత, తత్వం, ప్రజల ప్రభంధాలు, ప్రయోజనాలు వివరించి, అనేకమందిని ఆకర్షించాడు.

తృతీయదశలోని గ్రంధాలవల్ల కేపిటలిస్టుదేశాల సంగతి ఆలోచించి, వలసరాజ్యాలలో జాతీయ విప్లవ పంథాయే తరుణోపాయమని, రైతులు విప్లవవీరులని విశదపరచాడు.

రచయితలు రెండురకాలు. ఉద్గ్రంథాలు రచించేవారు, సాహిత్యానికి నూతన జీవనము యిచ్చేవారు. ఆయన ఆంగ్ల సాహిత్యంలో ఉద్గ్రంథాలు రచించి ప్రపంచ ప్రజలను ఆకర్షించాడు.

ఆంధ్రసాహిత్యంలో నూతన జీవనమును తెచ్చినవారిలో రంగాగారొకరు.

# నిత్యాన్వేషి

## శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి.

శ్రీ ఆచార్య రంగా జన్మస్థానం నిడుబ్రోలు. మా గ్రామం చేబ్రోలు. ఒట్టి ఊరిపేరులో సామ్యమే కాదు. ఆయన భావాలతో గూడా చేబ్రోలు ప్రజలకు అతి సన్నిహితత్వం కలదు. ఆచార్యుని రైతు ఉద్యమాలకు, జాతీయోద్యమాలకు నివాళులెత్తి గుంటూరు జిల్లాలో చరిత్ర ప్రసిద్ధిగాంచిన గ్రామం చేబ్రోలు, వెల్లువికి వస్తున్న జాతీయోద్యమ వెల్లువలో 14 మంది స్త్రీ పురుషులను కృష్ణ జన్మస్థానమునకు పంపి తోడ్పడిన గ్రామం చేబ్రోలు. శ్రీమతి భారతదేవి రంగా పేరుచెప్పి పొంగిపోయే స్త్రీలు ఆగ్రామంలో లెక్కకు మిక్కుటం. కొన్ని సంవత్సరాల తరబడి లోకసభా వేదికను జాతీయోద్యమ సమస్యలతో గ్రామీణ రైతు సమస్యలను మిళితం చేసి ఉగ్రూరత లూపుచున్న మేటినాయకుడు శ్రీరంగా మా నియోజకవర్గపు ప్రతినిధియని చెప్పుకొనుట మా ప్రజల కెంతయో గర్వ కారణం.

1931 శాసనోల్లంఘన ఉద్యమం పూర్తయినది. యించుమించు జైలునుండి రాజకీయ ఖైదీలందరు విడుదలైనట్లే. ఆచార్యులు రాజకీయ పాఠశాలను 1934లో నిడుబ్రోలునందు ప్రారంభించిరి. రాష్ట్రం నలుమూలలనుండి జాతీయ భావాలు వెల్లువికుచున్న యువకులు ఎందరో నిడుబ్రోలు చేరుకొనిరి. రాజకీయ పక్షాలలో ఈనాడు నాయకులుగా రాణించుచున్న ముఖ్యులలో ఎందరో ఆ రైతాంగ విద్యాలయంలో శిక్షణ పొందినవారే. మట్టినుండి మాణిక్యాలను సృష్టించుటలో ఆచార్యునికి ఆచార్యుడే సాటి. యువకులలో నిద్రాణమైయున్న శక్తులను మేల్కొలిపి వారి మెదడును రాజకీయ, ఆర్థిక పాఠాలతో నింపి రాష్ట్రం నలుమూలలా ఉద్యమవ్యాప్తికి పంపగలిగిన

ఘనత ఈ దేశంలో ఆచార్య రంగా ఒక్కరికే కలదనుటలో అతిశ యోక్తి ఏమాత్రం లేదు. యదార్థంగా ఆచార్యుని నామం సార్థకత చెందినది. ఏపార్టీలోచూచినా తుదకు ఏగ్రామంలో చూచినా ఒకరో యిద్దరో మేము రంగాగారి రైతాంగ విద్యాలయములో శిక్షణపొందితిమని చెప్పువారు మీకు కనుపించక పోరు. యిది పచ్చయప్ప కాలేజిలోని ఆచార్యత్వంకాదు. దీని విద్యా విధానమే (సిలబస్) వేరు. ఈ ఆచార్యపీఠంనుండి వెలుపలికివచ్చిన శిష్యగణం భారతమాత సేవలో మణిపూసలుగా నిగ్గుతేలిరి. ఈ నిడుబ్రోలు రామానీడు విద్యాలయం దేశంలో ఒక వినూత్నమైన యూనివర్సిటీగా రూపొంది రాష్ట్రాన్ని చైతన్యపూరితం చేసినది.

కేవలం ఉపన్యాసాలతో ఆగలేదు ఆచార్యులు. అనేకమంది యువకవులను ప్రోత్సహించి గ్రామీణ రైతు, జమీందారీ సమస్యల మీద గేయాలు వ్రాయించిరి. వాటిని రైతుభజనావళిపేర అచ్చొ త్తించి విద్యార్థులకు అదునులో అందజేసెడివారు. ప్రతి విద్యార్థి చేతిలో నోట్ బుక్ తో ఈ భజనావళి ఒకటుండేది. ప్రతిఏటా కొన్ని గేయాలుకలిపి తిరిగి అచ్చువేస్తూనే వుండేవారు రైతుభజనావళిని. ''ఆగునాజీవాలు సాగునాలోకాలు రాజుగా మనమెంచి రైతు జూడకపోతే'' అంటూ రైతుభజనావళి గేయాలుపాడుతూవుంటే వేదఘోషతో శిష్యవర్గాన్ని ప్రభోధించిన ప్రాచీన ఋష్యాశ్రమాలు తలపుకువచ్చేవి. ఈ జాతీయోద్యమ పీఠమైన రైతాంగ విద్యాలయంలో ప్రాచీనకాలంలోగల జ్ఞానపిపాసను మరపించేది ఈ విద్యార్థులలోగల రాజకీయతృష్ణ, రైతాంగభక్తి.

వెనుకబడిన ప్రాంతాలనినా, వెనుకబడినవర్గాలన్ననూ రైతు నాయకునకు అపారమైన ప్రేమ. దానికి నిదర్శనం రాయలసీమయే. రాయలసీమలో ఆచార్యరంగా అడుగుపెట్టని స్థానంలేదు. రాయల సీమ కరువునివారణకు తన ముఖ్య అనుచరులైన శ్రీ కందుల ఓబుల రెడ్డి మొదలైనవారితోకలిసి విధివిరామంలేని కృషిచేస్తూవుండటం ఒక పరిపాటి. రాయలసీమ ప్రజలకు రంగాగారనిన అపారమైన భక్తి

శ్రద్ధలుకలవు. ఆంధ్రదేశంలో ఆయన సేవను హెచ్చుగా పొందగల్గిన భాగ్యంకూడా రాయలసీమకే అబ్బినది. రాయల (శ్రీకృష్ణదేవరాయల) సీమను రత్నాల సీమగా మార్చవలెననుభావం ఆయన అనుచరులలో పొంగులు పారుతూ వుండెడిది. ఆయనే కాకుండా ఆయన అనుచరులు సహితం యిప్పటికే రైతుపేరు చెప్పినచో ఒల్లు తెలియని తన్మయత్వం చెందెదరు. మంత్రిగావున్నపుడు శ్రీతిమ్మారెడ్డి కాబినెట్ నిర్ణయాలను సహితం విస్మరించియిచ్చిన ఉపన్యాసములే యిందుకు నిదర్శనం,

తెలంగాణా ప్రాంతమును గురించికూడా రైతుభాంధవుడు ఆలోచించకపోలేదు. పోతేస్టేటు వేరు అయినందున ఆయన సేవలను తగినంత అందించుటకు వీలైనదికాదు. అట్లు నిరుపేక్షవహించటం జరుగలేదు. రైతుకుటుంబములోపుట్టి రాజకీయోద్యమములో ప్రవేశించి ఉత్సాహంగా పనిచేస్తున్న తెలంగాణా యువనాయకుడైన శ్రీ చెన్నారెడ్డికి ఎన్నియో విధముల ప్రోత్సాహం కలిగించిరి. అంతర్జాతీయ రైతుమహాసభలు రోమునగరంలో జరిగినపుడు ఆచార్య రంగా శ్రీ చెన్నారెడ్డిని భారత ప్రతినిధిగా పంపుటకు తోడ్పడినారు. వ్యక్తులలోవున్న విశేషతను సూక్ష్మంగా గ్రహించి దేశానికి ఉపకరింపజేయుట యనునది ఆచార్య రంగాకు వెన్నతోపెట్టిన విద్య,

కరువు కాటకాలు ఎక్కడవున్న అక్కడ ఈ రైతుబాంధవుడు ప్రత్యక్షం; అది రాయలసీమకానీ, సర్కారుకానీ మరే యితర రాష్ట్రంకానీ. (శ్రీ) సర్దార్ లచ్చన్నతో కలిసి వెనుకబడిన శ్రీకాకుళం జిల్లాను ఎన్నిసార్లు చుట్టి వచ్చినారో! అహర్నిశలు అలుపెరుగని కృషి సాగిపోతూనే యుంటుంది. ప్రజల కొరకు తన చక్కనిభాషను సహితం ప్రక్కకు బెట్టి ప్రజల భాషలో విధివిరామంలేని ఉపన్యాసాలు కొనసాగుచునే వుంటవి. అయినా మారుమూలలగల తన గ్రామీణ ప్రజానీకం తగినంత రాజకీయ, ఆర్థిక పరిజ్ఞానం పొందలేదనే ఆయన తహతహ.

అన్నింటికంటె ప్రతివ్యక్తీ తన హృదయ ఫలకంమీద నిలుపుకొనవలసిన విశేషం ఆయన నిర్దుష్టచరిత్ర. భ్రాతృప్రేమలో, పత్నీ గౌరవంలో, ప్రజాప్రేమలో శ్రీ రంగా అడుగడునా ఆ శ్రీరామ చంద్రుని తలపిస్తూ వుండెదరు, ప్రజాహిత సంస్థలలో హెచ్చుమంది డబ్బు లెక్కలలో అశ్రద్ధచూపెదరు. కాని ఆయన తత్వం అందుకు పూర్తి వ్యతిరేకం. వారు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా మూడవ సారి అనేక కుట్రలు కారణంగా ఓడిపోవునప్పటికి కొన్ని లక్షల ఆదాయమును రాష్ట్ర కాంగ్రెసుకు సమకూర్చి వుంచారు. ఆయన దృష్టిలో ఆర్గనైజేషనును గురించిన ప్రణాళికలు ఎన్ని వున్నవో! ఒక్కపైస తప్పిళ్లుగాని, తప్పుడు లెక్కలుగాని లేకుండా అప్పటి రాష్ట్రకాంగ్రెసు కార్యదర్శియైన శ్రీ కందుల ఓబులరెడ్డికి లెక్కలు అప్పగించిరి. ఆ బాధలు యిప్పటికీ వెంటాడటం వేరువిషయం. కొన్ని జిల్లా ఆఫీసులూ, వ్యక్తులూ ఆ ఘుడియవరకు ఆఫీసుకు డబ్బు చెల్లింపనే లేదు. ఓటమి హఠాత్పరిణామం. అయినా కార్యదర్శిగా తన బాధ్యతను నిర్వర్తించి అధ్యక్షునికి గర్వకారణం కాగల్గిన అనుచరుడు శ్రీ కందుల ఓబులరెడ్డి. ఆచార్యరంగా ప్రతిముఖ్య అనుచరుడూ ఆరోజులలో అంత జాగ్రత మెలగేవారు ఆయన ఒరవడిలో.

ఆచార్య రంగా రైతువిద్యాలయాలు ప్రతిసంవత్సరం రాష్ట్రంలోని ఏదోఒకమూల నడిపింపబడుచునే యుండెడివి. నాకు నిలచి శిక్షణతీసుకొనుటకు అవకాశం 1934లో నిడుబ్రోలునందు మాత్రమే లభించినది. తదుపరి విద్యాలయములు ఎక్కడ నడుపబడినను ఒకటి రెండురోజులకు చూచుటకు వెళ్లటం మినహా వుండుటకు వీలైనది కాదు. ప్రతివిద్యాలయములో స్త్రీలను వ్రేళ్ళమీద లెక్కించవల సినదే. ఈ పరిస్థితిలో స్త్రీలకు ప్రత్యేకంగా ఒక రాజకీయ పాఠ శాలను నడపటం అవసరమని తోచినది. నాయీ సంకల్పాన్ని నాకు సర్వవిధముల తోడ్పడుతూ అండదండలుగా వున్న శ్రీమతి గోళ్ళ మూడి రత్నమ్మగారిఎదుట పెట్టగా వారు సరేనని తమ ఆమోద ముద్రను వేసిరి. వెంటనే నిడుబ్రోలు వెళ్లి శ్రీమతి భారతీదేవి

రంగాతో చర్చించి వారి ప్రోత్సాహంతో జాతిపిత జన్మదినమైన 1945 అక్టోబరు 2-వ తేదీన రాజకీయ మహిళా శిక్షణ శిబిరాన్ని నిర్వహించుటకు నిర్ణయం తీసుకొన్నాం. ఈ శిక్షణ శిబిరనిర్వాహక కమిటీకి శ్రీమతి భారతీదేవి రంగా అధ్యక్షులు, శ్రీమతి గోళ్ళమూడి రత్నమ్మ ఉపాధ్యక్షులు, శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి కార్యదర్శిని. ఈ శిబిరమును ప్రారంభించుటకు డాక్టరు పట్టాభిగారు అంగీకరించి కొన్ని అనివార్య కారణములచే రాజాలకపోయిరి. వెంటనే మన ముఖ్య నాయకులలో ఒకరైన శ్రీ కళా వెంకట్రావుగారిని కోరగా వారు అంగీకరించి శిక్షణశిబిరమును గాంధీజీ జన్మదినమైన అక్టోబరు 2-వ తేదీన ప్రారంభోత్సవం జరిపిరి. దీనికి ఆచార్యత్వం శ్రీరంగా, కాశేశ్వరరావుగారలు వహించిరి. శిబిరం మాసంరోజులు నడిచినది. ఈ శిబిరంలో 45 మంది స్త్రీలు శిక్షణ తీసుకొనిరి. వారిలో హెచ్చు మంది యువతులు; ప్రజాహిత రంగాలలో పనిచేస్తూవున్న వారుకలరు. ఉపన్యాసకులుగా శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, శ్రీ గోపరాజు రామచంద్రరావు, శ్రీమతి భారతీదేవి, శ్రీమతి కమలాదేవి చట్టోపాధ్యాయ, శ్రీమతి శ్రీరాజ్యం సిన్హా, మహమ్మద్ ఇస్మాయిల్ యూత్ కాంగ్రెస్ అధ్యక్షులైన వి. యల్ సుందరరావు మొదలైన అన్నివర్గాల ప్రతినిధులువచ్చి స్త్రీలు రాజకీయరంగంలోనే కాక వివిధ రంగాలలో వారు నిర్వహించవలసిన విధులను గురించి ఉపన్యాసము లిచ్చిరి. శ్రీ ఆర్. కె. రామలింగారెడ్డి, శ్రీ అన్నాప్రగడ కామేశ్వరరావుగారలు డ్రిల్లు శిక్షకులు. ఈ శిబిరానికి రెండుపర్యాయములు శ్రీ మానికొండ సత్యనారాయణ, శ్రీ తెన్నేటి విశ్వనాథం గారలతో ప్రకాశంగారు విచ్చేసిరి. రాష్ట్ర కాంగ్రెసు అసెంబ్లీ (కాంగ్రెసుమీద నిషేధంవున్న రోజులవి) అధ్యక్షులుగా ఆమోదముద్రవేసినది మొదట శ్రీ కళ్లూరి చంద్రమౌళిగారైనను శిబిర ప్రారంభంనాటికి ప్రకాశంగారు విడుదలగుటచే రాష్ట్ర కాంగ్రెసుకు వారే అధ్యక్షులుగ నుండిరి. వారు రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులుగా శిబిర నిర్వహణకు వెయ్యిరూపాయలు కోరినంతనే యిచ్చి మమ్మ్ల

ప్రోత్సహించిరి ఇంతమంది సలహా సహాకారాలు పొంది నిర్వహించ గలశక్తి, కార్యోత్సాహం యిచ్చినది శ్రీ రంగాగారని చెప్పుకొనుటకు మా చేబ్రోలువాసులు మిక్కిలి గర్వపడుచుంటాం. వారి మీద గల అభిమానంకొలదీ వారి శిష్యుడైన శ్రీయుత పాటిబండ్ల కోదండ రామయ్య (చేబ్రోలు నివాసి) గ్రామంలో ఆర్థిక సహాకార మేగాక నాయకుల ఊరేగింపులు, ఉపన్యాసాలు ఏర్పాటుచేయుటలో సర్వ విధముల తోడ్పాటు నందించిరి. వారి పేరుచెప్పినచో ప్రతిరైతూ అది తమ పనిగా భావించేవారు.

సర్వాంగశోభితంగా దేశం ఉజ్వల భవిష్యత్తు కలిగివుండా లనునదే మొదటినుండీ ఆచార్య రంగా ఆకాంక్ష. ఆ దృష్టితోనే వారు రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులుగా నున్నప్పుడు చేనేత, మహిళా, యువజన, విద్యార్థి కాంగ్రెసు మొదలైనశాఖలు స్థాపించి రాష్ట్ర కాంగ్రెసుకు అనుబంధం చేసినారు. ఆ రోజులలో ఆచార్య రంగా వర్గ సంఘాలను విమర్శించే వ్యక్తులకు తరుగులేదు. చివరకు పత్రికలుగూడా దశకంఠుడుగా వ్యంగచిత్రాలను చిత్రించి విమర్శనలు లేపినవి. ఆయన వీటిని లెక్కించుచూ కూర్చునేవ్యక్తి కాదు; సంకల్ప సిద్ధుడు. తాను విశ్వసించిన పనిని మనసా, వాచా, కర్మణా చేసుకుంటూ పురోగమించటమే ఆయన ధర్మం. కొన్ని సందర్భములలో నాకుగూడా అనుమానములు జనించకపోలేదు. ఈ ఉపసంస్థల విషయములో, ఆయన చిత్తశుద్ధిమీదగల గాఢనమ్మకంతో మౌనం వహించేవాడిని. ఈరోజు కులప్రాతిపదికలమీద అసంఖ్యాక సంఘాల సృష్టి చూస్తుంటే ఆయన ఏర్పరచిన వర్గసంఘాల దృక్పథం సంఘానికి శ్రేయస్కరమని ఎంత త్వరగా గ్రహించగల్గిన దేశానికి అంత మేలు.

ఈమధ్య తెలంగాణా చేనేత పితామహుడైన శ్రీయుత గుంటక నరసయ్యా పంతులుగారు మాటల సందర్భములో 'ఆచార్య రంగాగారు మా చేనేత సంఘానికి చేసిన సేవ అమూల్యం; వారికి మా శరీరంలోని మాంసం ఒలిచి భక్తిగా సమర్పించుకొనినా మా ఋణం తీరదని'' అన్నపుడు నేను ఆశ్చర్యపోయాను. ఎంతమంది

ప్రజలలో, ఎన్ని వర్గాలవారి మనసులో యిలాంటి కృతజ్ఞతలు ఈ గ్రామీణ నాయకుని యెడల దాగియున్నవో ఎవరు చెప్ప గలరు? ఈ అధికార స్వార్థ భూయిష్ఠమైన వాతావరణలో తమ హృదయాధినేతను గురించిన తమ అభిమానమును వెల్లడించు కొనుటకు సహితం జంకుదురనుటలో సందేహించవలసిన పనిలేదు.

దేశంలో అనేకమంది అభిమానులు ఆయన మంత్రి పదవులు అధిష్టించలేదేయని బాధపడుతూ వుండటం చూస్తుంటాం. యదార్థంలో పండిట్ నెహ్రూతో తనకుగల భిన్నాభిప్రాయములను కొంచెం మనసులో భద్రపరచుకొన గలిగినచో ఏనాడో కేంద్రంలో మంత్రి పదవిని అధిరోహించి వుండెడివారు. కాని చిత్తశుద్ధిలేని పనులు ఆయన సహజత్వానికే విరుద్ధం. అందుచే ఆయన తన నమ్మకాలను వీడి తనను తాను మోసం చేసుకొనే స్థితికి దిగజారలేక పోయిరి. సిద్ధాంత పీఠంమీద చిత్తశుద్ధితో కూర్చొను ప్రవక్తకు—యిక్కడ నేను ప్రవక్త అను పదం ఉద్దేశ పూర్వకముగనే వాడితిని. నేను ఆయనను రైతుతత్వ సిద్ధాంత ప్రవక్తగా విశ్వసిస్తున్నా—ఈ అధికార పీఠం అంత సుఖప్రదంగాదేమో! కొద్దో గొప్పో ఆత్మవంచనకు ఉద్యుక్తులైనగాని మంత్రి పదవులు అధిరోహించుటకు అవకాశంలేని రోజులివి. భవిష్యత్తులోనైనను ఈ రాజ్యాంగ అధికారంలభించనీ, లభించకపోనీ—లభించగలదనే ఆశించుదాం—కేవలం రైతు శ్రేయస్సునేగాక వివిధవర్గాల ప్రజల భవిష్యత్తు సర్వవేళల ఆకాంక్షించెడి రైతు బాంధవుని సంకల్పం చెక్కు చెదరక వుండవలెననే కోరుకుందాం. ఈ తరాలలోనేగాక భావితరాలలోగూడా. అంతేకాదు ఈ ధరపై అన్నదాతలు (రైతులు) జీవించియుండు వరకూ ఆయన మకుటంలేని మహారాజే. పై చెప్పినదానికి ఉదాహరణగా ఒక విషయం. మహాసభలో ఆయన ఉపన్యాసం ముగిసిన తరువాత చూస్తే తెలిసిపోతుంది. తన అసలైన భక్తులు అభిమానులు తనకొరకు ఏ వెనుకనో, ప్రక్కనో నిరీక్షిస్తూ వుండెదరని ఆయనకు తెలుసు. తనకొరకు కాచుకొనివున్న ఆ సామాన్యుల వద్దకు తానే వెళ్ళి వారికిమంచిచెడ్డలు పరా

మర్శించిగాని యువతలికిరారు. యిక్కడసభను ఏర్పాటుచేసిన పెద్దలు ఎంతమంది తనకొరకు కాచుకొనివున్నా సరే. తనకుకావలసిన ఆత్మ ఆ అమాయకపు గ్రామీణప్రజలలో వున్నదని ఆయన ఎరుగును.

ఆచార్య రంగాను గురించి ఘనంగా వ్రాయుటకు ఎందరో పెద్దలున్నారు దేశంలో. ఎందుకనగా వారిలో విశేషాలేవో కొల్లలు గనుక. ఆయన ముఖస్తులకు లొంగెదరని కొందరిలో ఒకబలమైన అభిప్రాయం ఏర్పడియున్నది. దానినే మరికొందరు త్వరపడి నమ్మటం అనవచ్చును. వెలుతురును క్రీనీడ వెన్నంటినట్లు ముఖస్తుతి మనుష్యులు గూడా కొంతమంది ఆయనను ఆశ్రయించుకొని వుంటూవుండెదరు. చేతులు నలుపుకొంటూ అతివినయముతో వారు చెప్పుమాటలను తన నిర్మలహృదయమునుబట్టి ఆయన కొన్ని సమయములలో విశ్వసించటం అమలులోజరుగుతూవస్తున్న సాంప్రదాయం. పైనుదహరించిన విషయాలు సాధారణ సందర్భాలలో, యికకొన్ని చారిత్రక ఘట్టాలను పరిశీలించుదాం. ఆంధ్రరాజధాని విషయములో వారు చిత్తూరును సూచించిరి. దానికి కారణం ఆయన దృష్టిలో 'శ్రీబాగ్' ఒడంబడిక యేవున్నదో మరేకారణంగలదో అది వేరు విషయం. భక్తసులభుడై తన రాయలసీమ అనుచరవర్గానికి లొంగిపోయి రంగా చిత్తూరును బలపరుస్తున్నాడను జనాపవాదుకు దూరంకాలేక పోయిరి. ఇది కేవలం అసత్య మని వారుకూడా అంతరాత్మశుద్ధిగా అనలేరేమో! ఇకపోతే తెలంగాణసంగతి. ఒకభాషకు సంబంధించి రెండురాష్ట్రాలు వున్నను ముంచుకుపోవునది యేమున్నదని వారి అంతర్గతాభిప్రాయం. ఆత్మీయుల సమక్షంలో చర్చలు జరిగినపుడు వారు తమ అభిప్రాయమును వెల్లడించినట్లుగూడా వినికిడి. దానికి నిదర్శనగా హిందీరాష్ట్రాలైన యు. పి, బీహార్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలను ఉదహరించిరి. చివరకు కేంద్రం రెండు ప్రాంతములను కలిపి ఆంధ్రప్రదేశ్ గా రూపొందించుటకు నిర్ణయించుకొన్నదని తెలిసినపుడు విశాలాంధ్రకు అనుగుణ్యముగనే తన అభిప్రాయమును మలుచుకొనటం జరిగినది. ఏలనన అంతకుముందుసహితం ఆయనకు ప్రత్యేకమైన వ్యతిరేకత ఏమీ

లేదుగనుక. అంతవరకూ వారి అభిప్రాయములు తన సంకల్పాను సారమే నడచినది. తెలంగాణాలో ముఖ్య అనుచరుడని తలంచిన శ్రీ చెన్నారెడ్డి ప్రత్యేక తెలంగాణా రాష్ట్రమును సపోర్టు చేయమని పట్టుబట్టినందున ఆయనయందుగల అభిమానంతో మెత్తబడి అయిదు సంవత్సరాలవరకు రెండురాష్ట్రములు వేరువేరుగావుండి తదుపరి కలిసి పోవటం ఉచితంగా ఉంటుందని తన అభిప్రాయమును చివరిగడియలో ప్రకటించిరి. అయిదు సంవత్సరముల సమయమిచ్చినచో భిన్నాభి ప్రాయములతీవ్రత కొంత తగ్గవచ్చునని వారు వూహించియుండవచ్చు. కాని ప్రత్యేక తెలంగాణవాదుల వాంఛిత మదికాదుగదా? ఈ విధంగా అనుచరుల ఒత్తిడికి లొంగిఅనండి లేక వారిమీద ప్రేమచే ననండి తమ అభిప్రాయములతో తానే రాజీపడటం సామాన్య నాయ కులకైనచో నష్టమేమీలేదు. కాని ఆచార్య రంగాలాంటి మొదటి తరగతి నాయకులకు శోభాయమానం కాదు.

అసలే రైతుశబ్దం పేరుతో తమకు ఏదోముప్పు సంభవించ పోతున్నదని అదుర్దాపడువారు ఆనాడెందరో కలరు; ఆనాడే కాదు. ఈనాడుకూడా అంతేనేమో! చిన్నసాకు దొరికితే చాలు ప్రెస్సుతో సహా చేతపట్టుకొని హోరెత్తించెదరు. ఈ తుఫానును ఆయన లక్ష్య పెట్టక మహామేరువువలె నిలవటం వేరుసంగతి. ఆప్రకారము చలించే వ్యక్తి అయినచో ఏనాడో రాజకీయరంగంలో తల్లక్రిందులై ఉండెడి వారు. ఈనాడు అధికారంలోవున్న ఏఒక వ్యక్తికి లేని బలం రంగాకు ప్రజాహృదయంలో పాతుకొని వున్నదనుట నిస్సందేహం. ప్రజలను ఏ సంస్థ పేరుతోనైనను సమీకరించుకొనుటలో వారు ప్రత్యేక నిపుణులు.

వారి మెత్తని స్వభావం అనుచరవర్గంలోని నాయకశ్రేణికి చెందిన వ్యక్తులను కొందరిని కోల్పోవుటకు కారణమని వూహించుట తప్పుకాదనుకుంటాను. పట్టుబట్టినచో తమకోరికను ఆయన అంగీక రించకపోరను నమ్మకం ముఖ్యులలో ఎంతోమందికి కలదు. అన్నీ తాము తలంచినట్లు ఆచార్యులు ఒప్పుకొనటం సంభవం కాదుగదా?

నెంటనే కొందరి దండయాత్రల ప్రారంభం. అంతేకాదు. ఒక సందర్భం వచ్చినపుడు న్యాయంకంటె ఆశ్రితుల విషయంలో పక్షపాతం ఎక్కువ అనునది కూడా వారి విషయంలో ఒకవాదన. ఆ యిష్టానిష్టాలను తగ్గించుకొనినచో ఆయన సిద్ధాంత గమనానికి మహోన్నత స్థితిని చేకూర్చగలదని కొందరిభావం. ఐతే తానుగా తాదాత్మ్యం చెంది ననూ ఆయన అన్ని వర్గాల ప్రజల కొరకై పనిచేస్తున్న మహానాయకుడు. ఆయనలో ఏచిన్న లోపమూ ఉండరాదనునది ఆయన శిష్య వర్గంలోగల గాఢమైన అభిప్రాయం.

నేను కలం పట్టుకొనినది ఆయన చిరుచికాకుల వలన సన్నిహితులకు కలిగే బాధను ఎత్తి చూపుటకు. కాని ఆచార్యుని వ్యక్తిత్వం కలాన్ని ఎదురుగొట్టి వేరుగా రచనను సాగించినది.

నిత్యాన్వేషికి విరామ మెక్కడ? ఆచార్యుని సోషలిస్టుగా, అతివాదిగా నివాళు లెత్తిన యువకవర్గం కాలవాహినిలో తన అనుభవాలను జోడించుకుంటూ పురోగమిస్తున్న ఆచార్యరంగాను కొంత కాలమునుండి మితవాది (కన్సర్వేటివ్)గా భావిస్తున్నారు. ఆయనలో ఎన్ని చిన్నచిన్న మార్పులు కలుగుచున్నట్లు పైకి కనుపించినను అంతర్వాహిని మాత్రం ఒక్కటనునది తిరిగి అందరూ ఒప్పుకొను సంగతే. తదితర నాయకులవలె నినాదముల అతివాదం, నడతల మితవాదం ఆయనకు నచ్చనిపని. నమ్మిన విషయమును శాస్త్రీయదృష్టితో తరచి అందుపై వచ్చిన నిర్ణయమును కుండబద్దలు కొట్టినట్లు చెప్పటం ఆయన జన్మలక్షణం. ఈ రోజు ఆయన కాంగ్రెసులో సమిష్టి వ్యవసాయం విషయములో భేదించి మరొక అడుగు ముందుకిడి స్వతంత్రపార్టీ నేతృత్వభారమును వహించినారు. పురోగమన తిరోగమన నిర్ణయాలను కాలముకు వదలి వేయుట ఉచితం. ప్రవాహము ఒంపులను గురించికాదు ఆలోచించవలసినది; దాని పురోగమనమును గురించి. ఒంపులు తిరగనిచో నిలచిపోవటం మినహా పురోగమనమే సాగక పోవచ్చును. త్రోవలో నిలచే కొండలు, గుట్టలను అధిగమించ వలసినదే కదా!

# ఆచార్యరంగా - పత్రికవాణిజ్యాలు

## శ్రీ కె. రోశయ్య

వర్తక వాణిజ్యవర్గాలనగానే ప్రజల్లో ఒక రకమైన ఏవగింపు ఎంతో కాలంగా ఏర్పరుపబడియున్నది. ఇది ఒకనాటి పరిణామం కాదు. ఒకరిద్దరి చర్యలవల్ల కాదు. గత 13 సంవత్సరాలుగా మనం స్వాతంత్ర్యమును అనుభవిస్తున్నాం. అంతకుముందు స్వరాజ్య పోరాట దినాల్లో వర్తకులను కూడ తగిన మన్నన, గౌరవం వుంటూ యుండేవి. గాంధీజీ జీవించియున్నంత కాలం తగిన గౌరవ మర్యాదలు లేకపోయినా ఒకరకమైన స్థానం మాత్రం వుంది. ఎటొచ్చీ మహాత్ముని నిర్యాణానంతరం వర్తకులన్నా, పారిశ్రామికులన్నా ప్రజల్లో తీవ్రమైన భిన్నాభిప్రాయాలను కలుగజేశారు. ఎవరు కలుగజేశారు అనేది పెద్ద ప్రశ్న. ముఖ్యంగా ప్రజల్లో అలాంటి తప్పుడు అభిప్రాయాలను కలుగజేసిన, సృష్టించిన ఘనత ప్రథమంగా కాంగ్రెస్ వారికి దక్కుతుంది. తరువాతి స్థానం కమ్యూనిస్టు సోదరులది. మిగిలిన పార్టీలు ఇలాగే నామమాత్రంగా వున్నారు.

ఈ పరిస్థితి కమ్యూనిజం ప్రాథమిక స్థాయిలోవున్న దేశాల్లో వుంటుంది. కమ్యూనిజం బలపడినచోట అసలు వర్తకులనే వారే వుండరు. కాబట్టి వారికి ఎలాంటి మన్నన వుంటుందనే ప్రశ్న ఆ దేశాల్లో ఉదయించనే వీలుండదు. పాశ్చాత్య దేశాల్లో పారిశ్రామికులకు ఎంతో ప్రాధాన్యం కలదు. ప్రజాస్వామిక ముసుగులో యున్న మన భారతదేశంలో మాత్రం గత 13 సంవత్సరములుగా వర్తకులపట్ల ఏవగింపు క్రమేణా పెరుగుతూవచ్చింది, ఇటీవలి రెండు మూడు సంవత్సరాలలో దాని తీవ్రత మరీ ఉధృతమౌతోంది. ఇపుడు చూస్తే ఇంకో రెండేళ్ళలో వారి నామరూపాలు లేకుండా పోయేలాగున్నది పరిస్థితి. దీని కంతకూ కారణం కాంగ్రెస్ నాయకత్వధోరణి. కాంగ్రెస్ ప్రభుత్వాల విధానాలు. అంతేకాని మరేమీకాదు.

వ్యాపారాన్నికూడ ప్రభుత్వరంగంలోనే జరపాలనే ఆలోచన కాంగ్రెస్‌లో పండిత నెహ్రూ ప్రభృత అగ్రశ్రేణి రాజకీయవేత్తలకు ఎంతోకాలంగావుంది. కమ్యూనిస్టు విధానాలకు లొంగిపోయి ఈ తత్వాన్ని నెహ్రూపండితులు బాగా జీర్ణింప జేసుకొన్నారు. క్రమ క్రమేణా వారితత్వం, ఆలోచన కాంగ్రెస్ తన వార్షిక సభలలో జేసే తీర్మానాలరూపంలో బహిర్గతమైనవి. దీనికి వంతపాట పాడుచూ సెభాష్ అంటున్నారు కమ్యూనిస్టులు. ఇదే మా సిద్ధాంతంకూడ నంటున్నారు ప్రజాసోషలిస్టులు, సోషలిస్టులు తదితర సోషలిజం వంశజులందరూ.

వర్తక వాణిజ్యరంగాలంటే ఎంతటి ఏవగింపు ప్రజల్లో ప్రబలి వున్నా, సరకుచేయక, వారికివారుగా ప్రభుత్వ గుత్త వ్యాపార ధోరణిని ఎదిరించలేకపోతున్నా, వారి పక్షాన ఎలుగెత్తి మాటాడిన ఘనత ఆచార్య రంగాకు దక్కుతుంది. వారి సమస్యలకు ప్రాధాన్యతనిచ్చి గౌరవిస్తున్నారు. పదిమందిమాటకు చెల్లుబడి వుంటుంది కనుక నాకెందుకీగొడవ అనుకోకుండా ఏ వేదికనుండి మాట్లాడినా, పార్లమెంటు లోపలకాని, వెలుపలకానీ వర్తకుల పక్షాన ఎలుగెత్తి చాటుతున్న మహోన్నతవ్యక్తి ఆచార్య రంగా. కేంద్రరాష్ట్రప్రభుత్వ అక్రమపన్నుల విధానాలను, అనాలోచిత ధోరణలను ఎప్పటికప్పుడు ఖండిస్తున్నారు. నేడు వర్తక వాణిజ్యరంగానికి ఇంతకన్నా సన్నిహితుడుకాని, హితైషికాని లేడంటే అతిశయోక్తి కాజాలదు. కొందరుమాత్రం వర్తకుల సమావేశములలో మాట్లాడునపుడు వర్తకులు దేశసేవకులని, ఎవరిదయాదాక్షిణ్యాలపైన ఆధారపడ నవసరంలేని స్వతంత్రజీవన భృతులని శ్లాఘిస్తారు. ఎన్నికల సమయాల్లోమాత్రం ప్రతిఒక్కరూ కాంగ్రెస్‌వారుకాని, కమ్యూనిస్టుగానీ వాణిజ్యవృత్తిని శ్లాఘిస్తూ ఎన్నో ఆత్మద్రోహంతోకూడుకొనిన ఉపన్యాసాలు చేస్తారు. అవన్నికూడపబ్బంగడుపుకొనేందుకు మాత్రమే. వారి మనస్సులలో వర్తకవాణిజ్యాలంటే వీసమంతకూడా గౌరవం వుండదు. ఆలాంటివారు మన దురదృష్టంకొద్దీ, వారి అదృష్టంకొద్దీ

ఏ శాసనసభకో, లేక కేంద్రసభకో ఎన్నికైతే, ఆ తేదీ మొదలు వారి గడువు ఆఖరువరకు వర్తకజాతిని దూషించని ఘడియవుండదేమో? వర్తకులను ఎంతదూషిస్తే, దూషించిన వ్యక్తి అంత నాగరికులనిపించుకొంటారని వారి విశ్వాసం.

ఈ రకం ప్రవర్తన, నడత రంగాగారికి గిట్టవు. వర్తకుల సభలో పబ్బంగడుపుకొనేందుకు వారిని రాజులని, వారి సతులను రాణులని శ్లాఘించటం రంగాగారికి చేతకానిపని. వారి వృత్తిపట్ల తనకున్న గౌరవాన్ని మాత్రం ప్రదర్శిస్తున్నారు. వారికున్న సమస్యలమీద తీక్ష్ణంగా తన అభిప్రాయాలను విశదం చేయుటం ఆయనకు అలవాటు. వర్తకులలో తప్పులున్నా, దోషాలున్నా వారిని సమక్షంలోనే విమర్శించుటం ఆయనకు ఉగ్గుతో పెట్టిన విద్య. ఒక్కమాటలో చెప్పాలంటే ముఖస్తుతి ఎరుగని యదార్థమిది. "యదార్థవాది లోకవిరోధి" సామెత ప్రత్యేకంగా మన తెలుగు గడ్డకు సంబంధించినదే. అందుకనే ఏనాడో, దేశాన్ని మొత్తాన్ని తన ఆధిపత్యంక్రింద నడిపింపగల చరిత్ర, సామర్థ్యం, ప్రతిజ్ఞ, అనుభవం అన్నీ వుండికూడ, ఉన్నత రాజకీయ పదవుల నధిష్టింపలేకపోయారు రంగాగారు.

వర్తక, వాణిజ్యాలంటే రంగాకి ఇంతటి అపార గౌరవాదరాలు ఎందుకున్నవో పరిశీలిద్దాం. ఎన్నికలలో, లేదా పార్టీ ఆర్గనైజేషన్‌కు వర్తకులు ఆయనకు ఆర్థికంగా సహాయపడుతారనా? కాదు. ముప్పది ఐదు సంవత్సరాలుగా తన సర్వస్వాన్ని, సుఖశాంతులను, ఆస్థిపాస్తులను త్యజించి అహర్నిశాలు, అహోరాత్రులు ఏ రైతు కూలీ ప్రజల కొరకై శ్రమిస్తున్నారో వారు, ఆ రైతు కూలీలు ఆయనకు నిండైన సహకారాన్నిస్తున్నారనా? వర్తకులపై ఆశలు పెట్టుకునేందుకు రైతు కూలీలు సరిగా అర్థం జేసుకొనలేక పోయారనే చింత రంగాజీకి 35 సంవత్సరాల అనంతరం నేటికికూడా లేదు. లేకపోవటం మిక్కిలి ఆశ్చర్యకరం! బాధ, విచారం మాత్రం వున్నయ్. అవికూడ ఎందుకు? రానున్న సంవత్సరాలు రైతులకు, కూలీలకు, చేతివృత్తులవారికి, చిన్న

దుకాణదారులకు, బుద్ధిజీవులకు—వీరందరకుగడ్డువత్సరాలే అనిమాత్రం-ఈ విపత్తులనుండి వారిని ఎలా ఉద్ధరించాలా అనే తీవ్రమైన ఆలోచన మాత్రం రంగాజీలో వుంది. ఇంకా రగులుచున్నది. వారిదొక విచిత్రమైన మనస్తత్వం. వర్తకులమీద వారికి ఏమీ పేరాసలు లేవు. వర్తకులు నిజాన్ని నిజంగా అర్థంచేసుకొంటే అదే ఆయనకు పదివేలు. అదే ఆయనకు పరమ సంతోషం. రంగాజీకి వర్తక వాణిజ్యవర్గాలపట్ల గౌరవం ఇటీవల కలిగిందికాదు. ఆయన రాజకీయ జీవితారంభంనుండి క్రమేణా వృద్ధిజెందుతూవచ్చింది. విదేశాల్లో ఉన్నతవిద్య నభ్యసించి స్వదేశం రావటంతోనే దేశంలో హెచ్చుమందిగా అంటే నూటికి 75, 80 మంది దనుకయున్న రైతు కూలీప్రజలపట్ల నిల్చున్నారు. కాలగమనంలో ప్రతి ముఖ్య ఘట్టంలోను రంగాజీ తన ధర్మాన్ని నిర్వర్తించారు. దాంతో భారత దేశంలోనే గాక, ప్రపంచం నలుమూలలా కూడ రంగా, రైతు రంగాగా కీర్తికెక్కారు. దీన్ని అవకాశంగా దీసుకొని రంగాగారి రాజకీయ ప్రత్యర్థులు రంగా రైతు కూలీలకు తప్ప ఇతరులకు విరోధిగా చిత్రించారు. విద్యాధికులకు, చేతివృత్తుల వారికి, వర్తకులకు ఆదినుండి రంగాజీ తన సిద్ధాంతంలో సముచిత స్థానాన్నిచ్చి గౌరవించారు. అయినను వాస్తవం తెలియనివారు రంగా కేవలం రైతుల మనిషి అనుకొన్నారు. రంగాగారు తన సిద్ధాంత ఔచిత్యాల గురించి, వివిధ ప్రజోద్యమాల గురించి అనేక గ్రంథాలు అటు ఆంగ్లంలోను, ఇటు తెలుగులోను రచించారు. దాదాపు వారి రచన లన్నింటిలోను, వర్తక వాణిజ్యాల ప్రాముఖ్యతను ఉగ్గడిస్తూ, వారు దేశానికెలా ఉపయోగపడుతున్నారో వివరించారు. ఈ విషయాలన్నీ వారి గ్రంథాలు చదివి వారి ధోరణి తరచి చూచిన వారికిగాని అర్థమయ్యేవికావు. అంతే కాని రంగా వ్యాపారులకు విరోధి అని ఏవరైనా అంటే నిజమే కాబోలునని నమ్మి వూరుకొనే మామూలు వారికి యథార్థం బోధపడదుగదా ?

ఇంకో విషయమేమంటే రంగాగారు రైతుల ఉత్పత్తులకు తగిన ధరలు కావాలంటారు కనుక వర్తకులకు వ్యతిరేకి యంటారు. ఇది

కేవలం అర్థంలేని వాదన. వ్యాపారమంటే వర్తకుడు కొనుగోలు ధర పైన న్యాయమైన, యుక్తమైన లాభాన్ని వేసుకొని అమ్మటమేకదా! రైతు ఉత్పత్తికి హెచ్చు ధరలిస్తే ఆ ధరలమీద వ్యాపారి తన లాభాన్ని వేసుకొంటాడు. అంతేకాని రైతుల ఉత్పత్తులకు సహేతుకమైన ధర ముట్టాలనటం వర్తకులకెలా చేటో తెలియదు. అంతేకాదు రంగాగారు ప్రతి పర్యాయం కూడ వర్తకుడు రైతునుగాని, రైతు కూలీనిగాని, ఎవరైనా మరొకరిని దోపిడీ చేసుకొన గూడదని హితవు చెప్తుంటారు. దోపిడీ విధానానికి ఆయన పూర్తి వ్యతిరేకి. అంతే కాకుండా స్వేచ్ఛగా తన జీవనభృతికై మరొకరిపై ఆధారపడకుండా స్వతంత్రంగా జీవించే వ్యక్తులంటే రంగాగారికి అపారమైన ప్రేమ. అలాంటివారే దేశానికి నిజంగా కావలసిన వారంటారు. ఒకానొక సభలో రంగాజీ అన్న క్రిందిమాటలు చూస్తే వర్తకులంటే రంగా గారికి ఎలాంటి ప్రేమవున్నదో స్పష్టంకాగలదు.

"వర్తకులు తమ పొట్టకూటికి మరొకరి ముందు చేయిజాపరు. అవకాశమున్నంతలో ఏదో ఒకరకమైన చిన్నవ్యాపారం జేసుకొం టాడు. దాంతో తన సంసారాన్ని బ్రతికించటమే కాక ఇతరులను కూడ కొందరను బ్రతికిస్తాడు. దేశంలో ఏ ప్రాంతంలో ఏ పంట ఎంత పండుతుందో ప్రభుత్వం కోట్లరూపాయల వ్యయంతో తెలుసు కొనే దానికంటేకూడ జాగ్రతగా తెలుసుకొంటాడు. దానికి మంచి మార్కెట్ ఎక్కడవుందో విచారిస్తాడు. వారికే చోట కొని, లేని చోటికి తరలిస్తాడు, తనలాభం తను చూచుకొంటాడు. ఇలా చేయు టంలో మూడు, నాల్గు కర్తవ్యాలు నిర్వర్తిస్తున్నాడు. (1) ఉత్పత్తి దారులకు ధరలు చెల్లిస్తున్నాడు. (2) లోటు ప్రాంతంలో ప్రజలకు అందజేస్తున్నాడు. (3) ప్రభుత్వానికి జీతభత్యంలేని ఏజంటుగా వుండి పన్నులు వసూలుచేసి చెల్లిస్తున్నాడు. (4) తన సంసారానికి జీవనభృతి కల్పించు కొంటున్నాడు. ఇందులోను మరొకరి అధికారం సహించడు. స్వేచ్ఛగా బ్రతుకుతాడు ఇదంతా మంచిదంటాను నేను. ఇలాంటి స్వేచ్ఛాజీవులంటే నాకు ఇష్టం. కాని ఇలాంటివాడు "దేశ

ద్రోహులు-దొంగలు'' అంటారు కాంగ్రెస్‌వారు, జనహారు పండి తుడు. వీరినందరిని ప్రాడగొట్టి సహకార సంఘాలద్వారాను, స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ ద్వారా వ్యాపారం సాగించాలంటున్నారు కాంగ్రెస్‌వారు. అది తప్పంటాము నేను రాజాజీ, తదితరులం''. ఇది వినినవారికి చదివినవారికికూడ రంగాగారి దృక్పథం సుస్పష్టంగా గోచరం కాగలదు.

వ్యాపారులు ఒక్కవిషయాన్ని దీర్ఘంగా యోచిస్తే నిజం తెలియగలదు. రంగాజీకి వర్తకులన్నా, వ్యాపారులన్నా సదభి ప్రాయం లేకపోతే ఇలా చెప్పవలసిన పనిలేదు. వారి ఓట్లకోసం మాత్రమే అయితే-చెడుగా అనరుగాని మంచిగా చెప్పవలసిన పని లేదు. వర్తకులపట్ల ఏహ్యాభావముంటే ఏహ్యాభావమున్నట్లు వ్యక్తం జేయనవసరం లేదు. వర్తకులను గురించి ఏమీ మాట్లాడకుండావుంటే అంతేచాలు. కాంగ్రెసు పెద్దలు ప్రభుత్వాలు వర్తకులపని పట్టానే వున్నారుగదా? ఎన్నికలకు ముందు మీకు నేను వ్యతిరేకినికాను. కాంగ్రెసువారు మీకు వ్యతిరేకులని చెపితే ఆపబ్బం గడుస్తుందిగదా! కనుక రంగాగారిది పబ్బంగడుపుకొనే ఆలోచన ఎంతమాత్రంగాదు. ఇంతేగాకుండా రంగాగారు తాను అధ్యక్షుడుగావున్న స్వతంత్ర పార్టీ ఆశయాలలోగూడ వర్తకవాణిజ్యాలకు తగిన స్వేచ్ఛవుండాలని తమ విధాన ప్రకటనలో సూచింపజేశారు. ప్రైవేటు రంగానికి ప్రోత్సాహం, మంచి ప్రోద్బలం ప్రభుత్వములు కల్పించాలని స్వతంత్రపార్టీ ఆశయం. ప్రభుత్వమే వ్యాపారరంగాన్ని సంపూ ర్ణంగా ఆక్రమించుకొంటే లక్షలాది వర్తకులు నిరుద్యోగులై పోయే ప్రమాదం వుంది. అంతేకాకుండ చిన్నచిన్న పరిశ్రమలు వ్యాపారం కూడ ప్రైవేటు వ్యక్తుల యాజమాన్యంలో నడచినంత సమర్థవంత ముగా ప్రభుత్వం తానుగా నడిపించలేదని స్వతంత్ర పార్టీ వాదం. ఇలాంటి సదాశయాలు గలిగినందున స్వతంత్రపార్టీ మంచిది కాదం టారు కాంగ్రెస్ వారు.

ఈ విషయాలు ఆలోచించుకొని యెవరు ద్రోహులో నిర్ణ యించుకొనవలసినవారు వ్యాపారులు. వెనుకటికి ఒక సామెత వుంది,

''గొర్రె గొల్లను నమ్మదు – కటికవాడిని నమ్ముతుంద''ని. వర్తకులు ఈ సామెతను వారి వ్యవహారంలో నిజమనిపించుకోరాదు. ఏ రాజకీయపార్టీ, ఏ నాయకుడు అవకాశవాదో, ఎవరు నిజాయితీపరులో, ఎవరు దేశానికి కావాలో నిదానంగా ఆలోచించుకొని నిశ్చయించుకొంటే రంగాగారు వర్తకులకెంతటి సన్నిహితులో అర్థం కాగలదు. సిద్ధాంతాలు, ఉపన్యాసాలతోనే కాక ఆచరణంలోకూడ రంగా యెలాంటివారో ఒకటి రెండు విషయాలు యోచిస్తే తెలియగలదు. 1960 ప్రారంభంలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వ్యాపారుల గల్లాపెట్టెలను కూడ తనిఖీచేసే అధికారాలు కూడ అమ్మకం పన్ను శాఖాధికారులకు దఖలుచేస్తూ ఒక బిల్లు ముసాయిదా ప్రకటించింది. అది పిచ్చివాని చర్య అని అన్నారు రంగాజీ. వర్తక జాతిని మేల్కొల్పి తోడున్నారు. వర్తకుల వాదన నెగ్గింది. ఆ అవాంతరం తప్పిపోయింది. 1960 అక్టోబరు 1 నుంచి మెట్రిక్ తూకాల వాడకాన్ని నిర్బంధం చేసింది కేంద్ర ప్రభుత్వం. ప్రభుత్వం ప్రజలకు తూకాల మార్పిడి గురించి అర్థమయ్యే రీతిలో ప్రచారం గావించలేదు. వర్తకులకు వలసిన రాళ్ళు లభ్యమగుటకు ప్రభుత్వం తగిన ఏర్పాట్లు ఏ మాత్రం కూడ చేయలేదు. సెప్టెంబరు 25 న ఈ సందర్భంగా గుంటూరు జిల్లా అఖిలవర్తక మహాసభ నొకదానిని ఏర్పరచుకొన్నాం. రంగాగార్కి కనీసం ఆహ్వానంకూడా పంపలేదు. విజయవాడ ప్లాట్‌ఫారం మీదకు ఢిల్లీనుండి 25 ఉదయం దిగారు. తెనాలిలో మెట్రిక్ తూకాల సందర్భంలో సభ జరుగుతుందని విన్నారు, అంతే— దింపించిన సామాను తిరిగి బండిలోకి ఎక్కించి తెనాలి చేరారు. అయాచితంగా సభకరుదెంచి, ప్రజలపట్ల, ముఖ్యంగా వర్తకులపట్ల తమకున్న ప్రేమాదరాలను వ్యక్తం జేసుకొన్నారు. భారతదేశంలో ఒక ప్రధానమైన జాతీయ పార్టీకి అధ్యక్షులుగా వుంటూ ఇలా ప్రజా సమస్యలపట్ల తమ కర్తవ్యాన్ని నిర్వర్తించే వారు ఇంకొకరుండరేమో!

# నా ముప్పది సంవత్సరాల మైత్రి

## ప్రొఫెసర్ దీనాస్టాక్

ఆక్సుఫర్డులో విద్య నభ్యసించేటప్పుడు నాకు ఆచార్య రంగాతో మొదటి పరిచయం ఏర్పడింది. నాకంటె ఆయన వయస్సులో కొంచెం పెద్ద. అప్పటి సంఘటన ఒకటి నాకు బాగా గుర్తువుంది ఇప్పటికీ. బహుశ 1924లో కాబోలు మేమంతా మజ్లిన్ చర్చా సదస్సులో పాల్గొంటున్నాం. "భారత దేశంలో మహాత్మాగాంధీ ప్రభావం నేడిక లేదు" అన్నది చర్చాంశం. అప్పుడు ఆమాట హాస్యాస్పదంగానే కన్పించవచ్చు. కాని అదే నెగ్గింది. ఆరోజుల్లో ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో చదువుతున్న భారత విద్యార్థుల నిశ్చితాభిప్రాయం అది. వారి దృష్టి యావత్తూ ఐ. సి. యస్. వైపే వుండేది. వారు పాశ్చాత్య దృక్కోణంలోనుంచి మాత్రమే భారత దేశాన్ని చూడగలిగేవారు. కాని, రంగాజీ ఆతీర్మానాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు. తర్వాత సంభాషణలో ఆయన యిలా అన్నారు: "నేను భారతభూమిలో పుట్టి పెరిగాను. గ్రామీణులతో కలిసి విడిగా మాట్లాడాను. పారిశుద్ధ్యం, ఆరోగ్యం, గృహవసతి మొదలగువాటిని గురించి క్రొత్త క్రొత్త సంగతులు వారికి తెలియజెప్పడానికి ప్రయత్నించాను. నే వెళ్ళిన ప్రతి చోటా 'గాంధీజీ దీని విషయంలో ఏమన్నారు?' అని నన్ను ప్రశ్నించేవారు. గాంధీజీ దీనికి సుముఖులేనని నేను చెప్పజాలని పక్షంలో ఇక వారితో ప్రసంగించడంవల్ల ప్రయోజనమేమీ ఉండేది కాదు." సామాన్య భారత ప్రజానీకంగురించి యదార్థవిషయాలు బాగా తెలిసి వుండి సాధికారంగా మాట్లాడగలిగిన యువ భారతీయులు ఆనాడు ఆక్సుఫర్డులో ఎక్కువమంది లేరు.

ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో ఉండేరోజుల్లోనే రంగాజీ ఏదో మహాత్కార్యాన్ని సాధించడానికి కృతసంకల్పులైనట్లు విదిత

మయ్యేది. సాధారణంగా విద్యార్థులు తహతహ పడేరీతిగా రంగాజీ నలుగురు తనను గుర్తించాలని ప్రయత్నించే వారు కాదు. కేవలం జీవితపథం గురించి ఆయన తీవ్రంగా ఆలోచించేవారు కాదు. ఆయన ఏదైనా సూత్రభావానికే ప్రాధాన్యం ఇచ్చేవారు. భారతావని కేవలం మేధావుల దేశం కాదని, అది రైతాంగ దేశమని రంగాజీ విశ్వాసం. ఉపేక్షితుడుగా వుంటున్న రైతు నిజపరిస్థితిని తెలియ పరచడంలోనూ, రైతుజీవితాన్ని అభివృద్ధి చేయడంలోనూ తన సేవను లగ్నం చేసుకోవాలని ఆయన గుర్తించారు. సామ్రాజ్యవాద వ్యతిరేక భావానికి చిహ్నప్రాయంగా వుండే యీ క్రొత్త ఆశయం గురించి ఏమీ తెలియనివారు మొదట చాలా ఉద్రేకంపొంది, తిక మకపడి చివరకు ఆయనద్వారా విషయాన్ని సాకల్యంగా అవగాహన చేసికొని విజ్ఞతాయుతమైనదని ప్రస్తుతించేవారు. ఆయనతో మేము అనేకసార్లు చర్చలు జరిపాం. ఆయనకు గొప్పగొప్ప భావాలు మెరు పులవలె తృటిప్రాయంలో స్ఫురిస్తాయి. ఏదైన విషయం ఇతరుల మనస్సులో ఒకస్వరూపాన్ని పొందక పూర్వమే, రంగాజీ దానిని గురించి, దానికి సంబంధించిన చక్కటి సమాధానం ఇచ్చేవారు. కాని ఆయన సిద్ధాంతాలపేరుతో వాదనకు దిగేవారు కాదు. ఏ విషయాన్ని గురించైనా రంగాజీ నిర్భయంగా ఆలోచించగలరు. అయితే ఆ విషయానికి ఆలంబనమైన భావాన్ని కార్యరూపంలోకి తెచ్చేవారిని, ఆవిషయం వర్తించేవారిని దృష్టిలోవుంచుకుని ఆలో చించేవారు. 'స్వరాజ్యం' అంటే ముఖ్యంగా కర్షకుల స్వరాజ్యం అని తర్వాత ధనికుల, భూస్వాముల, రాజకీయవేత్తల స్వరాజ్యం అని ఆయన నమ్మేవరకు జాతీయవాద్యముల గురించి ఆయన యిదమిత్థ మైన అభిప్రాయం వెలిబుచ్చలేదని నా నమ్మిక.

తరువాత చాలకాలం వరకు ఆయన కన్పించలేదు. అప్పు డప్పుడు ఉత్తరం మాత్రం వస్తుండేది. తద్వారా ఆయన క్షేమ సమాచారాలు తెలుస్తుండేవి. తిరిగి 1930 లో రంగాజీని కలుసు కున్నాను. ఒక సోషలిస్టు మాసపత్రికకు సంపాదకీయ బాధ్యత వహిస్తూ

న్నాను. కార్యాలయం లండను మహానగరం మధ్య ఒక పాత గదిలో వుండేది. మా పత్రికకు భారతదేశంనుంచి వచ్చిన ఒకవార్త చదువు కుంటూ దాని అర్థం గురించి ఆలోచిస్తున్నాను. అప్పుడు రంగాజీ గది లోకి వచ్చారు. ఆ వార్త మీద మేము ఒకగంటసేపు సంభాషించు కున్నాం. రంగాజీ ఆవార్త అర్థాన్ని విశదపరచారు. గ్రామీణులే ఈ సారి ఉద్విగ్నహృదయులై, తాము విశ్వసించిన ఆదర్శంకోసం పోరాటం సాగిస్తున్నారని ఆయన వివరించారు. భాష పటిమగాని, రచనాపాటవంగాని యీ అర్థాన్ని తెలుసుకోవడానికి తోడ్పడలేక పోయాయి. వలస ప్రజల అభిప్రాయాలను, సమస్యలను పరస్పరం తెలుసుకోవడానికి లండను నగరంలో 'వర్ణజాతుల సమితి' అనే పేరుతో క్రొత్తగా ఒక సంఘాన్ని ఆసియా, ఆఫ్రికా దేశాలవారు ఏర్పాటు చేస్తున్నారని, ఆ ప్రతినిధుల సమావేశంనుంచి తాను వస్తున్నానని రంగాజీ మాటల సందర్భంలో చెప్పారు. అది చక్కటి ఆలోచన అని నేనను కున్నాను. ఆ సమితి సంస్థాపనకు రంగాజీ యెంత తోడ్ప డిందీ కొన్ని సంవత్సరాల తర్వాత నేను గుర్తించ గలిగాను.

కారాగారవాసం నిమిత్తం తాను భారతదేశం తిరిగి వెళ్ళాలని రంగాజీ అన్నారు. అవును! గాంధీ మహాత్ముని అడుగుజాడలలో నడవాలని తాను చెప్పే స్త్రీ పురుషులు ఎంతో మంది లాఠీ దెబ్బలకు గురి అవుతూ, జైళ్ళలో బంధింపబడుతుండగా రంగాజీ మాత్రం దేశం తిరిగి వెళ్ళకుండా వ్రూరుకోగలరా ? అట్టి ఉత్సాహోద్రేకాలు భారత దేశంలో సర్వవ్యాప్తంగా కన్పిస్తాయి. కాని నా పాశ్చాత్య అనుభవం పరంగా చూస్తే నాకు అవి ఏవో ప్రాచీన గ్రంథాలలో లిఖితమైవుండే అంశాలుగా తోచాయి. రంగాజీ అక్కడ ఆసీనులయ్యారు. గురుతర కార్య భారాన్ని గురించి ఆలోచిస్తున్నారు. కార్యరంగంలోకి దూక డమా మానడమా అన్న సమస్య ఆయనకులేదు. కాబట్టి భావి కర్తవ్యాన్ని నిర్ణయించుకోవడం కన్నా ఆ కర్తవ్య స్వరూపాన్ని తీర్చిదిద్దుకోవడం గురించి ప్రశాంతంగా తలపోస్తున్నారు. అప్పటి ఆయన మూర్తిని చూస్తుంటే, భారత దేశం పునరుజ్జీవనం పొందడం

అన్నది మూగపోవుతున్న ప్రపంచంలో సత్యమే చైతన్యవంతమవడం అనిపించింది. తర్వాత రంగాజీ మాతృభూమికి తిరిగి వెళ్ళారు. ఆయన జైలులోనుంచి నాకు లేఖ వ్రాశారు.

తిరిగి 1937లో మేము కలుసుకో గలిగాం. ఈసారి భారత దేశంలోనే కలుసుకున్నాం. కాంగ్రెసు రాష్ట్ర ఎన్నికలలో విజయం సాధించి, పరిపాలనా భారాన్ని స్వీకరించడమా లేదా అన్నది యింకా నిర్ణయించుకోలేదు. ఆ తరుణంలోనే నేను భారతదేశ సంచారం ప్రారంభించాను. "భారత ప్రజానీకం జరుపుతున్న కార్యకలాపాలను తెలుసుకోవాలంటే నా వెంట రండి" అన్నారు రంగాజీ. సరేనన్నాను. కాంగ్రెసువారిని, కిసాన్ సభ మార్గదర్శకత్వంక్రింద కార్యక్రమాన్ని సాగిస్తున్న సోషలిస్టులను, కమ్యూనిస్టులను దేశం నలుమూలలా తిరిగి చూశాను.

ఆ ప్రచారయాత్రలు నిర్విరామంగా తుఫానువలె సాగాయి. క్రిక్కిరిసిన మూడో తరగతి రైలుపెట్టెలలో ప్రయాణించేవారం. ఊగిసలాడే పాత కార్లలో గ్రామాలలోని సందులవెంట వెళ్లేవారం. రంగాజీ తీరిక అంటూ లేకుండా, విసుగు ఎరగకుండా పనిచేసేవారు. వెళ్ళిన ప్రతిచోటా కమిటీలను ఏర్పాటుచేయడం, స్థానిక నాయకులలో తలయెత్తిన స్వల్పభేదాభిప్రాయాలను తొలగించడం, పెద్దపెద్ద బహిరంగ సభలలోను, చిన్నచిన్న గ్రామ సమావేశాలలోను ప్రసంగించడం— ఇలా వుండేవి రంగాజీ పనులు. "రైతు సోదరులారా! మీరంతా ఏకంకండి! మీరంతా కలిసిబలసంపన్నులుగాను, ప్రయోజనులుగా ఉంటేతప్ప భారతదేశం దాస్యశృంఖలాలను ఛేదించుకోలేదు" అని ఉద్బోధించేవారు రంగాజీ. దేశంలో జరుగుతున్న కార్యకలాపాల వివరాలు నాకు అంతగా తెలియకపోవచ్చు, కాని రంగాజీ అందించే సందేశం, దానిపట్ల ప్రజలుచూపే ఉత్సుకత, గౌరవభావం, నాకు బాగా అవగతమయ్యాయి. చేయవలసిన పని ఎదురుగా ఉన్నప్పుడు రంగాజీ నిద్రాహారాలను గురించి ఆలోచించేవారే కాదు. కొంచెం సేపైనా విశ్రాంతి తీసుకోదలచేవారే కాదు.

మా ప్రయాణాలలో ఎప్పుడైనా లభించే స్వల్ప విరామంలో, గత ఏడుసంవత్సరాలలోను జరిగిన కృషిని గురించి కొంత తెలుసు కున్నాను. ఆంధ్ర రైతాంగ విద్యాలయాలు, వేసవి పాఠశాలల గురించి తెలుసుకున్నాను. సుశిక్షితులై, ప్రజా క్షేమానికి సంబంధించి శ్రద్ధతో కృషిచేయగలవారిని ఈ సంస్థలు గ్రామసీమలకుపంపేవి. వ్యవసాయ ఋణాలను మాఫీచేయాలని కోరారు. కిసాన్ యాత్రలు జరిగాయి. వందలాది గ్రామాల ప్రజలు ఈ యాత్రల ఫలితంగా ఏక మయ్యారు; వారంతా సుసంఘటితు లయ్యారు, సహేతుకమైన కారణాలు చూపుతూ ప్రభుత్వాధికారులకు ఇదబద్ధమైన అభ్యర్థనలు తెలుపుకో గలుగుతున్నారు. చేనేత కార్మికులకు పని లభించింది. గ్రామసీమకు సంబంధించిన ప్రతి చిన్నవిషయాన్ని రంగాజీ శ్రద్ధగా గమనించేవారు. దానిని తమ ఉద్యమభాగంగా చేర్చుకునేవారు. చీలికలకు అవకాశంలేదు. వైషమ్యాలు క్రమంగా సమసి పోయాయి. ఉద్దీపనం కల్గించగల మార్గదర్శకమైన ఆదర్శం ప్రత్యక్షంగా వున్నప్పుడు ఆచరణ పూర్వకమైన కృషి ఎంత త్వరితగతిలో జరిగిందో, దానిమూలంగా రంగాజీ భావించిన రాజకీయ సత్యాదర్శాలు ఏ విధంగా బలపడ్డాయో నేను స్వయంగా చూశాను.

అట్టి రోజులు ఎక్కువకాలం సాగవు. ఇంతలో యుద్ధజ్వాలలు ప్రజ్వరిల్లాయి. కమ్యూనిస్టులు విడిపోయారు. 'క్విటిండియా' ఉద్యమం ప్రారంభమయింది. ''కాంగ్రెసు నాయకులందరూ ఇప్పుడు ఖైదులో వున్నారు. రైళ్ళు, తంతి తపాలాలు సరిగా పనిచేయని కారణంగా నాకు పదిహేను రోజులపాటు విరామం లభించింది'' అని రంగాజీ లేఖ వ్రాశారు. తర్వాత మహాత్మాగాంధీ ఖైదు కావడంతో దేశం అంతటా ఆందోళన పెల్లుబికింది. అయితే దీనిని గురించి ఇంగ్లాండు ప్రజలలో ఎక్కువమందికి తెలియదు. దీనిని వారు తెలుసుకోడానికి యత్నించలేదు. పిమ్మట కొంతకాలం ప్రశాంతంగా గడిచింది.

రంగాజీవంటి మేధావి కారాగారంలోవున్నా ఆ కాలం వృథా పోదు. అచ్చట ఆయన సృజనాత్మకమైన కృషిజరిపారు. అది

ఆయనకు పరిశోధనకు లభించిన అవకాశంగా ఉపకరించింది. ప్రపంచ భవిష్యత్తులో కర్షకుడు, అతని స్థానంగురించి రంగాజీకి యిదివరకటి కంటె సుస్పష్టమైన అభిప్రాయాలు ఏర్పడ్డాయి. మార్క్సిసిద్ధాంతాలలోవున్న లోపం ఏమిటి? మానవుని మనుగడకు కావలసిన వుత్పత్తిచేసి కృషీవలున్ని మానవ సమాజంలో ప్రధానమైన భాగంగా మార్క్సిజం గుర్తించడంలేదు. పెట్టుబడిదారి వర్గానికి, కార్మిక వర్గానికి మధ్య పోరాడం వుండనేవుంది. అంతకంటె చాలా విపరీతమైన విషయం—పారిశ్రామిక తత్వానికిచెందిన వర్గానికి కర్షక వర్గాన్ని లొంగుబాటుచేయడం. పారిశ్రామిక వర్గం బలీయమైనది, సువ్యవస్థితమైనదికూడ. ఈరెండు వర్గాలు సమతుల్యంగా వుండేటట్లు చేయాలి. కర్షకునకు అర్హమైన ప్రతిపత్తి సమకూర్చి సమాజధర్మాన్ని పునర్నిర్మించుకోవాలి. అప్పటివరకు ప్రపంచంలో శాంతిసౌభాగ్యాలు నెలకొనలేవు. ఇదే స్వతంత్ర భారత దేశానికి, వలసదేశాలకు మధ్యగల అనుబంధసూత్రం! ఇదే జాతి సమానత్వానికి, మానవన్యాయసాధనకు రాజబాట!

పరిస్థితులను చూస్తూ మిన్నకుండే వ్యక్తికాదు రంగాజీ. 1946 లో తిరిగి ఆయనను లండనులో కలుసుకున్నాను. ప్రపంచ చిన్న తరహారైతుల మహాసభకు ఆయన భారత ప్రతినిధిగావచ్చారు. ప్రపంచ ప్రజలకు కావలసిన ఆహారంలో ఎక్కువ భాగం పండించి అందజేస్తున్నప్పటికీ నిపుణుల దృష్టిలోనికి రాకుండా వుండిపోతున్న లక్షలాది చిన్నతరహా కర్షకుల కష్టనిష్ఠూరాలను రంగాజీ భారత దేశం పరంగా వివరించారు. ఈ సందర్భంలోనే ఆయన లండను నగరంలో వలస ప్రజల ప్రతినిధులను కలుసుకున్నారు. వారి వివిధసమస్యలను తెలుసుకున్నారు. తన చిరకాలానుభవం రాజనీతిజ్ఞత నాధారంగా వారితో సంప్రదింపులు జరిపారు.

పిమ్మట భారతదేశం స్వరాజ్యం సాధించుకున్నది. ఆ తర్వాత వచ్చిన పరిణామాలను గురించి మీ అందరకూ తెలిసిందే. ఇంకా నాకంటే మీకే ఎక్కువ తెలిసివుండవచ్చు. కలహాల కాలం వంకర

అడుగులతో నడుస్తోంది. రాజకీయ వైషమ్యాలు ప్రబలిపోయాయి. నానాటికి సత్సంబంధాలజాడలే మరుగై పోతున్నాయి. ఇట్టి వాతావరణంలో సయితం రంగాజీ వైషమ్యాలకు అతీతులుగానే వుండగలిగారు. రాజకీయ స్వప్న జగత్తులో విహరించాలనే వ్యక్తి కాదాయన. అయితే నాయకుడుగా వున్న వ్యక్తి ఎప్పుడైన తప్పుచేస్తే చేయవచ్చు. కాని వాస్తవానికి తానుతీసుకున్న ఏదో ఒక నిర్ణయం తప్పో, కాదో అన్న సంగతి కొన్ని సంవత్సరాలు గతించితేతప్ప తెలియదు. ఒక్కొక్కప్పుడు ఎప్పటికీ తెలియకపోవచ్చుకూడా. ఒకటి మాత్రం నిత్య సత్యం—స్ఫూర్తివంతమైన విషయ పరిశీలనాశక్తి దూరపుదృష్టి వివేచన కలిగివుండి, తనకు ప్రత్యక్షంగా గోచరించే వాస్తవాంశాలనే సదా గమనిస్తూవుండి, పదవీ వ్యామోహానికి దాసుడు కాకుండా నిలిచి, స్వకీయమైన కీర్తిప్రతిష్టలకోసం ప్రాకులాడక, ప్రజా శ్రేయాభివృద్ధుల సాధనకై నిరంతరం కృషిసల్పడమే మహదాశయంగా భావించే ఆదర్శపురుషుని జీవితం లోపాలకు తావులేదు. ఆయన కృషి అమోఘమైన ఫలితాల నీయక మానదు.

అశేష ప్రజానీకానికి రంగాజీ ఆంధ్రుల మహానాయకుడుగా తెలుసు. ఆయన చేసిన సేవనుగురించి నాకు తెలిసింది చాలా స్వల్పం. అయినప్పటికి నాకు తెలిసినంతవరకు వ్రాయడానికి యత్నించాను. ఆయన విశాల దృక్పథంగల వ్యక్తి, గొప్ప మేధావి. అంతులేని శక్త్యుత్సాహాలతో మానవ కళ్యాణంకోసం కృషిసల్పే, మహనీయుడు. నేను పరిచయభాగ్యం పొందగలిగిన ఇద్దరు ముగ్గురు మహాపురుషులలో రంగాజీ ఒకరు.

# నాకు తెలుసు మీరు నమ్మరని

శ్రీ వి. వి. రమణ

నేను ఇంతవరకు రంగాజీని సరిగా అర్థం చేసుకోలేదంటే మీరు నమ్ముతారా? మీరు నమ్మరని నాకు తెలుసు. రంగాజీతో అనేక సంవత్సరాలు అతి సన్నిహితంగా మెలిగిన ఒక వ్యక్తినుండి ఇలాంటి అభిప్రాయం వ్యక్తమైతే ఎవరయినా ఎలా నమ్మగలరు? కాని ఇది మాత్రం నిజం.

రంగాజీ రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా వుండగా 1946 వ సంవత్సరాంతంలో ఆయనతో నాకు ప్రత్యేక సంబంధం కలిగింది. ఆ రోజులలో ముఖ్యమంత్రి పదవికంటె రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షపదవికి ఎక్కువ గౌరవం వుండేది. రైతు సమస్యలకోరకు పోరాడుతున్న యోధుడు రంగాజీ అని నేను వినడంవల్ల, వారితో ప్రత్యక్ష సంబంధం ఏర్పడకముందే వారంటే నాకు అభిమానం ఏర్పడింది. నేనుకూడా రైతుకులానికి చెందిన వాడినే. ప్రతిభావంతుడైన రైతు స్వామ్య వ్యవస్థాపకుడైన రంగాజీ ఆ తరగతికి చెందిన వ్యక్తిని విస్మరింపగలుగుతాడా? శ్రమజీవులైన కర్షక కుటుంబాలనుండి అనేకమంది వ్యక్తులను ఆయన నాయకులుగా చేసారు. ధైర్యం, నిస్వార్థసేవ ఆయన తన అనుచరులకు ఉగ్గుపాలతో రంగరించి పోసేవిద్య. ప్రస్తుత నా రాజకీయ జీవితానికి రంగాజీయే కారణమని, వారే నన్ను ఇంతవానిని చేశారని చెప్పటానికి గర్విస్తున్నాను. కాని సరిగ్గా, సమన్వయతతో ఆయనను ఇంకా అర్థంచేసుకోలేని పరిస్థితిలో వున్నాను.

కొన్నిసార్లు ఆయన ప్రతిభావంతుడైన పండితుడుగా కన్పిస్తారు. మరికొన్ని సమయాల్లో silly గా కూడ గోచరించడం కద్దు. ఇంకా మరికొన్ని వేళల పసిపిల్లవాడిలాగ ప్రవర్తిస్తారు. అనేక సంద

ర్భాలలో ఆయన పొరపాట్లకు కారణం ఈ పసిపిల్లవాడి మనస్తత్వమే (Child heart). ఈ తత్వమే తప్పుడు వ్యక్తులను ఆయన విశ్వసించేందుకు ప్రోత్సహించి, మోసం చేయించింది. పైగా అనేక పొరపాటు నిర్ణయాలకు మార్గం చూపింది కూడా. ఆయన ప్రభల విరోధికూడ చాకచక్యంతో వ్యవహరిస్తే రంగాజీ హృదయాన్ని జయించవచ్చు. రంగాజీ తీసుకున్న కొన్ని ముఖ్య నిర్ణయాలకు కూడా కారణం ఈ మనస్తత్వమే. ఈ నిర్ణయాలు తర్వాత తొందరపాటు నిర్ణయాలని కూడ రుజువు అయినవికూడ. రంగాజీ అంటే ఆప్యాయంగా వుండే అనుచరులు రంగాజీ ఈ పసిపిల్లవాడి మనస్తత్వం వల్లనే ఆయన అభిమానాన్ని చూరగొనలేక పోతున్నారు. అందువల్ల ఆయన తన అనుచరులపట్ల ఒక విధమైన పాక్షిక మనస్తత్వం ఏర్పరుచుకోవడం జరుగుతున్నది.

రైతుస్వామ్యం, స్వయంవృత్తుల సిద్ధాంతం మినహా ఆయన ఆర్థిక ఆలోచన స్పష్టంగా అగమ్యంగావుంది. రంగాజీవలె ఎక్కువగా చదివి, వ్రాసే తత్వం రాజకీయ నాయకులలో చాలా తక్కువ. రచయితలంటే ఆయనకు అపారమైన అభిమానం. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అంటే విశ్వాసమేకాదు, మనదేశంలోని అగ్రగణ్యులైన పార్లమెంటేరియన్స్‌లో ఆయన ఒకరు. గత 30 సంవత్సరాల నుండి ఆయన పార్లమెంటులోని ఉపన్యాసాలు, నడవడి, విశిష్టమైన, అగ్రగణ్యతకు చెంది కార్యదీక్షాదక్షతతో కూడుకున్నవని ఆయన పార్లమెంటరీ జీవితం రుజువు చేస్తున్నది.

ఆయన సిద్ధాంతాలతో ఏకీభవించనివారు కూడా ఆయన నిజాయితీకి, అతి సామాన్యతకు, కార్యదీక్షకు అభిమానించి గౌరవిస్తారు.

# గతమంతా ఒక ఎత్తు

## శ్రీ కాకుమాను తారానాథ్

రాజకీయాలలో అభిరుచి, ఆసక్తిగలవ్యక్తిగా ఆచార్య రంగా గారి వ్యక్తిత్వాన్ని, ధోరణిని పరిశీలించటం జరిగింది. కాని ప్రత్యక్షంగా గత ఎన్నికలలో ఆయనకు వ్యతిరేకంగా, అంటే కాంగ్రెసుకు వ్యతిరేకంగా పనిచేయటంవలన కొన్ని ప్రత్యక్ష అనుభవాలు, ఆయనను నిశితంగా పరిశీలించటానికి అవసరం కలిగాయి. వాటి ఫలితమే ఇది.

ఆచార్య రంగా ఒక అపూర్వ వ్యక్తి. జీవితంలో రాజకీయాలను ఆదర్శంగా ఉంచుకుని ఒక ఆచార్యుడుగా, కొన్ని సంస్థలను, కొంతమంది వ్యక్తులను తనవారినిగా చేసుకోగలిగాడు. తాను ఉన్న సంస్థకంటె భిన్నమైన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోగలిగాడు. అదే ఆయనకు కొంత స్తోమతును సమకూర్చకలిగింది. ఆయనకు మొదటి నుండి రైతాంగ సమస్యలంటే కల ఆసక్తినిగాని, ఆయనకు ఆరంగంలో గల విశేషానుభవాన్ని కాని ఎవరూ నిరాకరించలేరు.

కాని ఆయనకు గల కొన్ని advantages ఆయనకు కొంత నష్టాన్ని చేకూర్చాయేమోనని చెప్పవచ్చు. రాజకీయాలను శాస్త్రీయ దృష్టితో పరిశీలిస్తూ, Ideological basis మీద ఆయన తన ధోరణిని ఇంతవరకు నడుపూకోలేదేమోననిపిస్తుంది (ఇప్పటి స్వతంత్ర అవతరణమినహా). ఉదాహరణకు ఆయన, ప్రకాశంగారలు కాంగ్రెసు నుండి విడిపడటంగాని, తరువాత ప్రకాశంతో విడిపడటంగాని, బహుశా, ఆయన ప్రియతమ అనుచరగణానికికూడా అగమ్యగోచరాలేమో! ఆయన ఏమిచేసినా ఆమోదించి వెంటనడిచే అనుచరవర్గం ఉండటమే దీనికి కారణమేమో!

కాని గత పార్లమెంటు ఎన్నికలకాలంనుంచి ఆయన ధోరణిలో మార్పు కనపడింది. కొంతమట్టుకు ఆంధ్ర రాజకీయాలకుళ్ళులో నుంచి దూరంగా ఉండగలిగి, సమస్యలపట్ల నిష్పాక్షికదృక్పథంతో పరిశీలన ప్రారంభించారు. కాని ఆయన అనుచరవర్గమైన లచ్చన్న, కాకాని ప్రభృతులు నిరంతరసాగర మధనంలోపడి, ఏదో ఒకటి చేయాలి కాబట్టి డెమోక్రాటిక్ పార్టీగా అవతరించారు. అదే పద్ధతిలో తెనాలిలో సోషలిస్టు డెమోక్రాటిక్ పార్టీగా అవతరించారు. కాని భీకరగర్జనలను తలుచుకుంటూ, ఆనాటి శ్రీ పి. వి. జి. రాజు, కాకాని, బొమ్మకంటి, జి. సి. కొండయ్య, చెన్నారెడ్డి ప్రభృతులను కాంగ్రెసులోనూ లచ్చన్న, చంద్రమౌళి, ప్రభృతులను స్వతంత్రపార్టీలోనూ చూడగలుగుతున్నామంటే అది ఆంధ్రరాజకీయాలకు, తద్వారా భారత రాజకీయాలకూ చక్కటి ఉదాహరణ.

ఈ విషయాన్ని పరామర్శించటానికి కారణమొకటుంది. ఈనాడు స్వతంత్రపార్టీ ధర్మరాజ్య వ్యవస్థాపనాదర్శంతో, గాంధేయ ధోరణితో, వ్యక్తి స్వాతంత్ర్యరక్షణకాంక్షతో ఉద్భవించిందని చెప్ప బడుతుంది. దీనికి ప్రత్యక్షంగా వ్యతిరేకం కాకపోయినా, సోషలిస్టు వ్యవస్థ దీనికంటె భిన్నమైందనటంలో సందేహంలేదు. కాని దురదృష్ట వశాత్తు పైన చెప్పిన నాయకమ్మన్యులంతా ఒక్కరోజులో పైబట్ట కన్నా తేలికగా రాజకీయపు రంగును ఫిరాయించగలిగారు. తాము నూతనంగా చేరినవాటిల్లో నాయకులుకాగలిగారు. దీనిని అగ్రనాయకులు సహిస్తున్నారు. కాబట్టే తెనాలిలో స్వతంత్రపార్టీస్థాపన సమావేశానికొచ్చిన శ్రీ బాచిన సుబ్బారావు ఎం. ఎల్. సి తరువాత కాంగ్రెసు అయ్యాడు. దీనికి కారణం ఒకటే. సిద్ధాంతరీత్యాదృఢమైన దృక్పథం లేక రాజకీయాలంటే Pure and simple groupism కావటం. అందుకనే కొంతకష్టమైనా, సూటిగా చెప్పాలంటే, రంగాజీ ఇంతవరకు పక్షాలను నడిపారు. ఇప్పుడే ఉద్యమస్థాయిలో ప్రయత్నాలు చేస్తున్నారు నా అభిప్రాయంలో.

ఒకందుకు అభివందనాలు. ఈ వయస్సులో, ఈ దశలో, ఈ పరిస్థితులలో వ్యక్తిగత ఆకాంక్షలను త్యాగంచేసి తాను నమ్మినదాని కోసం ముందుకు దూకినందుకు ఆయన అభివందనీయుడు. కాని ఒక విషయాన్ని స్పష్టం చేయటం అప్రస్తుతంకాదను కుంటాను. కేవలం. ఇంతవరకు స్వతంత్ర దృక్పథం వ్యతిరేకాత్మకంగా (nagative) గా. ఉంది. ధర్మరాజ్యమంటే ఏమిటి? ఆ వ్యవస్థలో నేటి సంస్థల స్థానమేమిటి? ఈ అనుచర వర్గంతో అది సాధ్యమా? ఇవే నేడు రంగాజీ నెదుర్కొంటున్న కొన్ని ప్రశ్నలు. దాని కాయన ఇచ్చే సమాధానం మీద దేశ భవిష్యత్తుకూడా ఆధారపడి ఉంది.

అలా జరిగిన నాడు ఆయన పేరు భారత రాజకీయాలలో శాశ్వతమై, దేశం నేడు పోతున్న నిరంకుశత్వానికి అడ్డు పెట్ట గలిగిన మహా నాయకుడు గాగలుగుతాడు. రంగాజీ గతమంతా ఒకఎత్తు. నేటి స్వతంత్ర స్థాపన నూతనాధ్యాయం, నూతనావకాశం, పరమ పవిత్రకార్యం నాదృష్టిలో.

# అఖిలావని రైతుకూలీల అదృష్టపంట

## శ్రీ కొమ్మారెడ్డి బాపయ్య చౌదరి

బందరు జాతీయకళాశాలలో విద్యాభ్యాసం చేయునాటినుండి రంగాజీపై నాకు భక్తి విశ్వాసములు కలిగినవి. ఆ నాడే వారు అఖిలావని రైతుకూలీల అదృష్టపంట అని అభిప్రాయం కల్గింది.

మహావక్త రంగా. ఏ సమస్యపైనైనా ఏకధాటిగా గంటల కొలదీ గంగాప్రవాహంలాగా ఉపన్యసించగలడు. అలా అవిరళ ధారాపాతంగా ప్రవహించే ఆ వాగామృతం శ్రోతల కానందాన్ని చేకూర్చి, శిష్యులుగా మార్చగలడు. కాబట్టి రంగాజీ మహావ్యక్తిగాదు, మహాప్రవక్త కూడాను.

చిన్నలనూ, పెద్దలనూ చేరదీసి చిన్నాపెద్దా తారతమ్యాలను తొలగద్రోసి అందరికీ అప్పుడై—దేశభక్తి సూత్రాలు ఉపదేశించి—కర్తవ్య పరాయణులు గండని—కర్మసిద్ధాంత మర్మము లెరుకపరచు కర్మయోగి రంగాజీ!

దేశమందంతటా రాజకీయ పాఠశాలలు స్థాపించి యువతీయువకులకు రాజకీయాలు వంటబట్టించి రాజ్యాధికారాన్ని చేబట్టుకొను సమర్థులు గావించినాడు. ఈ నాటి ముఖ్య రాజకీయ పార్టీలలో రాటుదేలి ప్రముఖ వ్యక్తులుగా పరిగణింపబడు పలువురు నాయకులకు కులపతి రంగా.

ఊరూరూ తిరుగుచూ, వుపన్యాసాలిస్తూ నా కర్తవ్యం తీరిందిలే అని అనుకునే నాయకుడుగాడు రంగా. తాను నమ్మిన సిద్ధాంతాన్ని అక్షరాలా అనుసరించి అమలుజరిపే ఆదర్శపురుషుడు రంగాజీ.

పల్లెపల్లెనా పయనించి రాజకీయాలు ప్రబోధించడమేగాక—జాతీయ అంతర్జాతీయ సమస్యలు అంతుపట్టులాగా గ్రంథాలెన్నో

రచించి–చిన్నలను చేరదీసి – వారితో స్నేహంజేసి – సిద్ధాంతాలను బుద్ధికందించి – వారిని తనంతవారినిగా తయారుజేసి దేశాన్ని – సంఘాన్ని–సేవించండయ్యా–అని స్వేచ్ఛనిచ్చి–చిరునవ్వు నవ్వి చిన్మయానంద స్వరూపుడైన రచయిత రంగాజీ.

పంటచేలను తిలకిస్తూ – పరమార్థాన్ని ఒలికిస్తూ – పశుగణాన్ని పరామర్శిస్తూ పరమానందాన్ని పొందవలసిన పంటకాపులు – పన్నుల భారంతో వెన్ను లేవక – తెన్ను గానక – క్లిష్టపరిస్థితులలో తికమక పడుచుండుట కనులారా గాంచిన రంగా కలవరపడ్డాడు. కర్షక జనోద్ధరణకు కంకణం కట్టుకున్నాడు. రైతుసంఘాన్ని సృష్టించాడు. దానికి తగు పుష్టి కలుగజేసినాడు. భారతదేశ రైతు సంఘముగా పరిఢవిల్ల జేసినాడు. సత్యాగ్రహాస్త్ర విద్యాపారంగతుల జేసినాడు. బక్క రైతులను ఉక్కు ముక్కల్లాగా తయారు చేసినారు. సమర రంగమున సన్నద్ధపరచాడు. విజయశంఖము పూరించాడు.

ఉదయం మేల్కాంచినది మొదలు రాతిరి పండుకొనబోయే వరకును, వ్యవసాయ, సంసార లంపటాలతో సతమతమగుచూ వంద లేండ్లుగా మందకొడిగా వుంటున్న రైతుకూలీ బిడ్డలకు ప్రపంచ పటమును జూపి, ప్రగతి పథమున పయనింపజేసిన వైతాళికుడు రంగా.

విద్యాభ్యాసము ముగించి విదేశాలు వీడి స్వదేశమున కాలిడిన దాది హరిజనోద్ధరణకై అహర్నిశలు పరిశ్రమిస్తున్న పవిత్ర హృదయుడు రంగా. హరిజనులతో సహపంక్తి భోజనాలుజేసి తమ స్వంత బావులు వారి వుపయోగార్థం వినియోగింపజేసి సంఘ బహిష్కారాన్ని ధిక్కరించినదిట్ట రంగా. అస్పృశ్యతా నిర్మూలనోద్యమాందోళనకై ఆంధ్రపత్రికలో వ్యాసపరంపరల గుప్పించినాడు. ప్రత్యేకముగా హరిజన నాయకుడను గ్రంథమును కూడా వ్రాసినాడు. హరిజన సేవా దళముల గూర్చి, కాలి నడకను ఊరూరూ తిరుగుతూ అస్పృశ్యతా నిర్మూలనా ప్రబోధము జేయుచూ, అగ్రవర్ణాలనుకొను వారి

ఆతిథ్యము లందుకొంటూ తాలూకాలు చుట్టినదిట్ట. తాలూకాలే గాదు కృష్ణా, గుంటూరు, నెల్లూరు మండలాలు మండు టెండల్లో కాలి నడకను కార్యక్రమమును కొనసాగించిన కార్యదక్షుడు రంగా. వెళ్ళిన ప్రతిచోటను హరిజన దేవాలయ ప్రవేశము, సహపంక్తి భోజనాలు జరిగేలా చూచెడివాడు. ఒవ్వేరు ప్రాజెక్టు క్రింద పది హేను వందల ఎకరాల భూమిని అవిరళ కృషి జేసి, అతి స్వల్ప ఖరీదునకు హరిజనుల కిప్పించిన ఆదర్శ సంఘసేవా పరాయణుడు రంగాజీ. వీరు సాగించిన సంఘ సంస్కరణా కార్యక్రమములు స్వయముగా తిలకించిన అఖిల భారత హరిజన సేవక సంఘ కార్యదర్శి థక్కరబాబా చకితుడాయెను.

సర్వమానవ సౌభ్రాతృత్వమును సాధించాలను కున్నప్పుడు అన్ని వర్గాలను సమాన స్థాయిలోనికి తేవడము సమంజసము, న్యాయము, ధర్మము. కాని అటుల చేయజాలక ఒక్క రైతుల వర్గమునే అష్టదిగ్బంధన జేసి అణచ ప్రయత్నించడము అన్యాయము, అధర్మము, ఆక్షేపణీయము, అని గర్జిస్తూ, నిర్మొగమాటముగా ప్రభుత్వమును ఎదుర్కొంటున్న యోధాగ్రేసరుడు రంగా.

# కొండజాతులకు ఆయనకృషి

## శ్రీ ప్రతివాది భయంకర రంగాచార్యులు

ఆచార్య రంగాగారిని నేను షుమారు 25 సంవత్సరములనుండి ఎరుగుదును. వారు రైతు కూలిప్రజల అభివృద్ధికి కృషిచేయుకాలం లోనే ఆంధ్రదేశములో శ్రీ పుసులూరి కోదండరామయ్యగారు, నేను కొందరు మిత్రులు చేయుచున్న అఖిలభారత వెనుకబడిన ప్రాంతముల, కొండజాతిప్రజల సేవలోకూడ శ్రీ రంగాగారు మా కృషికి చాల దోహద మొనర్చుచుండిరి. హరిపుర, ఫైజీపూర్, జాతీయకాంగ్రెస్ మహాసభలలో ప్రప్రథమముగా మా కొండజాతి ప్రజల ప్రాంతముల అభివృద్ధిని గురించి, అర్థించుచూ ప్రవేశపెట్టబడిన తీర్మానములు శ్రీ రంగాజీ కృషివల్లనే ప్రవేశపెట్టబడినవి. వారప్పుడు మా సంఘమునకు గౌరవాధ్యక్షులుగా ఉండేవారు. వారు నీలగిరి ప్రాంతములో ఉండే కొండజాతి ప్రజలను గురించి ఒక పుస్తకమును వ్రాసి మాసంఘ నిర్మాతలైనటువంటి శ్రీ పుసులూరి కోదండరామయ్యగారికి అంకిత మిచ్చినారు. వారు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా ఉన్నప్పుడుకూడ కాంగ్రెస్ సభ్యునిగా వారి సహచర్యం కలిగియుండేవాడను.

నేను 1946 సెప్టెంబరు 14వ తేదిన అఖిలభారత కొండజాతిప్రజల ప్రాంతములసంఘమునకు ప్రధానకార్యదర్శిగా ఎన్నుకొనబడి మాసంఘ సమస్యలను ఢిల్లీలో జరుగుచున్న ప్రజాపరిషత్ సభలో ప్రవేశపెట్టి కొత్త రాజ్యాంగములో సదరు సమస్యల విషయమై చేర్పించుటకు గాను 1946 డిశంబరులో మా కార్యాలయమును ఢిల్లీలో పెట్టి నప్పుడు శ్రీరంగాగారు ఆనాడు పరిషత్ సభ్యులుగా ఉంటూ వారి ప్రభుత్వ వసతిగృహములో మా కార్యాలయమునకు ప్రారంభోత్స వము చేసి మా పనులు పూర్తి అగువరకు, షుమారు ఒకసంవత్సరము అచ్చట ఉండుటకు సమ్మతించి, మా ఉద్యమమునకు బహువిధముల తోడ్పడిరి. నిజముగా మాకు వారి ఆతిధ్య ఆదరణములు ఢిల్లీలో లేకుండినచో, ఢిల్లీలో మే మొక్కరోజైనను ఉండకలిగేవారము కాము. వారికి మానవసేవ ప్రధానాశయము. ఇప్పటి రాజకీయ

వాదులవలె పదవీవ్యామోహము, ధనవ్యామోహము వారి తత్వములో లేదు. వారి సహాయము అర్థించి పైకివచ్చిన చాలమంది వారిని విడిచిపోవుచుండిరి. వారి నిష్కామసేవా తత్వము వారిని ఎట్టి ద్వేషములకు పురికొల్పుటలేదు. రైతు కూలీప్రజా ఉద్యమము లోను, దేశీయ పరిశ్రమల అభివృద్ధిచేయు ఉద్యమములలోను వారికి జాతి, కుల, మత ప్రాంతీయభేదములు లేవు. ప్రజల అభివృద్ధికరము లగు ఉద్యమములను నడిపిరే కాని, అధికారబలము సంపాదింపవలె నని పార్టీలను నడుపలేదు.

గాంధేయసిద్ధాంతములు ననుసరించి ప్రజలు స్వేచ్ఛగా బ్రతుకుటకు, వారివారి స్వయం నిర్ణయ పరిశ్రమలకు ప్రభుత్వము దోహదము చేయవలసినదే గాని, ప్రభుత్వమే పరిశ్రమలు నడిపి, ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యముల నపహరించకూడదనియు, రైతులు తమ భూములను స్వేచ్ఛగా సేద్యము చేయుచూ, వారి శక్త్యానుసారము ఫలమును సంపాదించ వలసినదేకాని, ప్రభుత్వము ప్రజలభూములను తీసికొని గాని, వేరే సంఘములుగా ఏర్పరుపబడిన సంస్థలకు వప్పజెప్పి సమిష్టి వ్యవసాయములను చేయుటగాని కూడదని బహుకాలముగా నినాదము నిచ్చుచున్న శ్రీ అచార్య రంగాగారి హేతువాదమును గ్రహించి, వారి ఉద్యమమునకు దోహదమిచ్చి ప్రజలకు స్వేచ్ఛాస్వాంతత్ర్యము లను స్థిరపరచుటకు పూజ్యరాజాజీయొక్క ఆశీస్సులు వారికి కలుగగనే, నివురుగప్పిన నిప్పువలె ఉంటున్న శ్రీరంగాగారి యశస్సు యిప్పుడు దేదీప్యమానముగా వెలుగొందుచూ, అఖిలభారత స్వాతంత్రపార్టీకి అధ్యక్షస్థానమును అలంకరించిరి.

అచిరకాలములో అధికార, ధనకాంక్ష, స్వార్థపరత్వములలో కలుషమైయున్న ప్రస్తుత రాజకీయ వాతావరణమును, నిష్కామ యోగియై, యదార్థవాదియై, ప్రజాక్షేమమే తనజీవిత ధ్యేయముగా చేసుకొనియున్న శ్రీ రంగా శుద్ధిచేసి దేశమునకు యిహపరములను సాధించగలరని ఆశించుచున్నాము.

# ఆయన రైతురాజు

## శ్రీ ప్రత్తి శేషయ్య

నేను విద్యార్థిదశలో 1945–48 సం.ల మధ్య ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు కార్యవర్గసభ్యుడుగా కృషిచేయడం జరిగింది. ఆ సమయంలో ఆచార్య రంగా రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా ఉన్నారు. ఆనాడు ముఠా రాజకీయాల ప్రాబల్యంవల్ల రాష్ట్రవిద్యార్థి కాంగ్రెసు కార్యవర్గంలోకూడ రెండువర్గాలు యేర్పడినవి. అందులో ఒకవర్గం శ్రీ ఆచార్య రంగాని సమర్థిస్తే, మరియొకవర్గం వ్యతిరేకిస్తూ వుండేది. ఆ వుభయవర్గములమధ్య నేను తటస్థునిగావుండి కొంతకాలం సామరస్యమునకు ప్రయత్నించేయడం జరిగింది.

విద్యార్థిదశలోనే గాంధీయిజంపట్ల నాకు గాఢమైన అభిమానం ఏర్పడింది. సామ్యవాదంను ప్రోత్సహించుటయే గాంధీయిజంగా ఆనాడు నేను భావించాను. సామ్యవాదానికి రంగా వ్యతిరేకులని, ధనిక భూస్వాముల ప్రతినిధియని, అభివృద్ధి నిరోధకులని రంగా ప్రాబల్యమును ఆంధ్ర రాజకీయరంగంలో అరికట్టుటయే అభివృద్ధి కాముకుల ముఖ్య కర్తవ్యమని, విద్యార్థులలో కమ్యూనిస్టులు, సోష లిస్టులు, ప్రచారంచేస్తూ వుండేవారు. ఆ ప్రచారమును నేనుకూడ గురికావడం జరిగింది. అందువల్ల రాష్ట్రవిద్యార్థి కాంగ్రెసు కార్య వర్గంలో చివరదశలో నేను రంగా వ్యతిరేకముఠానే సమర్థించడం జరిగింది. ఈ విధంగా నేను విధ్యార్థి రంగంలో రంగా రాజకీయాలను అపార్థం చేసుకోవడం జరిగింది.

విద్యార్థిదశ పూర్తిఅయిన పిమ్మట ముఠా రాజకీయములయందు కలిగిన నైరాశ్యంకొలది నాటినుంచి నేను స్వతంత్రపార్టీలో సభ్యత్వం పొందేవరకు పార్టీ ముఠా రాజకీయాలకు దూరంగావుండి, గ్రంథాల

యోద్యమాలలో శ్రీ గాడిచర్లవారికి అనుచరుడుగను; ఐక్య ప్రజా వుద్యమం, సర్వోదయ వుద్యమములలో శ్రీ గోరాజీ అనుచరుడుగను కృషిచేసి, నేడు తిరిగి ఆచార్య రంగా అనుచరుడనుగా స్వతంత్రోద్యమంలో కృషిచేయడం జరుగుతూవుంది.

ఒకనాడు రంగాజీ వుద్యమాలతో ఏకీభవించలేని నేను, పైన వుదహరించిన వుద్యమాలతో సంబంధం వున్న నేను, స్వతంత్రోద్యమంలో శ్రీరంగాగారి అనుచరుడనుగా నేడు పని చేస్తూవుండడం చాలా మందికి ఆశ్చర్యం కలుగజేస్తున్నటుల వుందని నాకు తెలియజేస్తున్నారు. ఈ నాడు కూడ రంగాగారి రాజకీయాలను, స్వతంత్ర పార్టీ సిద్ధాంతాలను అపార్థం చేసుకుంటున్న రాజకీయవాదులు చెప్పుకోదగ్గ మైనారిటీ వర్గంగానే వున్నారు.

నేను శ్రీరంగాగారి రాజకీయ సిద్ధాంతములలో సంపూర్తిగా ఏకీభవించియే నిస్వార్థ చింతతో స్వతంత్రపార్టీలో కృషిచేస్తున్నాను. భారతదేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం విజయవంతం కావాలంటే ప్రతివారు రంగాగారి సిద్ధాంతాలు అంగీకరించక తప్పదు.

చిరకాలంనుంచి శ్రీ రంగాగారు ప్రబోధం చేస్తున్న రాజకీయ ఆర్థిక, సాంఘిక సూత్రాలనే నేడు స్వతంత్రపార్టీ తన సిద్ధాంతములుగా అంగీకరించి భారతదేశంలో పనిచేయడం ప్రారంభించినది. అందువల్లనే రాజాజీ ప్రభృతులు ప్రథమముగా భారత స్వతంత్ర పార్టీకి శ్రీరంగాగారిని అధ్యక్షులుగా ఎన్నికచేసి కృతజ్ఞత తెలియజేసారు. గాంధీయిజంను సంపూర్తిగా ఆకళింపుచేసుకున్న రాజకీయ భాష్యకారులలో రంగాగారిని ప్రథముడుగా నేను తలంచుచున్నాను.

వారి 40 సంవత్సరాల రాజకీయ జీవితం అనేక వీరోచిత పోరాటాలతోను, పెక్కు వుద్యమాల నిర్మాతగాను సంపూర్ణ త్యాగంతో నడచి పోతున్నది. స్వతంత్రోద్యమంలో వారితో నాకు కలిగిన కొద్దికాలపు పరిచయంలోను కార్యకర్తల పట్ల వారు తీసుకునే శ్రద్ధ, యిచ్చే ప్రోత్సాహం, పనిపట్ల వారికుండే నిరంతర ఆసక్తి,

సేవాతత్పరిత నన్ను ముగ్ధుణ్ణిచేసాయి. వారిపట్ల నాభక్తి, విశ్వాసాలను యినుమడింప చేశాయి. బుద్ధుడు, క్రీస్తు, రాజారామ మోహన్‌రాయ్, గాంధీజీలలోగల గుణగణాలు, శ్రీకృష్ణదేవ రాయలు, శివాజీ, ఆంధ్రకేసరి ప్రకాశం, ప్రభృతుల రాజకీయ వేత్తల మనస్తత్వం, సమ్మిళితమైన త్యాగమూర్తిగా శ్రీరంగాగారిని నేను తలంచుచున్నాను.

సహకార వ్యవసాయమనే బందిఖానాలో రైతాంగం పడి కృంగి కృశించి పోకుండా ధీరత్వంతో అడ్డుపడుతున్న రైతురాజు అచార్యరంగా. కనిష్ట ప్రభుత్వాజోక్యం, గరిష్ట వ్యక్తి స్వాతంత్ర్యమనే శంఖారావాన్ని దశదిశల పూరిస్తూ ప్రజానీకాన్ని మేలుకొలుపుతున్న రాజకీయ ప్రవక్త ఆచార్యరంగా.

రైతువుద్యమానికి ప్రాణం వాహిని. వ్యక్తి స్వేచ్ఛాస్వాతంత్రాల సంరక్షణ కోసం కంకణం కట్టుకొని, శాంతి సౌభాగ్యాలకోసం కృషిచేస్తున్న ఉత్తమ వారపత్రిక. వాహిని త్వరలోనే దిన పత్రిగా వెలువడ గలదని ఆశిస్తున్నా.

# అసలయిన రైతు

## శ్రీ వేగుంట కనకరామబ్రహ్మం

"Let us be the first to give a friendly sign, to nod first, speak first, give first and if such a thing is necessary, forgive first", అనే మహా సూక్తి మానవోత్తముడయిన రంగాజీకి అక్షరాల అన్వయిస్తుంది. మానవత మూర్తీభవించిన ఆ మహానుభావుని నేను మొట్టమొదటిసారిగా చూచినపుడు స్ఫురించిన మహోన్నతభావం అదే. నేటి మన దేశంలో నాయకుడుగా చలామణీఅయ్యే వ్యక్తియొక్క పరిసరాలకు కూడా వెళ్ళడానికి సామాన్యమానవునికి జంకు గొంకులు కలుగుతూవుంటవి. అటువంటిది ఎంతమందిలో వున్నా రంగాజీని దర్శించి ఒక్క నమస్కారం చేశామంటే చాలు "ఎవరు, ఏమిటి, ఎందుకు" అనే వివరాలు తెలుసుకొని ఎంతో ఆప్యాయతను అందిస్తారు. అది మాతృమూర్తిపెట్టే ప్రేమలాంటిది. ఆవిధంగా పరిచయమయిన ప్రతివానికి తన హృదయంలో స్థానం యిచ్చే తత్వం మన అగ్రనాయకులలో చాలామందికి అరుదు అంటే అసత్యంకాదు.

ఆచార్య రంగా అసలయిన రైతు. మన గ్రామీణ సంస్కృతీ విశిష్టత ఆయనలో కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. నేటి యీ నవీననాగరికత పెరగకముందు మన గ్రామీణులలో వుండే ఆదరణ ఆప్యాయత, నిష్కాపట్యం, నిరాడంబరత్వం, శాంతం, సహనం, ఔదార్యం, వుదాత్తత రంగాగారిలో ఎల్లప్పుడూ అగుపిస్తూంటవి. నిండు మనస్సుతో, నవ్వుముఖంతో అరమరికలు లేకుండా పల్లెటూరి యాసతో ఆ ప్రజానాయకుడు పలుకరిస్తూంటే ఎంత ఆనందంగా వుంటుంది? ఆయనపై పాశ్చాత విద్యల ప్రభావం ఎంతగా వున్నా, పార్లమెంటరీ సంప్రదాయాలు ఎంత సమధికంగా సంచయమయినా, అంతర్జాతీయ సంస్కృతులు ఎంతగా సమ్మేళనమయినా, మన తెలుగు గ్రామీణ

సంస్కృతికి ప్రతిబింబమయిన ఆ కలుపు గోలుతనం రంగాజీకి అపార మనేది ఆయన్నెరిగిన ప్రతివారు ఒప్పుకుతీరాలిసిందే. డాబూ, దర్పం లేని ఆవేషం, ఆడంబరమెరుగని ఆ పలుకు, అవిరామమయిన ఆ జీవితం ఎంతగా ఆకర్షించింది సామాన్య మానవుని ?

తాను నమ్మిన సిద్ధాంతాలకు, ఆశయాలకు ఎన్ని అవాంతరాలొచ్చినా చలించక ధీరోధాత్తుడుగా ఎదుర్కొనగల ధీరుడు. అదియే ఆయన వ్యక్తిత్వం. ఆ వ్యక్తిత్వం ఎంతవున్నతమైనదయితే రాజకీయాలలో పదవీ ప్రాప్తికి అది అంత అడ్డు. ఉదాహరణకు నేడు దేశాన్ని కలవరపెడుతున్న ''సహకారసమిష్టి వ్యయసాయం'' అనే ముఖ్య సమస్యపై మన కాంగ్రెసు అసెంబ్లీ పార్లమెంటు సభ్యులలో ఎంత మందికి ఆత్మవిశ్వాసముంది ? ప్రయివేటు ప్రసంగాలలో దానిపై వైముఖ్యం, పబ్లికు ప్లాటుఫారములపై దానిని సమర్థించడం. ఎందుకో యీ ఆత్మవంచన ? త్రికరణశుద్ధిలేని యీ పెద్దల మనస్తత్వం మనం అర్థం చేసుకోలేనిదికాదు. ఇటువంటి మనస్తత్వాలతో రైతాంగానికి అటువంటి జీవనమరణ సమస్య ఏరకంగా పరిష్కృతమవుతుందో దురూహ్యం——కొంతమంది సభ్యులు కొంతవరకయినా ధీనోదాత్తంగా వేదికలపై యీ సమస్యకు విముఖంగా తమ అభిప్రాయాలను వ్యక్తం చేసిన సందర్భాలు లేకపోలేదు. ఆ తరువాత వారి నోళ్ళకు తాళం పడడంకూడ మనం గమనించిందే. నిజమయిన వ్యక్తిత్వం వున్నవారయితే తమ పదవిని త్యజించి నిర్భయంగా వారి అభిప్రాయాలను వెల్లడించాలి. అదే రంగాజీకి మిగతావారికి గలతేడా. అందుకే ఆయన ఎంతటి సమర్థుడయినా, ఎంతటి దీక్ష, దక్షత కలవాడయినా, ఎటువంటి ఖ్యాతి, నీతివంతుడయినా దేశపరిపాలనకు సంబంధించిన ఏ పదవిని పొందలేక పోయాడు. అధికారాన్ని చేపట్టి అవినీతిని ఆపోశన పడుతూన్న నేటి కొంతమంది నాయకుల పోకడలను గమనిస్తూంటే రంగాజీలాంటి మహా నాయకులు పదవులకు దూరంగా వుండడమే మంచిదని పిస్తుంది. కొంతమందికి పదవివుంటేనే వారి పేరు

చలామణీ. అది వారికి కుహనాగౌరవాన్ని చేకూరుస్తుంది. రంగాజీ ఏ పదవిలేక పోయినా ప్రజలలో ప్రముఖుడే.

భారత దేశానికి ఆయన సేవ బహుముఖమయినది. ముఖ్యంగా రైతాంగ విద్యాలయాలు పెట్టి చాలామంది యువకులకు ఆర్థిక రాజకీయ సాంఘిక శాస్త్రాలలో విజ్ఞాన భిక్షపెట్టిన మొట్టమొదటి ఆచార్యుడు ఆచార్యరంగా అంటే అత్యుక్తికాదు. ఆయన విద్యాలయాల్లో శిక్షణ పొందిన యువకులు ఎంతగానో ఎదిగి అందులో కొంతమంది మంత్రి పదవులను నిర్వహించి సమర్థులయిన పరిపాలకులుగా ప్రసిద్ధినొందారు. ఆ విద్యాలయాల ద్వారానే భారతదేశంలో మరేరాష్ట్ర గ్రామీణ ప్రాంతాల్లోను లేనంత రాజకీయ, సాంఘిక చైతన్యం మన తెలుగు పల్లెలలో ద్యోతకమవుతుంది. తను పెరుగుతూ తన సహచరులను పెంచిన నాయకుడు రంగాజీ.

పల్లెపట్టుననే కాపురముండి పల్లెటూళ్ళనే తన కర్మక్షేత్రంగా ఎంచుకున్న శ్రామిక నాయకుడు మన రైతురంగా. ఆయన మన రాష్ట్ర, దేశ రైతాంగమునకేగాక అంతర్జాతీయ రైతాంగమునకే ఆశాజ్యోతి యగుట మన ఆంధ్రులకు గర్వకారణం.

సాహిత్య రంగంలో ఆయన సేవ ఎనలేనిది. మంచి గద్య రచయిత. భావావిష్కరణలోను, వాక్య విన్యాసంలోను తెలుగుతనం అడుగడుగున అగుపిస్తుంది. తెలుగు నుడికారపు సొంపు ఆయనెరిగినంత ఎరిగినవారు బహుస్వల్పం. ఆ పలుకుల పసందు వినవలసిందే గాని చెప్పలేం. రాజకీయ ఆర్థిక సమస్యలపై రచించిన వుద్గ్రంథాలు ఎన్నోవున్నై. అవి మాతృభాషలోకంటె ఆంగ్లంలో అధికం. అవిగాక చాల పుస్తకాలకు పీఠికలు, పరిచయ వాక్యాలు ఎన్నో వ్రాశారు. విమర్శలు, వ్యాఖ్యలు, సరేసరి. ముఖ్యంగా వ్యాసముల మాదిరి వచన రచనద్వారా ప్రముఖ వ్యక్తులను గురించి వ్రాసిన పద చిత్రణలు (Pen pictures) ప్రశంసించదగ్గవి. వీటన్నింటిని గమనిస్తూంటే ఆయన గొప్ప కవిగా (ఛందోబద్ధంగా కవిత్వమే వ్రాయాల్సిన పనిలేదు.) క్రాంతిక్తారుడుగా గోచరిస్తాడు.

అణగి మణగిపోయిన చేనేత పారిశ్రామికుని వుద్ధరించిన చేనేత జనకుడు రంగాజీ. ప్రస్తుత చేనేత నేతలంతా ఆయన చేతుల్లో తయారైనవారంటే అత్యుక్తికాదు.

పార్లమెంటేరియనుగా రంగాజీ ప్రతిభ అనన్యమైంది. పార్లమెంటు సభ్యునిగా ఆయనకున్నంత అనుభవం నేటి పార్లమెంటు సభ్యులలో బహుకొద్దిమందికి మాత్రమే కలదు. అందువల్ల పార్లమెంటులో జరిగే చిన్నవిషయం మొదలు పెద్దవిషయం వరకు ఏదీ ఆయనదృష్టిపథంనుండి పోదు. రైతు రిప్రజంటేటివుగా ఆయన వునికి భారత పార్లమెంటు చరిత్రలో సువర్ణాక్షరాలలో లిఖింపదగ్గది.

ప్రపంచంలో ప్రముఖులనేవారు చాలమంది ఆయనమిత్రులు. అందుకు కారణం ఆక్సుఫర్డులో ఆయన చదువుకున్న నాటినుండి నేటి వరకు ప్రాచ్య పాశ్చాత్య దేశాలలో అనేక సందర్భాలలో పర్యటించి మనదేశ సమస్యలను ఆయా దేశీయులకు సుబోధకము చేయుటయే. అంతర్జాతీయంగా వ్యవసాయోత్పత్తిదారుల సభలకు, కార్మిక సమావేశాలకు, రైతు మహాసభలకు, సహకార సమావేశాలకు వ్యక్తిగతంగాను, పార్లమెంటు రాయబారవర్గ సభ్యునిగాను యింకను అనేక సందర్భాలలో ప్రతినిధిగా వెళ్లి ఆ సభాసమావేశాలలో మహోపన్యాసాలు చేశారు. ఆ విధంగా మనదేశ గౌరవాన్ని యినుమడింపజేశారు. ముఖ్యంగా 1956 పారిస్ ప్రపంచ కర్షక మహాసభకు రంగాజీ ప్రారంభోత్సవం చేయడం ముదావహం.

అంతర్జాతీయ వ్యవసాయకుల (International farmers) సంఘస్థాపనలో ఆయనపాత్ర అపారం. ఆయన మేధాశక్తి, కార్యదీక్షత, విషయవిజ్ఞానం, అభ్యుదయ భావోన్నత్యం అంతర్జాతీయంగా గుర్తింపబడిన దనుట నిస్సంశయము.

అఖిలభారత సహకార యూనియన్‌కు ఉపాధ్యక్షుడుగావుంటూ నిద్రాణమైయున్న సహకారోద్యమమునకు పునరుజ్జీవితము, పునరుత్తేజితము కలుగజేశాడు.

పీడిత రైతుసోదరులకు ఆయన చేయుచున్న నిష్కామసేవ, నిరుపమత్యాగము గణనీయములు. వారు యితర ''ఇజమ్''ల ప్రభావానికి లోనుగాకుండా స్వతంత్ర జీవయాత్రను సాగించుటకు రంగాజీ వ్యాప్తిచేయుచున్న సిద్ధాంతాలు ప్రపంచ రైతాంగానికే శిరోధార్యములు.

మన బలాన్ని, మనశక్తిని మనం గుర్తించ నంతవరకు మనం అసహాయులుగానే వుందుమనే సలహా మన రైతాంగానికి చెప్పుడు యిస్తూవుంటాడాయన. ఆయన ఆశావాది. భారత రైతాంగానికి సచివుడు, సారథి. ఇది ఏ రైతు విస్మరింపరాని పరమ సత్యము.

మానవ మనస్తత్వాలను ఎంతగానో ఆకళింపు జేసుకొని వ్యక్తి సర్వసమర్థతను తన గీటురాయిపై నాణ్యం చేయగల షరాబు రాజాజీ. అఖిల భారత స్వతంత్రపార్టీ అధ్యక్షపదవికి ఎందరో మహామహులున్నను, రంగాజీనే ఎన్నిక జేశారంటే రంగాగారి ప్రజ్ఞాప్రాభవానికి అంతకంటే దృష్టాంతరం యింకేం కావాలి? సృష్టి, ప్రతిసృష్టి చేయగల ఒక అసాధారణవ్యక్తి రంగాగారు. ఆయన వ్యక్తియే గాదు, ఒక మహాసంస్థ.

నిష్కామంగా మానవసేవ చేయుచున్న రంగాజీకి యివే నా నమోవాకాలు.

# రంగాజీతో నేను

## శ్రీ కోడూరి రామరాయవర్మ

అది 1938 సంవత్సరం. నేను కృష్ణాజిల్లా గన్నవరంలో జరిగిన రైతుమహాసభకు స్వచ్ఛంద సేవకునిగా వెళ్లుట జరిగింది. నాడే పూజ్య రంగాజీతో నాప్రథమ పరిచయ సమయం.

'గోదావరిజిల్లా రైతు యువకుడా! ఎనలేని ధైర్యంగా వచ్చినావా' అంటూ పరిచయ ప్రారంభం జరిగినది. ఆనాటినుండి మరువక గ్రామజీవితము, రైతాంగము మనవిధినిగూర్చి తరచు జాబులువ్రాస్తూ రైతాంగ విద్యాలయ పాఠాలు నేర్పుటతో ఎనలేని సాన్నిత్యం ఏర్పరచుకున్నాం.

1944 సంవత్సరంలో నేను బళ్ళారి జైలులో గడుపురోజులలో సర్దార్ లచ్చన్నగారితో పరిచయం చేసుకోమంటూ జాబులు వ్రాసియున్నారు. నాటినుండియు రైతాంగ తరగతులకు హాజరగుతూ నా రెండు సంవత్సరముల జైలుజీవితాన్ని సుఖప్రదంగా గడుపగలిగాను.

1946 సంవత్సరంలో జైలునుండి విడుదలయినది లగాయితు జిల్లా రైతాంగములో పనిచేస్తూ జిల్లా రైతు కాంగ్రెసు కార్యదర్శిగా చేసే భాగ్యం నాకు కల్గినది.

కార్యకర్తను గమనించే కర్మశీలుడు రంగాజీ. రాష్ట్ర కాంగ్రెసు సభ్యుల ఎన్నికలకై, ఢిల్లీలో గోకులభాయి భట్టును కార్యకర్తలను తెలుపమనగా తటాలున తణుకులో వర్మ గలడని చెప్పియున్నారు. ఇలాంటి వెన్నో గలవా మహాశయుని కార్యదక్షతలు.

1951 సంవత్సరంలో కాంగ్రెసునుండి విడివడినపుడు కార్యకర్త విద్యుక్త ధర్మంగా భావించి కృషిసల్పి ఎనలేని సాహసంతో కృషి

కార్ లోక్ పార్టీ నిర్మాణం చేస్తానంటే జిల్లాలో సంచారమునకు సిద్ధ మన్నారు శ్రీ ఆచార్యుడు.

నిస్వార్థ త్యాగధనులు. మూడు లక్షల రూపాయల నిధిని ఢిల్లీలోనే కాంగ్రెసు పెద్దలకు అప్పగించిన యోగిపుంగవుడు. ఎప్పుడూ నిరుత్సాహపడే మమ్ము ఉత్సాహవంతులుగా కవ్విస్తూఉండేవారు.

1955 సంవత్సరంలో ఐక్య కాంగ్రెసు నిర్మాణ మొనర్చి కమ్యూనిస్టుల నంత మొందించి కాంగ్రెసుకు ఎనలేని సంఖ్యాబలాన్ని చేకూర్చిన సిద్ధాంత కర్త.

1954 సంవత్సరంలో కల్లుగీత సత్యాగ్రహము సందర్భముగా శ్రీమతి గొట్టు యశోదా దేవి, నా భార్య సుభద్రా దేవిగార్లను దీవించి రాయవెల్లూరు జైలుకు సాగనంపిన సత్యసంధులు వారు.

మాతామతల్లి భారతీదేవిగారు రంగాజీ సహచారిణియై మాబోంట్లను మార్గము చూపిన తల్లికి నమోవాకములు.

భారతదేశములో సహకార వ్యవసాయమును వ్యతిరేకించి ఎలుగెత్తి సాటిన సాహసాచార్యుడు రంగాజీయే.

రాజాజీ అండతో స్వతంత్రపార్టీని నిర్మాణముచేసి అజేయ మానంగా అధ్యక్షపీఠ మలంకరించి ప్రపంచ రైతుల పెన్నిధియై యీనాటికి 50 సంవత్సరములు అజేయమానంగా ప్రజాసేవకు కంకణము కట్టిన మా ఆచార్యుని, గురుదేవులు శ్రీ రంగాజీ షష్టిపూర్తి మహోత్సవము నెరపుకోగల్గిన మా ఆంధ్రజాతి కడుధన్యత నొందుగాక. శతాయుష్మంతులుగా వర్ధిల్లి ప్రజాసామాన్య పరిరక్షకులుగా మనగలం దుకు భగవంతుడు రంగాజీకి ఆయురారోగ్యముల చేకూర్చునుగాక.

# వెనుక బడిన వర్గాల ప్రజల నాయకుడు

## శ్రీ వి. యస్. సుంకన్నగౌడు

1955 సంవత్సరం ఎన్నికల సందర్భంలో శ్రీ రంగాగారు రాయలసీమ పర్యటనకు వచ్చినపుడు వారితో నాకు పరిచయం కలిగింది. వారితో పాటు ఎన్నికల ప్రచార సందర్భంగా అనేక గ్రామాలలో పర్యటించాము. వారు గ్రామాలలో, రైతుకూలీల మధ్య యున్నంతసేపు, వారు మహానాయకునన్న ఆడంబరత్వంగాని, అలాంటి వాతావర్ణం ఏమీ కనిపించలేదు. గ్రామములందు మకాం వేసిన సందర్భంలో, ఆ రైతులు ఇచ్చిన ఆతిథ్యంను స్వీకరించునపుడు, రాయలసీమ రైతుల, భోజన పక్వపరిణామమును వారు వర్ణించటం, అచ్చటి ప్రజలలో వారొక వ్యక్తిగా మిళితమై వ్యవహరించటం చూచిన నేను, వారిని ఎన్నడూ మరువలేని స్థితికి వచ్చాను. నేను గౌడ కులస్థుడనైనా, తదితరులు ఇతర కులస్థులయినా కుల మత భేదాలు మా పర్యటనలో ఎచ్చటా భేధించలేదు. కులమత వర్గాలను ఎచ్చటా పాటించని మహా నాయకుడు. మాజీ గీత పనివారల సంఘు యాజమాన్యమున ప్రారంభించబడిన యుద్యమమునకు అన్నివిధాలా చేయూతనిచ్చి, నిరుద్యోగంతో బాధపడే మాజాతి సమస్యకు అన్ని విధాల మద్దతునిచ్చి, వృత్తి గరపించిన మహావ్యక్తి. ఆయన కుల, మత, వర్గములతో, నిమిత్తం లేని సర్వ ప్రజానాయకుడు, ధీశాలి అనే దానికి మన దేశంలో ఎంచుకో తగ్గ ఆంధ్ర మణిపూస రంగాజీ అని గుర్తించగలిగాను. వీరు ఒక వర్గానికి, కులానికి, సంబంధించిన వారన్న ప్రచారం పచ్చి బుకాయింపు. వారు నిరాడంబరులే గాక ప్రజానాయకుడు.

# పార్లమెంటు ప్రముఖులలో ఒకరు

## శ్రీ ప్ర జా ప తి

నిడుబ్రోలు నుండి న్యూయార్కు వరకూ, విజయవాడ నుండి వాషింగ్‌టన్ వరకూ గల ప్రదేశం యావత్తూ రంగాగారి కార్య రంగమే. గ్రామ, ప్రాంతీయ, రాష్ట్రీయ, జాతీయ అవధులను ఛేదించుకుని అంతర్జాతీయతకై అహర్నిశమూ పాటుపడే తత్వం ఆయనది. నిఖిల విశ్వ రాజకీయ సదస్సులలో పాల్గొని ప్రసంగిస్తున్నా, ఆయన దృష్టి నిడుబ్రోలులో ఉంటుంది. నిమిషంసేపు నిడుబ్రోలులోకూర్చున్నా నానా దేశపు రాజకీయ ఆర్థిక సమస్యలపైననే ఆయన ఆలోచన కేంద్రీకృతమయి ఉంటుంది. ఆయన ఏమి ఆలోచించినా, ఎందుకు కృషిచేసినా, అన్నిటికీ మూలం రైతుజనక్షేమం. రైతు శ్రేయస్సు ఆయన జీవన శ్వాస.

నిండు మనసుతో తిండి గింజలను ఉత్పత్తిచేసి ఇచ్చే రైతును ఉపేక్షించే జాతికి భాగ్యం కలగదు. రైతు ముఖ్యంగా మన జాతికి వెన్నెముక. అతని కృషి ప్రభావ ఫలితాలు మన జాతికి సంబంధించిన సర్వ రంగాలలోనూ ద్యోతక మవుతాయి. రైతు పడేశ్రమకు తగిన ప్రతిఫలం అతనికి దక్కనినాడు, అతని జీవితంలో నిరాశ, నిస్పృహ ఆవరిస్తే, కృషి కుంటువడి, మన ఆర్థికవ్యవస్థ, తద్వారా రాజకీయ వ్యవస్థకూడా దెబ్బతినే ప్రమాదం ఉంది. కనుకనే దూరదృష్టితో, 'రైతు శ్రేయమే రాష్ట్ర శ్రేయానికి మూలం' అని రంగాగారు ప్రకటించినది.

రాజకీయంగా స్థిరత్వం లేనివారనీ, కేవలం అవకాశవాదులనీ ఆయనపై కొన్ని అపవాదులున్నా మనం చెప్పుకోవలసింది ఒకటి— రాజకీయాలకూ స్థిరత్వానికి బొత్తిగా పొందిక కుదరదు. అస్థిరత్వాన్ని

కొందరు, సిద్ధాంత విశ్వాస పరివర్తనలో చూపుతారు. మరికొందరు పార్టీలు మార్చడంలో చూపుతారు. అందరూ ఒకేజాతికి చెందిన వారు. కాల పరిణామంలో వచ్చే భావపరివర్తనకు తట్టుకుని తమ్ము తాము సమాధాన పరచుకోగలవారు కొందరయితే, ఉద్వేగ స్వభావు లయిన మరికొందరు జంధ్యాలు త్రెంచుకుని వీధిని పడతారు. ఇలా వీధిని పడేవారిలో కూడా ఏ రోజు కారోజు కొత్త చేసుకునే వారూ ఉన్నారు. ఏడాదికోమారు, ఏటికీ కోటికీ ఒక తత్వాలు ఫిరాయించే వారూ ఉన్నారు.

తన ప్రాథమిక ధ్యేయమైన రైతు న్యాయం, రైతు శ్రేయస్సు విస్మరిస్తున్నట్టు కనబడిన ప్రతి పార్టీనుండి రంగాగారు బయటికి నడి చారు. ఆ నడవడం, కాల వైపరీత్యంవల్ల కొంచెం తొందర తొందర గానే జరిగింది. కేవలం ఆశయాలేకాక, ఆశలు, రాజకీయ భవిష్య త్తును గూర్చిన ఆందోళన కూడా ఇందుకు దోహదం చేశాయి.

పాత రాగిచెంబుకే ఇంకా మెరుగులు పెడుతూ కూర్చోడంలో అర్థంలేదని భావించిన ఆనాటి కాంగ్రెసు సోషలిస్టులలో రంగాగారు కూడా ఒకరు. నేటి ఆయన రాచకీయ సహచరులయిన ఇతరులలా గానే, రంగాగారిలో కూడా కాలవశాత్తూ భావచైతన్యమనండి, కొందరు అనుకునేటట్టు భావ తిరోగమన మనండి కనబడింది. ఈ నూతన దృక్పథానికి వేదికగా లేచిన స్వతంత్ర పక్షానికి ఆయన అధ్యక్షులయారు.

ఒకవిధంగా చూస్తే, రంగాగారు అధ్యక్షులు కావడం స్వతంత్ర పార్టీ అదృష్టమే ననాలి. రాజగోపాలాచారిగారు ఈ పనిని ఎంతో దూరదృష్టితో చేశారు. ప్రజానీకంతో బొత్తిగా సంబంధంలేని మాజీ సంస్థానాధీశులు, మాజీ ఉన్నతోద్యోగులు, బడా వ్యాపారులు, పెట్టుబడిదారులతో నిండిన స్వతంత్రపార్టీకి ప్రజలలో పలుకుబడి కలిగి కొంతలోనైనా వారి విశ్వాసాన్ని చూరగొన్నవ్యక్తి అధ్యక్షుడు కావడం, సామాన్య ప్రజానీకాన్ని ధైర్యంతో, సానుభూతితో కలుసు

కొనడానికి తగిన అవకాశాన్ని పుంజుకొనడమే అయింది. రంగాగారిని మినహాయిస్తే, స్వతంత్రపార్టీలో సామాన్యుల ప్రాతినిధ్యం లేనేలేదని ప్రతికక్షుల అభిప్రాయం.

స్వతంత్రపార్టీలో బాగా పలుకుబడిగల బొంబాయి వర్గం ఎల్ల కాలం వ్యక్తి స్వేచ్ఛ, 'ప్రయివేట్ ఎంటర్‌ప్రైజ్' అనే మాట్లాడు తుంది. వారి ఆసక్తి అది. అయినా రంగాగారు మాత్రం ఎప్పుడూ భూమిని నమ్ముకుని, దున్నుకుని బ్రతికే రైతు, అతని లాభం, అతని మేలు — వీటినిగూర్చే కలలు కంటారు.

సామాన్య రైతుపట్ల ఆయనకు అంత అభిమానం కనకనే రాజ కీయంగా పరస్పర విరుద్ధమైన భావ విశ్వాసంగల కమ్యూనిస్టులు మొద లైన అతివాదుల వలనకూడా జోహార్లు పొందుతూంటారు. ఒకప్పుడు ఏదో చీకాకుగా ఉన్న సందర్భంలో మనసు చివుక్కుమనే మాట విసిరిన రాజాజీకూడా ఈనాడు "రంగాగారు నాచేతిలో ఆయుధం వంటివాడు." ఆయన చిత్తశుద్ధి, నిస్వార్థసేవ అందరకూ ఆదర్శ పాయమైనది అని అనవలసి వచ్చింది.

అనేక పర్యాయాలు పదవి చేజిక్కించుకొనే అవకాశం వచ్చినా ఆయన 'కాల దన్నారు'. ఆయనకు రెండవ హోదా అక్కర లేదు, మొదటి హోదా రాదు అని ఆమధ్య ఎవరో అన్నారు. తన విద్యావిజ్ఞానాలకు, సేవాత్యాగాలకు తగినహోదా లభించాలని ఎవ రైనా ఆశించడంలో నాకేమీ తప్పుకనపడదు. అయితే పదవులు అలంకరించిన పెద్దలు ఆశయాలు, ఆదర్శాలు వెనక్కునెట్టి ఆ పదవు లను నిలుపుకోడానికీ, ఇనుమడింప జేసుకోడానికీ పాట్లు పడడంతోనే సరిపోతుందనే సామాన్య జన విశ్వాసాన్ని పరిగణిస్తే, రంగాగారు పదవులకంటె. తమ ఆదర్శాలనే ఎక్కువ అభిమానిస్తారని తెలుతుంది.

రంగాగారు వ్యక్తికాదు, ఒక వ్యవస్థ, ఏడుగోజులు ఒక పూళ్లో మకాంచేస్తే, ఏడుసంస్థలు స్థాపించగల నేర్పు ఉంది ఆయనలో. సుమారు ఒక దశాబ్దం క్రితం, రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులుగా ఉన్న

కాలంలో, రాష్ట్రకాంగ్రెసుకు ఉపసంస్థలుగా ఆయన ప్రారంభించిన సంస్థలను చూస్తే తెలుస్తుంది, ఆయన "సంస్థాపకశక్తి".

తమ పదిహేడవ ఏట, 1917లో మొదట కాంగ్రెసులో చేరి, జాతీయోద్యమంలో పాల్గొని అనేక పర్యాయాలు జైలుశిక్షను అనుభవించారు. రాష్ట్రకాంగ్రెసు (అధ్యక్షు) వ్యవహారంలో సరి పుచ్చుకోలేక, సంస్థను విడిచి, కృషికార్ లోక్ పార్టీ స్థాపించారు. అప్పటినుంచి దాదాపు తొమ్మిది సంవత్సరాలు అస్థిరంగా, అస్త వ్యస్థంగా గడిచి, ఆయన్ను స్వతంత్రపార్టీకి అధ్యక్షున్ని చేశాయి.

కేంద్ర శాసనసభలో పావు శతాబ్దం పైచిలుకు అనుభవం ఆయనది. రాజ్యాంగ పరిషత్తులో, తాత్కాలిక పార్లమెంటులో సభ్యులు. 1952 ఎన్నికలలో రాజ్యసభ సభ్యులయ్యారు. కాని 1957 లో కాంగ్రెసు టికెట్ మీద లోక్‌సభకు ఎన్నికై, తర్వాత స్వతంత్ర మతం పుచ్చుకొని "ఫ్లోర్ క్రాస్ చేశారు".

పార్లమెంటు సభ్యునిగా, జాతీయ, అంతర్జాతీయ రైతు సంఘాల ప్రతినిధిగా అనేక ప్రపంచ దేశాలలో విస్తృతంగా పర్యటించి, విశేష మైన అనుభవం గడించారు. విశ్వ వ్యవసాయదారులను ఒకే వేదికపైకి తీసుకు రాగలిగారు.

రచయితగా, రాజ్యాంగ వేత్తగా, సంఘ సంస్కర్తగా, ఆర్థిక వ్యాఖ్యాతగా పేరు పొందిన రంగా పార్లమెంటులో చేసే ప్రతీ ప్రసం గమూ చేరవలసిన చెవుల్ని చేరి తీరుతుంది. ఒక్కొక్కప్పుడు వారిని ములుకుల్లాగ గుచ్చుతుందికూడా. ప్రతి విషయమూ ఆయనకు ప్రసంగ విషయం కాజాలదు. ఆయనకు నచ్చిన విషయం కావాలి. ఆయన మెచ్చిన అంశం అవాలి.

దేశంలో రేగిన ఒక నూతన ఉద్యమానికి నాయకుణ్ణి సమ ర్పించిన కీర్తి తెలుగువారిది. ఆ నాయకత్వాన్ని సఫలం చేసి సమ కాలంవారి మెప్పు పొందేవంతు ఆయనది. సందేహం లేదు.- ఆయనకు ఆ ప్రతిష్ట దక్కితీరుతుంది. !

# పార్టీ మారినా సేవా విధానం మారలేదు

## ఒక కాంగ్రెసు వాది

"రంగాకింక నితః పరంబనఁగ నిర్లక్ష్యము, ప్రాణంబు రై
తాంగంబన్న, స్వపక్షమాత్రఁడొక పల్కాడంగ నేరతి ను
ప్పొంగం జొచ్చునో, శత్రుపక్షమటులే బొమ్మాడెడినవాని వా
గ్భంగిన్ విశ్వమె గింగిరాల్ దిరిగిపోవన్ నాగునొక్కొక్కెడన్."

— మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి.

ఆచార్యరంగాకు ముందు, వెనుక కూడ అనేకులు కర్షకులకై కష్టించినమాట వాస్తవం. కాని కర్షకోద్యమ నిర్మాత అని అందరి చేత ప్రస్తుతింప బడుచున్నది ఆచార్య రంగాయే.

ఆయన రైతుల ఆపదల గడవంబెట్టుటలో అతిరథుడని, శుభంబైన దానిని ఒన గూర్చుటలో అందెవేసిన చెయ్యి అని అనుకొనుటే గాక, ఆయన కర్షక సఖుడు, సారథి, గురుడు, దైవము, అధికార దృప్తుల, కర్ధమత్తులకు భోగదాసిగ నున్న భూదేవి దాస్యము బాప కారణజన్ముడైన కర్షకమూర్తి. ఆయనను ప్రథమంగా సందర్శించి నప్పుడు కలిగిన అభిప్రాయం ముప్పది సంవత్సరాల అనంతరం కూడ ఆ అభిప్రాయం ఇంకా బలపడుతున్నది.

ఆయన నడిపేవి పార్టీలుకావు. అవి పేరుకుమాత్రమే. ఆయన నడిపిందన్నీ ఉద్యమాలు. జమీందారీ రైతు ఉద్యమం, కిసానోద్యమం చేనేతోద్యమం. ఎన్నో ఉద్యమాలు నడిపాడు. వీటన్నిటికీ మూల విరాట్టు ఆయనే.

పాశ్చాత్య దేశాలలో పారిశ్రామికాభివృద్ధి పెరిగింది కనుక అక్కడ బాధితులు కార్మికులే. అందుచేత అక్కడ సోషలిస్టులు, కమ్యూనిస్టులు లేబరు ఉద్యమాల్లో పాటుపడడం సహజం.

మనది వ్యవసాయక దేశం ఆ పరిస్థితులు లేకపోయినా మన దేశంలో సోషలిస్టులకు, కమ్యూనిస్టులకు అదే ధోరణి—ఆచార్య రంగా అట్లాగాక ఇక్కడ కష్టజీవులగు కర్షకులకు, వ్యవసాయకూలీలకు, చేనేతవారికి, చేతివృత్తులవారికి వృత్తి సంఘాలను పెట్టి తన ప్రత్యేకతను ప్రకటించాడు.

వీరేశలింగం సాంఘిక చైతన్యం కలిగించినట్లే ఆచార్యరంగా వర్గసంఘాలద్వారా రాజకీయ చైతన్యం కలిగించాడు.

Every man is a volume, if you know how to read him'.

—Canning.

ఆయన రాజకీయ జీవితం 1930 నుండి ఆరంభమైనది. ఆయన కాంగ్రెసులో వున్నా వెలుపలవున్నా ఆయనది ఒకటేలక్ష్యం – రైతుసేవ, గ్రామీణ ప్రజాసేవ. రంగాజీ అంటె ఒక వ్యక్తి కాదు, ఒక ఉద్యమంకాదు, పెక్కు ఉద్యమాలు. ఆయన కొన్ని సిద్ధాంతాలకు రూపమిచ్చాడు. ప్రజాదృష్టిని ఆకట్టాడు. అందుచేతనే ఆయన ఏ పార్టీలోవున్నా, ఆయన్ని సహచరులు అంటిపెట్టుకొని వుంటారు.

ఆయన నాయకత్వం, ఆయన వ్యక్తిగత ప్రతిష్ట, ప్రజాసేవా నిరతి శక్తి సామర్థ్యాల మీద ఆధారపడి ఉన్నదికాని అన్యంకాదు.

ఆయన నాయకత్వం ఒక్క ఆంధ్రదేశంలోనేగాక భరత ఖండములో పెక్కుప్రాంతాల పాదుకొని పోయినది.

వేయేల? పార్టీపేరు మారినా ఆయన సేవా విధానం మారదు. అదేదంటే – రైతాంగం, గ్రామీణ ప్రజలకు హక్కులరక్షణ.

ఆంధ్రభూమిలో రాజకీయ నాయకులున్నారు కాని, వారికి రాజకీయాలు లేవు. ఆయనను సేవాదృష్టితో అనుసరించినవారు కొందరు స్వార్థంకొరకు ఆయనను వీడారనటం పొరపాటు. ఆయన మొదట సోషలిస్టు, 1942 నుండి జాతీయవాదిఅయ్యాడు. సోషలిస్టులు

అధికంగా కమ్యూనిష్టులయ్యారు. ఇది అభిప్రాయభేదం గాని, స్వార్థం ఎట్లా అవుతుంది ?

మరికొందరు ఆయనతో వుంటున్నవారు కాంగ్రెసులోచేరారు. వారికది మంచిదని తోచవచ్చును. ఈనాడు కాంగ్రెసునుండి కొందరు బయటకు రావటం, మళ్లాచేరటం మనం చూస్తున్నాం. మానవనైజం మనం గ్రహించాలి.

ఏది ఏమైనప్పటికీ రంగాగారిది సేవామార్గంకాని, భోగమార్గం కాదు. పాండవస్వర్గారోహణ సంగతి తెలిసినవారు ఆయననుండి వీడిన వారికి ఉత్తరవిధంగా ఆరోపించటం అంత మంచిది కాదు. గాంధీజీ శిష్యులనుకునేవారు ఆయనను ఎంతవరకు అనుసరిస్తున్నారు ? వస్తూ వుంటారు పోతూవుంటారు ఇతరులు. ఆయనకు అనుచరులు తక్కువ కాదు. భారత దేశంలో ఏ నాయకునకు యీనాడు లేని అనుచరబృందం ఆయనకున్నది.

ఆచార్య రంగానుగురించి వారు వీరుగాదు, ప్రసిద్ధులు, ప్రముఖ పత్రికలు ఏమన్నవో తెలుసుకుంటే తెలుస్తుంది ఆయన గొప్పతనం. ఆయన సేవానురక్తి.

వైస్రాయి కార్యనిర్వాహక వర్గంలో మేధావి అయిన సర్ జేమ్సు గ్రెన్ ఇట్లా అన్నాడు. "పల్లెటూళ్ళ ప్రజల అవసరాలను బాగా అర్థంచేసుకొని హృదయపూర్వకంగా వారికొరకు పాటుపడు తున్నది ఒక్క రంగాగారే".

యూరోపియన్ గ్రూపు సెక్రటరీ ఫ్రెడరిక్ జేమ్సు "ప్రొఫెసర్ రంగా, కర్షక, కార్మిక బంధువు" అని ప్రస్తుతించాడు.

"సిడ్ని వెబ్ బ్రిటిషు కార్మికులకు చేసినమేలే ఆచార్యరంగా భారత దేశ రైతాంగమునకు చేసెను. ఆయనకు రైతులకు సంబంధించి సర్వవిషయాలు సమగ్రంగా తెలుసు. తెలియుటే కాదు. రైతు ఉద్యమ నిర్మాత ఆయనే".

ఆచార్యరంగా స్థాపించిన అన్ని సంఘాలకు పోటీ సంఘాలు కమ్యూనిస్టులు పెట్టారు. అవన్నీ వారి పార్టీ పెంపుకే. ప్రతిసంగతి వారు పార్టీ దృష్టితోనే చూస్తారు. ఎన్నిరంగాల్లో తికమకలు చేసినా రైతుల్లో మాత్రం వారి పాచికలు పారలేదు. ఈ సంగతే ఘోరం అనే పత్రికలో 1946 లో సెప్టెంబరు 8న కె. జె. జాన్ గారిట్లా వ్రాశారు.

"పారిశ్రామిక కార్మికుల్లో కమ్యూనిస్టులు పలుకుబడి సంపాదించారుకాని, ఆచార్య రంగాకృషివల్ల వారి ఆటలు కర్షకుల్లో సాగటంలా అనుకున్నట్లు ?"

ఇక మన కవులెందరో కీర్తించారు, పత్రికలు ప్రశంచినవి.

ఆయన అంతర్జాతీయంగాకూడా ఖ్యాతిగాంచాడు. ప్రపంచ కర్షక సంఘంలో ఆయన ప్రముఖుడు. కమ్యూనిస్టులు Red International స్థాపించినట్లే ఆయన Green International నిర్మాత. Credo of the World Peasants 'ప్రపంచ కర్షకలోక సిద్ధాంతం' అనే గ్రంథం మార్క్సు కాపిటల్ వంటిది. ప్రపంచ రైతులకు అది పారాయణ గ్రంథం అయినది.

ఆయన జాతీయవాదే కాదు, అంతర్జాతీయవాదికూడ. ఆయన చేసిన సేవ అపారం. ఆయన అందులో అధికఖ్యాతి గాంచాడు. 'వలస దేశాలు-రంగుజాతులు' అనే ఆయన గ్రంథాన్ని బైబులువలె పారాయణం చేస్తున్నారు వారు.

ఈనాడు సహకార సేద్యం పనికిరాదని, కాంగ్రెసునుండి వీడి-'కర్షకుడు - సహకార వ్యవసాయం' అనే ఉద్గ్రంథం వ్రాసి, కర్షక బంధువై కాంగ్రెసును ఢీకొంటున్నాడు. దేని కొరకు? అమాయకులగు రైతులను రక్షించుటకొరకు. ఆయన శతసంవత్సరములు వర్ధిల్లి, ఆయనకోరే రైతుకూలీ ప్రజారాజ్యం సిద్ధించుగాక !

# అమృత హృదయుడు

శ్రీ జి. విశ్వనాథం.

ఆయన అమృత హృదయుడు. అందరినీ అలాగే భావించు కుంటాడు. అరలులేని అంతస్తు. అడ్డులేని ఆలోచనలు. అంతులేని ఆత్మీయుడు. ఆయన నమ్మిన రకం ఇతరులను మరెవరూ నమ్మలేరు. అందుకే కాబోలు మనసులో అనుకున్నమాటను ముఖాన అనేస్తాడు.

ఆయన ఒక ఉద్యమం. గొప్ప సంస్థ. ఎన్నో శాఖల్ని నెల కొల్పారు. ఆశ్రయం కల్పించారు. అందరికీ మేలు చేకూర్చారు. కొందరే జీర్ణించుకున్నారు.

ఆయన ఒక రైలు. ఎందరో అందులో ప్రయాణం సాగించి గమ్యం చేరుతుంటారు. కొందరు మధ్యలో నిలుస్తారు. అయితే అందరికి ఆ రైల్లో టికెట్టు లభిస్తుంది. విచక్షణ పక్షపాతం లేదు. అందుల్లో క్లాసులు లేవు.

ఆయన ఒక ప్రచారకుడు. అందరికోరకు ప్రచారం చేస్తాడు. అందరితో నడుస్తారు. ఉద్యమాలు నడుపుతారు.

ఆయన సేవాఫలితాలను అందరూ అనుభవించారు. కొందరు మాత్రమే ఆయనకు అండగా నిలవగలిగారు. ఆయన అందరికీ అండ. అందరికీ ఆశ్రయం.

ఆయన ఒక వటవృక్షం. దానిఛాయల్లో అందరికీ విశ్రాంతి లభిస్తుంది. పోతూ తలా ఒక కొమ్మ నరుక్కు-పోతుంటారు. ఎన్ని నరికినా వృక్షం మోడువారదు. చిగుళ్లు పెడుతూనే వుంటుంది.

ఆయన ఇతరులకోసం ఎన్నైనా చేస్తారు. తనకోసం ఏమీ చేయరు. ఏమీ ఆలోచించరు. అదే ఆయన గొప్పతనం. ఆయన స్వయం పరిపూర్ణుడు. నిత్య నూతనుడు. పెరగడమే కానీ తరగడంలేదు.

ఆయన గొప్పతనం ఆయన తదనంతరం ఆకాశమంత వున్నతంగా, అందరికి గోచర మౌతుంది.

ఆయన ఆచార్య రంగా.

# వృత్తిజీవుల పరిరక్షకుడు

శ్రీ హెచ్. ఆర్. నండూరి

ఇటీవల ఆచార్య రంగా షష్టిపూర్తి మహోత్సవాన్ని ఆంధ్ర రైతాంగం అత్యున్నతంగా జరుపుకొంది. విజయవాడలో రంగాజీ కాంస్య విగ్రహాన్ని ఆవిష్కరించి తెలుగు ప్రజలు తమ భక్తివిశ్వాసాలను ప్రదర్శించుకున్నారు. ఎన్నో జయంత్యుత్సవాలను జరుపుకొని నిఖిల శ్రామికావళులు నివాళు లెత్తుతున్నారు. యిది మనకు గర్వకారణమే. అయినా రంగాజీ మాత్రం సంతృప్తిజెంద జాలరని మనం జ్ఞప్తి చేసుకోవలసివుంది.

పూవు పుట్టగనే పరిమళిస్తుందన్నట్లు "గ్రామీణ వృత్తిజీవుల స్వేచ్ఛా పరిరక్షణే ఆయన అకుంఠిత దీక్ష" అని వారి విద్యార్థిదశను తిలకిస్తేనే ద్యోతకమవుతూంది. స్వాతంత్ర్యసమరంలో సేనానిగా, సైనికునిగా అచంచలంగా సాగిపోతూన్నప్పటికీ, శ్రమజీవుల సమస్యలను విస్మరించక ఆయా ఉద్యమాలకు దండిగ ముందు నిలచి రథసారథ్యం నెరపారు. అటుతరువాత, దేశ స్వరాజ్యాన్ని సముపార్జించిందన్న సంతృప్తితో కొందరు నేతలు శ్వాసపీల్చినా, రంగాజీ ఆ శ్వాస తీసుకొనకపోవడం గమనించతగిన ముఖ్య విషయం. అదే అసంతృప్తిని బాపూజీకూడా వ్యక్తంచేసి ఉన్నారనే విషయాన్ని యిక్కడ మనం స్మృతిపథంలోనికి తెచ్చుకుంటే, సిసలైన అంతరార్థం ప్రస్ఫుటమవుతూంది.

"మనకు కావలసినది స్వరాజ్యమే కాదు. స్వాతంత్ర్యంకూడాను. ఆ స్వాతంత్ర్యం కూడా కొందరు వ్యక్తులకు మాత్రమే భుక్తంగా ఉండరాదు." అన్నారు బాపూ.

యీ పలుకుల్లోని పరమార్థాన్ని మనం అర్థం చేసుకుంటే, స్వాతంత్ర్య సైనికులంగా మనం కర్తవ్యంనుండి విముక్తులం కాలేదని

దృఢపడి తీరుతూంది. యీ మాట సాహసం కానేరదని నేటి ఘరానా పెద్దలుగూడా నిండు గుండెతో యోచిస్తే త్రోసిరాలేరు. కనుకనే రంగాజీ యజ్ఞం పరిపూర్తిచెందలేదు. అందుకే యీ మహోత్స వాలతో ఆయన సంతృప్తిచెందలేరని స్పష్టపరచవలసి వచ్చింది.

1951 లోనూ, ప్రస్తుతమున్నూ ఆయన కాంగ్రెసునుండి వెలు పలకు రావడంకూడా పదవులకోసం, ప్రాపుకోసం కాదని రాజకీయ వైరులే ఒప్పుకొని తీర్తారు. కాంగ్రెసులో ఉండగాకూడా క్రమశిక్షణ అనే కళ్ళేనికి కట్టుబడక తన గ్రామీణ సమస్యలపై నిర్మొగమోటం గాను, నిష్పాక్షికంగాను ఎదుర్కొంటూనే ఉండేవారు. కనుకనే, నెహ్రూజీకి, రంగాజీ అంటే ఓ "భయం" ఏర్పడింది,

1958 లో కేంద్ర ప్రభుత్వ పబ్లిక్ ఎకౌంట్సు కమిటీ చైర్మన్ గాను, కాంగ్రెసు పార్లమెంటరీ కార్యదర్శిగా వ్యవహరిస్తున్నప్పటికీ, సహకార వ్యవసాయ సమస్యపై పార్లమెంటులో కాంగ్రెసు పోకడ లను గర్హిస్తూవుంటే, దేశాభిమానులంతా కండ్లు తెరవాలని గర్జిస్తూ ఉంటే, నెహ్రూజీవంటి అధినేతలే ఉక్కిరిబిక్కిరయ్యారు. అంతవరకు యీ వ్యవసాయాన్ని గురించిన స్థూలమైన అభిప్రాయాలు లేని సభ్యులు గూడా చర్చలు— పరిశోధనలుచేసి రంగాజీతో ఏకీభవించారు. కాని...దురదృష్టం ఏమిటంటే అధికారాన్ని చేజిక్కించుకున్నవారు కాంగ్రెసును వ్యతిరేకిస్తే, లేదా వెలుపలకువస్తే తమ పదవీ ప్రాప కాలు అంతరిస్తాయేమోనన్న స్వార్థపరులు—సమస్యను తుణ్ణంగా ఆకళింపు చేసుకొనికూడా చక్కభజనచేస్తూనే ఉన్నారు. అయినా ఆయన వెరవలేదు. తన ధ్యేయాన్ని విడువలేదు. ఆ కాంగ్రెసులో యిమడలేదు. కనుకనే తమ సహచరులతో ఆలోచించి పోరాటం "తప్పనిసరి" అని నిర్ణయమైన తరువాతనే వెలుపలకు వచ్చారు. శ్రీమాన్ రాజగోపాలచారి వీరి ఆశయాన్ని గుర్తించి ఆనందంతో ఆయనకూడా ముందుకురావడం ముదావహం.

యిక్కడ ఒక విషయాన్ని జ్ఞప్తిచేసుకొనవలసి ఉంది. కొంత కాలంగా ఆంధ్ర కాంగ్రెసు వాదులలో ఏర్పడిన అనైక్యత— పదవీ

పోరాట సందర్భంగా కొందరు లోగడ డెమోక్రాటిక్ పార్టీని ఏర్పర చారు. ఆ సందర్భంలోనే అక్కడ ఢిల్లీలో రంగా సహకార వ్యవ సాయంపై తీవ్రంగా విభేదించి ఉన్నారు. యిదే అదునని డెమోక్రా టిక్ పార్టీవారు ఆయనను ఆహ్వానించడం అందుకు అంగీకరించక పోవడం జరిగింది. యీ నిరాకరించడాన్ని ఆసరాగాతీసుకొని కొందరు వక్రభాష్యం చెప్పారు. యీ చెప్పినవారిలో డెమోక్రాటిక్ పార్టీలో కూడా కొందరు లేకపోలేదు. కాని ఆ వక్రభాష్యం చెప్పినవారే, పదవీ పంపకాలలో ఏదో రాజీ ఏర్పాటుచేసుకొని, తిరిగి కాంగ్రెసు గుడారంలో కండ్లు మూసుకొని గుబుక్కున జొరబడ్డారు. కనుకనే, రంగాగార్ని కొందరు అపార్థంచేసుకున్నా, అసత్యమైన దుమారం రేపినా సుదూరంలోనే వారి ఔన్నత్యాన్ని ప్రజలు గుర్తించ గలరు.

భారత దేశంలో సోషలిస్టు సమాజ వ్యవస్థను నిర్మించాలనే సంకల్పముతో కాంగ్రెసు పాలకులు పరుగులు తీస్తున్నారు. సమా నత్వం, సర్వమానవ సౌభ్రాతృత్వం అంటూ సహకార వ్యవసాయ క్షేత్రాలను నెలకొల్పాలని అంగలార్చు తున్నారు. యిక్కడే రంగాజీ వారికి విరోధి అయ్యారు. త్వరపడవద్దని, పునరాలో చించమని కూడా హెచ్చరికలు చేశారు.

సహకార వ్యవసాయంయొక్క అంత్యదశ సమిష్టి వ్యవసాయం దీని నిజస్వరూపం పొరుగు దేశాల్లోని ప్రజల జీవన విధానాలదృష్ట్యా మనం ఆకళింపు చేసుకున్నాము. ఈ క్షేత్రాలనే ఉచ్చులో చిక్కు కున్న రైతాంగం శాశ్వితంగా బానిసలై పోవడం తథ్యం. పైగా నోరుగల పెత్తందార్ల జులుంక్రింద గ్రామీణ జీవులు గిజ-గిజ లాడ వలసి వస్తుంది. ఎప్పుడూ, ఏప్రభుత్వంలోనూ వృత్తిజీవుల స్వేచ్ఛను హరించే విధానాలు దేశానికి అరిష్టదాయకం. అలాంటి చర్యలను అరికట్టడానికి దేశాభిమానులంతా నడుం కట్టాలి అని నూటికి 80 మందిగాగల గ్రామీణ వృత్తిజీవుల పరిరక్షణకై స్వతంత్రపార్టీ

ద్వారా శంఖం పూరించి ప్రజలను మేలుకొల్పుతున్నారు. స్థలాభావమువల్ల నేని సమస్యను సంక్షిప్త పరచినా, రంగాగారి పొలికేకతో ప్రారంభమైన యీ సమస్య యిప్పటికే వాడవాడలా ప్రాకి ఉన్నది. కనుక విపులీకరించ నక్కరలే దనుకుంటాను.

ఇది చాల గడ్డుసమస్య. కాంగ్రెసు గణాచార్లు పదవిలంపటాలలో చిక్కుకొని నోరు మెదపలేక పోయినా, కొందరి హృదయాలలో అగ్నిపర్వతాలే ప్రజర్విల్లుతున్నాయి. అయినా జాప్యం ప్రమాద హేతువు. గ్రామీణజీవులు సంఘటితపడి, తమ స్వేచ్ఛా పరిరక్షణకు కంకణం కట్టకపోతే అనతికాలంలోనే, ఆయాస్వవృత్తి హక్కులు భూస్థాపితం కావడమే గాక, శాశ్వతంగా బానిసలు కావడం ముమ్మాటికీ తథ్యం. యీ సత్యాన్ని మభ్యపరచడానికి పాలకులు, గణాచార్లు కొన్ని డొంకతిరుగుడు సూత్రాలను వల్లిస్తున్నారు. ఎన్నో అసత్య సూత్రాలతో నమ్మించాలని విశ్వ ప్రయత్నం చేస్తున్నారు. మనమంతా వృత్తి స్వేచ్ఛా పరిరక్షణకు ప్రతిజ్ఞ తీసుకుందాం. రైతు స్వామ్యాన్ని హరింప జూచే శక్తులను ధీశక్తితో ఎదిరిద్దాం. రైతు వ్యవస్థా నిర్మాత రంగాజీ నాయకత్వాన పురోగమిద్దాం. విజయాన్ని సాధిద్దాం. జై కిసాన్.

# కాంగ్రెసుతో ఎప్పుడూ ఘర్షణ పడుతున్నారు

## శ్రీ జెట్టి నాగేశ్వరరావు

ఆయన హృదయము క్షీరసముద్రము. ఆయన ఆదర్శము హిమనగము అంతటి ఉన్నతము. ఆయన జీవితము స్నిగ్ధస్ఫటికము. ఆయన వినయ భూషణుడు. ఆయన సంఘమునుండి కోరునది అత్యల్పము—ఇచ్చునది సర్వస్వము.

తనకు పార్లమెంటు సభ్యుడుగా వచ్చు దిన భత్యములలో మిగిల్చి అనుచరులకు ఆడబ్బు పంపుచుండును. తనకు తెలిసిన ప్రతి చిన్న విషయముకూడ అనుచరులకు బోధించి, వారుచేయు ఉద్యమ సేవ తనకు చేసిపెడుతున్న సహాయముగా భావించి మురిసిపోతుంటారువారు.

నిష్కపటి. కావునే ఒరుల కపటమెరుగలేడు. ఆయన జీవితమున దాచుకోవలసినది లేదు—కావునే ఆయన రాజకీయ వృత్తిదారులవలె రహస్యముల దాచడు.

సాంఘిక, రాజకీయ దురాచారములపై ఆయన తిరుగుబాటుదారు. ఆయన సనాతనాచార పరాయణుడు. చెడు కన్పించని ఆచారముల, సంఘ మర్యాదల అందునవలె పాటించువారరుదు.

నిష్కల్మష వర్తనుడు. నేటి రాజకీయ నాయకులనేకులను లొంగదీసిన కన్యా కాంచన పదవీ ప్రలోభము లాయనను స్పృశించనైనా జాలవు.

ఒక్కమాటలో చెప్పవలెనంటే ఆయన నిజమైన గాంధీజీ వారసుడు—రాజకీయ, సాంఘిక ఆదర్శములు, వ్యక్తిగత ప్రవర్తనలో కూడ.

ఆయనే మా ప్రియమైన ఆచార్యుడు శ్రీ రంగాజీ.

భారత స్వాతంత్ర్య పోరాటము అనేకుల రాజకీయములలోనికి దించినది. వారు రాజకీయములందుండుటచే ఏదో ఒక వర్గమును బలపరుస్తూ ఆయావరముల అండదండలతో వోట్లు సంపాదించ బూనుకున్నారు. కాని శ్రీ రంగాజీ అట్లుగాదు. బ్రిటిషు పాలకుల నెదిరించుటకు మార్గముగా ఆయన రైతుకూలీలను, గ్రామీణ, స్వయంవృత్తుల వారిని బలపరచలేదు. స్వయంపోషకులు, గ్రామీణ, భారతీయ ఆర్థిక వ్యవస్థకు మూలస్తంభములైన ఆ స్వయంవృత్తుల వారి హక్కుల రక్షణార్థమే గాంధీజీవలె, ఆయన రాజకీయములలో దిగినాడు. నాడు కూడ కాంగ్రెసు అధిష్టాన వర్గముతో ఆయనకు అభిప్రాయభేదములు, ఘర్షణలు జరిగినవి. అందుకిదియే మూలము.

రైతుకూలీలకు బ్రిటిషుపాలకులకు వారి కిష్టమైనంతలో చేయు సహాయమును తానాహ్వానించుతాననీ అంత వరకు సహకరిస్తాననీ అన్నాడు. ప్రతి కాంగ్రెసు అభ్యర్థి రైతాంగ వ్యవస్థను, వారి హక్కులను రక్షించుటకు పోరాడతానని ప్రతిజ్ఞా పత్రాన్ని సంతకం చేయవలెనని పట్టుబట్టినాడు. కాంగ్రెసు అధిష్టాన వర్గమువారందు కంగీకరించలేదు. ఘర్షణ తప్పలేదు.

నెహ్రూవంటి నేటి కాంగ్రెసు రథసారథుల దుర్దార్థ్యమును గాంధీజీ నాడు గుర్తించలేదు. శ్రీ రంగా ఆశయమైన రైతుకూలీ కార్యక్రమం సరియైనదేనని తలచినను, దానికింకా అదనురాలేదని, దేశం స్వతంత్రమైన తరువాత అది అమలు జరుపవచ్చునని భావించినారు. శ్రీ రంగాను బలపరచలేదు. రైతు, కూలీ, చేనేత మొదలగు ప్రత్యేక సంఘాలవసరం లేదన్నారు.

బ్రిటిషువారు దేశంవదలి వెళ్లినప్పుడు, రాజ్యాధికారం ఎవరు గ్రహించగలరు? నాడు కాంగ్రెసుకు నాయకత్వం వహించియున్న రైతు, కూలీ, గ్రామీణ వ్యవస్థకు సంబంధంలేని బస్తీల మేధావులు. గాన ప్రత్యేక రైతు, కూలీ, చేనేత మొదలగు సంఘాల ద్వారా

ఈ గ్రామీణ వర్గాలను చైతన్యవంతం చేయక తప్పదన్నారు శ్రీ రంగా. గాంధీజీ ఇష్టానికికూడ వ్యతిరేకంగా ఆ యా సంఘాల నిర్మాణం కొనసాగించారు. ఆ సంఘాల నిర్మాణానికి కాంగ్రెసు పూనుకోలేదు. వెనుకబడ్డ ఆ వర్గములకు ప్రత్యేక శ్రద్ధతో రాజకీయ చైతన్యం కలిగించ బూనలేదు. ఆనాడే గనుక కాంగ్రెసు అధిష్టాన వర్గం శ్రీ రంగాజీ సూచన అంగీకరించి యుంటే—కమ్యూనిస్టులసలీ దేశంలో తల ఎత్తగలిగెడి వారేగాదు.

అందువల్ల దేశానికి రెండుకీడులు కలిగినై. మొదటిది—కమ్యూనిస్టులు నిరాటంకంగా ఆవర్గాలలోనికి చొచ్చుకొని వెళ్లగలిగారు. శ్రీరంగాజీ అధ్వర్యాన ఉన్న విదప్ప, కమ్యూనిస్టుల చేతులలోనున్న తక్కిన రైతుకూలీ మొదలగు సంఘాలు 1942 జాతీయ పోరాటంలో జాతీయ ఉద్యమానికి వ్యతిరేకంగా నిలిచి పనిచేసినై.

రెండవకీడు—ఎట్లో దేశం స్వాతంత్ర్యం పొందినప్పుడు—రాజకీయాధికారం హస్తగతం చేసుకున్న కాంగ్రెస్‌సంస్థయొక్క పెత్తనం ఈ గ్రామీణావర్గాల చేతులలోనికి రాలేదు. ''తాము తమ తండ్రితాతలుకూడ వ్యవసాయమంటే ఏమిటో ఎరుగని'' నాయకులు శ్రీ నెహ్రూవంటివారు కాంగ్రెసు సారథ్యము, దేశసారథ్యము వహించటం జరిగింది. రైతుకూలీ, కళాకారుల, చిన్నవ్యాపారులు మొదలగు స్వయంవృత్తులవారి సమస్యల నర్థంచేసుకొని, అవసరాల గమనించని, ఉనికినే నాశనం చేయునట్టి నడక కాంగ్రెసు ప్రభుత్వం ప్రారంభించింది.

బాపూజీ జైలులో నుండగనే దేశానికి జరిగిన మొదటికీడు గమనించి. జాతీయనాయకుల విడుదల జరుగగానే— 1945 లోనే కాంగ్రెసు అధ్వర్యాన రైతుసంఘాల నిర్మాణం గావించమని రంగానుతా నాదేశించినట్లు ప్రకటించినారు.

రెండవకీడును దేశం స్వాతంత్ర్యం బొందిన కొద్దిమాసాలలోనే గాంధీజీ గ్రహించ గలిగారు. తన ఇల్లే కోటగా, పొలమే రాజ్యంగా

ఏ అధికారికీ తలఒగ్గ నవసరంలేని, అన్నదాతయగు రైతును తిండిదొంగగా సృష్టించి—అటు ఉత్పత్తిదారుని, ఇటు వినియోగదారు ఇరువురి హక్కులనూ క్షేమాన్నీ, గౌరవాన్నీ, మంటగలిపి బ్లాకు మార్కెటు వ్యాపారులు, లంచగొండి ఉద్యోగులకు మాత్రమే లాభిస్తూ జాతి నైతిక పతనం గావించిన కంట్రోలు రేషనింగు లను తీసివేయాలని ఇటు రంగా ఉంచాలని అటు నెహ్రూ పట్టుబట్టి ప్రచారం చేస్తున్నప్పుడు—బాపూజీ రంగాను బలపరచారు.

నెహ్రూ గాంధీజీ అభిప్రాయాన్ని కూడ నిరాకరించి కంట్రోళ్లు ఉండివలసినదేనని పట్టుబట్టినపుడు బాపూజీ హృదయం వ్యధ జెందింది. ఒక ప్రార్థన సమావేశంలో వారన్న మాటలు—"కంట్రోళ్లు జాతినే నైతికపతనం చేస్తున్నవి. ఉత్పత్తిదారులేగాక వినియోగ దారులు కూడ కంట్రోళ్ళు పోవాలని కోరుచున్నారు. దేశం నలు మూలలనుండి, అన్ని వర్గాలనుండి నాకు లేఖలు వస్తూవుండటంవల్ల ఈ విషయం నాకు బాగా తెలుసు. కాని ఏమి చేయగలను? నారోదనం అరణ్యరోదనం అయింది. భారతప్రభుత్వం, పండిట్ నెహ్రూ కంట్రోళ్ళు ఉండాలని పట్టుబట్టుచున్నారు. కాని ఎంతలావు పండితు నకు కూడ ప్రజల అవసరాలు ప్రజలకంటె తనకెక్కువ తెలుసుననే గర్వం పనికిరాదు".

నెహ్రూ దృష్టి వేరనీ, నెహ్రూ నాయకత్వానగల కాంగ్రెసు ప్రభుత్వం రైతుల, గ్రామీణ ప్రజల సమస్యల నర్థంచేసుకోలేదనీ, హక్కుల రక్షించ జాలదని బాపూజీ చివరరోజులలో గ్రహించారు. రైతే రాజు కావాలనే తన ఆశయం.

రంగాగారివంటివారు దేశానికి నాయకత్వం వహించినప్పుడే గాని నెరవేరదని గుర్తించారు. రంగాజీతో సుదీర్ఘ సంభాషణలు జరిపి — ఆ వెంటనే హాజరైన ప్రార్థన సమావేశంలో ఒక రైతు భారత ప్రభుత్వం అధినేత అయినప్పుడుగాని తన ఆశయం నెరవేరదనీ— రైతు రాజ్యం, రామరాజ్యం రాదని వ్రాక్కుచ్చినారు. బాపూజీ

చివరిరోజులలో నెహ్రూకు దూరంగా, రంగాకు దగ్గరగా వచ్చారు. తన వారసుడు—తన ఆశయాలకు వారసుడు రంగాయేనని గుర్తించి, తదనుగుణ్యంగా నడక ప్రారంభించారు. కాని భారత రైతాంగం యొక్క, గ్రామీణ ప్రజానీకంయొక్క దురదృష్టవశాత్తు బాపూజీ అకస్మాత్తుగా మనలను వీడివెళ్ళటం జరిగింది.

ఆవేశంలో తమ వృత్తులువదలి స్వాతంత్ర్య సమరంలోపాల్గొన్న కాంగ్రెసు నాయకులు (అసలు ఏవృత్తిలేక జేరినవారు ఉన్నారనుకోండి) రాజకీయవృత్తినే అవలంబించి, నహుషుని పుణ్యంవలె తను వెనుకటిత్యాగ ప్రతిఫలంగా నేటి దేశసంపదలను అనేక రూపాలతో, పేర్లతో అనుభవించ బూనుకున్నారు. ఇక వారికి కావలసింది లేదు. తమ శేష జీవితాలు ఈ భూమిపై ఉన్నంతవరకు ఉన్నతపదవులన్నీ తామే ఆక్రమించి, సుఖించి, తమ బంధుమిత్రులకు కూడ ఆ లాభాలు అందించి తమ సంతానానికి వెనుకవేసిపోతే చాలు.

కాని రంగాజీ ఆశయం—బాపూజీ కలలుగన్న రైతురాజ్యం—రామరాజ్యం—దేశస్వాతంత్ర్యంతో నెరవేరలేదు. రైతు, కూలీలు, కళాకారులు, చిన్న వ్యాపారస్థులు మొదలుగాగల స్వయం వృత్తుల వారియొక్క హక్కులు బ్రిటీషువారి పాలనలో కంటె కూడ హెచ్చుగా—ఈ రాజకీయవృత్తిదారుల, మార్క్సు మానసపుత్రుల దాడికి గురియైనవి. పరిపాలకులు దేశన్యాయాన్ని భంగపరచినా సాంఘిక న్యాయాన్ని కొంతవరకైనా కాపాడినారు. సంఘంలోని ఒక వర్గాన్ని వెనుకవేసుకొని, ఇంకొక వర్గనాశనానికి పూనుకోలేదు. సాంఘిక వ్యవస్థను తారుమారుచేయ బూనలేదు. కాని నెహ్రూ నాయకుడుగాగల కాంగ్రెసు ప్రభుత్వం రైతు, కూలీ, కళాకారుల చిన్న వ్యాపారుల స్వయంవృత్తులను—సహకార, సమిష్టి వ్యవసాయం, ప్రభుత్వ వ్యాపారం మొదలగు విధానాలద్వారా భంగపరచ బూనుకున్నది.

కావున రంగాజీకి కాంగ్రెసువారితో మరల ఘర్షణ తప్పలేదు. కాంగ్రెసునుండి నిర్గమించినాడు. కృషి కార్ లోక్ పార్టీకి నేటి స్వతంత్ర పార్టీకి నాయకత్వం వహించవలసి వచ్చింది. చిత్రకారుని మనసులో నున్న చిత్తరువు, ఫలకంమీద సరిగా కుదురువరకు, అది తుడిచివేసి మరల వేయుచునే ఉండునట్లు రాజర్షి రాజాజీ నాయకత్వాన రూపొందిన స్వతంత్రపార్టీ వారి ఆశయాదర్శాలకు సరియైన ప్రతి రూపం వహించింది.

బాపూజీ నిజమైన వారసులు శ్రీ రాజాజీ, రంగాజీల నాయకత్వాన, స్వతంత్రపార్టీ ఆధ్వర్యాన, భారత ప్రజానీకం ఇంకొక కఠిన తరమైన స్వతంత్ర పోరాటం సాగించి, బాపూజీ ఆశయమైన, వారు కలలుగన్న వ్యక్తికి ప్రాధాన్యంగల రైతురాజ్యం, రామరాజ్యం స్థాపించుకోవాల్సి ఉంది.

# ఆచార్యజీ గ్రంథాలయ సేవ

## శ్రీ వెలగా వెంకటప్పయ్య

తన దేశంలోని గ్రంథాలయాలను చూచుకొని యే దేశమైనా గర్వించవచ్చును. గ్రంథాలయాలు ఒక దేశంయొక్క వైజ్ఞానిక స్థాయిని సాంస్కృతిక పరిమాణాన్ని ప్రతిబింబించగలవు. కనుక వివిధ రంగాలలో ఒక దేశపు వృద్ధిక్షయాలను గుర్తించడానికి అచటి గ్రంథాలయాలలోని పుస్తక సంచయంలోని సాహిత్య సంపదనుబట్టి గ్రహింపవచ్చును. కాబట్టి ఆదర్శవంతమయిన గ్రంథాలయ నిర్వహణకు దేశ సంపత్తులో అంతటి ప్రాధాన్యత వుంది. తాత్వికంగానూ సాంస్కృతికంగానూ, ఉన్నత శిఖరాల నందుకొన్న భారతీయులు యేనాడో గ్రంథాలయాల అవసరాన్ని, ఆవశ్యకతను గుర్తించారు.

విశాల భారతావనిలో ప్రాచీనకాలంలోనే గ్రంథాలయాలు స్థాపించబడినవి. ఇవి రాజుల ఆస్థానాలలోనో, దేవాలయాలలోనో, జమీందారులవద్దనో, శ్రీమంతుల చెంతనో వుండేవి. పైగా యివి వారు ఆస్తిపాస్తులలో ఒక భాగంగా పరిగణించబడేవి. కనుక వీటిని వ్యక్తిగత గ్రంథాలయాలు (పర్సనల్ లైబ్రరీస్) అనవచ్చును. సాహిత్యం, మతం, తత్వం మొదలయిన శాఖలలో దప్ప సామాన్యుడు చదువుకొని తెలుసుకోడానికి, ఆనందించటానికి గాని, తగిన పుస్తకాలు వుండేవికావు. అదృష్టవశాత్తూ ఆ పుస్తకాలు వున్నప్పటికి సాధారణ పౌరునికి ఆ గ్రంథాలయానికి వెళ్ళి చదువుకునే అవకాశం గాని, అనుమతిగాని, చొరవగాని, లేదు – ఆ పెద్దల ప్రాపకం లేందే బ్రతుకే దుర్లభంగా వుండేది.

కనుకనే ఆనాజులలో ప్రజలు చైతన్య రహితంగా వుండేవారు. జీవితసమస్య ప్రధానంగా వుండిగనుక రాజకీయ రంగంలోనూ, వైజ్ఞా

నిక రంగంలోనూ, యింకా యితర రంగాల్లోనూ చాల వెనుకబడి వుండేవారు. ఆర్థిక స్థోమత చేతనో, దౌర్జన్యం చేతనో ఆనాడు రాజుల ఆస్థానాలను ఆక్రమించారు తప్ప- విజ్ఞానసిద్ధియై, తన ప్రతిభాసంపత్తితో అధికారాన్ని చేపట్టినవారు బహు అరుదు.

జీవిత చక్రాలలో ఆగడ్డుదినాలు దొర్లిపోయినాయి. సామాన్య ప్రజానీకాన్ని సహితం వివేకవంతం చేసి, చైతన్యంకలిగించే వుద్దేశంతో గత శతాబ్దంలో సార్వజనీన గ్రంథాలయాలు (పబ్లిక్ లైబ్రరీస్) ప్రారంభించబడినాయి. జాతి, మత, వర్గ విచక్షణలేక యీ గ్రంథాలయాలలో సర్వజనులు వైజ్ఞానిక అభివృద్ధి చేసికొనుటకు అవకాశం కల్పించ బడినది.

సార్వజనీన గ్రంథాలయాలకు గత శతాబ్దంలో అంకురార్పణం జరిగినా యీ శతాబ్దంలో వాటి అభివృద్ధి జరిగింది. మానవ పురోగమనానికి తోడ్పడు సంస్థలలో గ్రంథాలయాన్ని ప్రధానంగా గుర్తించారు. కనుకనే గ్రంథాలయాలు నాటినుండి నేటివరకు అనేక సంస్థలకు, ఉద్యమాలకు అండదండలుగా వుంటూ పలు విధాలుగా ప్రోత్సహించి వాటి శక్తిసామర్థ్యాలను యినుమడింప జేసింది.

గత రెండు శతాబ్దాలుగా సాగుతోన్న భారత స్వాతంత్రసమరం యీ శతాబ్ది ప్రారంభంలో తీవ్రరూపం దాల్చింది. వాడవాడల సభలు సమావేశాలు జరిపి ప్రజలలో దేశభక్తి ప్రబోధం చేస్తూ వుండేవారు. మోచర్ల రామచంద్రరావు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య' కొండా వెంకటప్పయ్య పంతులు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు' సురవరం ప్రతాపరెడ్డి మొదలయిన మహామహులెందరో నిరంతరం స్వరాజ్య సాధనకు కృషిచేస్తూ గ్రామగ్రామాన గ్రంథాలయాల అవసరాన్ని ప్రజలకు తెలియ పరుస్తూ వుండేవారు.

అది 1910 సంవత్సర ప్రాతంనాటి విషయం. ఆరోజులలో మన ఆచార్యరంగాగారు వున్నత పాఠశాలలో చదువుతూ వుండేవారు.

పాఠ్య పుస్తకాలతోపాటు కేవలం కల్పనాకథలు చదవక చరిత్ర, సాంస్కృతిక గ్రంథాలు విరివిగా చదివేవారు.

తాను చదివిన గ్రంథాలలోని మంచి విషయాలను ప్రోగుచేసి తోటి విద్యార్థులకు అధ్యయన తరగతులు నిర్వహించేవారు.

''చరిత్ర – సాంస్కృతి'' పైగల గ్రంథాలు, దేశనాయకుల నిర్విరామ ప్రబోధాలు రంగాజీని ఎంతగానో ఆకర్షించాయి. రాజకీయ చైతన్యానికి నాంది వేశాయి. రాజకీయ విజ్ఞానం ప్రజల కుప యోగ పడాలనీ, తను ప్రజల మనిషిననీ, ప్రజలు తన వాళ్ళని ఆచార్యజీ ఆనాడే భావించారు.

తన దేశానికి సంబంధించిగాని, విదేశాలకు సంబంధించిగాని ఏరంగంలో నయినా వృద్ధిక్షయాలు తెలుసుకోడానికి, మనం వారి అనుభవాలకు ఆకళించుకోడానికి గ్రంథాలయం అవసరమని గుర్తించారు. అప్పటికే తన గ్రామం నిడుబ్రోలులో ఆంధ్ర సరస్వతీ గ్రంథాలయం వుండేది. కాని పనిచేయటంలేదు. ఈ గ్రంథాలయ పునరుద్ధరణ కార్యక్రమానికి రంగాజీ పూనుకొని 1915 సంవత్సరంలో తన స్వంత చావిడిలో ప్రారంభించారు. కొద్దిగా పుస్తకాలు, కొన్ని పేపర్లు మాత్రం వుండేవి.

గ్రంథాలయం చేయాల్సిన ముఖ్య కార్యక్రమాలలో ఆనాడున్న ప్రధాన సమస్యలకు ప్రజల ముందుంచటం. ఆపని యీ గ్రంథాలయం బాధ్యతతో చేసింది. లక్షలాది ప్రజాధనంతో నడుస్తున్న యీనాటి గ్రంథాలయాలు యీ కార్యక్రమాన్ని ఎంతవరకు నిర్వహిస్తున్నాయో చెప్పలేం. కాని ఆనాడు ప్రజలలో గ్రంథాలయాలు తెచ్చిన చలనం భారత స్వాతంత్ర్య సమర చరిత్రలో అపూర్వ ఘట్టం.

గ్రంథాలయ పునరుద్ధరణతోనే తన పని తీరిపోయిందనకోక దాని పురోభివృద్ధికి ఎంతో కృషి చేశారు. తన చావడి గ్రామానికి ఒక మూల వుండటంచేత అందరకు అచటికి రావటానికి యిబ్బందిగా

వుండేది. అందుకోసం ఆచార్యజీ ఆంధ్ర సరస్వతీ గ్రంథాలయాన్ని గ్రామ నడిబొడ్డుకు మార్చారు. అందరకు అందుబాటులోనూ, సమీపంలో వుండటంచేత యీ గ్రంథాలయం పిన్నలను, పెద్దలను ఎంతగానో ఆకర్షించింది,

చదువురాని వారిని సహితం యీ గ్రంథాలయం ఆకట్టుకుంది. మన దేశంలోను, యితర దేశాలలోను నిరంతరం జరిగే పరిణామాలకు ఆచార్యజీ వయోజనులకు చెబుతూ వారిని కనువిప్పు కలిగించేవారు. పత్రికలలోని ప్రధానమయిన భాగాలకు చదివి వినిపించేవారు. విజ్ఞాన వీధులలో వారిని విహరింపజేసి తృప్తిచెందేవారు.

అంతేగాక ఆనాడున్న సమస్యలపై గ్రంథాలయంలో చర్చలు జరిపేవారు. దేశాన్ని కలవరపరుస్తున్న సమస్యలను కూలంకషంగా చర్చించటం ద్వారా యువకులు, వయోజనులు అనేక విషయాలు తెలుసుకోడానికి అవకాశం కలిగేది. ఆ విధంగా ఆచార్యజీ గ్రంథాలయాన్ని ఎంతో ఆదర్శవంతంగా నిర్వహించారు. ప్రజలకు వివేకవంతులుగా చేయటానికి గ్రంథాలయాల్ని మించిన సంస్థ లేదని నిరూపించారు. పరిసర ప్రాంతాలలోనూ, దూరప్రాంతాలలోనూ అనేక గ్రంథాలయాల స్థాపనకు తోడ్పడ్డారు. తానొక గ్రంథాలయ సేవకుడుగా దీక్షవహించి కృత కృత్యులైనారు. గ్రంథాలయ వుద్యమానికి అనుపమ ప్రచారం చేశారు.

గ్రంథాలయాన్ని జాతి, మత, కులవ్యవస్థలకు దూరంగా వుంచాలని ఆచార్యజీ ఆశయం. తన ఆశయం విజయంకోసం నిర్విరామ కృషికి వెనుకంజ వేయరు. నెల్లూరు జిల్లాలోని ఒకగ్రామంలోని గ్రంథాలయాన్ని ఒక కులపెద్ద నిర్వహిస్తూ, సామాన్య ప్రజలకుగాని యితర కులాలవారికిగాని ప్రవేశం కల్పించక తన మూఢత్వాన్ని ప్రదర్శిస్తూ వుండేవాడు. ఈ విషయం రంగాజీకి తెలిసి యువకులను కూడగట్టి ఆ పెద్దయొక్క అనుచిత ప్రవర్తనను అడుగంటించారు. గ్రంథాలయం వుపయోగించటంలో అందరకు అవకాశాన్ని కల్పిం

-చారు. ఇలాంటి వీరోచిత సంఘటనలు ఆచార్యజీ జీవిత సమరంలో ఎన్నో చూడగలం.

గ్రంథాలయ వుద్యమానికి వయోజన విద్యా ప్రచారానికి అవినాభావ సంబంధం వుందని అందరు ఎరిగినదే. పెద్దలు విజ్ఞానవంతులు కానిదే పిల్లలు వృద్ధిలోకిరారు. భావితరాలవారి పురోభివృద్ధి కొరకైనా వయోజనులు విజ్ఞానవంతులు కావాలి. సూరి వెంకటనరసింహశాస్త్రి, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, అయ్యంకి వెంకట రమణయ్య మొదలయిన విజ్ఞానవేత్తలు వయోజన విద్యాప్రచారాన్ని వాడవాడకు చేస్తువుండేవారు.

ఆ వుద్దేశ్య బలంతో ఆచార్యజీ 1922 సంవత్సరంలో వయోజన విద్యా ప్రచారసంఘాన్ని స్థాపించారు. అనేకమంది నిరక్షరాస్యులకు విముక్తి కలిగించి విజ్ఞానలోకపు వెలుగులు చూపించారు. అంతేగాక——

"నిరక్షరాస్యత నిర్మూలింపుడు
విద్యావ్యాప్తిని చేయండోయ్"

అని వాడవాడల తన విజ్ఞాన శంఖాన్ని వినిపించి ప్రజలకు కనువిప్పు కలిగించారు.

కనుక వారు చేపట్టిన యేవుద్యమమైనా అనన్య ప్రచారం పొంది ప్రజల ముందుకు వెళ్ళేది. జనజీవాలు పుంజుకొని వీరోచిత పోరాటాన్ని సాగించేది. రైతు వుద్యమం, విద్యార్థి వుద్యమం, మహిళా వుద్యమం, చేనేత వుద్యమం, గ్రంథాలయ వుద్యమం, వయోజన విద్యా ప్రచారవుద్యమం—— మొదలయిన అనేక ప్రజావుద్యమాలలో వారి నిర్వహణా సమర్థత, ప్రజ్ఞ, ప్రభావాలు మనకు ప్రస్ఫుటమౌతాయి.

ఈ వుద్యమాల వలన అనేకమంది యువకులు కార్యరంగంలోకి వచ్చారు. వారిని నిరంతరం ప్రోత్సహిస్తూ తన విజ్ఞాన సౌరభ్యాన్ని

వెదజల్లి మట్టినుండి తీసిన మాణిక్యాలుగా మెరిపించారు. వారి జీవిత దృక్పథంలో వెలుగుబాటను చూపించారు ఆచార్యజీ.

కాబట్టి ఆచార్యజీ ప్రజాజీవితం దాదాపు యాభై సంవత్సరాల క్రితం (1910) సహాధ్యాయులకు తాను చదివిన పుస్తకాలలోని విషయాలపై అధ్యయన తరగతులు నిర్వహించటంలోనే ప్రారంభ మయినదని చెప్పవచ్చును. మహోన్నతంగా ౧౯౫౦ సంవత్సరం వారికి జరిగిన షష్టిపూర్తితోబాటు వారి ప్రజా జీవితానికి స్వర్ణోత్సవంగూడ జరిగినదని చెప్పగలం. వారి నిరంతర విజ్ఞాన అన్వేషణ, అకుంఠిత కార్యదీక్ష, స్వేచ్ఛా పిపాస ముప్పిరికొని మహనీయమూర్తిగా రూపొందించాయి.

ఈ జీవిత ప్రాంగణంలో ఎలెన్ రాయ్‌తో పోల్చగల సాధ్వీ మణి, ఆదర్శగృహిణి, అమృత స్వరూపిణి భారతీదేవి రంగాను అభినం దించకుండా వుండలేం.

# పశు వైద్యాభిమాని

కీ. శే. యేజెళ్ళ శ్రీరాములు చౌదరి

ఎంతోమంది పుడుతున్నారు — మరెందరో గిడుతున్నారు. వారివలన దేశానికిగానీ, సమాజానికిగానీ ఉపకారముండదు. అంత మాత్రంచేత సామాన్య ప్రజలను నిరసిస్తున్నారని ఎవ్వరూ భావించ కుందురుగాక. నా ఉద్దేశమల్లా మహామహులైనవారు, జాతి నుద్ధ రించగలవారు, ఏ దేశానికైనా, ఏ కాలానికైనా వ్రేళ్ళమీద లెక్కింప దగినంతమంది మాత్రమే ఉంటారని. అటువంటి పుణ్యమూర్తులలో, రైతు నాయకులలో, దేశోద్ధారకులలో రంగాగారొకరు.

రంగాగారు తమ జీవితాన్నంతటిని దేవసేవలో గడిపిన తపస్వి, త్యాగమూర్తి. అరువది సంవత్సరాల జీవితంలో సుమారు ముప్పది వత్సరములు ప్రజాజీవితంలో గడపిన ధన్యులు. భారత స్వాతంత్ర్య సమర రంగములో ప్రప్రథమ శ్రేణిని నిలచి, వీరోచితంగా పోరాడిన సైనికుడు. ఎన్ని కష్టాలు సంభవించినా, ఎన్ని నష్టాలు వచ్చిపడినా, వెనుకంజ వేయడ మెరుగని ధీరుడు. "విజయమో— వీరస్వర్గమో" తప్ప మధ్యేమార్గము లేదని విప్లవ తత్వాన్ని జీవనాడులను పట్టించుకొని స్వాతంత్ర్యాన్ని సాధించేవరకు విరామం లేకుండా, నాటినుండి నేటివరకు కృషిచేసిన, చేస్తున్న కర్మవీరుడే గాక, కర్షకవీరుడు. మహాత్మాజీ స్వాతంత్ర్య దివ్యసందేశ శంఖా రావాన్ని వినిపించి వందలాది యువకుల్ని స్వరాజ్య రైతుకూలీ ప్రజారాజ్య గ్రామాల కురికించిన సైన్యాధిపతి ఆచార్య రంగాగారు.

అసమానం, అసూయ యెరుగని విశాలహృదయులు రంగాగారు. ఆయనముఖంలో నేను వికారాన్నిగాని, విషాదాన్నిగాని చూచినట్లు లేదు. ఎప్పుడు చూచినా చిరునవ్వే. మనసిచ్చి మాట్లాడే మధుర

స్వభావం వారిది. ఆయన ప్రజలచేత ప్రేమింపబడినవ్యక్తి. వారు తెలుగులో ఉపన్యాసమిస్తూ ఉంటే వినాల్సిందేగాని వర్ణించడం కష్టం. రంగాగారు గొప్ప నిర్మొగమాటి. ఏదయినా చెప్పదలచి నపుడు కుండ పగులగొట్టినట్లు ఖచ్చితంగా చెప్పే స్వభావం. మరు క్షణం మళ్ళీ మనస్సులో ఏమీఉండదు.

నాకు వారితో చాలాకాలమునుండి సన్నిహిత సంబంధ మున్నదని చెప్పుకొనుటకు గర్విస్తున్నాను. వారి రాజకీయపుటాశ యాలు ఏవి అయినప్పటికీ ఆ రాజకీయములపట్ల వారికున్న అచంచల విశ్వాసాన్ని నేను హృదయపూర్వకంగా అభినందిస్తాను. 1929 లో వారు మా వైద్యాలయాన్ని సందర్శించి సంతృప్తిని వెల్లడించటమే గాక - తమ జీవితకాలమంతా ఇటువంటి కృషికి దోహదమిస్తామని వక్కాణించారు. అప్పుడప్పుడు వారిచే నిర్వహింపబడే రాజకీయ విద్యాలయములలో నాచేత పశువైద్యాన్నిగురించి చెప్పించి, తమ పశు సేవాసక్తిని ప్రదర్శించేవారు. 1939 వ సంవత్సరములో ననుకొంటాను, మా కళాశాల పట్టణ ప్రధానోత్సవానికి అధ్యక్షత వహించి విద్యార్థు లకు "పశువైద్యాచార్య" బిరుద ప్రదానము గావించారు. ఆసంవత్సరమే పశువైద్యశాలలకిచ్చే గ్రాంటును గురించి ప్రభుత్వంతో తీవ్రంగా పోరాడారు.

వీరి ఆయుర్వేద పశువైద్యాభిమానానికి నిదర్శనంగా ఒక చిన్న సంఘటనను క్రింద పొందుపరుస్తున్నాను.

1937లో ప్రభుత్వం - ఆయుర్వేద పశువైద్య మూలికాన్వేష ణకుగాను ఒక లక్షరూపాయలు మంజూరుచేసింది. కాని కొందరు తెల్లదొరలు దీనికి అడ్డు తగిలారు. "చచ్చు ఆయుర్వేద వైద్యం కోసము ప్రభుత్వము ఇంతడబ్బు ఖర్చుచేయటం అనవసరం" అని పేలారు. రంగాగారీ నీచవాదాన్ని తీవ్రంగా ఖండించారు. "మీకు ఆయుర్వేద పశువైద్య మూలికాప్రభావం తెలియాలంటే, కృష్ణాజిల్లా అంగలూరు వెళ్ళండి. అక్కడ శ్రీ యేనెళ్ళ శ్రీరాములు చౌదరి

గారిని కలుసుకోనండి. మీ సందేహాలన్ని విచ్చిపోతాయి. అప్పటికీ మీదృక్పథం మారకపోతే, మీయిష్టంవచ్చిన నిర్ణయానికి రావచ్చు'' అని కోపగించుకొన్నారు. తత్ఫలితంగా ప్రభుత్వం తరఫున శ్రీ కృష్ణస్వామి అయ్యంగారు నావద్దకు రావటమూ, ఆంధ్రదేశంలో తప్ప మరెచ్చటా నేనిటువంటి కళాశాలలనుగానీ, వైద్యనైపుణ్యాన్నిగానీ ఇంతవరకూ చూడలేదు'' అని వారు అనటమూ జరిగింది.

అఖిలభారత కిసాన్ మహాసభసందర్భంలో మాపశువైద్యాన్ని గురించి ఉపన్యసించి, ఆసేతు హిమాచలం ఈ వైద్యమును ప్రోత్సహించాలనే తీర్మానాన్ని ప్రతిపాదించి తమ జాతీయాభిమానాన్ని చాటుకొన్నారు. విదేశపర్యటన సందర్భంలో ఆదేశాలలో అభివృద్ధి నొందిన నూతన వైద్యశాస్త్ర విషయసంబంధమైన పెక్కు గ్రంథాలను నాకిచ్చి, నన్ను మరింతగా ఉత్సాహపూరితులను చేశారు; ఈనాటికి చేస్తున్నారు.

రంగాగారు ఒక వ్యక్తి కాదు; ఒక ఉద్యమం – ఒక మహత్తర సంస్థ. ఒక తీవ్రమైన శక్తి. ఆంధ్రదేశపు పుణ్యాలపంట. భారతమాత గర్వించదగ్గ ఉత్తమ పుత్రరత్నం. ప్రపంచప్రముఖ రాజకీయవేత్తలలో ఒక ఆణిముత్యం. రాజకీయంగాను, సాహిత్యపరంగాను, పోరాటముల ద్వారాను, ఉద్యమ నిర్వహణాదులచేతను, వారు మన కొనరించిన అమూల్యమైన సేవను, మనం వారికి ఎంతో ఋణపడివున్నాము. ఈ యుగపురుషుని అడుగుజాడలలో నడచి జాతి నూతన వికాసము నొందుగాక !

శ్రీమతి భారతీదేవిగారు కూడా మావైద్యానికి అనేక విధములుగా సాయపడ్డారు. వీరు చేసిన సహాయ సహకారాలను మేమెన్నటికీ మరువజాలము.

శ్రీ రంగాగారికి నూటపది ఏండ్లు ఆయురారోగ్యాన్ని ప్రసాదించమని ఆపరమేశ్వరుని మనమందరం మనసారా ప్రార్థించుదాము.

# ప్రపంచ రైతాంగ ధృవతార

## శ్రీ హెచ్. ఆర్. వడ్డెంపూడి

శ్రీ రంగాజీ రాజకీయ తంత్రజ్ఞునిగాకన్న నూతన సిద్ధాంత ప్రవక్తగానే మిన్నగా కనిపించుతారు. మార్క్సు ప్రవచించిన కార్మిక నాయకత్వంకన్నా రంగాజీ సిద్ధాంతీకరించిన 'రైతుకూలీ ప్రజారాజ్య' స్థాపన విశిష్టమైనది. మార్క్సు సిద్ధాంతాల్లో నియంతృత్వ పోకడలు హెచ్చు. ప్రతివ్యక్తి స్వేచ్ఛగా తానభివృద్ధి చెందుచూ తన సమాజాన్ని అభివృద్ధిచెందించుకొనే అవకాశాలు పూజ్యం. సమాజయంత్రం లోని ఒక నట్టుగా మొత్తం యంత్రం కదలినప్పుడు మాత్రమే తాను కదులుతూ, యంత్రం నిలిచిపోయినప్పుడు నిలిచిపోయి కుంటుతూ, పడుతూ, లేస్తూ వ్యక్తి ముందుకు సాగుతాడు. రంగాగారి రైతూ, కూలీ రాజ్యస్థాపనలో ప్రతివ్యక్తీ ఒక యంత్రం. దేనికది పనిచేస్తూ అన్నింటితో కలిసి ముందుకు సాగుతూ వుంటుంది, అందువలననే వీరి భావన విశిష్టమైనదిగా ఎంచుతున్నాము.

ప్రస్తుత ప్రపంచం వ్యక్తికి యిస్తున్న విలువలు హెచ్చు. మూక పాలనలుగాని, వర్గపాలనలుగాని, నియంతృత్వ నాయకులను గాని యీ శతాబ్దపు ప్రజలంతగా అభిలషించరు. అందువలననే రంగాగారు సూచిస్తున్న రైతుకూలీ ప్రజాస్వామ్య సిద్ధాంతమే నేడు విశిష్ట మైన రాజకీయ పంథా.

ఉన్నత మేధాసంపన్నుడయ్యీ రాజకీయంగా తగినంతగా ముందుకు రాలేదని వారి అభిమానులు కొందరు తలపోస్తూ యుంటారు. నా దృష్టితో పరికిస్తే వారి ఆలోచన సవ్యముకాదేమో ననిపిస్తుంది. ఈనాడు వారు ముఖ్యమంత్రి కాకపోవచ్చు. మంత్రి కాకపోవచ్చు. కాని ముఖ్యమంత్రులను, మంత్రులను చేయగల భావనాబలం వారి సిద్ధాంతానికుంది. ఏ ముఖ్యమంత్రికీ లేనంతమంది అనుచరులు అభి

మానులు వారికున్నారు. వారిసిద్ధాంతం దేశదేశాల మన్ననల నందుకొంది. వారు లక్షిస్తున్న సిద్ధాంతం వెనుక ప్రపంచ రైతాంగం నిలచియుంది. ఇంతకన్నా అభివృద్ధి ఏమిటి?

కాంగ్రెస్ నుండి లోక్ పార్టీ, లోక్ పార్టీనుండి కాంగ్రెసు, మరలా స్వతంత్రపార్టీ ఇలా పార్టీమార్చి చెడిపోయాడని కొందరు వాపోతున్నారు. మార్పు సజీవత్వానికి చిహ్నం. కాలానుగుణంగా వస్తున్న మార్పులను అవగాహన చేసికోలేనివారు తాము మారలేరు, తమతోటి సమాజాన్ని మార్చలేరు. జాతీయ స్వాతంత్ర్యోద్యమ కాలంనాడు కాంగ్రెస్ తో నిలచి దేశ స్వాతంత్ర్య సాధనలో కృషి సల్పాడు. ఏ రైతాంగ శ్రేయస్సు తా నాదినుండి ఆశిస్తున్నాడో ఆ రైతాంగ వ్యతిరేక శక్తులను అరికట్టేందుకే తిరిగి కాంగ్రెసుతో చేయి కలిపాడు. ఏ ఉద్దేశం కోసమైతే కాంగ్రెస్ తో చేయికలిపాడో ఆ ఉద్దేశానికే కాంగ్రెస్ ఎసరు పెట్టనున్న సమయంలో కాంగ్రెస్ నుండి బయటపడి స్వతంత్రపార్టీని నిర్మించి రైతాంగ రక్షకునిగా వ్యక్తి స్వాతంత్ర్య పరిరక్షకునిగా నిలచాడు. వ్యక్తిత్వాన్ని, స్వంత అభిప్రాయాలను మిగులబెట్టి పదవులు సంపాదించే టంమాకు పార్టీలకు దాసులవడం ఉత్తమమా? లేక తన అభిప్రాయ సాధనకై ఎన్ని కష్టా లెదురొచ్చినా నిలచి పోరాడటం ఉత్తమమా?

రైతాంగ శ్రేయస్సే తన ముఖ్య ధర్మసాధనగా ఎంచి రంగాజీ ఇన్ని మార్పులను చేసినట్లున్నది. ఇన్ని ఉద్యమాలకు నాయకత్వం వహించాడు. ఇది మనమందరం మెచ్చవలసినదే గాని కొందరంటున్నటు తప్పుగాదు.

భారత దేశంలోని విశిష్ట వ్యక్తులలో రంగాజీ ఒకరు. చిరంజీవియై చిరకాలం వర్ధిల్లి శ్రీరంగాజీ మన గ్రామీణుల జనాన్ని ఉద్ధరించునటుల వారికి సంపూర్ణారోగ్యములు కలుగుగాక అని సర్వేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

# కోహినూర్ వజ్రము

## శ్రీ పాములపాటి బుచ్చినాయుడు

మన ఆంధ్రదేశానికి ప్రపంచ ప్రసిద్ధి చేకూర్చిన రత్నము కోహినూరు. అది గుంటూరుజిల్లా కొల్లూరులో పుట్టింది. దీన్ని సొంతం చేసుకుందామని తెలుగురాజులు తమలో తాము యుద్ధాలు చేసుకొన్నారు. కాని అనైక్యం నిండుగా ఉండడం వల్ల స్వదేశంలో నిలువ లేకపోయింది. క్రమక్రమంగా పుట్టిన చోటును వదలి పరరాష్ట్రాలకు-ఆపైని పరసీమలకు చేరింది. అసూయ మెండుగా ఉండే ఆంధ్రులు - స్వంత రత్నాలను నిల్పుకోలేకపోవడం గత చరిత్రవల్ల అనుభవము. ఆ కోహినూరు తిరిగి తిరిగి బ్రిటీషువారికి దక్కింది. దాని గొప్పతనాన్ని గ్రహించారు. తమకు రాజు, లోకసమానమగు చక్రవర్తులైన దంపతుల కిరీటాల్లో నాయకమణిగా నిల్చింది. నాటికి నేటికి విరాజిల్లుతోంది. ఆ రీతిగా మన ఆంధ్రదేశంలో ఉత్తమ, రత్నాలు చాలా పుట్టినవి. వాటికి దగినంత ప్రకాశంతో వెలుగు లిచ్చాయి.

అట్లాగే గుంటూరుజిల్లా నిడుబ్రోలులో మన రంగా 'కోహినూరుగా' ఉద్భవించారు. మనరాష్ట్రానికేగాక మనదేశం అన్ని ప్రాంతాలలో, యావత్ప్రపంచంలో వెలుగొందారు. అంతేగాక తమతో తుల్యంగా సిద్ధాంత ప్రవక్తలుగా శిష్యగణాన్ని తయారుచేశారు కవులకు ఆదరణ, ప్రోత్సాహం ఇచ్చి స్వతంత్ర ప్రజారాజ్యాన్ని సుస్థిరంగా నిల్పే సాహిత్యాన్ని వెలుగొందింప జేశారు. ఎవని హృదయంలో ఏ మాత్రం దేశాభిమానం మొలకెత్తినా - దాన్ని పెంచి పెద్దజేసి లోక క్షేమంకోసం వినియోగపడేట్లు చేశారు. అన్ని రంగాల్లో సంఘాలు స్థాపించి ప్రత్యేక నాయకుల్ని నిర్మించి కార్యక్రమం సాగించారు. విద్యార్థి, యువజన, కార్మిక, కర్షక,

చేనేత, గ్రంథాలయ మొదలగు సంస్థలన్నిటికి స్థాపనాచార్యులు ఆచార్యరంగాగారనడంలో అతిశయోక్తి లేదు.

అయితే విలువగట్టే షరాబులు ఏనాటికైనా ఉత్తమ రత్నాలను గుర్తింపకపోరు. తల ధరింపకపోరు. ఆనాడు పుట్టిన కోల్లూరు కోహినూరు రత్నము చక్రవర్తుల ఆదరణ పొందితే ఈనాడు నిడుబ్రోలులో పుట్టిన రత్నాన్ని మళ్లీ చక్రవర్తుల రాజాజీ సమాదరించారు. నాయకమణిగా ఎన్నుకొన్నారు. ప్రపంచంలో విజ్ఞానఖనిగా విఖ్యాతిగాంచిన రాజాజీ గుర్తించడంకంటె మహా భాగ్యం ఏమి కావాలి? రత్నము రత్నమే! దాని కాంతి ఎప్పటికీ ప్రకాశిస్తుంది. అజ్ఞానాంధకారంలో ఉన్నలోకానికి వెలుగిస్తుంది. అందువల్లనే ఆచార్య రంగా కోహినూర్.

# విద్యార్థి ఉద్యమం - ఆచార్య రంగా

శ్రీ సుంకర సత్యన్నారాయణ

భారత దేశంలోని విద్యార్థి ఉద్యమం స్వాతంత్ర్య సముపార్జన పోరాటంలో ఒక భాగంగా రూపొందింది. మహాత్మా గాంధీజీ పిలుపు నందుకుని వివిధ రాష్ట్రాలలోని విద్యార్థులను సమాయత్త పరచి మహత్తరమైన శక్తిగా సంఘటిత పరచి స్వాతంత్ర్య సమర ప్రాంగణములో ముందునిలిపి విద్యార్థి వర్గాలకు స్వాతంత్ర్య పోరాట చరిత్రలో సుస్థిరమైన స్థానమును కల్పించుటలో బృహత్తర పాత్రను నిర్వహించిన బహుకొద్దిమంది దేశనాయకులలో ఆచార్యరంగాఒకరు.

1942 "క్విట్ యిండియా" పోరాటంలో దేశనాయకులు యావన్మంది యినుప కవాటాల వెనుక బంధింపబడినపుడు స్వాతంత్ర్య సమర జ్యోతిని మారుమూలలకు గొనిపోయి అశేష గ్రామీణకూలీ ప్రజానీకంలో స్వాతంత్ర్యపిపాసను రేకెత్తించి విప్లవోద్యమాన్ని విజయవంతముగా నడిపినవారు విద్యార్థులు. తెనాలిలో, భీమవరంలో, బాపట్లలో బ్రిటిషు మరతుపాకీ గుండ్లకు గుండెలనిచ్చి ప్రాణాన్ని తృణప్రాయంగా ఎంచి స్వాతంత్ర్య సమర యజ్ఞములో సమిధలై ఆంధ్రావనికీర్తిని అజరామరం గావించిన అఖండఖ్యాతి ఆంధ్ర విద్యార్థులదే! అమరమైన అట్టి ఆంధ్రవిద్యార్థి వుద్యమానికి పితామహుడు ఆచార్యరంగా. ఆచార్య రంగా మహానాయకుడేగాదు. సృష్టికర్త, విశ్వకర్త, రాజకీయమైన [illegible]. ప్రజల అవసరాన్ని, దేశకాల పరిస్థితులను, పరిస్థితుల ప్రాముఖ్యాన్ని, వాతావరణ అనుకూలాన్ని యిట్టే గ్రహించి వుద్యమాన్ని సృష్టించి రూపురేఖలు తీర్చిదిద్ది పటిష్టతను కలుగజేసి ప్రాణాన్ని ప్రతిష్ఠించి బహుళజనామోదాన్ని పొందే కార్యాన్ని సాధించుటలో అశేషప్రజ్ఞగల కార్యశూరుడు. ఏ లక్ష్యంతో మహాత్మాగాంధి '42 ఉద్యమానికి పిలుపు

నిచ్చారో - ఆలస్యం నిరవేరేవరకు విరామమెరుగక విజయమో, వీర మరణమో, స్వాతంత్ర్యమో, శాశ్వత బానిసత్వమో తేల్చుకోవాలనే పట్టుదలతో తాను జైలులోనుండియే సందేశాలద్వారా, సలహాల ద్వారా ఆంధ్రవిద్యార్థుల నందరినీ ఏకకంఠంతో సంఘటిత పరచి జాతీయ వ్యతిరేకులైన కమ్యూనిస్టులు, వారి అనుయాయి విద్యార్థి వర్గాల విచ్ఛిన్నచర్యల నెదుర్కొని జాతీయ విద్యార్థి సంఘాలను స్థాపించి స్వాతంత్ర్య జ్యోతిని అఖండజ్యోతిగా వెలుగొందింప చేసిన మహానాయకుడు ఆచార్య రంగా. తత్ఫలితంగానే నిడుబ్రోలు రామానీడు విద్యాలయంలో ఆంధ్రవిద్యార్థులందరు సమావేశమై జాతీయ విద్యార్థి సంఘాలను స్థాపించటము జరిగింది. ఆ మహానాయకుని పోషణలో, చేయూతతో, సలహాలతో, సంప్రదింపులతో జాతీయ విద్యార్థిసంఘము కమ్యూనిస్టు విద్యార్థి ఫెడరేషన్ దుశ్చర్యల నరికట్టి స్వాతంత్ర్యపోరాటాన్ని కొనసాగించిరి. కాని యింతలోనే జాతీయ విద్యార్థి సంఘాలను బ్రిటిషు ప్రభుత్వం నిషేధించటం జరిగింది. విద్యార్థి ఉద్యమం దెబ్బతిన్నది.

నాయకులందరు వదిలి పెట్టబడిన తర్వాత మరల విద్యార్థుల నందరిని సమావేశపరిచి జాతీయ సంస్థను అండగాను, విద్యార్థి హక్కుల పోరాటమునకు విద్యార్థి కాంగ్రెస్ నిర్మింపబడింది. ఆ విద్యార్థి కాంగ్రెసు కూడా ఆచార్య రంగా సృష్టియే! అనతికాలం లోనే దినదిన ప్రవర్ధమానమై శాఖోపశాఖలుగా విస్తరిల్లి ఆంధ్ర విద్యార్థుల ఏకైక ప్రాతినిధ్యసంస్థగా రూపొందిన అశేష ఆంధ్ర ప్రజల ఆదరాభిమానాలు చూరగొని వివిధ విద్యాలయాలనుండి విశేష ప్రాతినిధ్యంతో గుంటూరులో తన ప్రథమ సమావేశాన్ని జరుపుకొంది. ఆ సమావేశాన్ని ప్రారంభించింది ఆచార్య రంగాయే! తదుపరి రెండవ ఆంధ్రవిద్యార్థి కాంగ్రెసు మహాసభలు కర్నూలు జిల్లా నంద్యాలలో జరిగాయి. ఆ సమావేశంలోనే మహాత్మా గాంధీజీ మన్ననలు పొందిన రంగాగారిచే సిద్ధాంతీకరింపబడిన రైతుకూలీ ప్రజారాజ్య సిద్ధాంతాన్ని తన రాజకీయలక్ష్యంగా ఆమోదించింది.

అంతటితో ఆగక దేశంలోని వివిధరాష్ట్రాల విద్యార్థి నాయకులతో ఆచార్య రంగా సంప్రదించి భారత విద్యార్థి కాంగ్రెసును నిర్మించుటలో తమ సంపూర్ణ సహాయ సహకారాల నందించాడు. ఢిల్లీలో 1948 డిశంబరులో జరిగిన భారత విద్యార్థి కాంగ్రెసు మహాసభలు భారత విద్యార్థి చరిత్రలో ఒక చిరస్మరణీయమైన ఘట్టం. వివిధ రాష్ట్రాలలోని విద్యార్థి ప్రతినిధులు కార్యదీక్షతో, పట్టుదలతో, దృఢసంకల్పంతో, అచంచల విశ్వాసంతో భారతచరిత్రలో తమ విధ్యుక్తపాత్ర నిర్వహణకోసం సమావేశమై ఆచార్యరంగాయొక్క వినూత్న రైతుకూలీ ప్రజారాజ్య సిద్ధాంతాన్ని తమ రాజకీయ లక్ష్యంగా ఆమోదించారు. ఆచార్యరంగాపై విద్యార్థులకున్న భక్తి ప్రపత్తులను, వినూత్న సిద్ధాంతములోగల ధర్మపథాన్ని చూచి ఆనాటి సభకు హాజరైన జయప్రకాశ్, కృపలానీవంటి మహానాయకులు అచ్చెరువొందారు. రంగాజీ సిద్ధాంతంలోగల వినూత్నతత్వాన్ని చూచి ఆ సిద్ధాంతకర్తకు తమ జోహారు లర్పించారు.

అంతేగాక ప్రకాశం ప్రధానిగా మద్రాసులో ప్రభుత్వము ఏర్పడినపుడు ఆంధ్రవిద్యార్థి కాంగ్రెస్ డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ఉద్యమాన్ని నడిపింది. రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులుగా వుండికూడా రంగాజీ ఆ ఉద్యమానికి తమ సంపూర్ణ సహాయాన్నందించారు.

కాంగ్రెసు ప్రభుత్వం డిటెన్షన్ విధానంలోగల లోపాలను గుర్తించునట్లుచేసి ఆ విధానాన్ని రద్దుపరచుటకు రాష్ట్రకాంగ్రెస్ ద్వారా పోరాడి అశేష విద్యార్థుల ఆదరాభిమానాన్ని చూరగొని విద్యార్థి ఉద్యమాలను విజయవంతము గావించిన విద్యార్థి నాయకుడు ఆచార్య రంగా.

వ్యావసాయక విధానాలపైనా, కంట్రోళ్ళు మొదలగు అరిష్టకర పద్ధతులపైన కాంగ్రెస్‌తో భేదించి కృషికర్‌లోక్ పార్టీ స్థాపించిన తర్వాతకూడా విద్యార్థి సమ్మేళన్ పేరుతో ఆంధ్ర విద్యార్థుల నందరిని సంఘటిత పరచారు.

రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షులుగా భారత కృషిక్ లోక్ పార్టీ అధ్యక్షులుగా విద్యార్థులపట్ల ఆయన ప్రదర్శించిన ఆదరాభిమానాలు ప్రోత్సాహప్రోద్బలాలు చిరస్మరణీయములు. మహానాయకుడై వుండి కూడా సామాన్య విద్యార్థులతో కలిసిమెలిసి చనువుగానుండి తన సిద్ధాంతాన్ని వారి హృదయాలలో నాటునట్లు చేయటంలో ఆయన సిద్ధహస్తుడు. ఆయన రాజకీయజీవితంలో ఆయన, ఆయన శిష్యులు నడిపిన రాజకీయ విద్యాలయాలలో విద్యార్థి నాయకులందరూ విద్యార్థులే! వేమేల-విద్యార్థి ఉద్యమము ఆయన జీవితంలో విడదీయరాని భాగం నలుబదియేండ్లుగా ప్రజారంగంలో ఆయన సల్పినకృషి రైతుకూలీ జనాలకు ఆయనచేసిన సేవ, రైతులయొక్క ఆర్థిక, సాంఘిక, నైతిక స్వాతంత్ర్యంకొరకై ఆయన పడినపాట్లు విద్యార్థులందరకు ఆయనపట్ల ఒకే గురు భావాన్ని కలుగజేసినవి. యీనాటి ఆంధ్రరాజకీయ రంగంలో నాయకులై, ప్రజాసేవకులై, మంత్రులై, సామంతులై రాజకీయాధికారాన్ననుభవించుచున్న వివిధ పార్టీలలోని నాయకులందరు ఒకనాడు వారి శిష్యగణములోని వారే! కాంగ్రెస్ సంస్థ నెదిరించి తాను రాజకీయలక్ష్యం కోసం శ్రీ డి. పి. మిశ్రా, కె. ఎస్. నారిమన్, సుభాస్ చంద్రబోస్ లాంటి మహానాయకులు కాలగర్భంలో కలిసిపోయినప్పటికీ రైతుకూలీల హక్కుల కోసం రాజకీయాధికారాన్ని కాలదన్ని యిప్పటికీ భారత రాజకీయ రంగంలో ధ్రువతారగా వెలుగొందుచున్న మహానాయకుడు ఆయనొక్కరే. షష్టిపూర్తి మహోత్సవసందర్భంలో వారికి యివే నా భక్తిపూర్వక పూజా పుష్పాంజలులు. ప్రజాస్వామ్యములో ప్రజా ఉద్యమాల నిర్మాణంలో నేటికీ నిష్ఠయు పూన్పును తాత్విక్షు ధైర్యస్థైర్యాల మారుమోగిస్తూ భారతమాతపుత్రులను ఆదర్శ ప్రాయమైన భారతీ మాత కివే నా ప్రణతిశతములు. రైతుకూలీ ప్రజారాజ్య నిర్మాణం కొరకు, పతిత ప్రజాసేవ స్వాతంత్ర్య పరిరక్షణకు ఆచార్య రంగా దంపతులు శతాయువులై వర్ధిల్లునట్లు ఆశీర్వదించవలసిందిగా భగవానుని ప్రార్థిస్తున్నాను.

# ఆయన ఎన్నడూ తప్పు చేయలేదు

డాక్టర్ కె. సదాశివరావు

ఆచార్య రంగాగారితో నా ప్రథమ పరిచయము 1942 మేలో. పరిచయమనేకంటే వారిని దర్శించుకొనడం అనుట సహజమేమో! మిత్రుడు రాధాకృష్ణ వివాహ సందర్భంగా నిడుబ్రోలు వెళ్ళడం జరిగింది. శ్రీ రాధాకృష్ణ రంగాగారిని ఆహ్వానించుటకు వెళ్లుతూ నన్ను వెంటతీసుకొని వెళ్లారు. అప్పుడు వారిని దర్శించే అవకాశం లభించింది.

పశువుల పాకకని కట్టించిన పెంకుటింట్లో కొంతభాగం వారి నివాసగృహం. అలంకరణాలుగాని, ఆడంబరములుగాని లేని నిరాడంబరమైన, ప్రశాంతమైన వాతావరణములోనున్నది. అప్పుడే దూర ప్రయాణ చేసి ఇల్లుచేరారు. కొందరు మిత్రులు, అనుచరులతో ఇష్టాగోష్టి జరుపుతూవున్నారు. బడలికగానున్నందున వివాహమునకు రాజాలననియు, సోదరుడు శ్రీ లక్ష్మీనారాయణగారు వస్తారనియు చెప్పిరి. ప్రథమ పరిచయమగుటచే బెరుకు బెరుకుగా చూచుచున్న నన్నుగురించి తెలుసుకొనిరి. అప్పుడే ఇంటర్మీడియట్ పరీక్ష పూర్తి చేసినట్లు చెప్పితిని. ఆసందర్భమున నే శ్రీమతి భారతీదేవిగారిని చూచితిని. అప్పటికే వారు రాజకీయరంగమున రంగాజీకి సమవుజ్జీగ వుండుటవలన భారత నారీమణులలో రాజకీయంగా ప్రఖ్యాతి చెంది యుండిరి. ఆమె ఆదర్శ భారత మహిళ. సిండుగృహిణి ధర్మములు, నాయకత్వమునకు వలసిన హుందా, ఠీవి, దర్పము ఆమెలో మూర్తులా ప్రస్ఫుటంగా కన్పించాయి. ప్రథమదర్శనమున నే పరమపూజ్యమైన మాతృభావము కలిగినది. ప్రథమదర్శనమే అయినా రంగాగారు బహుకాలంగా పరిచయమున్నట్లుగా ఆప్యాయంగా, ఆదరణగా ఎన్నో విషయాలు నన్నడిగి, వారుచెప్పి, చిరకాలం మాయా

ప్రథమ పరిచయం మధుర స్మృతిగా నిలచిపోయేట్లు చేశారు. నాటికి నేటికీ ఆనాటి రంగాజీతో జరిపిన ఇష్టాగోష్టి నాస్మృతి పథంలో మరువరాని సన్నివేశము.

ఆనాటికి రాజకీయాలతో ప్రత్యక్షంగా పరిచయములేని నాకు కలిగిన అనుభూతి నునవివేస్తాను. ఆంధ్ర దేశములో ప్రముఖజాతీయ నాయకులు ముగ్గురు 1. ఇంట ధీశాలి ప్రకాశం పంతులు 2 బయట మేధావి పట్టాభి శీతారామయ్య పంతులు, 3 ఇంటాబయటా మేధావిగా ధీశాలిగా రంగా. అప్పటికే ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగార్లు కీర్తిశేషులైరి. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, గొల్లపూడి శీతారామశాస్త్రిగారు రాజకీయంగా ప్రముఖపాత్ర వహించక నిర్మాణకార్యక్రమ నిర్వాహణయందు నిమగ్నులైయుండిరి.

ఆ తరువాత కొద్దికాలములోనే ఆగష్టు ఉద్యమం ప్రారంభమైంది. దేశవ్యాపితంగా స్వాతంత్ర్యోద్యమం మహోజ్వలంగా సాగుతున్నది. జాతీయ నాయకత్వమంతా కారాగారములో బంధించబడి లక్షోపలక్షల దేశభక్తులు దేశవ్యాప్తంగా ఉద్యమమున జేరి త్యాగములు చేయుచుండిరి. ఆగష్టు మహోద్యమమున కొంతకాలం రహస్య కార్యకలాపములు సాగించి ప్రగతిసాధించి, గ్రామీణ ప్రజలనుండి జాతీయోద్యమమునకు అండదండలు, చేయూతను కలిగించి కారాగారమున ప్రవేశించిరి.

అప్పట్లో కమ్యూనిస్టులు ప్రజాయుద్ధనినాదంతో బ్రిటిష్ ప్రభుత్వ అండదండలతో గ్రామ మహాసభలు, జిల్లా మహాసభలు, రాజకీయ సభలు జరుపుతూ దేశంలో - ముఖ్యంగా ఆంధ్రలో కొంత అలజడిని కలిగించి ప్రజలలో విభేదాలు కలుగజేసిరి. ఆ తరుణంలోనే రంగాగారు మిగతా జాతీయ నాయకులకన్నా కొంతముందుగా జైలునుండి విడుదలైరి. కాంగ్రెసుపై ఆంక్ష ఇంకా తొలగలేదు. కాంగ్రెసు

సమితి పేరిట కొందరు నాయకులు ప్రజలలో పనిచేయుచుండిరి. అందు రంగాగారి పాత్ర అత్యంత ప్రముఖమైనదిగానూ, ప్రధాన మైనదిగానూ వుండెను.

కాంగ్రెసు స్వరాజ్య సంపాదనకొరకు పనిచేయు రాజకీయ సంస్థగానే గాక, ఆర్థిక, సాంఘిక అభివృద్ధిని సాధించే అభ్యుదయ కరమైన సంస్థగా ప్రజాసామాన్యములో చొచ్చుకొని పోవుటకు గాంధీజీ చేయు కృషికి రంగాగారు బహుముఖంగా తోడ్పడు చుండిరి.

రంగాగారు రాజకీయంగా కాంగ్రెసు సంస్థను బలపర్చుటేగాక, సాధారణ ప్రజలలోనైతం రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విషయ పరి జ్ఞానము కలిగించుటకుగాను వేసంగి రాజకీయ పాఠశాల నెలకొల్పి బహుముఖంగా ప్రచార ప్రయోగముల గావించుచుండిరి. గ్రామీణ రైతుకూలీ ప్రజలనుండి వేలాదిగా ప్రజాసేవకులు రాజకీయరంగమున ప్రవేశించుటకు రంగాగారి కృషియే కారణం. ఆంధ్రలోని వివిధ రాజకీయ పార్టీలయందలి యువనాయకత్వమున హెచ్చుమంది రంగా గారి రాజకీయ పాఠశాలలోని విద్యార్థులే.

రైతు, కూలీ, చేతివృత్తుల, యువజన, విద్యార్థి, మహిళా మొదలగు వర్గసంఘముల నెలకొల్పి, వారివారి ఆర్థిక, సాంఘిక ప్రయోజనాల సాధనకొరకు కృషిచేయుచునే జాతీయోద్యమము నకు అండగా, బలంగా పెంపొందించిరి. రాజకీయ రంగమున యిదొక అపూర్వ విషయంగా ప్రశంసల నందుకొన్నది.

1937లో అధికారం చవిచూచిన కాంగ్రెసువాదులు 1942 ఆగస్టు ఉద్యమం సందర్భమున జైళ్ళలో వుంటూనే రాబోయే అధి కారాన్ని హస్తగతం చేసుకొనుటకై కుట్రలు, కుతంత్రములు పన్ను కొనుచుండిరి. దీని పర్యవసానమే 1945 లో శ్రీ ప్రకాశంగారు రాష్ట్ర కాంగ్రెసుకు అధ్యక్షునిగావున్నా నామమాత్రులుగా వుండ వలసి వచ్చింది. ఆనాడుజరిగిన పార్లమెంటరీబోర్డు ఎన్నికల్లో ప్రకాశం

గారికి వ్యతిరేకంగా పట్టాభివర్గం మెజారిటీ సంపాదించింది. రంగాగారు ప్రకాశంగారిని బలపరిచారు. రాజమండ్రి సమావేశము రంగా - ప్రకాశం కలయికతో ప్రజాబలం సంపాదించినా పార్టీ బలంలేక వోడిపోయారు. 1945లో రంగాగారి అనుయాయు లనుకొన్నవారి నెవరిని అసెంబ్లీ సభ్యులుగా ఎన్నిక చేయలేదు. అధికారంలో లేకపోయినా, విదేశాలలో వున్నా రంగాగారు 1946లో రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులుగా పెద్ద మెజారిటీతో ఎన్నుకోబడ్డారు. రాష్ట్ర కాంగ్రెసు రంగా గారి నాయకత్వమున బలవత్తరమైన ప్రజాసంస్థగా రూపొందించబడింది.

ఆంధ్రుల అండతో తమిళులు ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు గారిని ముఖ్యమంత్రిగా దించివేశారు. మొత్తం రాష్ట్రప్రభుత్వం తన యంత్రాంగమును యావత్తు ఉపయోగించి, కుట్రలు, కుయుక్తులతో, అనేకంగా అన్యాయాలు, అక్రమాలు కొనసాగించుచూ ఆంధ్ర కాంగ్రెసులో రంగాగారి నాయకత్వాన్ని తొలగించేందుకు అహోరాత్రులు కృషిచేశారు. అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులుగా శ్రీ పట్టాభిగారు పోటీచేయుట జరిగింది. ఆంధ్రుడు అభ్యర్థిగా వున్నప్పుడు ఆంధ్రులమైన మనము వ్యతిరేకించుట మర్యాదగాదని ఉదార బుద్ధితో తమకు వ్యతిరేకి అయినను పట్టాభిగారిని రంగాగారు బలపర్చారు. దాని పర్యవసానం పామును పాలుపోసి పెంచినట్లయింది. కాటువేసింది.

అటు అఖిలభారత కాంగ్రెసు, ఇటు రాష్ట్ర ప్రభుత్వ అధికార వర్గం చేయరాని అన్యాయాలు, అక్రమాలు చేసి 1951 నాటికి 5 వోట్లతో రంగాగారిని ఓడించిరి.

అప్పటికే గుంటూరుజిల్లా పలిగేట్ల ఎన్నికలను కోర్టుద్వారా నిలుపుదల చేయించారు. కాంగ్రెసు చరిత్రలో కనీ వినీ ఎరుగని సంఘటన ఇది. దాంతో రంగాగారు కాంగ్రెసునుండి వదలి బయటకు వచ్చేందుకు పరిస్థితులు దారితీశాయి.

నాడు మొదలు నేటివరకు జరిగిన, జరుగుతూన్న వివిధ పరిణామాల్లో రంగాగారి అనుయాయులుగా వున్న అనేకమంది వారి వారి స్వార్థముల కొరకేమి, అభిప్రాయ భేధాలవలన నేమి దూరమవుతూ వున్నారు. రంగాగారు ఎప్పటికప్పుడు కొత్త ముఖాలను సంతరించుకుంటూ, తన ఉనికికి భంగం కలుగకుండా, తాను నమ్మిన సిద్ధాంతముల, ఆశయముల సాధనకొరకు నిరంతర, నిర్విరామ కృషి కొనసాగించుతునే యున్నారు.

ప్రజాస్వామ్య పరిరక్షణకొరకు రంగాగారు అనేక పర్యాయములు తన స్వార్థమును సైతం త్యాగంజేసి కాపాడిన సందర్భములు కోకొల్లలు. 1952 లో మద్రాసు రాష్ట్రం కమ్యూనిస్టుల వాతపడకుండా రంగాగారు కాపాడిన ఉదంతం, భారత రాజకీయ చరిత్రనే మార్చినదనుటలో సందేహంలేదు. 1955 లో మరొకమారు ఆంధ్ర దేశము నియంతృత్వ శక్తులనుండి కాపాడారు. ఇలా ఎన్నో ఉదంతాల నుటంకించ వచ్చును.

రంగాగారు పార్టీలను తరచు మారుస్తుంటారనే విమర్శకులున్నారు. వారు నిజం తెలియకనైనా అలా అంటుండాలి. లేక అర్థం కాకనైనా అంటుండాలి. కాని రంగాగారు తాను నమ్మిన సిద్ధాంతమును, ఆశయమును, ఏకదీక్షతో సాధనకొరకు కృషి చేయుచున్న ధీశాలి. అదే "రైతు కూలీ ప్రజారాజ్యం."

అధికారముకొరకు – దర్పముకొరకు – స్వార్థముకొరకు రంగాగారు తప్పులు చేయలేదని, చేయరని వ్యతిరేకులు సైతం ఒప్పుకొనే సత్యం.

ఈనాడు మంత్రి గాకపోయినా, మరే అధికారం లేకపోయినా, ఆంధ్ర ప్రజల అభిమాన ప్రజానాయకులు ఆచార్య రంగా అగుట బహు జనాభిప్రాయం.

సోషలిజం కమ్యూనిజంల మధ్య ఉన్నటువంటి భేదాభిప్రాయాలను గురించి మనమిప్పుడు చర్చించబోవటం లేదు. ఒకటి సామ్యవాదం – మరొకటి సమాజవాదం. ఈ రెండింటి యొక్క ఆర్థిక సూత్రం ఒకటే అయినప్పటికీ ఆచరణ విధానం రాజకీయంగా భేదిస్తున్నది. రెండూ గూడ సమాజంలో ముందంజ వేయగలిగిన తరగతి కార్మికవర్గంగా గుర్తించినయ్. ఈ తరగతి నాయకత్వం విషయంలో సామ్యవాదులకూ–సమాజవాదులకు తేడాలేదు. అసలు ఈ సూత్రాన్నే నిరాకరించిన వ్యక్తి ఆచార్యరంగా. ఆ కథకు మనమిప్పుడు ఉపక్రమిద్దాం.

భారతదేశంలో అంతర్భాగంగా ఉన్న ఆంధ్రరాష్ట్రంలోని గుంటూరుజిల్లా నిడుబ్రోలు అనే ఒక కుగ్రామంలో పారంపర్యంగా స్వార్జిత ఆస్థిపై హక్కుల్ని అనుభవిస్తున్న ఒక సామాన్య రైతు కుటుంబంలో పుట్టిన శ్రీరంగాను గురించి యూనప్రపంచ రైతాంగ నాయకుడుగా, సిద్ధాంత కర్తగా రాణిస్తాడని ఈ శతాబ్ది ప్రారంభంలో బహుశా ఎవ్వరూ ఊహించి ఉండక పోవచ్చు.

పరతంత్ర భారతదేశంలో స్వతంత్ర వ్యవసాయదారుని కుటుంబంలో పుట్టి రైతు జీవితాన్ని – గ్రామీణ ప్రజల జీవితాన్ని సమగ్రంగా అర్థం చేసుకుంటూ, తన విరామ సమయంలో రైతు బిడ్డగా జీవించారు. "ఇతర రైతుల మాదిరిగానే నా ఇరవై సంవత్సరాల వయసు వరకు మా పొలం పనులలో నేను పాల్గొంటుండే వాడినని" అని ఆయన స్వంత మాటలలో చెప్పిన దానినే నేనిక్కడ ఉదహరించటం జరిగింది. ఆయన చదువుల్లో చూపిన చురుకుదనం చూచి వారి కుటుంబ క్షేమాభిలాషు లందరూ రంగాగారిని ఉన్నత విద్యకై ఇతర దేశాలకు పంపించవలసిందిగా సలహా చెప్పారు. కష్టపడి సంపాదించిన డబ్బుతో రంగాగారిని ఉన్నత చదువులకై ఇంగ్లండు పంపించటానికి నిర్ణయించుకున్నారు. 1920 నుంచి 1923 వరకూ ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉండి ఆర్థిక శాస్త్రం అభ్యసించారు. అప్పటికి నెహ్రూపండితుడు ఇంగ్లండ్‌లో ఒక సంపన్న విద్యార్థిగా

చదువుపూర్తి చేసుకుని బారిస్టర్ (న్యాయవాది) పట్టాపుచ్చుకుని భారతదేశంలో తండ్రికి తోడుగా రాజకీయాలలో ప్రవేశించాడు. రంగాగారు ఇంగ్లాండు వెళ్ళిన సంవత్సరమే శ్రీసుభాష్ చంద్రబోస్ ఐ. సి. యస్. లో ఉత్తీర్ణుడై భారత దేశానికి తిరుగు ప్రయాణం చేశారు. వలస దేశాలనుంచి విద్యార్థులుగా పోయిన వారందరూ ఇంగ్లాండులో తాము చదువుకునే చదువులతో పాటు సోషలిజం కమ్యూనిజం భావాలను కూడా జీర్ణించుకోవటం ఒక సరదా కార్యక్రమంగా వుంటుండేది.

"ఆ ఉద్యమాల ప్రభావం నన్ను బాగా కదిలించినయ్ అని రంగాగారే చెప్పుకున్నారు. అంతేగాక "అనేక విదేశాదేశాలలోని సోషలిస్టు-కమ్యూనిస్టు పార్టీల ప్రముఖ నాయకులతో సుదీర్ఘకాలంగా నాకు సన్నిహితసంబంధం, స్నేహం ఉన్నప్పటికీ సోషలిజంగానీ, కమ్యూనిజంగానీ నన్ను పూర్తిగా స్వాధీనపర్చుకో లేకపోయినాయి. అందువలన సోషలిజం మేధావియైన ప్రొఫెసర్ లాస్కీ పాశ్చాత్య సోషలిజం పరిధిని అధిగమించి వాస్తవికంగా డెన్మార్కులో, ఇటలీలోవున్న వ్యవసాయ సహకార విధానాలు ఏమైనా ఆశాజనకంగా ఉంటవేమో పరిశీలించమని సలహాయిచ్చారు" అని వ్రాశారు. ఇలా సోషలిజం-కమ్యూనిజం ఆచరణరీత్యా కాకుండా సిద్ధాంతరీత్యా జీర్ణించుకున్నప్పటికీ దాని ప్రక్రియనే కొన్నిల్లలుగా అనుమానాలతో భారతదేశానికి వచ్చారు.

1919 లో రష్యాలో విప్లవం జయప్రదమై కమ్యూనిస్టు ప్రభుత్వం అక్కడ ఏర్పడి కమ్యూనిజం సిద్ధాంతాలను ఆచరణలో పెట్టటానికి ఉపక్రమించింది. అనుకున్నంత త్వరగా ఆచరణలో దాని బాగోగులు ఈ ఉత్సాహవంతులైన యువకులకు అర్థంకాలేదు. ఇంగ్లండులో ఉన్నప్పుడు కొన్నికొన్ని విషయాలు ఆ ప్రభుత్వాన్ని గురించి తెలుసుకున్నా అవన్నీ సామ్రాజ్యవాద ప్రభుత్వాల దుష్ప్రచారాలుగా భావించారేతప్ప వాస్తవాలుగా నమ్మలేక పోయారు.

ఈ సందర్భంగా ఆచార్య రంగాగారు ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంనుండి డి. లిట్ బిరుదును (1924–26)లో "అత్యధిక జనాభా గలిగి వెనుకబడివున్న దేశంలో గ్రామికుల ఆశాజనక ఆర్థికవిధానం" అనే అంశంపై వ్యాసంవ్రాసి సంపాదించారు. లుడ్డైట్ అనేవ్యక్తి పారిశ్రామిక పురోగమనంపై తిరుగుబాటుచేస్తే చేనేతను యాంత్రిక నేత ఎలా తలక్రిందులు చేసిందో నన్న విషయంపై వివరణతో కన్నింగ్‌హ్యాం "పారిశ్రామిక చరిత్ర"ను వ్రాశారు. కానీ బివరిడ్జి, పిగోల "నిరుద్యోగ" సిద్ధాంతం రంగాజీని ఆకర్షించింది. దానిపై ఆయన భారతదేశంలోని గ్రామీణ ఆర్థిక సిద్ధాంతం రూపొందిస్తూ వ్రాసిన వ్యాసం విశ్వవిద్యాలయాన్ని ఆశ్చర్యంలో ముంచివేసింది. రంగాగారి సిద్ధాంతాన్ని ఆమోదించటానికి యూనివర్శిటీ తటపటాయించింది. "చేనేత భవిష్యత్తు అనుమానాస్పదం" అని తన సిద్ధాంతంలో చేర్చకపోతే డి. లిట్ లభించదనికూడ చెప్పివేశారు. కాని, రంగాగారు పదేపదే ఆలోచించినా తనసిద్ధాంతం తప్పలేదని దృఢత్వం ఏర్పడింది. తుదకు డిగ్రీనే వదులుకోవాలని నిశ్చయించుకున్నారు. తుదకు గిల్బర్ట్ స్లాటర్ అనే ఆర్థికవేత్త రంగాగారి సిద్ధాంతం ఆమోదయోగ్యమని ఒప్పించాడు. ఆయన ప్రదర్శించిన ధైర్యానికి, దీక్షకు అభినందనలతోపాటు డిగ్రీకూడ లభించింది.

అటువంటి సిద్ధాంతాల్ని ప్రతిపాదించినప్పటికీ రంగాగారికి ఏర్పడిన సోషలిస్టుభావాలు భారత గ్రామీణ ప్రజల ఆర్థిక విషయాలతో జోడించటానికి శాయశక్తులా ఆయన ప్రయత్నం చేయబూనుకున్నాడు. అందుకు ఎంతటి దిగువస్థాయినుంచి ఆయన ఆలోచనలు ప్రారంభించాడో ఈక్రింద నుదహరించిన ఆయన నిర్వహించిన పదవులే తార్కాణం. ఒంగోలు భూమినివారణ కమిటీ అధ్యక్షులుగా, (1926–1927) ఇరిగేషన్ అడ్వయిజరీ బోర్డు అధ్యక్షులుగా, (1929–31) గుంటూరుజిల్లా రైతు సంఘాధ్యక్షులుగా, (1926–31) ప్రైమరీ లాండ్ మార్టుగేజి బ్యాంకి అధ్యక్షుడుగా, మద్రాసు రాష్ట్ర కేంద్ర భూ తనఖా బ్యాంకు డైరెక్టరుగా, రాష్ట్ర కో ఆపరేటివ్ యూని

యన్ గౌరవ సభ్యుడుగా; మద్రాసు ప్రభుత్వం నియమించిన ఆర్థిక పరిశోధనోద్యోగిగా, (1928–29) గోదావరీ - కృష్ణ రీ సెటిల్‌మెంట్ ఆర్థిక విచారణ సంఘానికి కార్యదర్శిగా, (1929–30) ఆంధ్రరాష్ట్ర రైతు సంఘాధ్యక్షులుగా (1928) ఆయన వ్యవహరించారు. ఇలా బహుముఖ రంగాలలో పనిచేసి రైతుల - తదితర వర్గాల, మొత్తంగా గ్రామాలలోని స్థితిగతులన్నీ క్షుణ్ణంగా జీర్ణించుకున్న రైతాంగ మేధావి ఆచార్య రంగా. ఒక్కొక్క రంగంలో పనిచేస్తున్నప్పుడు ఒక్కొక్క సూత్రాన్ని కనిపెడుతూ రంగాగారు తన మేధస్సుకు మెరుగులు దిద్దుకుంటూ వచ్చారు.

ఈ మధ్యకాలంలో ఆయన చదివిన ఉన్నత చదువుకు తగినట్లుగా 1927 వ సంవత్సరంలో మద్రాసులోని పచ్చయప్పాస్ కళాశాలలో ఆర్థిక-రాజకీయ శాస్త్రాలు బోధించేందుకు ప్రొఫెసర్ పదవిని నెలకు 400 రూ జీతంమీద నిర్వహించారు. కాని అనతికాలంలోనే దేశసేవకై తనను అంకితం చేసుకొని నాలుగు గోడల మధ్య ఆచార్యుడుగావున్న పదవికి తిలోదకాలు వదలి నేలనాలుగు చెరగులావున్న ప్రజలందరికీ రాజకీయ ఆర్థిక విషయాలు బోధించే జీతభత్యాలు లేని ఆచార్యుడుగా ఆయన తనకుతాను మార్చిపోయారు. ఇప్పటివరకూ కళాశాలలోనైనా నెలకు రెండు వేలరూపాయలు జీతం తీసుకునే ఆచార్యుడుగా ఆయన తన [illegible] విశ్రాంతి తీసుకొని వుండేవారు. అమూల్యమైన తన యువ్వనదశను అమోఘమైన తన సంపాదనాకాలాలను అమాయకులైన గ్రామీణ ప్రజానీకానికి– పతితులైన పీడితవర్గాలకు, నోరులేని రైతుకూలీలకు ధారాదత్తం చేశారు. తనతోపాటు చదువుకున్న వారందరూ ఉద్యోగాలు చేసుకుంటూ–వ్యాపారాలు చేసుకుంటూ డబ్బు సంపాదించుకుంటున్నా తాను మాత్రం పిత్రార్జితాన్ని కరిగించుకుంటూ రాజకీయ రంగంలో నిర్విరామంగా కృషిచేస్తూ [illegible] రాజకీయ ఒడిదుడుకల్ని ధైర్యసాహసాలతో ఎదుర్కొంటూ అరవయ్యేపడిని అధిగమించిన వ్యక్తి ఆచార్య రంగాగారు.

అంతేగాదు. స్వచ్ఛమైన రైతు కుటుంబంలో పుట్టి తనచుట్టూ వున్న వాతావరణాన్ని దేశంయొక్క ప్రాథమిక సమస్యల్ని సమగ్రంగా అర్థం చేసుకుని కోటానుకోట్ల గ్రామీణ ప్రజల సమస్యల్ని మానసిక గ్రంథంలో ముద్రించుకుని, పట్టణ ప్రజలతో సమానంగా, వారి సంక్షేమాన్ని పునరుద్ధరించటానికై కంకణం గట్టిన ధీరోదాత్తుడు ఆచార్యరంగా.

ఒక వైపున రాజకీయ సిద్ధాంత తృష్ణ, వేరొక వైపున రాజకీయ స్వాతంత్ర్యదీక్ష రంగాజీలో ఒకేమారు ప్రజ్వలించి తావిళ్ళు వేసుకుంటూ పరుగులెత్తాయి. దేశానికి స్వాతంత్ర్యం కావాలి – ఈ లోపుగానే ప్రజలు చైతన్యవంతులు కావాలి అని ఆయన ఆతురత చెందారు. దేశమే రైతులమయం. కానీ జాతి కుల మత ప్రాంతీయ భాషా చిక్కులతో సతమత మౌతూ వుండి ఆకాశంలోని చుక్కల మాదిరిగా దూరదూరంగా చిన్న చిన్న పల్లెటూళ్ళల్లో దుర్భరంగా భయభక్తులతో బ్రతుకుతున్న ఈ జనాన్ని ఎలా సంఘటిత పర్చటం? ఇది ఆ నాడు రంగాగారి ముందున్న సమస్య.

వేరొక వైపున స్వతంత్రాన్ని సంపాదించటానికి ఏర్పడిన కాంగ్రెస్ బస్తీ ప్రజలచేతులలో వుంది. మహాత్మాగాంధీ కాంగ్రెస్ నాయకత్వం వహించినప్పటికీ అంతరంగికంగా కాంగ్రెస్‌లో వర్గ సంస్థలు పనికిరావని అభిప్రాయ పడుతున్న రోజులలో కాంగ్రెస్‌లో చేరిన రంగాగారు వర్గసంస్థలు ఉండి తీరాలని పట్టుబడుతూ ప్రారంభంలోనే నాయకత్వంతో ఘర్షణకు తలపడవలసి వచ్చింది. అధిక సంఖ్యాకులు స్వతంత్రోద్యమంలో పాల్గొనాలంటే వారివారి వర్గాలకు ప్రత్యేకమైన సంస్థలు ఉండాలని వాదించినా బస్తీనాయకత్వం దానిని త్రోసిపుచ్చింది. ఆ స్థితిలో రంగాగారు స్వతంత్రమైన రాజకీయ పునాదుల్ని వేసుకోవలసి వచ్చింది. తన ఆశయంతో ఏకీభవించే వారిని కలుపుకోవటంగానీ తాను వారితో చేరి పనిచేయటంగాని జరుగుతూ వచ్చింది. అప్పటికి ఏర్పడిన కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీలు కూడ బస్తీలలోని పారిశ్రామిక కేంద్రాలలోని కూలీలను కూడగట్టుక

రావటానికే ప్రయత్నించినవే తప్ప – వర్గసంస్థల్ని అవి ఆమోదించినప్పటికీ – అవి గ్రామాలలోనికి చొచ్చుకురాలేక పోయినది. ఆ విద్యతో – అనైక్యతతో అణగారిపోతూ అంతకుమించి పరాయి ప్రభుత్వం చూచి బెదరిపోతున్న జనాన్ని సమీకరించటానికి సంఘటిత పర్చటానికి దారిడొంకలు లేని పల్లెగ్రామాలకు నమ్మకమైన అనుచరులతో పాదయాత్రలు ప్రారంభించారు రంగాగారు. వారికష్టసుఖాలను తెలిపే పద్యాలతో పాటలతో స్వాతంత్ర్యోన్ముఖంగా వారిని నడిపించే కృషిలో అంతరంగిక బాహాట శత్రువుల్ని ఎదుర్కొంటూ గ్రామగ్రామాన వివిధ వృత్తులవారికి సంఘాలను పెట్టుకుంటూ, అనుకోనిగండాలను ఎదుర్కొంటూ రంగాగారు గ్రామీణ ప్రజల హృదయాలను చూరగొన్నారు.

వర్గసంస్థల్ని రంగాజీ ప్రతిష్టం చేస్తూంటే, కమ్యూనిస్టు, సోషలిస్టులు బలపడుతుంటే కాంగ్రెస్ వాటిని గుర్తించనంటున్న రోజులలో రంగాగారు తన ప్రత్యేక రాజకీయ సూత్రాలకు జీవంపోశారు. గ్రామీణ సంస్థలలో ప్రవేశించిన కమ్యూనిస్టులు, సోషలిస్టులు ఆ సూత్రాలు తమ విధానంలో భేదిస్తున్నవని గ్రహించి వర్గ సంస్థల్ని పట్టుకోవటానికి కలిసి కట్టుగా పనిచేసి తమ రాజకీయ పార్టీలకు వాటిని అంగాలుగా ఉపయోగించాలని ప్రయత్నించినప్పుడు రంగాజీ వాటితో భేదించవలసి వచ్చింది. ఇంత రగడ జరిగినతరువాత, ప్రజలలో రంగా ఏకైకమైన, అజేయమైన ఒక శక్తి అని గ్రహించినతరువాత ఆ బలం కాంగ్రెస్ ఉపయోగ పెట్టుకోవటానికి వర్గసంస్థల ఉనికిని 1942లో ఆమోదించింది. రంగాగారి [illegible] ప్రజారాజ్య సిద్ధాంతాన్ని గాంధీజీ ఆమోదించారు. కమ్యూనిస్టులు తద్భిన్నంగా [illegible] రాజ్యాన్ని ఆమోదించారు. కాంగ్రెస్‌కు బ్రహ్మాండమైన బలం సమకూడింది. రంగాగారు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్‌ను తన సిద్ధాంతానికి ఉపయోగ పెట్టాలని రంగాగారి ప్రయత్నిస్తూంటే రంగాగారి బలాన్ని కాంగ్రెస్‌కు ఉపయోగ పెట్టుకోవాలని పాత నాయకత్వం అభిలషించింది. ఈ తంత్రాంగంలో రంగాగారు ఓడిపోయారు. కాని ఆయన

మనసులోని రైతాంగ సంక్షేమ కార్యక్రమం ఓడిపోలేదు. ఆ కార్యక్రమంతోనే మరొకపార్టీ ఏర్పడింది.

రంగాగారు పార్టీలు మార్చారు అనే భావం ఒకటి ప్రజలలో వున్నది. స్వంత కొంపలేక అద్దెకొంపల్లో వుంటున్నవారు, వాటినే తమ స్వంతమని భావించి ఎదురుగావున్న స్వంతదారుణ్ని గురించి. ఏడ్చినట్లుగా వుందిది. గ్రామీణ రైతుకూలీ ప్రజానీకంయొక్క సంక్షేమ కృషిలో మార్పు లేనప్పుడు ఆ వుద్యమాన్ని ఆ ఆశయాన్ని సాధించుకోవటానికి కల్పించుకునేపార్టీ నామకరణ గురించి అనుమానాలు కలిగించుకోవలసిన అవసరమేమిటో బోధపడదు.

ఇక అసలు విషయానికి వద్దాం. సోషలిజం – కమ్యూనిజం – గాంధీయిజం అనే వాటిపై రంగాజీ భావాలను గురించి ఈవ్యాసం వ్రాయపూనుకున్నప్పటికీ ఇంతటి పూర్వచరిత్రను చెప్పకుండా ఆ సమస్యను చర్చించటం భావ్యంకానట్లు తోచింది. అలాగే సోషలిజం పుట్టుకకు పూర్వచరిత్ర అది కమ్యూనిజంగా మారటానికి హేతువులు గ్రహించటం జరిగినప్పుడు ఎందుకు రంగాజీ గాంధీయిజంపై మోజు చూపుతున్నారనేది అర్థం ఔతుంది.

పాశ్చాత్య రాజ్యాలలో విప్లవాలకు పూర్వం నెలకొనివున్న రైతాంగ వ్యవస్థ స్వతంత్ర రైతాంగ వ్యవస్థ కాదు. అది కేవలం కౌలుదారీ వ్యవస్థకంటె హీనమైన వ్యవస్థ. అన్ని విధాల స్వాతంత్ర్యం పోగొట్టుకుని స్వాతంత్ర్యాన్ని ఎలా తిరిగి సంపాదించుకోవటమా? అని సతమతమౌతున్న రోజులలో ధనిక భూస్వామ్య వ్యవస్థలకు భిన్నంగా జరుగుతున్న సంఘర్షణలో సామ్యవాద బీజాలు పడ్డాయి. రాడికలిజం, సిండికాలిజం, యుటోపియను సోషలిజం, ఫేబియన్ సోషలిజం, గిల్డు సోషలిజంలాంటిపేర్లతో ఆయా సామ్యవాద సిద్ధాంతాలను మేధావులు రూపొందించుకుంటూ వచ్చారు. ఇందులోని ప్రతి ఒక్కదానితో స్వల్పమైనభేదాలతో సామ్యవాద స్వరూపాన్ని మనం చూడగలం. సామ్యవాదంలో కొంతమేరకు వ్యక్తి స్వాతంత్ర్యం—కొంతమేరకు

ఆస్థి స్వాతంత్ర్యం—మత స్వాతంత్ర్యం ఉండి జాతి కులమత విచక్షణ లేకుండా అందరూ సమాన అవకాశాలు కలిగివుంటూ; ఇతర పార్టీలను సహిస్తూ, ప్రజాస్వామ్యాన్ని గౌరవించటం అనే విషయంలో ఆంతరంగిక అభిప్రాయభేదాలు స్వల్పభేదాలు ఉంటున్నాయి. నాయకత్వం కార్మికవర్గానిదే అయినా ఇతర వర్గాలను సంలీనం చేసుకోవాలనే కోరిక సామ్యవాదానికి లేదు. కమ్యూనిజంతో వున్న నిర్బంధాలు సోషలిజానికి లేనందువలననే సోషలిష్టు ప్రభుత్వాలు ఏర్పడిన పాశ్చాత్యదేశాలలో సోషలిజం విఫలమైపోయి ఆ స్థానంలోకి కమ్యూనిజమో లేక కన్సర్వేటిజమో పెత్తనానికి రావటం జరిగింది.

రంగాగారిని సోషలిజం ఆదిలో ఆకర్షించినా సోషలిజానికి లొంగిపోయేట్లుగా అది ఆయనను ఆకర్షించలేదు. సోషలిజాన్ని భారత దేశ పరిస్థితులకు అనుగుణ్యంగా లొంగదీయాలని ఆయన ప్రయత్నించి చూచాడు గాని ఆ ప్రయత్నం వివిధ కోణాలతో చూచినప్పుడు పొరపాటుగా తోచింది. తాను ఆలోచించిన సోషలిజంకూడా తన సోషలిష్టు మిత్రుడైన బి. డి. హెచ్ కోల్ కు దగ్గరగావుండి ప్రజాస్వామ్య సామ్యవాదం ఆధారంగా వుండేది.

ఒకరినొకరు ద్వేషించుకోవటాన్ని రంగాగారు ఆమోదించలేదు. అందుకే తాను ప్రతిపాదించిన [illegible] ప్రజారాజ్య సిద్ధాంతం పరస్పర ద్వేషించని అరికట్టటానికి ఒక విరుగుడు మందుగా ఆయన అభిప్రాయ పడ్డాడు. పాశ్చాత్య రాజ్యాలలో యుద్ధానికి పూర్వం, యుద్ధానంతరం సోషలిస్టు డెమోక్రాట్లు ప్రభుత్వాలను పట్టుకున్నారు. కాని యుద్ధానంతర ఆర్థికవ్యవస్థ వారి నమ్మి చెరగగొట్టింది. దానితో విఫలమైన సోషలిజం కమ్యూనిజంగా మారింది. అలాగే ఇంగ్లాండులో ఫ్రాన్సులో కెనడాలో యుద్ధానంతర శాంతికాలంలో సోషలిజానికి నడుములు విరిగి కన్సర్వేటిజం పెత్తనానికి వచ్చింది. అనేకమారులు రంగాగారు ప్రపంచంలోని వివిధ దేశాలకువెళ్ళి పరిస్థితులను స్వయంగా చూచినందువలన కనీసంగా సోషలిజం భావాన్ని ఆమోదించటాని

కైనా అవకాశాలు సన్నగిల్లినాయి. ఐరోపాలో సోషలిజం పొందిన పరాజయం భారతదేశంలో గుణపాఠంగా స్వీకరించవలసిన అవసరం ఏర్పడింది. కొన్నాళ్ళు గాంధేయ వాదాన్నే సోషలిజంగా చెప్పుకుని గాంధేయవాదులు తృప్తిపడుతూవుంటే, జాతీయ సోషలిజం పేరుతో సోషలిస్టులు దోబూచులాడవలసిన పరిస్థితులు ఏర్పడినాయి. ఈ స్థితిలో రంగాగారు క్రమేణ గాంధీవాదమే తన స్థైతుకూలి ప్రజా రాజ్యానికి సన్నిహితమైనదిగా గ్రహించి నామమాత్రమైన తన సోష లిజం భావాలకు స్వస్తిచెప్పి గాంధేయ ఆర్థిక దృక్పథంతో సిద్ధాంతాన్ని పటిష్టం చేశారు.

ఇక కమ్యూనిజంతో ఆయన అన్ని అంశాలలోనూ భేదిం చారు. తొలి కమ్యూనిష్టు ప్రభుత్వం రష్యాలో ఏర్పడినప్పుడు వలస దేశాలలోవున్న ప్రజలు దాని పోకడను గమనించటానికి కుతూహల పడ్డారు. మానవులకు సోషలిజం ధ్యేయంకాదనీ, అన్నివర్గాలు కార్మిక వర్గానికి లొంగివుండాలని లేక సంలీనం కావాలనీ అది ప్రతిపాదిం చింది. ఉత్పత్తి పరికరాలు – సమస్తమైన ఆస్థి రాజ్యానికే చెందాలనీ వ్యక్తి నిమిత్తమాత్రుడుగా సమాజంలోని అంతర్భాగస్తుడుగా రాజ్యా నికి బద్ధుడై వుండాలనీ రాజ్యమే వ్యక్తిక్షేమాన్ని చూడాలనీ దీనిని నిర్వహించటానికి అన్ని వర్గాలకంటె విప్లవాత్మకమైన కార్మికవర్గమే అధికారంలోవుండి కార్మిక నియంతృత్వాన్ని అమలుజరుపాలని అది కోరింది. ప్రజాస్వామ్యాన్ని మరొక పార్టీని త్రోసిరాజని కమ్యూనిస్టు పార్టీయొక్క ఏకైక పాలనే కొనసాగాలని ప్రతిపాదించింది. కమ్యూ నిజమే మానవుని అభ్యున్నతికి వికాశానికి అంతమస్థాయి అని ప్రక టించింది. ప్రపంచంలోని అన్ని సిద్ధాంతాలను బలాదూర్‌గా భావిం చింది. ధనికవాదంలోని పారిశ్రామిక అదనపువిలువ కమ్యూనిజంలోని పరిశ్రమలలో వుండదన్నది. అందువలన శ్రామికుల అదనపు విలువ దోచబడదన్నది. నా అనే భావానికంటే అన్ని రంగాలలోనూ మన అనే భావం ప్రాతిపదికగా స్వీకరించింది. ఆధునిక పరిశ్రమలను తప్ప పూర్వపరిశ్రమల్ని నిరశించింది.

దున్నేవానిదే భూమి—అందరికీ బట్ట అందరికీ తిండి అందరికీ వసతి అనే నినాదాలతో పేదల్ని ఆకర్షించబూనిన కమ్యూనిజం యొక్క సిద్ధాంత రహస్యాలు సూత్రప్రాయంగా పైన ఉదహరించాను. రష్యాలో వ్యవసాయ ప్రజలకు – పారిశ్రామిక కార్మికులకు ఆస్తిపై స్వాతంత్ర్యం లేక భూస్వామ్య ధనికవర్గాల్ని ఎదుర్కొనలేక బ్రతుకక వలసిన పరిస్థితిలో అందరికీ భూమి అనే నినాదం భూమిలేని వారందరినీ ఆకర్షించింది. కానీ భారతదేశంలో భూమి స్వంతంగా గలిగి సరాసరి ప్రభుత్వానికే శిస్తులు చెల్లించుకుంటూ స్వతంత్రోద్యోగంలో ఉన్న జనసంఖ్య నూటికి 70 మంది ఉన్నారని రంగాగారు తెలుసుకున్న తరువాత ఆ కమ్యూనిస్టు సూత్రాన్ని అసలు ఆమోదించలేకపోయారు. స్వాతంత్ర్యం కోల్పోయి భూస్వాముల చేతులలో పడిన రైతాంగాన్ని రక్షించి వారు కోల్పోయిన స్వాతంత్ర్యాన్ని తిరిగి సంపాదించి పెట్టటానికి ప్రయత్నించవలసిన సోషలిజంగానీ కమ్యూనిజంగానీ ఉన్న స్వాతంత్ర్యాన్ని ఆస్తిని జాతీయం చేయటం ద్వారా హరించటం ధర్మం కాదు అని అభిప్రాయపడ్డారు. అప్పుడు ఆస్తే కాకుండా, అందులో తనకై తాను ఏర్పర్చుకున్న ఉద్యోగాన్ని కూడా జాతీయం చేయటం జరుగుతుందని రంగాగారి అభిప్రాయము. వృత్తులు లేని ఉద్యోగాలు లేని బహుకొద్దిమందికి స్వయంపోషకమైన వృత్తుల్ని ఉద్యోగాలను కల్పించవలసిన ప్రభుత్వం ఉన్న వృత్తుల్ని ఊడబీకటం అధర్మమని రంగాజీ వాదన. మనం సమాజంలో ప్రారంభించే దానికంటే సమాజానికి మూల పురుషుడైన వ్యక్తిని ప్రాథమికంగా తీసుకుని అతని ఉత్సాహం సృజనశక్తి పెంపొందేట్లు చూడాలని రంగాగారి ఆలోచన. తప్పనిసరి అయిన రంగాలలో తప్ప మిగతా రంగాలలో యాంత్రిక జోక్యం అవసరం లేదనీ, వ్యవసాయాన్ని జాతీయం చేయటానికి అది ఒక భారీ ఫ్యాక్టరీ కాదనీ, [illegible] ఎప్పటికీ అది అతనికి ఉద్యోగాన్ని కలిగించే కార్యాలయమనీ జీవనవృత్తికి మార్గదాయకమనీ; రైతు విప్లవకారుడనీ, [illegible] ఏ విధమైన పెత్తనం చేసినా దోపిడీ అన్యాయమనీ, రైతులందరినీ కార్మికులుగా మార్చ

వలసిన అవసరంలేదనీ, కార్మిక నియంతృత్వంకంటే నైతికమైనటువంటి ప్రజాస్వామ్య వ్యవస్థ ఆచరణ యోగ్యమనీ, మానవునిలో నీతికి మతం ప్రోత్సాహకరమనీ రంగాగారి అభిప్రాయాలు. ఇందువలననే భారత దేశాన్ని రాట్నంతో చైతన్య ప్రపూరితం చేసిన మహాత్మా గాంధీ ఆర్థిక సాంఘిక రాజకీయవాదం ఆయనకు ధ్యేయమైంది.

ఒక లక్ష్యాన్ని స్థాపించటానికి పరివర్తనను ప్రధానంగా భావించి, అందుకు సత్యాన్ని అహింసను ప్రముఖలక్ష్యాలుగా నిర్వచిస్తుంది గాంధేయ వాదం. స్వాతంత్ర్య పోరాటానికి సత్యాగ్రహాన్ని, సహాయ నిరాకరణాలను ఆయుధాలు స్వీకరించిందేగానీ విప్లవాన్ని రక్తపాతాన్ని కాదు. ఆధునిక యంత్రాలవలన నిరుద్యోగం తాండవించకుండా జనాన్ని కాపాడుకునేందుకు వీలైనంతవరకు చేతి పరిశ్రమల్ని అది ప్రోత్సహించింది. వర్గసైషమ్యాలను నిరసించి ధర్మకర్తృత్వాన్ని అది ప్రతిపాదించింది. మానవునిలోని పరివర్తన గుణాన్ని సౌశీల్యాన్ని గుర్తించి మానవుడికి స్వేచ్ఛను అన్ని రంగాలలోనూ కావాలని, ప్రతివ్యక్తీ పరిపాలనలో భాగస్వామి కావాలనీ అందుకు వికేంద్రీకరణ ప్రాతిపదికగా పరిపాలన సాగాలని అది కోరింది. జీవిత ప్రమాణాలను విపరీతంగా పెంచుకోకుండా సాధ్యమైనంతవరకు తగ్గించుకోవటం ప్రతి కుటుంబం స్వయంపోషకం కావటం దాని ఆశయం. తద్వారా సర్వోదయం జరుగుతుందన్నది.

ఇది ఒక ఆర్థిక రాజకీయవిధానంగా కాంగ్రెస్ గుర్తించి దేశంలో ప్రచారంచేసి దానిని అమలు పెట్టటానికి పూనుకుంటానని కాంగ్రెస్ హామీనిచ్చింది. అందుకు గాంధీజీ వినోభాభావేను తన ఆశ్రమ వారసుడినిగా, జవహరిలాల్ నెహ్రూను రాజకీయ వారసుడినిగా ఎంచుకున్నారు. కానీ ఆశ్రమవాసి సర్వోదయం పేరుతో ప్రచారానికి బయలుదేరి భూమి అందరిదని ప్రచారం ప్రారంభించారు. సంక్షేమ రాజ్యం నెలకొల్పటానికి కాంగ్రెస్ ధ్యేయం సోషలిజం అనే తీర్మానాన్ని చేసి ఆ తీర్మానాన్ని అమలు జరుపటానికి ప్రణాళిక ప్రారంభించారు. గాంధేయ ప్రణాళికను త్రోసిరాజని

తనస్వంత సోషలిస్టు ప్రణాళికను రాజ్యాంగానికి సహితం అతీతంగా ప్రారంభించ బూనుకున్నప్పుడు వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఆస్తిని హరించ బూనుకున్నప్పుడు ఆచార్య రంగాగారు నిజమైన గాంధేయ వాదిగా తిరుగుబాటు చేశారు. ప్రభుత్వ కనీస జోక్యం, వ్యక్తికి గరిష్ట స్వాతంత్ర్యం అనే ఆశయం తో అశేష రైతాంగాన్ని సహకార వ్యవసాయ పాశాలనుంచి తప్పించటానికి పూజ్య రాజాజీతో కలిసి స్వతంత్రపార్టీని స్థాపించారు. సోషలిజం, కమ్యూనిజం భారతదేశం యొక్క స్థితిగతులకు ప్రత్యామ్నాయం కాదని ప్రజాస్వామ్య పూరితమైన గాంధేయవాదమే మన సమస్యల పరిష్కారానికి శరణ్యమని ఈ పార్టీ ఆశయం.

రాజకీయ రంగంలో జీవితమంతా ప్రత్యక్షంగానో పరోక్షంగానో అంతరంగిక బాహాటపు శత్రువులతో ఘర్షణలకు తలపడి అరవై సంవత్సరాల నడుస్తువచ్చినా అలసట ఎరుగని నిరంతర ప్రజాసేవా ధురీణుడు ఆచార్య రంగాజీకి సమకాలికుడినిగా ఒక దశాబ్దంపాటు రాజకీయ పోరాటాలలో ఆయనకు సహచరుడినిగా అనుచరుడినిగా పాల్గొన గలిగిన నా అదృష్టానికి గర్విస్తున్నాను.

ట్రిబిస్ విస్ బ్రతికి ఉన్నట్టయితే ఈనాడు రైతులకు చరిత్రకారుడు లేడని వాపోయి ఉండేవాడు కాదు. రంగాజీ ప్రపంచ రైతాంగ విప్లవ చరిత్రను వ్రాసి రైతులు విప్లవకారులు కారని ప్రతిపాదించిన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని పూర్వపక్షం చేశారు. ఆయన వ్రాసిన విప్లవ రైతాంగం నవ్యరైతాంగ యువకులకు ఆత్మవిశ్వాసాన్ని, ధైర్యాన్ని పునరుద్ధరించేటట్లు చేసిందనే దృఢవిశ్వాసంతో ఆయన స్వాతంత్ర్యోద్యమ సమాఖ్యకు పితామహుడని దయాళువని విశ్వసిస్తూ శతసంవత్సరాలపాటు జీవించి భారతదేశాన్ని ఉన్నత స్థాయికి నడిపించాలని ఆశిస్తున్నాను.

# రైతుల వ్యక్తిత్వం కలిగించాలి

శ్రీ యన్. రామి రెడ్డి.

ఆచార్య రంగాగారిని గురించి అభిప్రాయాన్ని ప్రకటించడము, సూర్యుని దివిటీతో చూపించడం కాగలదు. అరవై యేండ్ల యీడులో తరుణ వయస్కులకంటె చురుకుగా లక్ష్యసిద్ధికోసం, శ్రమపడుతున్న వారి నలభై యేండ్ల రాజకీయ జీవితం ముక్కోటి ఆంధ్రులకే పరిమితమై పోకుండా, నలభైకోట్ల భారతీయులయొక్క పలువిధములైన సమస్యలను పరిష్కరించడానికి బ్రహ్మాండముగ చేస్తున్న పరిశోధనగా పరిణమించింది.

పదునాలుగేండ్లకు పూర్వము ప్రప్రథమముగా వారితో పరిచయమైననాడు నాలోని రైతు మేల్కొన్నాడు. జిజ్ఞాస రగులుకొన్నది. సంపూర్ణ మానవుని సందర్శించిన సంతృప్తి యేర్పడినది. నాలోకూడ సత్యమైనశక్తి యేదో ప్రవేశించినట్లైనది. ఎక్కడాలేని గౌరవము ఎంతో పూజ్యభావము యేర్పడినది. మాయిద్దరికీ జన్మాంతర సంబంధమేదో ఉన్నదనిపించింది. నాటినుండి నేటివరకు ఈ అభిప్రాయము, ఆదరణ, అభిమానములు, దినదిన ప్రవర్ధమానము ఔతూ వస్తున్నవే కాని మార్పురాలేదు రాబోదు. రావడానికి అవకాశమే లేదు.

కళాశాలల, విశ్వవిద్యాలయాల పరిధులలో కుదించుకొనిపోక, విశాలవిశ్వములో అనంత మానవకోటియొక్క సమగ్రజీవితానికి సమర్థవంతమైన జీవితవిధానానికి విలువలను వివరిస్తూ, విధిగా పోషిస్తూ, వెలయిడరాని సంస్కారానికి దోహదము చేస్తున్నది.

దినదినమూ, వారవారమూ రూపాంతరాలు చెందే రాజకీయ రచనలో దూకి వారితోపాటు పరుగెత్తటం వారి అభిమతము కాదు. ఆ స్థాయికి వారు దిగిరాలేదు. అందుకే వారికి "టాక్ట్" తక్కువని,

వారి మిత్రులు, శత్రువులుకూడ ఏకాభిప్రాయాన్ని వ్యక్తంచేస్తూ వుంటారు. ఇది నిజమేనని నేను అభిప్రాయ పడుతాను. అయితే ఈ "టాక్ట్" లేకపోవడము అనేది, వారు సమగ్రమానవులు కావడంవల్లనే జరిగింది కనుక, దానిని, సుగుణముగ భావిస్తాను. పదవులకోసం, ప్రాబల్యముకోసము ప్రాకులాడేవారికి, ఈరకమైన యాతన అంతా, అవసరం కాని, సిద్ధాంతాలకోసం, లక్ష్యసిద్ధికోసం, స్థిరముగ నిలువబడి, పోరాడే, త్యాగులకు అది అంటదనీ, అవసరంకూడ లేదనీ నా నమ్మకము.

పదవులే ముఖ్యమనే అభిప్రాయం వారికుంటే అవి పొందడము యేమంత గొప్ప విషయము కాదు. అందుకు తగిన అనుకూల వాతావరణమున్నప్పుడుకూడ, ఆ పనికి ఒడిగట్టలేదు. పందిని నందిగా— నందిని పందిగాచేసి, ఎవరినెవరి నెత్తినో చేయిబెట్టి – ఏదో విధముగ పదవులలో ప్రవేశిస్తామను తాపత్రయము వారికి యెన్నడు లేదు. వారి మనఃతత్వానికి యీ రథసంతో యే మాత్రము సరిపడదు. పల్లెలలోవున్నా పట్నాలలోవున్నా – విజయవాడలోవున్నా–వియన్నాలో వున్నా వీధిలో నడుస్తున్నా – విమానాలలో తిరుగుచున్నా – అహోరాత్రులు అత్యధిక సంఖ్యాకులైన – అన్ని విధాల అందరిచేత అణచివేయబడుతున్న – అన్నదాతలైన రైతులభివృద్ధిని గురించియే ఆలోచిస్తూ వుంటారు. రాజకీయాలైన – మరేవైన రైతుల శ్రేయస్సుకు తోడ్పడేవిగాయుంటేనే స్వీకరిస్తారు. అనుసరిస్తారు. లేకపోతే లేదు. కర్షక కార్మిక జనుల కోసరం యెంతటి త్యాగాలను చేయడానికైన జంకరు. అదే వారిబలం.

పదవి స్వీకారం కాకపోయినా, మరికొన్ని కారణాలవల్లకూడ 1952 లో వారు కాంగ్రెసును వదలిపెట్టకుండవుంటే, ఆంధ్రదేశ రాజకీయ పరిస్థితులు మరొకవిధముగ నడిచియుండేవని చాలమంది అభిప్రాయపడుతూ వుంటారు. కాంగ్రెసును ఆనాడు వారు వైదొలగకుండవుంటే, ఈరాష్ట్రానికి, రంగాగారే ముఖ్యమంత్రిగావచ్చివుండేమాట వాస్తవమే అయినప్పటికి, ఇతర రాష్ట్రాల రైతుల శ్రేయస్సుదృష్ట్యా,

రంగాగారు పార్లమెంటులో వాగ్బంధనము లేని సభ్యులుగా వుండడమే మంచిదని అభిప్రాయపడేవారు వున్నారు. తాత్కాలిక యిబ్బందుల కన్నా, శాశ్వత ప్రయోజనము కొరకు పాటుపడ్డ సప్పటికీ ముఖ్యమైనది కనుక, వారు చేసినదే మంచిపని యను విశ్వాసము నాకు యేర్పడింది. నాతో ఏకీభవించువారు యెంతో మంది వున్న సంగతి కూడ నేను యెరుగుదును.

ఏదియేమైనప రంగాగారు, తమ సబుద్ధ యేండ్ల రాజకీయ జీవితము ద్వారా రైతులకు వ్యక్తిత్వము, కలిగించినారు. గౌరవ ఆదరాలను చేకూర్చినారు. వివిధరంగాలలో రైతులు సారథ్యం వహించే తాహత్తు సమకూర్చినారు. మట్టిలోనుండి మాణిక్యాలను తయారు చేసినారు. చీకటిలోనుండి వెలుగునకు తెచ్చి విడిచినారు. వారి జీవితము అన్ని విధాల ధన్యమైనది. వారి తపస్సు యెన్నటో ఫలించినది. వారి కలలు నిజమైనవి. వారికివే నా జోహారులు.

గూర్చి అనవరతం, ఆలోచించి తనభావాలకు సుగమం చేకూర్చాలన్న పట్టుదలగల మహా ఉద్యమ నిర్మాత.

అధికారానికి, స్వార్థానికి, కులమత బంధుప్రీతికి అతీతంగా తుదకు తను కుటుంబీకుడనన్న ధ్యేయసే మరచి ప్రజల సమస్యల కొరకై, ప్రజారక్షణకై, ఎంతటి పార్టీవర్గములతోనైనా, ప్రభుత్వ యంత్రాంగంపైనైనా పోరాటం సాగించే ధీశాలి. సామాన్య గ్రామ జీవితాన్ని, రైతుకూలీ సమస్యలను అర్థం జేసికొన్న ఆంధ్ర ఏకైక నిరాడంబర నాయకులు. వారితో, పరిచయం కలిగినతోడనే వారి భావాలను, ప్రభోదించి ప్రజ్వలించే శక్తిని, తన సహచరులకు ప్రసాదించి దేశమునకై కృషిచేయ పురికొల్పగలశక్తి వారికే చెల్లుతుంది.

ఆలాంటి అనుచరులలో అధికార మత్తులో నైనవారు కొందరుండవచ్చు. ఒక వ్యక్తి లోభిస్తే వందమంది రంగాగార్ని అర్థం జేసికొన్న రైతుబిడ్డల్ను కార్యరంగానికి ఉపక్రమింప చేసేశక్తి, వారికే దక్కింది.

# మహోన్నత వ్యక్తి రంగా

## శ్రీ ఎ. జె. దీక్షిత్

అఖిలభారత స్వతంత్రపార్టీ అధ్యక్షులు ఆచార్య రంగా స్వార్థపర వర్గాలచే బాహాటంగా దుష్ప్రచారానికి, అవాస్తవికారోపణలకు గురైన నాయకులలో ఒకరు. ఇలా ఎందుకు జరుగుతున్నది. అంటే ఆయన శీలం అనుమాన రహితమైనది గనుకనే రైతాంగ సమస్యలు, స్వతంత్రవృత్తులవారి సేచ్ఛాసమస్యలు సందర్భంగా ఆయన ఏలాంటి లొంగుబాటు లేకుండా పోరాడారు. అంతకన్నా బృహత్తర సమస్య ఉత్పన్నమైనపుడు 1955 ఎన్నికల సందర్భంలోనే భారత కమ్యూనిస్టులు ఆంధ్రలో అధికారం కైవసం చేసుకోనున్నపుడు, ఆయన ధోరణిలో ఎక్కడ ఏక్కడా కొద్దిపాటి సర్దుబాటులు ఉండవచ్చు. ఆంధ్రలో కమ్యూనిస్టుల ఓటమికి రంగాగారు వహించిన ఉత్తమపాత్రను నాటి భారతజాతీయ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ ఢేబర్ అంగీకరించారు. రంగాగారిని అభినందిస్తూ యిలా వ్రాశారు.

"మిమ్ములను కలుసుకోగలిగినందుకు సంతోషం. ఆంధ్ర దేశం అమోఘంగా వ్యవహరించింది. ఈ ఫలితాన్ని సాధించటంలో మీరు వహించిన అత్యుత్తమపాత్రకై మిమ్ములను నేను అభినందించాల్సి వుంది."

ఈ యథార్థాన్ని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారుకూడా అంగీకరించారు. ఆయన లేఖాంశాలు.

"ఢేబర్ గారు యిప్పుడే నాగపూర్‌లో నన్ను చూడటానికివచ్చారు. మీతో నిన్న ఆయన జరిపిన సంభాషణ నాకు చెప్పారు. మీ ఉత్తర ప్రత్యుత్తరాలు యిప్పుడే నాకు చూపించారు. మీరు, మీ పార్టీ తిరిగి కాంగ్రెస్‌లో చేరేందుకు మాతో భుజం భుజం కలిపి పనిచేసేందుకు నిర్ణయించారని తెలుసుకొని సంతసిస్తున్నాను."

కాని యిదే రంగాగారు తమ 60 వ పడిలో కాంగ్రెసును వదిలేందుకు చారిత్రాత్మక నిర్ణయంగైగొని రాజాజీయొక్క ఇత్తేజకరమైన మార్గదర్శకత్వాన కొత్తపార్టీకి సారథ్యం వహించేందుకు పూనుకొన్నారు. ఈ విధంగా తమ భవిష్యత్తు, అసంఖ్యాకులైన తమ అనుచరవర్గం భవిష్యత్తు వదలుకోగలిగిన వ్యక్తి మరెవరైనా ఉంటారా? 1959 జూన్‌లో మద్రాసులో నూతనపార్టీ స్వతంత్ర పార్టీగా ఆవిర్భవించినపుడు రాజాజీ యీ నూతన పార్టీకి రంగాగారిని నాయకత్వం వహించేందుకు కోరారన్న విషయమే రంగాజీ ప్రజానాయకత్వానికి, శక్తి – సామర్థ్యాలకు అత్యుత్తమ ప్రశంసగా భావించాల్సివుంది. ఆయన ఒకనాటి అనుచరులు పలువురు అధికారం, పదవుల ఆశతో ఆయనను వదిలారు. ఇలాంటి విడిపోవటాల మూలంగా రంగాగారు పరిస్థితుల, వ్యక్తుల పోకడలను అర్థం చేసుకో గలిగారు. కలతమాత్రం చెందలేదు. తమ భావాలను కార్యరంగంలోకి తెచ్చేందుకు తగిన యువకులను, యువతులను సృష్టించుకో గలిగిన సత్తా, సామర్థ్యాలు – అంతులేని ఆకాంక్ష గలవారు. అధికారంలో వున్న వారిని ఎదిరించాలంటే అది అందరికి సాధ్యమయ్యే విషయంకాదు. అధికార ప్రలోభాలకు లొంగనివారే అధికారంలో ఉన్నవారిని తీవ్రంగా ప్రతిఘటించ గలరు. అందువలన యీ కృషి బృహత్తరమైనది. రంగాజీ యీ కృషిని నిస్సంశయముగా నిర్వర్తించ గలిగిన వారు.

రంగాగారు అవకాశవాదియా అంటే కాదు – కాదు అని ముమ్మాటికి కాదు అని గట్టిగా చెప్పవచ్చును. ప్రతిపక్షాన్ని నిర్మించాల్సిన ఆవశ్యకత విషయమై ఎల్లప్పుడూ వాదిస్తూ ఉండేవారు. ఇందుకు ఆయన మాటలనే ఉదాహరిస్తాను. 1951 లో నెహ్రూకు రంగాగారిలా వ్రాశారు.

''కాంగ్రెస్ వాదులు తమలో తాము పోట్లాడుకోవటం, నిరసించుకోవటం కాంగ్రెసులోనే ముఠాలు కట్టడంలాంటి అవాంఛనీయ ధోరణిపట్ల మీరు తరుచు విసుగుదల వెల్లడిస్తూ వచ్చారు. కాని

మీరు యీ సమస్యా పరిష్కారానికి ఏనాడూ పూనుకోలేదు...... అయినపుడు కాంగ్రెస్ రెండు పార్టీలుగా విడిపోయేందుకు అనుమతించండి...కాంగ్రెస్ పరిపాలనలో విసిగి వేసారిన కాంగ్రెస్ వారందరు కలిసి ప్రతిపక్షాన్ని నిర్మించే అవకాశం ఉండాలి. నాకు సంబంధించి నేను అలాంటి ప్రతిపక్షంలో చేరేందుకు యిష్టపడతాను. యీ విధంగా మనలో అనేకులం ప్రత్యామ్నాయ ప్రజాస్వామిక నాయకత్వాన్ని నిర్మించగలం. తద్వారా యితోధిక దేశాభివృద్ధిని, శ్రేయస్సును దేశంలోను, వెలుపలా ఉన్న నియంతృత్వ శక్తుల బారి నుండి మన ప్రజలకు రక్షణను కల్పించ గలిగిన వారమౌతాము.''

ప్లానింగుకు సంబంధించి ఆయన భావాలు విస్పష్టమైనవే! ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాపై రంగాగారి హెచ్చరికను వివరిస్తాను.

"ఈ ప్రణాళిక తదితర పార్టీలన్నిటి సహకారంతో రూపొందించబడినది కాదు. నామటుకు నేను, ఇంకా చెప్పాలంటే మనం ప్రాతినిధ్యం వహించే రైతాంగం, చేతివృత్తులవారు యీ ప్రణాళికలో సూచించబడిన కేంద్రీకృత సమిష్టికరణ పద్ధతితో సంబంధం పెట్టుకోలేదు.''

రంగాగారు యింతవరకు అధికారాన్ని కైవసం చేసుకోవటంలో విఫలుడైనారని ఎవ్వరైనా అంటే అనవచ్చు. కాని 1962లో అదృష్టం ఆయన్ను వరించనున్నది. నాడు ఆయన 4.5 రాష్ట్రాలలో అధికారానికి వచ్చే తమపార్టీ ప్రతినిధులకు మార్గదర్శకత్వం వహించాల్సి వుంటుంది. కేంద్రంలో రాజ్యాంగ బద్ధంగా ప్రతిపక్షమైన స్వతంత్రపార్టీకి నాయకులుగా వ్యవహరించాల్సివుంది.

ఈ మహోన్నత కృషికంతా ఆయన ప్రథమంగా శ్రీమతి భారతీదేవికి కృతజ్ఞత తెలుపాలి. ఆంధ్ర దేశంలోని ప్రతి చిన్నా-పెద్ద రాజకీయవేత్త, ఆమెను మాతృ స్వరూపంగా భావించి అమ్మగారు అని ఆప్యాయతతో సంబోధించు కొంటారు.

# స్వతంత్రపార్టీ ఒక ఉద్యమం మాత్రమే

## శ్రీ యం. వెంకటయ్య

కమ్యూనిస్టులు రంగాగారిపై చేస్తున్న వింత ప్రచారం నన్ను రంగాగారితో పరిచయం చేసింది. 'రంగా రాజకీయాలు' అనే ఒక చిన్న పుస్తకం చదివిన తరువాత రంగాగారిని చూడాలనే దృఢనమ్మకం నాలో కల్గింది. నేను ఒక విముక్త జాతికి చెందినవాడను. స్వరాజ్యం రాకముందు మా జాతులవారిని బ్రిటిషు ప్రభుత్వం పెట్టు కష్టాలను కన్నులారాగాంచుచు వున్న నేను వాళ్ళకి సంఘాలు నెలకొల్పుకొంటూ, 1935 లో తాత్కాలిక ప్రజాప్రభుత్వం శ్రీ ప్రకాశంగారి నాయకత్వాన ఏర్పడినపుడు మా జాతి ప్రజలకు రక్షణ కలుగ జేయాలని శ్రీ ప్రకాశంగారికి మెమోరాండం రంగాగారికి సమర్పించిన మెమోరాండం కాపీలను మా పెద్దలనుండి తీసుకొని చదువగల్గితిని. రంగాగారు తప్ప గ్రామీణ ప్రజల సౌన్నత్యమునకు కృషిచేయువారు మరెవ్వరూ లేరని నిస్సంశయముగా తెలిసిననూ, రంగాగారిని గురించి వింత వింత ప్రచారం గావించడం ఒక్క కమ్యూనిస్టులకే యింత అక్కసు ఎందుకని విచారించగా, రంగాగారు గాంధీగారి సలహా ననుసరించి దేశస్వాతంత్ర్యంకొరకు శాంతియుత పంథాలో నడుచుకొనుటకు ఒప్పుకొని, తన స్వంత ఆలోచనల్లోయున్న రైతు–కూలీ ప్రజారాజ్యం ఆశయం స్వరాజ్యం వచ్చిన తర్వాత ఏర్పాటు చేయవచ్చునన్న తలంపుతో జాతీయ వుద్యమంలో పాల్గొని జైళ్ళకువెళ్ళిన తర్వాత అప్పటి బ్రిటీషు వారి ఏజెంట్లుగావుంటూ, జాతీయ కాంగ్రెసు కార్యకర్తల రహస్యములను ప్రభుత్వానికి అందజేస్తూవున్న కమ్యూనిస్టులు రంగాగారిపై ఇలాంటి ప్రచారంకు ఒడిగట్టారని తెలుసుకున్నాను. అందువల్ల నేను ఎంత నిరుపేదనైనప్పటికి రంగాగారి విధానమును రంగాగారికి తెలియకుండా అవలంభించవలసివచ్చెను.

రంగాగారు ప్రచురించిన రైతుభజనావళిలోని పాటల సారాంశా లను ఉపన్యాసాల ద్వారా గ్రామీణులకు నేను తెలియ జెప్పుతూ ఉండేవాడిని. వాటిలోని వుద్దేశాలు ప్రజలను బాగా ఆకర్షించినవి. రంగాగారు ఎన్ని పార్టీలు మార్చినా అవన్నీ యీ పౌరప్రజల సముద్ధ రణ కొరకు ఆందోళనచేయుటకు ఉద్యమాలు మాత్రమేనని నేను 1947లోనే గ్రహించగలిగితిని. ఆనాడు రంగాగారు రాష్ట్రికాంగ్రెసు అధ్యక్షులుగా వచ్చిన సందర్భంలో నేను బనగాలపల్లె ఎస్టేటు కాంగ్రెసు ప్రచారం గావిస్తూవుంటిని. రంగాగారిని అక్కడకు ఆహ్వానించాలన్న తలంపును కొందరు పెద్దలు వలదన్నారు. నేను స్వయంగా వచ్చి, నంద్యాలలో కలుసుకుంటిని. 1943 నుండి ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా రంగాగారు నాకు పరిచితులుకాబట్టి 1947లో నన్ను ఆయన తొందరగా గుర్తించగలిగిరి. కంట్రోల్లు, రేషనింగు విషయంలో అప్పటి ప్రభుత్వంవారు చేయుచున్న అక్రమాలను కాంగ్రెసులోవుండే విమర్శించుచుండిరి. వారి సలహాను అనుసరించి మేముకూడ నిరసన దినోత్సవాలు, ప్రభుత్వ అధికారులవద్దకు రాయభారాలు, రైతు యాత్రలు సాగించాము. ఆనాటినుండి 1950 వరకు జిల్లా కాంగ్రెసు కార్యాలయ కార్యదర్శిగా వుంటూ రంగాగారిని పూర్తిగా అర్థం చేసుకోగలిగితిని. హరిజన విద్యార్థి, యువజన, చేనేత మొదలగు వర్గ సంఘాలు స్థాపించి వారందరిని ఏకం చేయుటకు చాలాకృషి చేయు యుండిరి. వారి కృషి ఫలితమువల్లనే నేడు ప్రభుత్వం ద్వారా చేనేత వారు సహాయంపొంద కలుగుతున్నారు. నోరులేని ప్రజలైన గ్రామీ ణులకు రైతు – కూలీ సంఘాలు ఆనాడు రంగాగారు నెలకొల్పబట్టి వాటిద్వారా ఈనాడు రైతుకూలీలు రాజకీయంగా ముందుకు రాగలి గారు. 1951 లో కె. యల్. పి. ని స్థాపించారు. నేను వారిని అను సరించాను. ఎన్నికలలో పోటీచేసి రైతుకూలీ ప్రజల బలం ప్రదర్శించ డం జరిగింది, రంగాజీ సహాయం పొందిన రాజాజీ ప్రభుత్వం రంగాజీ ఆదేశానుసారంగా రాష్ట్రంలో రేషనింగు రద్దు కావించింది. కె. యల్. పి. ఎందుకు స్థాపించారో ప్రజలకు బోధపడింది. రంగా

గారి అనుయాయుల్లో కొందరు పదవి వ్యామోహంవల్ల రంగాగార్ని వదలి పదవులను అలంకరించారు. సన్నులొంగదీసుకొనుటకు వారి అధికారమునంతా వుపయోగించిరి. వారికి భయపడలేదు. ప్రత్యేక రాష్ట్రం విషయంలో భాషాప్రయుక్తరాష్ట్రాలు కావాలన్న ఉద్యమాన్ని రంగాగారు లేవదీశారు. వారి ఉద్యమ ఫలితంగానే ఈనాడు రాష్ట్రాలు ఏర్పాటుకాబడి భాషారాష్ట్ర మంత్రివర్గాలు ఏర్పడినవి. వారు స్వతంత్రపార్టీ ఈనాడు నెలకొల్పారు. ఈపార్టీ ప్రధానోద్దేశం స్వతంత్రవృత్తులవారి రక్షణకు ఏర్పడ్డ ఒక వుద్యమం మాత్రమే.

రంగాగారి ఉద్యమాలను నాలాంటి ప్రచారకులేగాకుండా తెలుగుగడ్డపై వారపత్రికగా 'వాహిని' పత్రిక ప్రచారం కావించింది. ఆర్థిక లోటువలన నాలాంటి కార్యకర్తలు మామూలుగానే నికృష్టమైన సిరుపేదలుగా వుంటూ రంగాగారి ఆశయాలు కొన్నాళ్ళకు ఫలించి తీరుతాయని, అప్పటికి అందరికి కూడూ, గుడ్డా, కొంప లభించగలవని అంతవరకు యీనాటి ప్రభుత్వంలోవలె ధనవంతులు ఇంకా ధనవంతులుగాను, బీదలు మరీ బీదలుగాను వుండితీరవలసిందేనని గుర్తించాను.

# రంగాగారితో సహాధ్యాయం

## శ్రీ లింగం వీరభద్రయ్య చౌదరి

శ్రీ రంగాగారు 1920 నవంబరులో ననుకొందును, ఆక్స్‌ఫర్డుకు వచ్చిరి. అప్పుడింగ్లండుకు చదువు కొరకు ఒకేసారిగా వచ్చిన ఏడుగురు విద్యార్థులలో వారొకరు. వచ్చిన వారిలో చాలామంది గుంటూరుజిల్లావారగు శ్రీ వెలగపూడి రామకృష్ణగారు ఐ. సి. యస్. తరిఫీదులో నుండిరి. అందువలన వారందరూ ఏకోన్ముఖముగా, శ్రీరామకృష్ణ సలహా, సాయములను పొందుటకు ఆక్స్‌ఫర్డ్ వచ్చిరి. ఒకటి రెండు రోజులలో తతిమ్మావారు ఇంగ్లండు, స్కాట్లెండులలోని ఇతర విశ్వవిద్యాలయములకు వెళ్ళిపోయిరి కాని శ్రీ రంగాగారు ఆక్స్‌ఫర్డ్ లోనే నిలిచిపోయిరి. నేనంతకు 2 నెలలకుముందు శ్రీ రామకృష్ణగారి యాజమాన్యమున ఆక్స్‌ఫర్డ్ చేరుకొని యుంటిని. శ్రీరామకృష్ణ వారి సహపాఠి శ్రీ టి. భాస్కరరావు, ఆక్స్‌ఫర్డ్ శివారు బాట్లీలో 'ఎల్మ్స్ ఫారం' అను పేరుగల ఇంటిలో నుండుచుండిరి. శ్రీ రామకృష్ణగారు వారున్న ఇంటికెదురుగా గోష్ఠకవతల ప్రక్కనున్న 'ఎల్మ్స్ లాడ్జి'లో వసతి ఏర్పాటు చేసిరి. శ్రీ రంగాకూడా "ఎల్మ్స్ లాడ్జి"లో చేరిరి. తరువాత సుమారు 3 మాసములకు శ్రీ వాసిరెడ్డి శ్రీ కృష్ణ విద్యార్థిగా ఆక్స్‌ఫర్డ్ వచ్చి మేముండిన బసలోనే చేరిపోయిరి. మేము ముగ్గురము సంవత్సరన్నరవరకు "ఎల్మ్స్ లాడ్జి"లో కలసి మెలసి యుంటిమి. శ్రీ రామకృష్ణ తన తరిఫీదును పూర్తిచేసికొని 1921 ఆఖరులో స్వదేశమునకు తిరిగి వెళ్లునరకు మా ముగ్గురు యోగక్షేమములకు బాధ్యత వహించి యుండిరి.

శ్రీ రంగా మొదటినుండియు నిరాడంబర వేషధారి. అందులో క్రొత్తగా అక్కడకు వచ్చినప్పుడు మిక్కిలి సామాన్య దుస్తులతో వచ్చినట్లు గుర్తు. ఆ నిరాడంబరత్వమును ఆయన ఎన్నడూ విడిచి

పెట్టలేదు. బిరుదందిన విద్యార్థిగా ఆరితేరిన తర్వాత కూడ ఆ నిరాడంబరత్వమే నిలచినది. ఆయన దేహాలంకరణకు తావీయలేదు. సహజముగా దానిని గురించి యోచనగాని, శ్రద్ధగాని యుండెడిది కాదు. ఈ విషయములో శ్రీ రామకృష్ణగారిని మిక్కిలి దగ్గరగా అనుకరించిరి. వచ్చినకొలది రోజులలోనే శ్రీ రంగా శ్రీ రామకృష్ణ ప్రియ శిష్యులుగా మారిరి. వారి నన్నివిధముల ననుకరించవలెనని ప్రయత్నించకనే అలవరచుకొనిరేమోగాని ఆయన అడుగుజాడలలో నడుచుచున్నట్లు మాకు తోచెడిది. శ్రీ రామకృష్ణ పెద్ద పెద్ద అంగలతో మిక్కిలి విసురుగా నడిచెడువాడు. వారి ననుకరించుచున్న శ్రీ రంగా గునుకు అవలంబించవలసి వచ్చెడిది. దాని కాయన ఎంత మాత్రము బిడియ పడెడువాడు కాదు. అది స్వాభావికముగ గోవుతో చిన్న పరుగుతో కలసిపోయే దూడలాగు సహజముగా నుండెడిది. ఆ మొదటి రోజులలో శ్రీరంగా తిండి విషయముగాని, బట్ట విషయమునగాని వినోద విషయమునగాని పట్టించుకొనెడు వారేకాదు. ఆయన అప్పటి నడవడి మావంటి ఆడంబర వేషధారులకు, బడాయి కోరులకు, చుల్కనగా కన్పట్టెడిది. కాని ఆయన మాటలలో చమత్కారము, హాస్యము, వేగము, చురుకుదనము, ఉజ్వలత, సమయ స్ఫూర్తి మొదటినుండియు ప్రస్ఫుటము. నిష్కపటముతో పెద్దగా నవ్వుట, ఉత్సాహముతో ఉప్పొంగుట, సంతోషముతో ఎగిరిగంతులు వేయుట, ఆనందములో హృదయమునకు హత్తుకొనుట, పరిచయులతో స్వేచ్ఛగా అరమర లేకుండా కలసిమెలసి కొంతవరకు చిలిపి చేష్టలలో గూడ పాల్గొనుట, వారికి పుట్టుకతో వచ్చిన సుగుణములు. ఉన్నవారు, లేనివారు, పండితుడు, పామరుడు, అను భేదము మొదటి నుండియు పాటించని మనస్తత్వము వారిది. భేషజము ఇంచుకంతయు లేనివారు,

శ్రీరంగా ఆదర్శ విద్యార్థి. విద్యా సముపార్జనయే ఆయన పరమావధి. దానికి సంబంధించని విషయములను ఆయన పట్టించుకొనెడువారు కాదు. విషయ, విజ్ఞాన, సముపార్జనలో వారిది తదేక

ధ్యానము. తాము విశ్వవిద్యాలయములో నేర్చుకొనుచున్న అంశములతోనేగాక ఇతర విజ్ఞాన విషయములలోను, రాజకీయ సంబంధమైన విషయములలో గూడా, వారు అభిరుచి, ఉత్సాహము, పరిచయము, మొదటినుండియు గల్గించుకొనిరి. ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయ అర్థశాస్త్ర పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులగుటయేగాక ప్రత్యేక ప్రశంసను పొందిరి. మిక్కిలి కష్టపడి గృహపరిశ్రమలు, గ్రామ ఆర్థిక జీవనము మొదలైన విషయములలో అపారమైన పరిశోధనలు జరిపి విశ్వవిద్యాలయ పండితుల మెప్పును బొందిరి. మరియు సామాన్య జనుల కష్టజీవులయందు పిన్ననాటినుండియు తమకున్న అభిమానము ననుసరించి ఇంగ్లండులోని కార్మికపక్ష నాయకులతో పరిచయము కలిగించుకొనుటయే గాక, వారి వార్షిక సభలకు హాజరయి ఉచితరీతిని పాల్గొనుచుండిరి. ఆ సంబంధము, సానుభూతిగల శాస్త్రవేత్తలతో పండితులతో స్నేహము సంపాదించుకొనిరి. ఈ విధముగా విద్యార్థి దశలోనే, మిక్కిలి చొరవతో, మనోబలముతో, రాజకీయ మహానాయకులతో పరిచయము సంపాదించుకొని వారి మనస్తత్వముతో, దృక్పథముతో, ఆశయ, ఆదర్శములతో, తాము కూడా భాగస్వాములు కావలెనని పాటుబడినవారు హిందూదేశ విద్యార్థులలో మిక్కిలి అరుదు. అన్నివిధముల శ్రీ రంగాగారి ఇంగ్లండు చదువు, ఉనికి, మిక్కిలి సఫలత జెందినవి.

శ్రీ రంగాగారు 1920 నుండియు నాకు స్నేహితులు, 1918లో ననుకొందును. ఒకసారి వారి స్వగ్రామమగు నిడుబ్రోలులో, గ్రంథాలయ వార్షికోత్సవ సందర్భముగా వారిని జూచియుంటిని. తరువాత వారు ఆక్స్‌ఫర్డ్ వచ్చినప్పుడు పరిచయమైరి. తరువాత స్నేహితుల మైతిమి. "ఎగ్మోస్‌లాడ్జి" లోనున్న సమయమున వారు లెక్కల పఠనములో సాయముచేసి ఒక విధముగా గురువులు కూడా అయిరి. తదుపరి ఆప్తమిత్రులముగా రూపొందితిమి. జాతీయ భావము, దేశ, వ్యక్తి స్వాతంత్ర్యములు, సాంఘిక న్యాయము, బీదసాదలయందు సానుభూతి ఆర్థిక సంక్షేమము మొదలైన అనేక విషయములలో.

నేను శ్రీ రంగాగారి అభిప్రాయములతో పూర్తిగా మొదటినుండియు ఏకీభవించినను, స్వతః వారి దృక్పథమునకు, నా దృక్పథమునకు, వారి మనస్తత్వమునకు, నా మనస్తత్వమునకు భేదముండియున్నది. అందు వలన బాట్లీ యిల్లువిడిచి ముగ్గురము (శ్రీ రంగా, శ్రీ వి. యస్. కృష్ణ, నేను) మూడు దారులైనప్పుడు, వారితోటి సాన్నిహిత్యము తగ్గినది. వారి అనుభూతులతో నాకు భాగములేకుండ పోయినది. కాని వారు ఆక్స్‌ఫర్డ్‌లో నున్నంతకాలము వారిని కలసికొనుట ఆ స్నేహమును నిలబెట్టుకొనుట జరిగినది. శ్రీమతి భారతీదేవిగారు ఇంగ్లండుకువచ్చి కొంతకాలము ఆక్స్‌ఫర్డ్‌లోను, లండన్ లోను, ఉన్న ప్పుడు వారితో పరిచయభాగ్యము కలిగినది. ఆమె నాయెడల జూపు చుండిన సోదర భావము తరువాత నే నిండియాకు 1927లో తిరిగి వచ్చిన తర్వాత, 1928లో నా కెంతయో ఉపయోగపడినది. కొన్ని నెలలపాటు వారి మద్రాసు గృహములో అతిథిగానుండు భాగ్యము నాకు లభించినది. దీని వలన ఉమామహేశ్వరులవంటి ఆ దంపతులతో నా అనుబంధము మరింత దృఢమైనది.

విద్యాభ్యాసానంతరము నేను గవర్నమెంటువారి నౌకరిలో జేరుటవలన, ప్రజాహితైక జీవియగు శ్రీ రంగాగారికి నేను దూర ముగా నుండినను, మా ఆక్స్‌ఫర్డ్ రోజులు తరుచు జ్ఞాపకమునకు వచ్చుచు, మా హృదయాలను దగ్గరకు చేర్చుచుండును. ప్రజాసేవ యందు 35 సంవత్సరములకు పైగా గడిపి, వారిప్పుడు తమ షష్టి పూర్తి ఉత్సవము జరుపుకొనుచున్నందులకు మిక్కిలి ఆనందించు చున్నాను. వయస్సున వారికంటె ఇంచుమించు 2½ సంవత్సర ములు పెద్దనైన నేను ఆ పెద్దరికము పేరున ఇంకను పెక్కువర్షములు మనుడని వారిని మనఃపూర్వకముగా నాశీర్వదించుచున్నాను. శ్రీ సర్వేశ్వరుడు శ్రీ రంగాగారికి పూర్తి ఆయురారోగ్యములను మరింత ఎక్కువగా దేశ, ప్రజాసేవ చేయుటకు, జవసత్వములు, మనోపటుత్వము, సునిశిత మేధాసంపత్తి నొసగి కాపాడుగాక!

# ఎక్కడున్నా పైచేయి వారిదే

శ్రీ ఎమ్. ఎస్. కౌల్

గత ఇరువది సంవత్సరాలుగా ఆచార్య రంగాతో అనేక సందర్భాలలో అనేక చోట్ల కలసి పనిచేశాము; నిజంగా ఆచార్య రంగాలతో మనకు సాన్నిహిత్యం, బాంధవ్యము ఏర్పడినాయి. నేను లోక్ సభ కార్యదర్శిగానో, సభ్యుడుగనో లేక మరొక దానితోనో బయలుదేరవచ్చు. కాని మన నాయకుడు (ఆచార్య రంగా) విషయంలో ఒక ముఖ్య విషయం గుర్తుంచుకోవాలి. ప్రతి దానిని ఎంతో జాగ్రత్తగా గమనించి, పరిశీలించగల గొప్పశక్తి రంగా గారికున్నది. ఆయన ఏమి మాట్లాడినా దానికి ఆధారం ఆయన సొంతపరిశీలనయే. పబ్లిక్ ఎకౌంట్సు కమిటీ అధ్యక్షులుగా ఆఫీసు దస్త్రాలను, పనిని, శ్రద్ధగా ఆచార్య రంగా చూచారు. ఆయన వచ్చిన దగ్గరనుంచీ ఆఫీసులో ప్రతి చిన్నపనిని స్వయంగా గమనిస్తూ వుండేవారు; ప్రతి ప్రయోజనకరమయిన పని ఫలించి తీరుతుందని ఆయనకు గట్టినమ్మకం; మంచి పూలను ఎన్నుకొనడానికి ఆయన యెప్పుడూ యత్నిస్తారు.

ఆచార్య రంగాలో ఇంకో గొప్ప సుగుణం ఉన్నది – ఆయన అద్భుతమయినశక్తి. ప్రజలతో నిరంతర సంబంధము. దేశంలో జరుగుతున్న దానికి అనుగుణంగా రంగాగారు యెప్పుడూ నడుచుకుంటారు అంటేనమ్మండి. ఆయన చాలా అదరగణ్ణాం మనిషని ఆయన రాజకీయ మిత్రులు కొందరు వ్యాఖ్యానించడం విన్నాను. ఆడిటర్ – జనరల్ ఆ మాటతో అంగీకరించలేదు. ఆయనను గురించి అలా వ్యాఖ్యానించడం శుద్ధ తప్పు అవి వ్యక్తిగతంగా నేను భావించాను. స్నేహ పూర్వకంగానే అలాంటి వ్యాఖ్యానం జరిగి ఉండవచ్చు. ఆచార్య రంగాను గూర్చి అలాంటి అభిప్రాయాలను పెట్టుకోవడానికి నేను సుతరామూ అంగీకరించను. ఆచార్య రంగా సృజనాత్మక శక్తి

కల్గిన గొప్పవ్యక్తి. శక్తిసామర్థ్యాలతో తొణికిసలాడే నిండుమూర్తి ఆచార్య రంగా. సోమరితనాన్ని, నిర్లక్ష్యాన్ని ఆయన సహించలేరు. ప్రతిపని సాఫీగా, సక్రమంగా జరగాలని ఆయన ఆలోచన. వారిలో నా కున్న 20 సంవత్సరాల పరిచయంలోను ఆయనలో నాకెక్కడా ''అదరగణ్డం'' కనబడలేదు. మేముతరచు యెక్కడబడితే అక్కడ కలుస్తుంటాం. పార్లమెంటు భవనంలోనో, వరండాలోనో ఏదయినా మీటింగులోనో కలుస్తుంటాము. 1957 లో దూరదేశంలో, కామన్ వెల్తు పార్లమెంటరీ సమావేశ సందర్భంలో, కెనడాలో, లండన్‌లో, కైబరు కనుమలో, ఆచార్య రంగాను చూస్తుండేవాడను. ఎక్కడున్నా ప్రతి చిన్న విషయాన్ని కడు జాగరూకతతో గమనిస్తుండే వారు. ఆయన పనిచేస్తున్నప్పుడు చూస్తుండేవాడిని. అప్పుడు వారి నుండి నాకు కూడా కొంత శక్తి ప్రవహిస్తున్నదా అనిపిస్తుండేది - ఎప్పుడు ఎంత చిక్కు పనినిగూడా చిరునవ్వుతో పరిష్కరిస్తూ ఉండే వారు. ఆయన చెప్పే ప్రతిమాటా ఆత్మవిశ్వాసంతోను, స్వానుభవం తోను కూడి ఉంటుంది. ఆయన ఆలోచనను సీవు అంగీకరిస్తే, ఆ పనిని చక్కపెట్టే విధానాన్ని మనకు వదలు తుండేవారు. పని పుర మాయించడానికి, పనిచేయడానికి, సీటలో ఉన్న తేడా ఆయనకు బాగా తెలుసు. మనము చేసే పని కెప్పుడు అడ్డం చెప్పరు. ''నివేదికలు, వివరాలు కావలసినపుడు కేవలము ఆఫీసు కాగితాలమీదనే ఆధారపడతాను. అధ్యక్షుడుగా అనుసరించవలసిన విధానాలను, చేయవలసిన సిఫారుసుల వరకే నేను చూచుకుంటాను.'' అని ఆచార్య రంగా ఒక సారి అనడం నేను విన్నాను. ఆచార్య రంగా ఈ స్నేహ పూర్వక ధోరణికి మేము ఆయనకు సన్నిహితులము కాగలిగాము. మమ్ములను పరీక్షచేయడానికి బదులు, మాలో పూర్తివిశ్వాసముంచి పని నడిపించుకు పోతుండేవారు. ఇంకా మేముంతా ఆయనకంటే చిన్న వాళ్ళం. ఐనా ఆయన మమ్ములను సమానులుగానే ఆదరిస్తుండేవారు. మా ఆఫీసులో ఎవరిపట్లా పక్షపాతాన్ని చూపేవారుగారు. మమ్ముల నందరిని సమంగా ఆదరించేవారు. ఆచార్య రంగాతో మేము గడపిన

అమూల్య సమయాన్ని పెన్నిధిగా భావించుకొని, శాశ్వతంగా స్మరించు కుంటూ వుండగలము.

పబ్లిక్ ఎక్కౌంట్సు కమిటీ అధ్యక్షులుగా ఆచార్య రంగా గారు ఎంతో కాలము లేకపోవచ్చు. ఆయనవున్నది యేడాదిగా వచ్చు. శ్రీ లాయడ్ జార్జి చెప్పినట్లుగా ఎన్ని సంవత్సరాలు పదవిలో వున్నారనేది నిజంగా కొలబద్దగాదు; ఎంతటి శ్రద్ధతో, ఉత్సాహంతో, శక్తితో పనిచేయించినదీ, ఇతరులపట్ల ఎంతటి విశ్వాసాన్ని ఉంచినదీ చూడాలి. ఆచార్య రంగా పదవీకాలంలో కార్యదర్శి నుంచి చిన్న ఉద్యోగివరకు అందరూ మామూలుకంటే ఎన్నో రెట్లు పని హెచ్చుగా చేయగలిగారు. ఆచార్య రంగాగారి ఈ ఒక్క సంవత్సరం అధ్యక్ష పదవి పబ్లిక్ ఎక్కౌంట్సు కమిటీ చరిత్రలో ఉజ్వలమైన భాగమని చెప్పడానికి నేను సాహసంతో గర్వపడుతున్నా. నేను ఇలా చెప్పడానికి కారణాలు యెన్నో ఉన్నాయి. అవన్నీ నే నిక్కడ యేకరువు పెట్టదలచడము లేదు. అంతటి స్వల్ప వ్యవధిలో ఆయన సాధించిన ఫలితాలు అద్భుతమయినాయి. రాజకీయవేత్తగా ఆయనకున్న లెక్కలేనన్ని పనులలో పబ్లిక్ ఎక్కౌంట్సు కమిటీ పనులను ఇంతటి శ్రద్ధతో ఎలా చేయగలిగినారో అని తలచుకుంటే నేను ఆశ్చర్య పడుతుండేవాడను. పబ్లిక్ ఎక్కౌంట్సు కమిటీ పనిని ఆయన అప్యాయంగానే చేసేవారు. పార్లమెంటులో కూర్చొని ప్రశ్నావళిచూస్తుండే వారు; చర్చలలో పాల్గొంటూనే తనకమిటీమీద మాటపడకుండా కనిపెట్టి వుండేవారు; ఏమయినావస్తే, చకచకా దానిని తెలుసుకొని పార్లమెంటులో 10 నిమిషాలలో దానిని తేల్చివేసి అందరి మన్ననలను పొందుతుండేవారు. ఎంతో చాకచక్యంతో, సామర్థ్యంతో తన బాధ్యతలను నిర్వహించిన విషయం పార్లమెంటు సభ్యులందరకు తెలుసు.

కమిటీయొక్క ఆఫీసు, దాని గౌరవాన్ని, ప్రతిష్టను నిలబెట్ట వలసి యున్నది. ఆచార్య రంగాకు సంబంధించినంతవరకు ఆయన కమిటీయొక్క ప్రతిష్టను ఇనుమడింప చేసినారు. ఆచార్య రంగారినీ,

వారి అసమాన కృషిని గుర్తించడముద్వారా మనము మంచి పని చేస్తున్నాం; ఆయన మన మనస్సులో సదా ఉంటారు. ముందుముందు క్రొత్తగా రానున్న మన కార్యాలయోద్యోగులకు మన ఈ అనుభవాన్ని అందిస్తాం; ఆచార్య రంగా చూపిన మార్గాన్ని వారికికూడా చూపుదాం.

కమిటీ కార్యకలాపాలను ఆచార్య రంగా బహు ఉదాత్తంగా నడిపేవారు. ప్రతి విషయం కూలంకషంగా తెలుసు కాబట్టి ఆచార్య రంగా దర్పముగా వ్యవహరించ గలిగారు. ఆడిటర్-జనరల్‌కు తగు గౌరవాన్ని ఇస్తుండేవారు. కమిటీకి కావలసిన వివరాలను ఆడిటర్ జనరల్ చేత చెప్పించేవారు. అయితే తన అధ్యక్ష పదవి ఉన్నతమయినందున, ఎవరిని పెత్తనం చేయనిచ్చేవారు కారు. ఆచార్య రంగా హయాంలో ఆడిటర్-జనరల్‌కు, పబ్లిక్ ఎకౌంట్సు కమిటీ అధ్యక్షుడికి మధ్య చక్కని బాంధవ్యాలన్ను ఏర్పాటు జరిగిందని నేను చెప్పగలను.

ఆచార్య రంగాకు సంబంధించినంతవరకు మనము ఆయనకు ఎలాంటి సలహాలు ఈయవలసిన అవసరముండదు. రాజకీయరంగంలో తనకున్న ప్రముఖ స్థానం, నిస్వార్థ ప్రజాసేవ, మహోన్నత వ్యక్తిత్వం ద్వారా ఆచార్య రంగా ఎక్కడున్నా, స్వేచ్ఛగా వ్యవహరిస్తారు.

ఆయన ఎక్కడున్నా, ఏ సమావేశానికి అధ్యక్షత వహించినా, తన వ్యవహారంలో ఇతరులను వేలుపెట్టనీయకుండా, ఏకధాటిగా సంభాళించుకోనగలరు. ఆచార్య రంగా, తన హయాంలో ఆయన చేసిన కృషినిబట్టియే ఆయన పబ్లిక్ ఎకౌంట్సు కమిటీకి గొప్ప అధ్యక్షుడు అని చెప్పడంలో అసహజమేమీ లేదు. ఆయన తరువాత వచ్చేవారు ఆయన నిర్మించిన ప్రమాణములను నిలబెట్టగలరో, లేక అంతకంటే ఇనుమిక్కిలిగా చేయగలరో అనే విషయం ఆ వచ్చేవారి వ్యక్తిత్వాన్నిబట్టి, వారి సామర్థ్యమునుబట్టి ఆధారపడివుంటుంది. మా కార్యాలయ ఉద్యోగుల దృష్టిలోను, మా కమిటీ చరిత్రలోను

ఆచార్య రంగాగారు ప్రవేశపెట్టిన ప్రమాణాలు (Standards) ఆదర్శ ప్రాయ మయినవని, ఉదాత్తమైనవని చెప్పుకొనడానికి గర్విస్తున్నా.

పబ్లిక్ ఎకౌంట్సు కమిటి ఛైర్మన్‌గా ఆచార్య రంగా ఎలాంటి మందగొండితనాన్ని సహించేవారు కారు. కటువుగా వ్యవహరించడం ఆచార్య రంగాకు చేతకాదు. ఆచార్య రంగా సమక్షంలో నిలచిన మంచి ఉద్యోగులు తాము కమిటీ మీటింగులకు వచ్చేముందు అన్ని విషయాలు సాకల్యంగా తెలుసుకొని, కమిటీకి నచ్చచెప్పడానికి వీలుగా తయారయి రావాలని భావించేట్లుగా రంగాగారు చేయగలరు. ఇంకా ఎలాంటి మందగొండి తనాన్నిగాని– "ఇవాళ కాదు– రేపు" అని వాయిదా వేసే తత్వాన్ని గాని రంగాగారు సహించరు. ఒక ఆలోచన అందిస్తే దాని వివరాలను ఉద్యోగులు తయారుచేయాలంటారు; చిల్లర మల్లర సంగతులలో మునిగిపోకుండా అసలు సంగతికి అవరోధం రాకుండా చేయాలంటారు; వీటన్నికి తోడు ప్రభుత్వ కార్యదర్శులు చకచక ఒక నిర్ణయం తీసుకొనగలిగి వుండాలని రంగాగారు కోరు తుండేవారు.

ప్రభుత్వ కార్యదర్శులు ఆచార్య రంగా అందించిన ప్రమాణా లను సంతృప్తికరంగా నిలబెట్ట గలిగితే ఎలాంటి విమర్శకు తావు యేర్పడదు. దేశం కొరకు, పార్లమెంటు కొరకు, మా కమిటీ కొరకు ఆచార్య రంగా – ఇతరు లెవరూ పది సంవత్సరాలలోకూడా సాధించ లేని దానిని – తన హయాం ఒక్క సంవత్సరములో మహత్తర కృషి చేశారు.

ఆచార్య రంగాగారి మరొక ప్రత్యేకత దేశంలోని రాష్ట్రాల పబ్లిక్ ఎకౌంట్సు కమిటీల అధ్యక్షులకు అధ్యక్షుడుగా పనిచేశారు. అతి స్వల్ప వ్యవధిలో 21 తీర్మానాలను నెగ్గించగలిగారు. ఇది రికార్డు నంబరు. రాబోయే పది సంవత్సరాలలో కూడా అన్ని తీర్మానాలను యెవరు చేయించలేరని నేను ఖాయంగా చెప్పగలను. ఎందుచేతనంటే రంగాగారిలాగా అంతటి శక్తిని, ఉత్సాహాన్ని, చొరవను, సమస్య

స్యలను సంగ్రహంగా తెమల్చ గలగడం, మరెవ్వరిచేత కాకపోవచ్చు. ప్రధానమంత్రినికూడా ఆచార్య రంగా లోక్కొచ్చారు. ప్రధానికూడా కొన్ని అభిప్రాయాలు యిచ్చారనుకోండి. మా సమావేశంలో చేసిన ఈ 21 తీర్మానాలు చరిత్రాత్మక మయినవి. దాని ఘనత ఆచార్య రంగాకే దక్కుతుంది. వారి సామర్థ్యము అద్భుతమయినది.

ఆచార్య రంగాతో మనమంతా ఒక కుటుంబముగా నడుచుకున్నాము. రాజకీయవేత్తల నడుమ స్వేచ్ఛగా మాట్లాడడానికి అంతగా వీలుండదు. కాని ఆచార్యరంగా సమక్షంలో మనకు పూర్తి స్వేచ్ఛ, చనువు, ఉన్నందున మనసులో ఉన్నదానిని దాచుకోకుండా మనము బయటపెట్టుకోగలుగు తున్నాము. అనేక సంవత్సరాలుగా ఉన్న నా అనుభవంద్వారా ఇదంతా చెప్పాను. నేను ముందుగా చెప్పినట్లు ఇది ఆచార్య రంగాగారితో మనకున్న సంబంధాలను గుర్తుంచుకొనడానికి జరిగిన సందర్భము. ఆచార్య రంగా మనలో ఉన్నారు; మనం వారితో ఉన్నాము; ముందుముందు కూడా మన సంబంధాలు ఇలాగా ఉంటాయి.

# వారి రైతాంగ విద్యాలయాలు

## శ్రీ నన్నపనేని వెంకటసుబ్బయ్య

ఇరవై అయిదు సంవత్సరాల నాటి మాట. దేశంలో అంటరానితనాన్ని నిర్మూలింప జేయటానికి గాంధీజీ భారతదేశం మంతటా పర్యటన సాగిస్తున్న రోజులు. అదే సందర్భంలో ఆంధ్ర దేశానికి అరుదెంచిన గాంధీజీ 1933 డిశంబరు 23వ తేదీన నిడుబ్రోలులో జరిగిన బ్రహ్మాండమైన సభలో రామానీడు విద్యాలయాన్ని - రంగా గ్రంథాలయాన్ని ప్రారంభించి ఆశీర్వదించారు. ఆనాటినుండి యీ విద్యాలయం ఆంధ్ర దేశానికే గాక-అఖిల భారతావనికే తన సేవా కార్యక్రమాలద్వారా మార్గదర్శకమయింది. ఈ భవనాలను విద్యాలయంగా మార్పుచేయడానికి ఒక ప్రత్యేకోద్దేశ్యం వుంది. 1922 ప్రాంతంలో విద్యాభ్యాసంకోసం రంగాజీ ఇంగ్లండులో వున్న సమయం. బ్రిటిషు కార్మిక పక్షం, తమ కార్యకర్తలకు శిక్షణ యిచ్చేదానికి రాజకీయ పాఠశాలలునడుపుతుండేవారు. ఒకసంవత్సరం రంగాజీ ఆపాఠశాలలోవిద్యార్థి. మరుసంవత్సరం అదే పాఠశాలలో వుపన్యాసకులు. అప్పట్లో ఆ పాఠశాలను నడుపుతున్న తీరు - చెప్పే పాఠాలు - ఇచ్చే శిక్షణ - రంగాజీ నాకర్షించాయి. స్వదేశానికి తిరిగి వచ్చిన తర్వాత అదే పద్ధతిలో ఒక గ్రామీణ విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయాలనే విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయాలనే ఆలోచన రంగాజీకి ఆనాడే కలిగింది. అప్పటినుండి యీ ఆలోచన కొకరూపం యివ్వడానికి కృషి ప్రారంభించారు. కాని ఎవరూ వుత్సాహం చూపలేదు. కలిసిరాలేదు. చివరకు అదృష్టవశాత్తు నిడుబ్రోలులో కీ॥ శే॥ పాములపాటి వెంకటరమణయ్య, రామస్వామి, అంకినీడు గారలు నిర్మించిన భవనాలు - స్థలం - భూములు - విద్యాలయంగా గాంధీజీ ప్రారంభించడంతో భవనాలు సిద్ధించాయి. వేల రూపాయలు ఖరీదు చేసే తన

స్వంత గ్రంథాలయాన్ని సార్వజనిక గ్రంథాలయంగా మార్చి అందులో వుంచారు.

## రైతాంగ విద్యాలయం

1934 వ సంవత్సరం. అప్పటికి రైతు వుద్యమం బలాన్ని సంతరించుకుంటున్నది. కాని వ్యతిరేకత హెచ్చుగావుంది. యిటు జాతీయ వాదులు - అటు కమ్యూనిస్టులు రైతులకు ప్రత్యేక సంఘాలుండరాదంటూ వ్యతిరేకిస్తున్నారు. ఆ పరిస్థితుల్లో తన స్వంతకాళ్ళపై నిలబడి-తనకు తోడునీడగావున్న కొద్దిమంది అనుచరుల సహకారంతో వుద్యమాన్ని నడపవలసి వస్తున్నది. కాని వుద్యమం త్వరగా బలపడి-పెంపొందాలంటే యింకా హెచ్చుమంది - కార్యకర్తలు వుండాల్సిన అవసరం కనపడింది. 1934 వ సంవత్సరం ఏప్రియల్ 12 వ తేదీన యీ కార్యకర్తల తయారు చేయడానికి ఆంధ్ర రైతాంగ విద్యాలయం పేరుతో - ఒక విద్యాలయాన్ని యీ భవనాలలోనే ఏర్పాటు చేశారు. భారతదేశంలో యిలాంటి పాఠశాల లేర్పడడానికి యిదే మొదలు. యీ విద్యాలయానికి రంగాగారే ప్రిన్సిపాలు. శ్రీ లక్ష్మీనారాయణగారు అధ్యాపకులు. యీ విద్యాలయ ప్రారంభోత్సవానికి కీ॥ శే॥ దేశభక్త వెంకటప్పయ్య పంతులుగారు అధ్యక్షత వహించారు. అప్పట్లో "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" పత్రికా సంపాదకులుగా నున్న శ్రీ కె. సంతానంగారు ప్రారంభకులు. విద్యాలయానికి ఆరు జిల్లాలనుండి 30 మంది విద్యార్థులు వచ్చారు. విద్యాలయం మాసం రోజులు జరిగింది. ఆంధ్రదేశంలో ఆయావిషయాలలో ప్రవీణులైన వారు వచ్చి వుపన్యాసా లిచ్చారు. విద్యాలయ శిక్షణ ఒకవిశిష్ట పద్ధతిలో సాగింది.

1935 ఏప్రిల్ 17-వ తేదీన విద్యాలయ రెండవ వార్షిక సమావేశం నిడుబ్రోలులోనే ప్రారంభమయింది. ఆనాటి సభకు కీ॥ శే॥ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు అధ్యక్షులు. యీ సంవత్సరం 35 మంది విద్యార్థులు అన్నిజిల్లాలనుండి వచ్చారు. యిదిగూడ

మాసంరోజులు నడచింది. మూడవ విద్యాలయం 1936 సంవత్సరం మే 15 తేదీన ప్రారంభమైంది. అదికూడ నిడుబ్రోలులోనే శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు ప్రారంభించారు. యీసారి విద్యాలయానికి 40 మంది విద్యార్థులు హాజరయ్యారు.

1937 మే 1వ తేదీన నాల్గవ విద్యాలయం ప్రారంభమయింది. యీ సంవత్సరం ప్రారంభోత్సవం యీ విద్యాలయంలో అంతకు ముందు శిక్షణ పొందిన సదాశివన్, ఓబులరెడ్డిగార్లు జరిపారు. అన్ని ప్రాంతాలనుండి 45 మంది విద్యార్థులు వచ్చిచేరారు. మాసం రోజులు జయప్రదంగా సాగింది.

అదే సంవత్సరం ప్రత్యేకంగా రాయలసీమవారి కోసం రాయలసీమ రైతాంగ విద్యాలయం డిశంబరు 20 వ తేదీన కర్నూలుజిల్లా గిద్దలూరులో జరిగింది. శ్రీమతి భారతీదేవిగారు అధ్యక్షత వహించారు. ఓబులరెడ్డిగారు ప్రిన్సిపాల్‌గా వున్నారు. విద్యాలయంలో 60 మంది విద్యార్థులు శిక్షణ పొందారు. యీ విద్యాలయం పట్ల వ్యతిరేక ప్రచారం హెచ్చుగానే వుంది. ఐనా ఆగలేదు. కాలం గడచినకొద్దీ – ప్రజలు – యువకులు – యీ విద్యాలయ ప్రాముఖ్యాన్ని గమనించారు. వుపయోగాన్ని గుర్తించారు. రోజురోజుకు హెచ్చుమంది యువకులను ఆకర్షిస్తున్నది. యిలా ప్రతి సంవత్సరం జరుగుచున్న విద్యాలయాలలో శిక్షణ పొందినవారి సంఖ్య పెరిగిపోవడంతోపాటు– విద్యాలయాన్ని తమ ప్రాంతంలో ఏర్పాటు చేయాలంటూ ఆహ్వానాలు విపరీతంగా రాసాగాయి.

ప్రతి సంవత్సరం విద్యాలయాన్ని ఒకేచోట నడిపినందువల్ల దూరప్రాంతాలనుండి వచ్చేవారికి యిబ్బంది అవుతున్నది. అంతేకాదు – అంత ఖర్చులు భరించి రాలేనివారికి అవకాశం లేకుండాపోతున్నది. వేర్వేరు ప్రాంతాలలో నడిపినందువల్ల ఆ ప్రాంతాలలో యింకా హెచ్చుమంది శిక్షణపొందడానికవకాశం కల్పించిన

వార మవుతామనే ఆలోచన కలిగింది. అక్కడనుండి విద్యాలయాన్ని వేర్వేరు జిల్లాలలో–వివిధ ప్రాంతాలలో జరుప నిశ్చయించారు.

## మదనపల్లి విద్యాలయం

ఈ నిర్ణయం ఫలితంగానే 1938వ సంవత్సరం మే 1వ తేదీన ప్రారంభమైన అయిదవ విద్యాలయం ఈ సారి నిడుబ్రోలులో గాక చిత్తూరుజిల్లా మదనపల్లిలో జరిగింది. మదనపల్లి అంటే "ఆంధ్రా ఊటి". ప్రకృతి సుందరి బాగా సింగారించుకొని కనపడేచోటుచేరువనే ఆరోగ్యవరం. ప్రక్కన ఎత్తైనకొండలు – పరిసరాల్లో పొలాలు. ఫ్యూరి వెలుపల మామిడితోట మధ్యలోనున్న బంగాళాలో జరిగింది. 75 మంది విద్యార్థులు వచ్చారు. శ్రీ॥ శ్రీ॥ న్యాయపతి నారాయణ మూర్తిగారు అధ్యక్షత వహించారు. ఆంధ్ర జిల్లాలనుండేగాక – మైసూరు – బెంగుళూరు – వేలూరు – కోయంబత్తూరులనుండి గూడ ఈ విద్యాలయానికి విద్యార్థులు వచ్చారు. విద్యాలయం నెలరోజులు జరిగింది.

## తునికిపాడు విద్యాలయం

మరు సంవత్సరం విద్యాలయం మరొక ప్రాంతంలో జరపాలను కున్నారు. కృష్ణాజిల్లా – తిరువూరు తాలూకా తునికిపాడులో జరిపితే యిటు ఆంధ్రజిల్లాలకు – అటు తెలంగాణవారికి అందుబాటుగా వుంటుందనుకున్నారు. ఆ సంవత్సర సమావేశం 1949 మే లో తునికి పాడులో జరిగింది. యీ విద్యాలయానికి గూడ బాగా విద్యార్థులు వచ్చారు. తెలంగాణావారు గూడా వున్నారు వచ్చినవారిలో. విపరీత మైన ఎండలు – గాడ్పులు తట్టుకోలేనంత తీవ్రంగా వున్నాయి. అయినా నెలరోజులు విద్యాలయం సాగింది. యింతవరకు రంగాగారు లేకుండా ఏ విద్యాలయమూ జరుగలేదు. విద్యాలయం జరిగిన మాసం రోజులు వారు విద్యాలయంలోనే వుండి శిక్షణ యిచ్చేవారు.

## ఇడుపులపాడు విద్యాలయం

1940లో దేశంలో రాజకీయ వాతావరణం వుద్రిక్తంగావుంది. అప్పటికప్పుడే జాతీయవాదులలో తీవ్రవాదు లనుకొన్న వారి ఏరివేత ప్రారంభమయింది. ఆ పరిస్థితులలో ఈ సంవత్సరం విద్యాలయం బాపట్ల తాలూకా ఇడుపులపాడులో జరుపడానికి నిశ్చయమైంది. విద్యాలయాన్ని ప్రారంభించడానికి సుభాష్‌బాబు అంగీకరించారు. కాని ప్రభుత్వం వారిని అంతకుముందే అరెస్టు చేసింది. వారంరోజులకు విద్యాలయం ప్రారంభం కానున్న సమయంలో రంగాగారిని గూడ ప్రభుత్వం నిర్బంధించింది. దాంతో విద్యాలయం ఆగిపోతుందనుకున్నారు చాలామంది. కాని రంగాగారి శిష్యబృందం ప్రభుత్వచర్యనొక సవాలుగా తీసుకుంది. రంగాజీ లేకపోయినా విద్యాలయం సాగిపోవలసిందేనని పట్టుబట్టారు. ముఖ్యులంతా ఆ నెలరోజులు ఇడుపులపాడులోనే మకాంపెట్టి – పట్టుదలతో – వుత్సాహంతో విద్యాలయాన్ని సాగించారు. విద్యాలయం 1940 ఏప్రియల్ 9 వ తేదీన ప్రారంభమయింది. ఓబులరెడ్డిగా రధ్యక్షులు. లచ్చన్నగారు ప్రారంభోత్సవం చేశారు. విద్యాలయానికి 100 మంది విద్యార్థులు వచ్చారు. విద్యాలయం నెలరోజులు జరిగింది. యీ సంవత్సరం విద్యాలయ విద్యార్థులకు డ్రిల్లుగూడ ఏర్పాటుచేశారు. కాని కొద్దిరోజులలోనే డ్రిల్లునేర్పే శ్రీ కాకదాల కామేశ్వరరావుగారిని విద్యాలయంనుండే కైదున్యాగా తీసుక వెళ్లారు.

## చెన్నూరువిద్యాలయం

1941 రంగాజీ యింకా జైలులోనే వున్నారు. అయినా తలపెట్టిన కార్యక్రమం ఆగిపోవడానికి వీలులేదనే దృఢనిశ్చయంతో వున్నారు శిష్యబృందం. ఆ సంవత్సరం విద్యాలయం కడపజిల్లా చెన్నూరులో జరిగింది. పెన్నానదీ తీరాన – మామిడితోటలో – విద్యాలయంకోసం డేరాలు వేశారు. ఆ డేరాలవల్ల ఆ తోట యుద్ధభూమి అనిపించింది.

ఒక విధంగా అది నిజమే. కార్మిక కర్షక రాజ్య స్థాపనకు అవసరమైన సమరాన్ని సాగించే – సైనిక దళాలుగదా యిక్కడ తయారవుతున్నది! ఈ సంవత్సరం విద్యాలయానికి 70 మంది విద్యార్థులు వచ్చారు. ఆర్. నరసింహారెడ్డిగారు అధ్యాపకులు. విద్యాలయం నెలరోజులు సాగింది.

ఇంతలో మహాత్ముడు అంతిమ పోరాటానికి పిలుపు యిచ్చాడు. క్విట్ ఇండియా వుద్యమం ప్రారంభం కాబోతున్నది. రంగాగారిని, వారి శిష్యులను – ప్రభుత్వం నిర్బంధలో వుంచింది. ఏ కొద్దిమందో బయటవున్నా, ఏమిచేయటానికీ అవకాశంలేని సమయం. అందువల్ల విద్యాలయాన్ని సాగించడానికి అంతరాయం కలిగింది. 1944 సెప్టెంబరు వరకు అదేస్థితి. ఆ సంవత్సరం అక్టోబరులో రంగాగారు విడుదలై వచ్చారు.

1945 వ సంవత్సరం మేలో – తిరిగి విద్యాలయం నిడుబ్రోలులోనే జరిగింది. ఇదివరకు జరిగిన అన్ని విద్యాలయాలు ఒక ఎత్తు, యిది ఒక యెత్తు. అప్పటికి యీ విద్యాలయ కీర్తి ప్రతిష్టలు తారాపథాన్నందుకున్నాయి. ఆంధ్ర దేశంలో ఏమూలచూచినా విద్యాలయంలో శిక్షణపొందినవారు వందలకొలదిగా వున్నారు. అప్పుడే జైళ్ళనుంచి బయటపడ్డారు. యువకులలో రాజకీయ చైతన్యం పొంగులువారుచున్న రోజులు. అలాంటి సమయంలో ఈ విద్యాలయం జరగటం. ఆ సంవత్సరం విద్యాలయానికి 225 మంది విద్యార్థులు వచ్చారు. యీ విద్యాలయంగూడ మాసంరోజులు నడిచింది. 1946 లో కృష్ణాజిల్లా దివి తాలూకా అవనిగడ్డలో జరిగింది.

1947 – రంగాగారు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా ఉన్న రోజులు. ఆ సంవత్సరము విద్యాలయం చిత్తూరు జిల్లా దిగువ మాఘం గ్రామ సమీపంలో శివగిరి వద్ద జరిగింది. విద్యాలయం జరిగేచోటు – వూరికి దూరంగా – కొండలమీద ప్రశాంతంగా వుంది. ఆ ప్రక్కనే జలజల సాగిపోతున్న సెలయేరు – నారికేళ సలిలాలను మించిన నీరు.

నిజంగా విద్యాలయానికి అనువైనచోటు. విద్యాలయానికి శ్రీ తిమ్మా రెడ్డిగారు అధ్యాపకులు. వందమంది విద్యార్థులు హాజరయ్యారు.

## పలాసాలో

అదే సంవత్సరం శ్రీకాకుళం జిల్లా పలాసాలో సేవాదళ ఆఫీసర్ల శిక్షణ శిబిరం. ఇది కేవలం విద్యాలయాల్లో లాగా పాఠాలు చెప్ప డానికే గాకుండా – సేవాదళ శిక్షణ గూడ యివ్వబడింది. దాదాపు వందమంది శిక్షణ పొందారు. యిది ఆరువారాలపాటు జరిగింది. యిక్కడ శిక్షణపొందిన సేవాదళంవారు – మద్రాసులో "మార్చి" చేస్తుంటే చూచిన మిలిటరీ ఆఫీసర్లు ఆశ్చర్యపడ్డారు. సాంకేతికాలు చెప్పకుండా యింత బాగా మార్చి చేయడం – మిలిటరీ శిక్షణ పొందిన వారు గూడ చేయలేరని ఒక మిలిటరీ ఆఫీసరు అన్నాడు. వీరికి సేవా దళ శిక్షణతోపాటు రాజకీయాలుగూడ చెప్పారు. ఇక్కడ శిక్షణ పొందిన సేవాదళ అఫీసర్లే – తర్వాత సంవత్సరాలలో ఆంధ్ర దేశంలో వివిధ జిల్లాలలో – గ్రామాలలో సేవాదళ క్యాంపులు పెట్టి – యువ కులకు శిక్షణయిచ్చి – దాదాపు మూడు వేలమంది సుశిక్షితులైన – యువ సైనికులను తయారు చేశారు.

1948 లో ప్రత్యేకంగా హైదరాబాదు వారికోసం ఒక విద్యా లయం బెజవాడలో జరిగింది. అదే సంవత్సరం – సేవాదళ క్యాంపులు ఒకటి – బెజవాడలోనూ – మరొకటి చిలకలూరిపేటలోనూ జరిగాయి. ఖమ్మంమెట్టులో ఒక విద్యాలయం నడిపారు. అయితే ఇవి కొద్దికాలం మాత్రమే నడిపారు.

1949 లో గూడ బెజవాడలో వారంరోజులపాటు విద్యాలయం జరిగింది. 1951 లో నిడుబ్రోలులో జరిగింది. యివి రెండూగూడా కొద్దికాలం నడచినవే.

1952 విద్యాలయం కృష్ణాజిల్లా చల్లపల్లిలో జరిగింది. సుమారు 200 మంది విద్యార్థులు వచ్చారు. విద్యాలయం చాలా జయప్రదంగా జరిగింది.

## తిరుత్తని విద్యాలయం

1953 సంవత్సరం విద్యాలయం – చిత్తూరుజిల్లా తిరుత్తనిలో జరిగింది. దాదాపు వందమంది విద్యార్థులు వచ్చారు. యిదిగూడ పెద్ద యెత్తున జరిగింది.

యిదిగాక స్థానికంగా – తాలూకా స్థాయిలోనూ, జిల్లా స్థాయిలోను విశాఖపట్నం జిల్లాలో – శ్రీకాకుళం జిల్లా యిచ్ఛాపురం –గుంటూరుజిల్లా దుద్దుకూరు – రామచంద్రపురం తాలూకా వెలుగతోడు గ్రామాలలో విద్యాలయాలు కొన్నిరోజులపాటు జరిపారు.

1959 జనవరిలో నిడుబ్రోలులో మూడురోజులు ఘోరం జరిగింది. ఇది విద్యాలయంగా గాక – యీనాడు రైతులోకాన్ని ఎదుర్కొంటున్న సహకార వ్యవసాయంలాంటి సమస్యలపై ముఖ్యులంతా ఒక చర్చ సాగించారు. యివిగాక – 1952 నుండి సేవాదళ క్యాంపులు - భారత్ సేవక్ సమాజ క్యాంపులు సాగించారు. యీ విద్యాలయాల ప్రాశస్త్యాన్ని గమనించి – పంజాబు – యు. పి, బెంగాలు – కర్నాటక రాష్ట్రాలలో రైతాంగ విద్యాలయాలు స్థాపించబడినాయి.

## నిజామాబాదు విద్యాలయం

1961 ఫిబ్రవరి 20 నుండి నిజామాబాదులో మూడురోజులపాటు రైతాంగ పాఠశాల నిర్వహించడం జరిగింది. రంగాజీ స్వతంత్ర పార్టీ ప్రధానాశయాలను గురించి వివరించారు. ఈ పాఠశాల తెలంగాణా రైతులోకంలో చైతన్యత మేల్కొలిపింది.

## పౌరశిక్షణ కళాశాలలు

ఇంతటితో ఆగలేదు. యువజన విద్యార్థి కాంగ్రెసుల ఆధ్వర్యాన బెంగాలు, బీహారు, బొంబాయి, పంజాబు, యు. పి. రాష్ట్రాలలో యువజనులు విద్యార్థులకొరకు పౌర శిక్షణ కళాశాలల పేరుతో విద్యాలయాలు నడిపారు. ఈ సందర్భంలో రంగా గారికి ప్రస్తుతం

కేంద్రప్రభుత్వ ఆహారమంత్రిగా నున్న శ్రీ యస్. కె. పాటిల్‌గారు తోడ్పడ్డారు.

రైతాంగ విద్యాలయం యీ విధంగా రోజురోజుకు క్రొత్త బలాన్ని సంతరించుకుంటూ - అభివృద్ధి చెందుతూ తన సేవాకార్య క్రమాల పరిధిని విస్తృత పరచుకుంటూ వచ్చింది. వివిధ ప్రజా రంగాలకు - సుశిక్షితులైన సేవకులను తయారు చేసి అందించింది. భారత దేశానికి మార్గదర్శకమై - ఆంధ్ర దేశానికి కీర్తి గడించిన మహా ప్రతిష్టాపనంగా పేరుపొందింది. రైతాంగ విజ్ఞానాన్ని దేశం నాలుగు చెరగులకేగాక - విదేశాలకు సైతం వెదజల్లింది. ఎంతోమంది యువకులు - ఈ విద్యాలయం నుండి - వుత్తేజాన్ని - వుత్సాహాన్ని పొందారు.

ప్రజాసేవ చేయడానికి ఎం. ఏ., బి. ఏ. లు చదివినవారే కావాలంటే తగినంతమంది దొరకరు. అందువల్ల దేశంలో వివిధ ప్రాంతాలకు - మతాలకు - తరగతులకు చెందిన - విభిన్న తత్వాలుగల సాధారణ రైతుకూలీ యువకుల నొకచోట చేర్చి, వారికి రైతాంగ తత్వము, ధోరణి, క్రమశిక్షణ, కట్టుబాటు, రాజకీయ సాంఘికార్థిక విషయాలలో విజ్ఞానం కలిగించి, సమర్థులయిన- ప్రజల మనస్తత్వాలను అర్థంచేసుకొని, వుద్యమాలను నడపడానికవసరమైన శక్తి - యుక్తులు గలిగిన కార్మిక కర్షక సేవకులుగా తయారు చేయడమే యీ విద్యాలయ ఆదర్శం.

విద్యాలయానికి స్త్రీలు, పురుషులు, యువకులు, వృద్ధులుగూడ వచ్చేవారు. స్థానిక రైతుసంఘాలు శిఫార్సుచేసిన వారిని మాత్రము విద్యార్థులుగా చేర్చుకునేవారు.

## సిలబస్

విద్యాలయంలో దేశదేశాల స్వాతంత్ర్యోద్యమాల చరిత్ర-తత్వం నానా దేశ రాజ్యాంగ విధానాలు, కార్మిక కర్షకోద్యమాల చరిత్రలు,

వివిధ ఇజములు – వాటిమధ్యగల తేడాలు, ప్రపంచ చరిత్ర, మారక విధానం, సహకారోద్యమం, జర్నలిజం, పశువైద్యం, భూమిశిస్తు విధానం, వుద్యమ నిర్మాణం, ప్రచార పద్ధతులు మొదలైన అన్ని విషయాలు బోధించేవారు.

భారతదేశం నలుమూలల నుండి ఆయా విషయాలలో ఆరితేరిన పండితులు, ప్రముఖులు వచ్చి విద్యార్థులకు వుపన్యాసాలిచ్చేవారు. అలా వచ్చినవారిలో ప్రొఫెసరు మాల్కొని, డాక్టరు కుమారప్ప, ఆర్యనాయగం, జయప్రకాశ్ నారాయణ్, అజయకుమార్ ఘోష్, ఇందులాల్ యాగ్నిక్, డాక్టరు పట్టాభి, కీ. శే. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగార్ల వంటి ప్రముఖులున్నారు. ప్రొఫెసరు కె. టి. షా యీవిద్యాలయానికి గౌరవ ప్రిన్సిపాలుగా వున్నారు. యీ విద్యాలయాన్ని సందర్శించిన అంతర్జాతీయ ప్రముఖులలో హంగరీదేశ మాజీ ముఖ్యమంత్రి ఫెరంకి నాగే, డిమిట్రాన్, డాక్టరు రాండు మొదలైన ప్రముఖులున్నారు.

విద్యాలయంలో కేవలం రాజకీయ విషయాలు బోధించడమే గాదు–వ్యవసాయం యితర దేశాలలో యెలా అభివృద్ధి చెందిందో అందుకు వారు అవలంబించిన నవీన వ్యవసాయ పద్ధతులు, వారు పశువుల పెంచేవిధానం, పారిశుద్ధ్యంలాంటి విషయాలను మాజిక్ లాంతరు సహాయముతో తెలియజెప్పేవారు. వివిధ సమస్యలపట్ల రైతాంగ దృక్పథాన్ని వివరించేవారు. బుర్రకథలు, హరికథలు, రైతాంగ భజనావళి పాటలు, పద్యాలు ద్వారా కార్మిక – కర్షక ప్రబోధం సాగించేవారు.

## చర్చావేదిక

సాధారణంగా వారానికి నాల్గురోజులు రాత్రిపూట చర్చా వేదిక ఏర్పాటుచేసి, వివిధ విషయాలపై చర్చలు సాగించేవారు. ఆరోజు ప్రతివిద్యార్థి, ఆనాటి సమస్యలమీద, అనుకూలంగానో, ప్రతికూలంగానో మాట్లాడి తీరవలసిందే. యిలా చర్చఅంతా పూర్తి

అయినాక, చర్చాసందర్భంలో ఎవరెవరు, మాట్లాడిన దానిలో, వివిధ అభిప్రాయాలు పొరపాటో వివరించేవారు. ఈ విధంగా ఈ చర్చలు – విద్యార్థులకేగాక, వినేవారికిగూడ యెంతో విజ్ఞాన దాయకంగా–వుండేవి. ప్రజారంగంలో పనిచేయగోరేవారు ధైర్యంగా ప్రజలముందు నిలచి – ఉపన్యసించడాని కవసరమైన మనోబలాన్ని పొందడానికి ఈ చర్చలు విద్యార్థుల కుపకరించేవి.

## నమూనా పార్లమెంటు

ఈ విద్యాలయంలో పార్లమెంటరీ వ్యవహారంలో విద్యార్థులకు శిక్షణ యిచ్చేందుకు నమూనా పార్లమెంటు నడుపబడేది. యిది ఈ విద్యాలయంలో ఒక ప్రత్యేకా కర్షణ. ముక్కుపచ్చలారని ముద్దు బిడ్డలు – మంత్రులుగా – ప్రతిపక్ష నాయకులుగా – సభ్యులుగా – బడ్జెటులు బిల్లులు ప్రవేశపెట్టి, వాటిపై ప్రసంగాలు సాగిస్తుంటే చూడముచ్చటగా వుండేది. ఈపార్లమెంటు ఎంత సహజ ధోరణిలో నడిచేదో తెలుసుకోడానికి – ఈ సందర్భంలో – ఒక వుదాహరణ చెపుతాను.

అది 1940 వ సంవత్సరం విద్యాలయం ఇడుపులపాడులో జరుగుతున్నది. ఒకనాటి రాత్రి ఈ నమూనా పార్లమెంటు ఏర్పాటు చేశాం. విద్యాలయానికి ప్రిన్సిపాలుగావున్న స్వర్గీయ డి. యస్. వల్లభరావుగారే ఆనాటి పార్లమెంటుకు అధ్యక్షులు గూడా; శ్రీ సి. బాలిరెడ్డి ప్రధాన మంత్రి, మరికొంతమంది మంత్రులు. స్వర్గీయ పుల్లెల శ్యామసుందరరావుగారు ప్రధాన ప్రతిపక్షనాయకులు. ప్రశ్నలు –సమాధానాలు మంత్రివర్గంబడ్జెటు ప్రవేశపెట్టడం – దానిమీద ప్రతి పక్షాల నాయకులు, ఉపన్యాసాలు – విమర్శలు చేయడం జరిగింది. ఏదో సందర్భాన్ని పురస్కరించుకుని ప్రతి పక్షాలవారు "వాకౌటు" చేసి. బయట ప్రదర్శనాలు చేశారు. ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ప్రదర్శనాల తర్వాత బహిరంగ సభ – ఆ బహిరంగ సభలో ప్రభుత్వ విధానాలను దుయ్యబట్టుతూ ప్రతిపక్షాల నాయకులు ఉప

న్యాసాలు చేశారు. ఆనాటి శ్యామసుందరరావుగారి వుపన్యాసం - యిప్పటికీ మరువలేం. అదే వారి ఆఖరి వుపవ్యాసంగూడ. యిలా జరుగుతూవుంటే - వూరిలోని ప్రజలు - విద్యాలయం వారిలో రెండు పార్టీలు పడి - తగాదా పడుతున్నారని భావించి మూగిపోయారు. యిది తగాదా గాదు - పోట్లాటలు కావు, పార్లమెంటు ఎలా వుంటుందో - దాని చర్చల తీరు - నిబంధనలు, సాంప్రదాయాలు వగైరా విషయాలు - విద్యార్థులకు తెలియజేసి - పార్లమెంటరీ వ్యవహారాలలో వారికి శిక్షణ యివ్వడాని కేర్పాటు చేయబడ్డ - నమూనా పార్లమెంటు అని చెప్పేసరికి విస్తుపోయారు. ఈ పార్లమెంటు సమావేశాలకు, చర్చా వేదికలకు, విద్యార్థులేగాక, గ్రామంలోని ప్రజలు వందలకొలదిగా హాజరయ్యేవారు. ఈ కార్యక్రమాలు, అంతసహజంగా, వుపయోగకరంగా వుండేవి. యిలా ప్రజారంగంలో పనిచేసే వారి కవసరమైన అన్ని విషయాలలోను చక్కని తర్ఫీదు ఇవ్వబడేది. ముఖ్యంగా రైతులకు అనుదిన సేవ చేయాలనే తత్పరతను విద్యార్థులలో కలిగించ ప్రయత్నించేవారు.

## విద్యార్థులు

ఈ సందర్భంలో విద్యాలయ విద్యార్థులను గురించి ఒక్కమాట చెప్పాలి. యీ విద్యాలయానికి వచ్చిన విద్యార్థులలో సోమరితనం అనేది మచ్చుకుకూడ కన్పడేదిగాదు. వీరిలో ఎవరిని కదిలించినా వుత్సాహం, వుద్వేగం, విషయ గ్రహణ పిపాస, కష్టసహిష్ణుత తొణికిసలాడుతుండేవి. వివిధ మతాలు, కులాలకు చెందినవారు, ఎలాంటి భేదభావంలేక "భాయీ - భాయి" అనుకుంటూ, సోదరత్వాన్ని వెల్లడి చేస్తుండేవారు. ఎండలు మండించివేస్తున్నా ఆ రోహిణీకార్తె ఎండలనుగూడ భరించి, పట్టుదలతో, తమ విద్యా సముపార్జనా వ్యాసంగాన్ని సాగించేవారు, వారు ప్రదర్శించే వుత్సాహంచూస్తే నిద్రాణులైయున్న ప్రజానీకాన్ని ఈ విద్యాలయం ఎలా కార్యార్థులనుజేసి, కార్యసాధనకు పంపుతూవుందో స్పష్టపడేది. ఒక్కొక్క యువకుడు, ఒక్కొక్క నాయకుడై భావిభారత రాజకీయ రంగంలో

గొప్ప స్థానాన్ని ఆక్రమిస్తారనే ఆశకలిగేది. ప్రతి సంవత్సరం చివర రోజున శిక్షణ పొందినవారికి యోగ్యతాపత్రాలు యివ్వాబడేవి.

## విద్యాలయం సాధించే దేమిటి ?

ఇలా యీ విద్యాలయం పాతికేళ్ళ పర్యంతం యెంతోమంది యువకులను ఆంధ్రుల సేవ కందించింది. వివిధ వృత్తులకు సంబంధించిన విభిన్న తత్వాలు గలవారిని యీవిధంగా తన శిక్షణద్వారా - వారేవృత్తికి సంబంధించిన వారైనా - మిగతా వృత్తుల - తరగతుల వారి పట్ల గూడ - సుహృద్భావం - సామరస్యం కలిగించి - అందరిని ఒక్క త్రాటిపై నడిపించగల భావైక్యతను కలిగించింది. విశ్వవిద్యాలయాలలో - మూడేసి నాలుగేసి సంవత్సరాలు గ్రంథ పరిశీలన చేసినవారికే గాని సామాన్యంగా పట్టుబడని గొప్ప విషయాలు మాతృభాషలో, సునాయాసంగా నేర్చుకోడానికి, సాధారణ రైతు బిడ్డలకు, అవకాశం కల్పించింది.

ఈనాడు ఆంధ్ర దేశంలో ముందంజవేస్తున్న ఉద్యమాలన్నిటికి, యీ విద్యాలయంలో శిక్షణ పొందినవారే మూలకందాలుగా, సేవకులుగా, నాయకులుగా, తల మానికముగా ఉన్నారు. ఆంధ్ర దేశంలోని అన్ని ప్రజాసంస్థలలోనూ, ఉద్యమాలలోనూ ప్రముఖులుగా వున్నారు. కమ్యూనిస్టుపార్టీ, సోషలిస్టుపార్టీ, కాంగ్రెసు - ఒకటేమిటి ? అన్ని పార్టీలలోను, యీ విద్యాలయ విద్యార్థులు బహుముఖ ప్రజ్ఞను ప్రదర్శించి పనిచేస్తున్నారు. సేవకులుగా, సారథులుగా, నాయకులుగా గణుతి కెక్కారు. కేవలం శాసనసభ్యులుగానే గాదు, మంత్రులుగా - మరెన్నో విధాల గణనీయమైన సేవను చేశారు. చేస్తున్నారు. ఇందుకు మాజీమంత్రులు ఓబులరెడ్డి, లచ్చన్న, ఒకప్పుడు మనరాష్ట్ర వ్యవసాయమంత్రిగావున్న శ్రీతిమ్మారెడ్డి, పార్లమెంటు సభ్యుడు బాలిరెడ్డి, సోషలిస్టు నాయకుడు ఆర్. నరసింహారెడ్డి, కమ్యూనిస్టు నాయకుడు నూకినేని బసవపున్నయ్య, స్వర్గీయ డి.యస్. వల్లభరావుగారలే తార్కాణం. మచ్చుకు కొద్దిమంది పేర్లు మాత్రమే

యిక్కడ వుదహరించాను. కాని యిలా తమ సేవావ్రతానుష్ఠానం ద్వారా తమకు విద్యాలయంలో యిచ్చిన యోగ్యతా పత్రాలకంటె సంపాదించుకొనగలిగినవారు మరెంతో మంది వున్నారు.

ఆంధ్ర దేశంలో వీరికి సంబంధంలేని వుద్యమం లేదంటే అతిశయోక్తిగాదు. వివిధ వుద్యమాలలో, కఱవు - కాటకాలు, రైతు రక్షణ యాత్రలు, రీసెటిల్‌మెంటు ఆందోళనలాంటి కర్షక నవచైతన్యోద్దీపనా కార్యక్రమాలలో వీరు చేసిన, చేస్తున్న ప్రజాసేవ ఆంధ్రలోకం మెరుగనిది కాదు. ఇంతెందుకు ఆంధ్ర రైతు ఉద్యమం అచిర కాలంలో అందరి దృష్టిని ఆకర్షించిందంటే భారత రైతు వుద్యమానికి గర్వకారణమైందంటే ఈ విద్యాలయంలో ఏ కొంచెం శిక్షణపొందిన యువకులు సాగించిన ప్రచార - ప్రబోధాలే కారణం. ఒక్క రైతు వుద్యమమేగాదు, కార్మికోద్యమమేగాదు, గ్రంథాలయోద్యమమే గాదు, అది వయోజన విద్యారంగం కానీయండి, స్వాతంత్ర్య రంగం కానీయండి మరే రంగం కానీయండి—అన్నిటిలోను, ఎవరికొందరు వుత్సాహంతో సేవచేస్తున్నారు. అద్వితీయమైన ప్రతిభను ప్రదర్శిస్తున్నారు. యీ ఒక్క రాష్ట్రంలోనే గాదు, వివిధ రాష్ట్రాలలో ఈ విద్యాలయ విద్యార్థులు, తమ సేవా కార్యక్రమాలు సాగించారు. సాగిస్తున్నారు సమర్థతతో, యీ ఒక్క చోటనేగాదు, జిల్లా జిల్లాలో, తాలూకా తాలూకాలో, ఈ విద్యాలయాలు వెలిశాయి. దేశమంతటా యిలాంటి విద్యాలయాల శిక్షణా పద్ధతులపట్ల ఆసక్తి, వుత్సాహం కలిగించి, మార్గదర్శకమైనది యీ విద్యాలయం. అడ్డంకులను, యిబ్బందులను ఎదుర్కొంటూ కాలం గడిచిన కొద్దీ యింకా యెక్కువమంది విద్యార్థులను ఆకర్షిస్తూవచ్చింది. రోజు రోజుకు క్రొత్తబలాన్ని సంతరించుకుంటూ, యిలా యీ విద్యాలయం ఇరవై అయిదు సంవత్సరాల పర్యంతం అవిచ్ఛిన్నంగా యావద్భారత రైతు వుద్యమాన్ని నడపడానికవసరమైన అభిమన్యులను సృష్టించింది. విద్యుదుత్పాదక కేంద్రం ఎలా అయితే విద్యుచ్ఛక్తిని తయారుచేసి దూరప్రాంతాలకు పంపి ఆ పరిసరాలను

శాంతివంతం చేస్తుందో అలాగే ఈ విద్యాలయం గూడ విజ్ఞాన వికాసాలు కలిగిన సుశిక్షితులైన సేవకులను తయారుచేసి, దేశమంతటా వెదజల్లింది. తన కాంతి పుంజాలను దశదిశలకు వ్యాపింపజేసింది. యీ విద్యాలయ శిక్షణావిధానం—ఆదర్శాలు — ప్రపంచ వయోజన విద్యా సంస్థల సమ్మేళనపు దృష్టినిగూడ ఆకర్షించాయి.

ఇలా దేశమంతటా వేర్వేరు ప్రాంతాలలో విద్యాలయాలు ఏర్పాటయినాయి, నడిచినాయి. కాని తర్వాత వచ్చిన రాజకీయ ఒడుదుడుకులు, యిబ్బందులువల్ల, వీటన్నిటిని గుదిగుచ్చి ఒకే విశ్వవిద్యాలయానికి వేర్వేరు శాఖలు లాగా వీటిని కేంద్రసంస్థకు అనుబంధించి దానికి ఒక శాశ్వతరూపం యివ్వడం సాధ్యమయిందిగాదు. అయినా ఆ ధోరణిలో చాలాదూరం ముందుకుసాగింది. చాలదు, యిక అదిగూడ చేయగలిగితే ఒక ఆదర్శప్రాయమైన, వుపయోగకరమైన గ్రామీణ విశ్వవిద్యాలయం, ప్రభుత్వ ప్రమేయంతో నిమిత్తం లేకుండా స్వశక్తిపై ఆధారపడి ఏర్పాటుచేసిన గౌరవం దక్కుతుంది. అంతేగాదు, యిలాంటి విద్యాలయాలు యింకా కావాలి. వీటికొక స్థిరరూపం యివ్వాలి. కొన్ని ప్రాంతాలలోనైనా ఇలాంటి విద్యాలయాలు శాశ్వతంగా జరిగే ఏర్పాటు చేయాలి. అప్పుడే గ్రామీణ ప్రజలకు కాపుదల, రక్షణ కలుగుతుంది. ఆ సుదినం కోసం ఎదురు చూద్దాం.

ఈనాడు యీ విద్యాలయం రజతోత్సవం చేసుకున్నందుకు ఆనందంగా వుంది. పాతస్మృతులు ఒక్కొక్కటే కళ్ళముందు కదిలి, హృదయంలో మెదిలి, హృదయం వుప్పొంగిపోతున్నది.

ఈ విద్యాలయం యింకా బలపడి యిలాంటి వుత్సవాలు ఎన్నో చేయించుకుంటూ ముమ్ముందుగూడ యింతకంటె హెచ్చుసేవ ప్రజలకు చేయ గల్గుతుందని ఆశిస్తున్నాను.

# సాగునీటి వనరులకు రంగాజీ కృషి

## శ్రీ సాగినేని వెంకయ్య

ఆచార్య రంగాగారనగానే అనేక ప్రజావుద్యమాలు ఒకటివెంట ఒకటి తలపుకు వస్తాయి. వారు రైతు వుద్యమం ప్రారంభించి, జమీందారీ విధానం రద్దుకు, జలాశయాల నిర్మాణముకు ధాన్యోత్పత్తి దారుల అవసరాలకు అనేకవిధాల కృషిచేసినారు. అటులనే వ్యవసాయ కూలీ సంఘాల కూలీ నిర్మాణమునకు చేనేత చర్మకారకాది అనేక వృత్తిసంఘాలు పెట్టినారు. తగిన సేవకులు దొరికిన సంఘాలు మూడు పువ్వు లారుకాయలుగా వృద్ధిచెందినవి. ముఖ్యముగా గృహపరిశ్రమలు అభివృద్ధిచెందుటకు లాభకరముగా మారుటకు అనేకవిధాల కృషిచేయుచున్నారు. నేడు వ్యాపారస్థుల కష్టములు తన దృష్టిలో నిడుకొని వారి యిబ్బందులు తీర్చుటకు ఆందోళన చేయుచున్నారు. ఇటుల అదియిది అననేల, వారి సర్వతోముఖ ప్రజాసేవ ఆలోచించిన కొలది అంతులేనిదిగా గోచరమగును. వారు ప్రజావుద్యమ స్వరూపులు.

రైతుల భూములు సస్యశ్యామల మగుటకు, ఆహారోత్పత్తి పెరిగి ప్రజల ఆహారకొరత తీరుటకు, సాగునీటి వనరులకు వారు ఎంతయో కృషిచేసినారు. కృష్ణానదీ జలాలకు ఇప్పటి ఆనకట్టలోనే ఇంకా ఎక్కువ భాగం సద్వినియోగం చేయవచ్చునని ఆయన అనుకున్నారు. అందువలననే 1926 నుంచి పెదవడ్లపూడి, అప్పాపురం కాల్వల నిర్మాణమునకు ఆందోళనచేసి, సాధించినారు.

అనావృష్టికి గురిఅవుతున్న రాయలసీమ పరిస్థితులు ఆయనను ఎంతగానో బాధించినవి. 1935లో ఢిల్లీ అసెంబ్లీకి వెళ్ళగానే తుంగభద్ర జలాశయమునకు ఆందోళన ప్రారంభించారు. శ్రీ శొంఠి రామమూర్తి గారి కృషితో ఆ జలాశయము నిర్మాణము పూర్తి

అయినది. ఆ జలాశయంవల్ల రాయలసీమ అవసరాలు తీరలేదనే ఆందోళన ఆయనలో అలాగే వుండిపోయింది. అదే వారు కృష్ణా, సంగమేశ్వర జలాశయాలపై నేను వ్రాసిన చిన్న పుస్తకంలో ఉపోద్ఘాతం వ్రాస్తూ ఉద్ఘాటించారు. ఈ పుస్తక పఠనానంతరం వారిదృష్టి కృష్ణా, సంగమేశ్వర జలాశయాల నిర్మాణంవైపు ప్రసరించింది. 1947లో కేంద్రమంత్రి శ్రీ గాడ్గిల్‌గారికి, కృష్ణా, సంగమేశ్వర జలాశయ నిర్మాణ అవసరము గురించి వ్రాసిరి. 1948 మే నెలలో మార్కాపురంలో జరిగిన రైతు మహాసభలో రంగాగారిని జలాశయ రైతుసంఘానికి గౌరవాధ్యక్షులుగా ఎన్నుకోవడం జరిగింది.

నాగార్జున సాగర్, పులిచింతల జలాశయముల నిర్మాణావశ్యకతను తొలుత వారే గుర్తించిరి. 1951 వ సంవత్సరమున ఆచార్య రంగాగారి నాయకత్వాన ఆంధ్రప్రభుత్వము వద్దకు ఈ ప్రాజెక్టుల విషయమై ఒక రాయబారవర్గం వెళ్ళాము. శ్రీ రంగాగారు అధికారులకు రాయలసీమకు, మెట్టప్రాంతములకు కృష్ణాజలాలయొక్క ఆవశ్యకతనుగూర్చి వివరించారు. నిపుణులతో కూడిన ఒక విచారణ సంఘము నియమించి, తగిన విచారణ చేయకున్న సత్యాగ్రహము చేయగలమనికూడ హెచ్చరించారు. ఈ విషయముపై భోస్లాకమిటీ విచారణకు వచ్చినప్పుడు, అప్పుడు లోక్‌పార్టీ నాయకత్వం వహిస్తున్న రంగాగారు ఆ కమిటీకి అన్ని వివరాలు అందించినారు. రంగాగారి నిరంతర పోరాటమువలన ఆ నాగార్జున సాగర్ ప్రాజక్టు కట్టడమును ఈనాడు మనం చూడగలుగుతున్నాం.

అన్నిప్రాంతాల రైతులకు నీటి వనరులు కల్పించాలని వారి అభిప్రాయం. అనావృష్టికి వ్యవసాయం దెబ్బ తింటున్నదని ఆవేదన పడే రైతు బాంధవుడు ఆయన. రైతుల కష్టాలు తన కష్టాలుగా భావించి వాటి నివారణకు నిరంతరం కృషిచేస్తున్న విరామ మెరుగని కృషీవలు డాయన.

# గుజరాతీ రైతులు ఆయనను ఆరాధిస్తున్నారు

శ్రీ చిమన్‌లాల్. యమ్. మోడి

రైతు నాయకులు ఆచార్యరంగాగారు 1954 లో జనవరి 24 నుండి ఫిబ్రవరి 4 వరకు మా గుజరాతు పల్లెప్రాంతాలలో పర్యటించారు. వారి పర్యటన మా రాష్ట్ర చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడివుంది. అనేక సంవత్సరాల కొద్ది రైతు సమస్యల పోరాటం కోసం ఒక నాయకుని కొరకు ఏ పల్లెటూరి ప్రజానీకమైతే ఎదురు చూస్తూవుందో ఆ నాయకుడు తమ మధ్యకు వచ్చినందుకు మా గుజరాతు గ్రామీణ ప్రజానీకం ఎంతో ఆప్యాయతలో, విధేయతతో తమప్రియతమ నాయకుని ఆహ్వానించింది. రంగాజీ అతి సామాన్యత రైతు ధోరణి మా గుజరాతీ గ్రామీణ రైతులను కదిలించి వేసింది. వారి సమస్యల నివారణకు ఆయన ఒకడే కార్యనిష్ణాత అని మా గుజరాతీయులంతా భావించారు. వేలాది ప్రజానీకం చెవులు నిక్కించి ఆయన వుపన్యాసాలను విన్నారు.

స్వరాజ్యం వల్ల రైతులకు మేలుకలుగుతుందని, కలగాలని ఆశించినవారిలో రంగాగారితో పాటు మా గుజరాతులో దాదూభాయ్ ముల్జీభాయ్ అమీన్ ఒకరు. వీరు రంగాగారితో పాటు ఆనాడు కాంగ్రెసును వదలిపెట్టి రంగాగారు నెలకొల్పిన కృషీకార్ లోక్ పార్టీలో చేరారు. దాదూభాయ్ ముల్జీభాయ్ అమీన్‌గారే ఆనాటి పర్యటన ఏర్పాటు చేసారు. దాదాపు మూడు దశాబ్దాలకు పైగా రంగాగారు రైతు వుద్యమంలో కృషిచేస్తున్నారు.

రైతు రాజ్యాన్ని స్థాపించాలనే కలలు రంగాగారు 1920 లో ఆక్సుఫర్డులో చదువుతూవుండగా కన్నారు. ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ, డెన్మార్కు దేశాలలో 1922–23 సంవత్సరాలలో పర్యటించి తదుపరి

స్వదేశంవచ్చి 1923 జనరల్ ఎన్నికలలో రైతు రాజకీయ పార్టీ నెలకొల్పి నలుగురు అభ్యర్థులను నిలబెట్టారు. అందులో ముగ్గురు ఎన్నికైనారు. ఇదే ఆయన రాజకీయ జీవితానికి నాందీ ప్రస్తావన. ఆరోజులలో ఆయన ఒక బ్రిటీషువారినే కాకుండా, కాంగ్రెసు నాయకత్వాన్నికూడ ఎదుర్కొనవలసి వచ్చింది. గ్రామీణ ప్రజల దయినందిన స్థితిగతులను అర్థం చేసుకొన్న బాపూజీ రంగాజీ చేస్తున్న కృషిని అభినందించారు. బాపూజీ ఆశీర్వాదంతోనే మద్రాసు కళాశాలలోని ఆర్థిక శాస్త్ర ఆచార్యత్వానికిసెల్లు వదలి, కాంగ్రెసులోపల వుండి రైతుల అభివృద్ధికి కృషిచేయడం మొదలుపెట్టారు. ఆనాడు దుర్భరంగావున్న జమీందారీ రైతుల దైన్యస్థితికి దిగాలుపడిన రంగాజీ జమీందారీ రైతుల ఆర్థికపరిస్థితులను వివరిస్తూ ఒక గ్రంథం వ్రాసి, అందులో జమీందారీ విధానాన్ని తీవ్రంగా నిరసించారు. అప్పట్లో తెలుగు దేశంనుండి ఈ జమీందారీ విధానం పోవాలని పొలికేకపెట్టిన వ్యక్తి ఆయన ఒక్కడే.

స్వాతంత్ర పోరాటంలో పెక్కుసార్లు జైలుకువెళ్ళి, ఆ జైళ్ళలోనే అనేక గ్రంధాలు రచించారు. రైతుకూలీ ప్రజారాజ్య సిద్ధాంతాన్ని రంగాగారు జైలులో వుండే రచించారు 1944లో బాపూజీతోపాటు రంగాగారు జైలులో వుండటం తటస్థించింది. రైతు కూలీ ప్రజారాజ్య సిద్ధాంతంయొక్క ప్రధానోద్దేశం ఆయన బాపూజీకి వివరించారు. కాని బాపూజీ మూడుసంవత్సరాలకు పైగా ఈ సిద్ధాంతంయొక్క విశిష్టతనుగూర్చి ఆలోచించారు. 1948 జనవరిలో ఇంకా మూడురోజులకు మా బాపూజీ కన్నుమూస్తాడనగా, బహిరంగంగా రంగాజీ రైతు కూలీ ప్రజారాజ్య సిద్ధాంతాన్ని బలపరచారు. పరిపక్వతచెందని అధికారం పొందడంవల్ల ఎలాటి ప్రయోజనం లేదని బాపూజీవలె రంగాగారుకూడ భావించారు. అందుకనే ఒకసారి రంగాజీని పదవి స్వీకరించమని కోరితే వైస్రాయి కౌన్సిలులో తమరు సభ్యుడుగా వుండేందుకు అంగీకరించారా ? మీరు ఆనాడు వైస్రాయి కౌన్సిలులో సభ్యత్వం ఎందుకు అంగీకరించలేదో అలాగే ఈనాడు

ఈ ప్రభుత్వంలో పదవిని అలంకరించేందుకు అంగీకరించడం లేదు అని అన్నారు. ఈ మాటకు ఆయన పసిపిల్లవానిలాగా నవ్వి, రంగాజీ వీపుపై నిమిరి, అలాంటి వృద్ధేశానికి రంగాజీని అభినందించారు.

గుజరాతు రైతులు రంగాజీని ఆరాధిస్తున్నారు. వారి సమస్యల కొరకు కృషిచేస్తున్నవ్యక్తి రంగాజీ ఒక్కరేనని మా రైతు లోకం విశ్వశిస్తూవుంది. ఐదు ఎకరాలకులోపు భూ కమతాలుగల రైతులు వేలాదిగా రంగాజీ గుజరాతు పర్యటనలో పాల్గొని వారి రైతుకూలీ ప్రజారాజ్య సిద్ధాంతంపట్ల ఆమోదం వెల్లడించారు. కుటుంబంకన్న కమతాన్నే అమితంగా మా గుజరాతు రైతులు ప్రేమిస్తారు. అందుకనే కమతాలను కాపాడాలని ఎలుగెత్తి చాటుతున్న రంగాగారిపట్ల మా రైతులకు అపారమైన అభిమానం. రైతుకు భూమిపైగల స్వామ్యాన్ని రక్షించాలని రంగాజీ విజ్ఞప్తిచేసినప్పుడు మా రైతులోకం ఆ విజ్ఞప్తిని హర్షించింది. అహమ్మదాబాద్‌కు 15 మైళ్ళ దూరంలోగల కలోల్ అనే ఒక పారిశ్రామిక పట్టణంలో రంగాజీ మాట్లాడుతూ, ''వజ్రంగికి కాడిస ఎలాంటిదో రైతుకు కమతం అలాంటిది. రచయితకు కలం ఎలాంటిదో. చేనేతవానికి మగ్గం అలాంటిది. వాని సంస్కృతికి ఆటపట్టు అది. జీవితానికి ఉపాధి అదే. దివారాత్రులు రైతు చెమటోడ్చి నిరంతరం విశ్రాంతి తీసికొనక భూమిని దున్నుతాడు. చిన్న కమతంగల రైతు నాగరికతగల ప్రభుత్వానికి ఒక జాతీయ పెట్టుబడి''అని వక్కాణించారు.

రైతుస్వామ్యంపట్ల ఆయనకున్న అపారమైన ప్రేమ కమ్యూనిజానికి దగ్గరలోవున్న భూదానంపై మోజు లేకుండా చేసింది. ''కష్టపడి సంపాదించుకోవడం తప్పా''? అని రంగాజీ ఒకసభలో ప్రశ్నించారు. ప్రభుత్వంలో లంచగొండితనం, ఆశ్రిత పక్షపాతం, నిరుద్యోగం నానాటికి పెరుగుపోతూవుంటే అటు సంఘానికి, ఇటు ప్రభుత్వానికి భారం లేకుండా స్వేచ్ఛగా జీవించేవ్యక్తి తప్పుడువాడని భావించడం సమంజసమా? అని ఆయన ప్రజానీకాన్ని అడుగుతున్నారు. గ్రామీణ ప్రాంతాలను అభివృద్ధి చేసేందుకు సహకారం కావాలని

రంగాగారు అంటున్నారు. కాని చిన్న రైతులను రూపుమాపి సోవి యటు దేశంలోని సమిష్టి వ్యవసాయంగానీ, నిర్బంధ సహకారంగానీ, అవసరంలేదని అంటున్నారు. ఒకవేళ ఇలాంటి నిర్బంధ సహకార విధానం అమలులోనికి తెస్తే భూములు కోల్పోయిన రైతులంతా పట్టణాలకు వలసవెళ్ళి దినభత్యపు కూలీలుగా మారవలసి వస్తుంది అని ఆయన ప్రజానీకానికి హెచ్చరిక చేస్తున్నారు. గాంధీజీ ఆశించిన వికేంద్రీకరణవిధానంలో విశ్వాసంగల రంగాగారు సహకార వ్యవసాయం నిర్బంధంగా పనికిరాదని వాదిస్తున్నారు,

మా గుజరాతు పర్యటనలో రంగాగారు రైతులకు ఎన్నో సలహాలు యిచ్చారు. వ్యవసాయం బాగా తెలిసిన వ్యక్తిగా ఆయన మా రైతులందరికి అమూల్యమైన సలహాలు యిచ్చారు. ప్రత్తి పొగాకు, లాంటి వాణిజ్య పంటలు విరివిగా పండించవలసిందిగా ఆయన కోరారు. ప్రభుత్వభూములపై సహకార సంఘాలద్వారా వ్యవసాయం చేసేందుకు సహకార సంఘాలను నెలకొల్పుకోమని రంగాగారు మా రైతులకు సలహాలు యిచ్చారు.

అంతర్జాతీయ వ్యవసాయోత్పత్తిదారుల సమాఖ్య సంస్థాపకులలో ఒకరుగా ఆయన రైతుల అభివృద్ధికి, ఎంతగానో కృషి చేసారు. మా గుజరాతు గ్రామీణ రైతులు ఎన్నటికి రంగాగారి సేవను మరువలేరు. ఆయనను రైతుబాంధవునిగ మా రైతు లోకం ఆరాధిస్తూ వుంది.

# కొన్ని పత్రికల కథనం

ఈ నవంబరు 7 తేదీ (1960) ఆచార్య రంగా జన్మదినం. ఈఏటి జన్మదినానికి ప్రత్యేక ప్రాముఖ్యత వున్నది. రేపు 7 వ తేదీతో రంగా గారికి 60 సంవత్సరాలు నిండుతాయి. యావదాంధ్రమూ ఆరోజువారి షష్టిపూర్తిని ఆనందంగా జరుపుతుంది. ఇది రైతాంగ పర్వదినం!

రంగాజీకి అప్పుడే ఆరవైఏండ్లు నిండాయా? ఆశ్చర్యమే!

వారిలో యీ అరవయ్యేవ పడిలో నిండు యవ్వనం, నవనవో న్మేషమైన నూతనోత్సాహం పరవళ్ళు త్రొక్కుచున్నవి. ఇది వారి నిజజీవితంలో, రాజకీయ జీవితంలోగూడా ద్వితీయ యవ్వనమేనేమో!

రంగాజీ ఒక వ్యక్తి కాదు; ఒక సంస్థ. ఒకసంస్థగాదు ఒక మహోద్యమం. ఈ వుద్యమానికి అంతమంటూ ఎప్పుడూ తెలి యదు. అంతవరకు రంగాజీ జీవితం 'అరణ్యపర్వమే'. ప్రతిభావంత మైన, ప్రజాసేవాసమన్వితమైన, ప్రయోజనకరమైనవారి జీవితం, 'ఉద్యోగపర్వం'లో ప్రవేశించాలని వారి అభిమానులు కోరుతూ వుండే వారు. ఎంత అభిలషించినా, ఆవేదనపడ్డా ఆ సుదినం సుదూర మౌతు న్నదేగాని, సుప్రసన్నంగావడం లేదు. ఇది శోచనీయమైన విషయం.

రంగాగారికి దర్పంతో కూడిన అధికారపదవికంటె, చైతన్య వంతమైన ప్రజోద్యమ ఆదిపర్వమంటే అభిమానం మెండు. తన అభి ప్రాయాలను చంపుకోక, ఆత్మాభిమానాన్ని అణచుకొని, వ్యక్తి త్వాన్ని దిగజార్చుకొని స్వంతలాభం పొందడమంటే; నిలకడలేని వాడనే అపవాదును భరించుటకుగూడా సిద్ధపడి, తనకు, తన అభి ప్రాయాలకు, తన కార్యసరళికి స్వేచ్ఛాస్వాతంత్ర్యా లుండేచోట చేరడమో, లేక సృష్టించుకోవడమో గౌరవమని భావిస్తారు. అందు వల్లనే లోక సహజమైన పద్ధతిని అనుసరించుటలో, కాంగ్రెస్‌ను అంటి పెట్టుకొని వుండాలని ఎన్నిపర్యాయములు ప్రయత్నించినా, అది వారికి సాధ్యపడలేదు. ఆత్మోన్నతికి అధిక ప్రాముఖ్యమివ్వకుండా వారు తన రాజకీయ జీవితాన్ని కాంగ్రెస్‌కే అంకితం జేసివుంటే,

ఆ సంస్థలోగాని, ఆ ప్రభుత్వాలలోగాని యీనాడు వారిస్థానం సము న్నతమైనదిగా వుండి వుండేది.

రంగాగారు ఎన్నో వుద్యమాలు నిర్మించారు. ఎన్నో వుద్యమాలకు నాయకత్వం వహించారు. కోట్లాది ప్రజలకు విముక్తి కల్గించిన జమీన్‌దారీ వుద్యమం వారి రాజకీయ జీవితపు తొలిరోజుల ఘనవిజయం. ఆనాడు ఏ కాంగ్రెసునాయకుడూ ఆ వుద్యమ సారథ్యానికి సాహసించలేకపోగా, రంగాగారు అవ్యాజంగా అందులోదూకి వుద్యమాన్ని నడిపించి, గమ్యంచేర్చారు. రంగాగారితో జమీన్ రైతుల, 'జమీన్ రైతు' అనుబంధానికి ఆ వుద్యమమే కారణం. ఆనాటినుండి రైతోద్యమాన్ని చేపట్టి—పార్టీ ఏదైనా—మార్పులేకుండా నిర్విరామంగా ప్రబోధం సాగిస్తూనే వున్నారు.

ఒక్క రైతోద్యమమేగాదు – చేనేత కార్మికులు యీనాడు ఆమాత్రమైనా గుర్తింపబడి, జీవనసౌకర్యాలు కల్గించుకో గలుగుతున్నారంటే, అది రంగాగారి పుణ్యమని చెప్పడం అతిశయోక్తి గాదు. యువకులలో జాగృతి కల్గించారు, విద్యార్థులను చైతన్యవంతులను జేశారు; వర్గసంఘాలను ప్రోత్సహించారు. అవన్నీ కాంగ్రెస్ వ్యతిరేక చర్యలుగా చిత్రించి వారిమీద దుష్ప్రచారం సాగించిన వారే, తర్వాత వాటి అవసరాన్ని, ప్రాధాన్యాన్ని గుర్తించి తాము వాటిని నిర్మించక తప్పలేదు.

ఒక్కొక్క వుద్యమాన్ని నిర్మించడం, బలపరచడం, శక్తివంతం జేయడం రంగాగారి వంతుగా; చివరకు అవి వారికి వ్యతిరేకంగా పరిణమించడం వాటివంతుగా వుంటున్నది. అట్లనే కొన్ని వేలమందికి వారు రాజకీయ విజ్ఞానం కల్గించారు, వారిని వక్తలను జేశారు, రచయితలుగా తీర్చారు. పదవులిచ్చారు. పెద్దలను జేశారు. వారిలో ఎందరు యీనాడు రంగాగారి అనుచరులుగా వున్నారో చెప్పలేము. వారొక సిద్ధాంత కర్త. ఉద్యమ నిర్మాత, రాజకీయ ఆచార్యుడు. ప్రత్యక్ష రాజకీయాలకు, అందులో యీనాటి రాజకీయాలకు, రంగాగారు సరి

పడరు. రాజకీయాలలో వారు అందరివలె విజయులు కాలేకపోవుటకు కారణం అదే. రంగాగారు నిస్వార్థపరులైన వ్యక్తి. వారి రాజకీయ జీవితంలో ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా, అధికారంలో లేకపోయినా, యీనాడు వారు ప్రజానాయకుడుగా నిలువగలిగివున్నారంటే రాజకీయాలలో నీతికి నిజాయతీకి వారు ఎక్కువ విలువివ్వడమే కారణం. వారు తన అనుచరులపట్ల పితృవాత్సల్యాన్ని ప్రదర్శిస్తారు. వారి సంసారం యిరువురే; కాని వారి రాజకీయ కుటుంబం మాత్రం బహుళ విస్తృతమైనది; వారు సంతానహీనులు; కాని రాజకీయంగా వారిది కుచేల సంతానం. ఆంధ్రలో ఏ నాయకునికిలేని అనుచరబృందం, శిష్యకోటి, ఒక్కమాటతో ఏత్యాగానికైనా సిద్ధపడే ఆప్తవర్గం, రంగాగారికున్నదంటే, అదీ వారి నాయకత్వంలోని; వ్యక్తిత్వంలోని విశిష్టతే. వారు శిష్యకోటికి పితృతుల్యులు; రైతాంగానికి ఆప్త బంధువులు.

రంగాగారి శాసనసభ జీవితంగూడా సుదీర్ఘమైనది. వారు 1934 లో కేంద్రశాసనసభ సభ్యులైనారు. ఆనాటినుండి యీనాటి వరకు వారు పార్లమెంటు సభ్యులుగా అవిచ్ఛిన్నంగా వుంటున్నారు. ఇంత దీర్ఘకాలం సభ్యులుగా వున్నవారు ఆంధ్రలో ఏ ఒకరిద్దరో మాత్రమే. కాని రంగాగారివలె ఇంతకాలం, యింత అనుభవంగలిగి మంత్రిగాక, లేక ఏ యితర పదవీ పొందని సభ్యుడుగామాత్రం మరొకడు లేడు. రంగాగారు తిరుగ మాతృమందిరంలో చేరి, యీ వయసులో నైనా అధికారబాధ్యతలతో దేశసేవచేయాలని ఆకాంక్షిస్తూ, ఆ శుభలగ్నంకొరకు ఎదురుచూచే మాబోటి అభిమానులు లేకపోలేదు.

షష్టిపూర్తి సందర్భంలో 'జమీన్‌రైతు' రంగాజీకి శుభాకాంక్షలందజేస్తూ, వారి ప్రజాహిత జీవితం చైతన్యవంతంగా, వుత్సాహవంతంగా నూరేళ్ళుసాగాలని అభిలషిస్తున్నాము.

ఈ సందర్భంలోనే రజతోత్సవం జరుపుకుంటున్న మా సోదరి 'వాహిని' పత్రికకు శుభాభివందనలు—జమీన్‌రైతు.

ఆంధ్రప్రభ: ఆచార్య రంగా షష్టిపూర్తి మహోత్సవం ఆంధ్రులకు ఆనందదాయకం.

విదేశాలలో విద్యార్థిగా, కొద్దికాలంపాటు పచ్చయప్ప కళాశాల ఆర్థిక శాస్త్రాధ్యాపకులుగా గడిపిన తొలిదశలను మినహాయిస్తే, ఆచార్య రంగాగారి అరవై సంవత్సరాల నిండు జీవితం అవిరళ దేశ సేవకే అంకితమైంది.

అధికార వాంఛ నావలకు ద్రోసి, ప్రజారాధనమే పరమార్థంగా భావించి, ఇంతకాల మింతటి కర్తవ్యనిష్ఠతో ప్రజలను సేవించిన త్యాగమూర్తులు ఆంధ్రరాష్ట్రంలోనే కాదు యావద్భారతంలో సయితం వ్రేళ్లపై లెక్కించబడవలసే ఉంటారు.

రచయితగా, రాజ్యాంగవేత్తగా, సంఘసంస్కర్తగా, శాసన సభా సభ్యుడుగా శ్రీ రంగా జీవితం బహుముఖ ప్రజ్ఞా ప్రాభవాలను ప్రకటిస్తున్నా, రైతుజనశ్రేయమే శ్రీ రంగా జీవితానికి ధ్యేయమైంది.

రైతు దినోత్సవం; రైతు రక్షణవారం; రైతాంగ విద్యాలయం; రైతు గ్రంథాలయం; ఒకటేమిటి, సమగ్రమైన రైతు యోగక్షేమమే, ఆలక్ష్యంపట్ల ఆయనకుగల అకుంఠిత విశ్వాసమే ఆచార్య రంగా ఉద్యమాలన్నిటికీ మూలం.

రంగాగారివలె రైతుతత్వాన్ని జీర్ణించుకున్న వ్యక్తులు రాజకీయ నాయకులలో ఎందరో లేరు. రైతాంగానికి రంగా జీవన గంగ. అందుచేతనే రంగాగారి జీవితంచే ప్రభావితులైనవారు నాగరికులకంటె గ్రామీణప్రజలే అధిక సంఖ్యాకులు.

ఆచార్య రంగా దేశభక్తిని ప్రస్తుతించడానికి, సర్వతోముఖమైన ఆయన పండితీ ప్రతిభలను గుర్తించడానికి రంగాగారి ప్రస్తుత రాజకీయాభిప్రాయాలతో ఏకీభవించ నక్కరలేదు.

అమృత హృదయులు, అకలంక వర్తనులూ అయిన ఆచార్య రంగా దంపతులు దేశోద్ధరణ తత్పరులై, దీర్ఘాయుష్మంతులై ప్రకాశింతురుగాక యని ఈశ్వరుని ప్రార్థిస్తున్నాం.

మందాకిని : నవంబరు 7 వ తేది విజయవాడ పండువులొడవు తొడిగినది. అదే రైతునాయకుడు, జమీందారీ విధానం నిర్మూలన గావించిన కర్షకుడు, ఆంధ్రయువక రాజకీయ జ్ఞానప్రదాత, అంతరాత్మ-చోదిత కర్మవీరుడు, అకలంక దేశభక్తుడు, భావిభారత రాజకీయ నైతిక పునరుద్ధాన దీక్షాబద్ధమైన స్వతంత్ర పక్షనాయకుడు ఆచార్య యన్. జి. రంగాగారి షష్ట్యబ్ద పూర్తి పుత్సవదినము. వారు దీర్ఘవసంతశాతము ననుభవింతురుగాక.

సంఘం : రంగాగారు ఆంధ్రదేశం గర్వించదగ్గ నాయకులలో ఒకరు. సోషలిస్టు భావాలను ప్రారంభంలో విరివిగా ఆంధ్ర యువకులలో ప్రచారం చేసిన ముఖ్యులలో రంగాగారు ఒకరు. ఎంత అభ్యుదయ భావాలు ప్రచారంచేసినా ఉద్యమాలు నడపడంలో నేటి సమాజంలో ఆధిక్యత ననుభవిస్తున్నవారి స్వార్థాలను వెనుక వేసుకొనిరావడంవల్లనే ఆయన ప్రజలలో నడవలేక పోయారు, సామాన్య ప్రజలను తనతో తీసుకు వెళ్ళలేక పోయారు.

భారత మిత్రము : అధికారవాంఛ నావలకు ద్రోసి, ప్రజాసేవయే పరమార్థంగా భావించి, స్వతంత్ర సమరవీరుడై రైతుబాంధవుడై రచయితగా, రాజ్యాంగ వేత్తగా, సంస్కర్తగా రంగా జీవితం బహుముఖంగా ప్రవహించినా, రైతు జనశ్రేయమే రంగా జీవితానికి ధ్యేయమైనది. వారు స్వతంత్రపార్టీ అధ్యక్షులు. నిజానికి ఇండియాలో నెహ్రూకు ప్రతినాయకుడు రంగా. నెహ్రూ నియంతృత్వానికి బ్రేకులు వేసింది రంగా. అమెరికా ప్రజాస్వామ్య సూత్రాలను ఆమోదించి, నేటి కమ్యూనిష్టు ప్రభావాన్ని ఇండియాలో ఎదిరించింది రంగా. కాని ప్రజలు వారిని సరిగా అర్థంచేసుకోలేక పోతున్నారు. ఇకనైనా ఆంధ్రప్రజలు తమ నాయకుణ్ణి గౌరవింతురు గాక. ఆచార్యరంగా దంపతులకు మా జోహారులు.

# కొందరి అభిప్రాయాలు

శ్రీ కె. వి. వేమారెడ్డి: రంగాగారు 1920 సంవత్సరము నుండి రైతు, కూలీ ప్రజల కృషికి ఎంతో తోడ్పడి అమోఘమైన సేవచేసారు. చాలా ప్రశంసనీయము. వారితో ఎన్నో సంవత్సరములు రాజకీయాలలో పనిచేసే భాగ్యము లభించినది. రాజకీయరంగంలో, దేశసేవలో నన్ను ప్రప్రథమంగా దించినదివారే. రాజకీయంగా నాకు, వారికి భేదాభిప్రాయములున్నప్పటికి, వారు దేశానికి అమోఘమైన సేవచేసిన ఆంధ్రరత్నములలో ఒకరు. షష్టిపూర్తి జరుపుకున్న వారికి జోహార్లు అర్పిస్తూ, దేశసేవచేయుటకు వారు ఎక్కువకాలం జీవించవలెనని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

శ్రీ సూరపనేని వెంకటేశ్వరరావు: ఆచార్య రంగాగారు నోరులేని పల్లెటూరి ప్రజల ప్రతినిధి. ఆయనకు పదవికంటే దీనజనులైన రైతుల బాధానివారణే ముఖ్యం. అందుచేతనే ఆయన రైతు బాంధవుడుగా ప్రసిద్ధికెక్కిన పుణ్యపురుషుడు.

నేడు కోటానుకోట్ల రైతుల ఆస్తి సర్వస్వములాగుకొని, మానవునికి ప్రాణప్రదమైన రైతులస్వేచ్ఛా స్వాతంత్ర్యాలను గుంజుకొని రైతుజీవితాన్ని అంధకారబంధుర మొనర్చి సహకార వ్యవసాయమనే కుట్రను సాహసోపేతంగా, ధైర్యంగా, నిర్భయంగా మన ప్రధాని శ్రీ నెహ్రూగారి నిరంకుశత్వాన్ని బందరు మీటింగు ద్వారా ఎదిరించి, ఎల్వాలు నిర్ణయాలను వమ్ముచేయుటకు, రైతుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాపాడుటకు బద్ధకంకణం కట్టుకున్న మేరుధీరుడు. ఆయనకు ఆయనే సాటి. రైతు సమస్యలను యింత ఆకళింపుచేసుకున్న నాయకుడు మరొకరులేరు. ఎంతైనా ఆయనను గురించి చెప్పవచ్చును. ఆయన ఆజ్ఞలను పాటించి, వారినే అనుకరించిన మన ఆస్తి, మన

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కాపాడబడగలవు. లేనియెడల మనకు అంధ కార బంధురంతెప్ప మరొక మార్గము లేదు.

శ్రీ నాదెళ్ళ నాగేంద్రరావు : ఆచార్య రంగాగారు నడిపినవి వుద్యమాలుగాని పార్టీలుగావు. వారు జీవితంలో దాదాపు 40 సంవత్స రములకుపైగా రైతుకూలీ ప్రజల అభివృద్ధికి కృషిచేశారు. వర్తకుల స్వేచ్ఛకొరకై పాటుపడుతున్నారు. నిరాడంబరజీవి. నిస్వార్థపరులు. పూర్వపు మద్రాసును కమ్యూనిస్టు పరిపాలనలో పడకుండా మంత్రి పదవి నిచ్చెదమన్నను నిరాకరించి, శ్రీ సి. రాజగోపాలచారి నాయ కత్వమును అంగీకరించి, వ్యక్తి స్వేచ్ఛను కాపాడుటకు కృషిచేస్తున్న మహానుభావులు. వారి రాజకీయ ధోరణి ఈనాటి వరకు ఏమీ మార లేదు. ఆయనను సేవాదృష్టితో అనుసరించినవారు స్వార్థం కొరకు ఆయనను విడిచివెళ్ళారు. రంగాగారికి యితరులను మోసముచేయుట తెలియదు. యదార్థవాది. ఉన్నది ఉన్నట్లుగా మాట్లాడేవారగుటచే వారు బహు జనుల ఆదరమును చూరగొను చున్నారు. కాని వారికి మోసపు ఎత్తులు తెలియనందున రాజకీయంగా అనుకొన్నంతగా పైకి రాలేదు. అందుచేతనే అధికారములోనికి ఈరోజువరకు రాలేక పోయినారు.

శ్రీ కావూరు పట్టాభిరామయ్య : ఆచార్యరంగాగారిని మొట్ట మొదటిసారిగా దర్శించక పూర్వమే, స్వదేశమందు విదేశమందు ఆయన సల్పిన ప్రచార ప్రబోధములు నాకు దిగ్భ్రమ కలిగించి నన్ను ముగ్ధుని గావించెను. ఆయనను ప్రథమంగా దర్శించినపుడు నా ఆనం దమునకు అంతులేదు. ఆయనలో గొప్ప ఆశాజ్యోతి కనబడెను. శ్రీ నెహ్రూతో సాటి, మేటి ఆంధ్ర దేశమున జన్మించెనని గర్వపడ్డాను. శ్రీ జవహరుని తదుపరి రాజకీయ వారసుడు కావలసినదే. అయితే శ్రీ రంగాగారు ఎల్లప్పుడూ నాయకుడేగాని అనుచరుడుగాడు. రాజకీయ పార్టీలనేకాదు, ఉద్యమాలనే నెలకొల్పిన మేటి. పదవీ వ్యామోహ ముతో వ్యక్తిత్వమును చంపుకుని, అగ్రనాయకుల అడుగులకు మడుగు

లోత్తుచు, ఏఎండ కాగొడుగు పట్టిన, ఏనాడో కాంగ్రెసు ప్రభుత్వంలో ఏ రాష్ట్ర ముఖ్యమంత్రియో, మంత్రియో, కేంద్రమంత్రియో అయి వుండును. ఆయనను సేవాదృష్టితో అనుసరించినవారు కొందరు స్వార్థము కొరకు ఆయనను విడిచి వెళ్ళిరనుట నిజమే. ఇందుకు నిదర్శనములు కలవు.

సర్దార్ లాల్‌సింగ్ : దేశసేవకోసం తన సర్వస్వాన్ని అంకితం చేసిన కొద్దిమంది వ్యక్తులలో ఆచార్య రంగాగారు ఒకరు. గ్రామీణ వాసుల సమస్యల కొరకు నిర్భయంగా, నిరంతరం పోరాడే వీరుడాయన. సరియైన వ్యవస్థాపక సంఘం ఈ రైతులకు మనదేశంలో లేనందువల్ల వీరికి ప్రభుత్వంలో పలుకుబడి లేదు. వ్యవసాయదారుల సమస్యలకొరకు రంగావలె పోరాడే వ్యక్తులు ఈ దేశంలో అరుదు.

అఖిల భారత వ్యవసాయదారుల సమాఖ్య తరఫున, ఢిల్లీ స్వతంత్ర పార్టీతరఫున ఆయనకు నేను నివాళులు అర్పిస్తున్నాను. గ్రామీణప్రజల సమస్యల నివారణకు కృషిచేసేందుకు మన నాయకుడు రంగాజీకి భగవంతుడు చిరాయువు ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను.

శ్రీ కె. సభా : రంగాజీ చరిత్రలో స్వర్ణఘట్టము అవతరించినది. దేశంలోని మేధావులూ, విజ్ఞానులూ వారి ఉద్యమాన్ని సింహావలోకనం చేసుకొని వారిపట్ల గాఢమైన విశ్వాసాన్ని ప్రదర్శించే రోజుల్లో ఉన్నామిపుడు. ఇది చాల సంతోషించదగ్గ విషయం.

మన ప్రాచీన సంస్కృతిని చరిత్రను దృష్టిలో ఉంచుకొన్నపుడు స్వతంత్రపార్టీ మరికొంత ఆధ్యాత్మిక దృష్టిని అలవరచుకోవడం అవసరం. ప్రతిపక్షాల భౌతిక దృష్టినిగూర్చి ఆలోచించినపుడుకూడా మనకు ఆధ్యాత్మిక దృష్టి మరింత అవసరంగా కన్పిస్తున్నది.

పార్టీ ప్రణాళికలో నైతిక పునరుద్ధరణకు ఎక్కువ విలువనిచ్చి మన ఉపన్యాసాలలో, వ్రాతలలో, ప్రచారంలో ఎక్కువభాగం

అందుకే వినియోగించినపుడు మనకు శ్రమలో ఆనందము, శ్రాంతిలో విశ్రాంతి, గమ్యస్థానములో భగవత్‌స్వరూపమూ గోచరించగలవు.

గాంధీజీ ఉద్యమాలకు ముందు ప్రార్థన, సత్యాగ్రహాములకు ప్రధమస్థానాలిచ్చారు. ఈ స్వరాజ్యము ఉద్యమాలకంటె ప్రార్థనలతో సత్యంతో సంపాదించి నందుచేతనే ఇంకా నిలిచి యున్నది.

రాజాజీ రచనలు, ఉపన్యాసాలు ఆధ్యాత్మిక రంగంనుండి ఏకో శానా దూరంకావు. రంగాజీ రచనలు, ఉపన్యాసాలుకూడా అంతే కాని కొంతతక్కువ దూరంగా కన్పిస్తాయి. ఇప్పుడాదృష్టి చాల అవసరం.

1950 లో గోలకొండ పత్రికలో కొన్ని వ్యాసాలు వ్రాశాను. అందులో రంగాజీని యుగపురుషుడుగా చిత్రించాను. ఆనాడావ్యాసాన్ని అతిశయమన్నారు. ఇప్పుడది యథార్థంగా కన్పించడం రైతులకు దేశానికీ అదృష్టం. ఎవరిదృష్టి వారిదైనా యుగపురుషుడుగా, శ్రామికుల ప్రవక్తగా, రైతు వేదాంతిగా వారి గమ్యస్థానం ఎంతో దూరంలో లేదు.

ఈ పార్టీలు, ఈ రాజకీయాలు యివన్నీ తాత్కాలికాలు. వారు వెడుతున్న గమ్యస్థానంలో ఇవన్నీ మైలురాళ్లు. ఆ రహదారిలో ఎందరో నడిచిపోతున్నారు. నడిచిపోతూ నాయకులయ్యారు. వివిధ రంగాలలో ప్రముఖులయ్యారు. అలసినవారు, అలిగినవారు, విశ్రాంతి కోరినవారు, ఎక్కడికక్కడ ఆగిపోయినవారూ, మళ్లీ కలిసినవారు, క్రొత్తవారూను. ఆశ్చర్యమేమంటే ఆయన వెడుతూనే ఉన్నారు. ఆసక్తి ఉన్నవారు వెంబడిస్తూ ఉన్నారు. ఈప్రయాణం ఎన్నాళ్ళంటే చెప్పలే దెవరూ? ఒక్కప్రభుత్వాన్ని పట్టుకోవడం, ఇంకో ప్రభుత్వాన్ని పడగొట్టడమే కాదు వారి ధ్యేయం. అది కాకూడదని నా ఉద్దేశం. కాదనీ నా విశ్వాసం. ప్రపంచ రైతాంగ సుస్థిరతకూ, వారిశాంతి సౌఖ్యాలకు ఒక విశ్వవ్యాప్తమైన నిశ్చల వేదాంతాన్ని ప్రసాదించడం కావాలి.

నేనిట్లా ఊహించుకొన్నపుడు, నిర్వచించుకొన్నపుడు, ఆ దృష్టితో సహకరిస్తున్నపుడు కేవలం రాజకీయదృష్టితో (తాత్కాలికం) చూచేవారు నాపట్ల విముఖత్వాన్ని ప్రదర్శిస్తున్నా నాకేమీ విచారముండటంలేదు. నిర్మాణరంగంలో, అత్యంతావసరమైన పరిస్థితుల్లో రాజకీయరంగంలో చురుకుగా కన్పించాలన్పిస్తుంది.

దేశంలో మానసికారోగ్యం క్షీణదశకు వచ్చినట్లు స్ఫురిస్తున్నది. భౌతిక దృష్టితో శూన్యాన్ని (Space) చేరుకుంటున్న మానవుడు ఆధ్యాత్మిక దృష్టిని విస్మరించినపుడే యుగపురుషులు, దైవాంశ సంభూతులు అవతరించారు. ప్రళయాలూ, భూకంపాలు సహితం సంభవించాయి. కలుషితమై అవినీతితో తొణికిసలాడుతున్న రాజకీయ రంగంలో రంగాజీ నీతికి, నిజాయితీకి ధర్మానికి ప్రతిబింబంగా నేడు ప్రకాశించడం మహాభాగ్యం.

కవులు, రచయితలు, సంపాదకులలో చాలమంది ఒక విధమైన భావదాస్యానికి గురియై స్వేచ్ఛను పోగొట్టుకొంటున్నారు. మునుపెన్నడూ లేనంత నైతిక పతనం వారిలో సంభవించింది. డాక్టర్లే రోగిష్టులైనట్లు మానసికమైన వ్యాధులకు ఔషధాన్నిచ్చే సాహితీవేత్తలు బానిసలు కావడం దేశారిష్టాన్ని సూచిస్తున్నది.

# అరవదవ పడిలో ఆచార్య రంగా

మూలం :
డాక్టర్ జార్జి యమ్. డిమిట్రాప్

అనువాదం :
యన్. విజయరాజకుమార్.

1900 సం॥ నవంబరు 7 వ తేదీన ఉద్భవించిన భారత రైతు నాయకుడు ఆచార్య రంగాజీ జన్మస్థలమైన ఆంధ్ర రాష్ట్రంలోని నిడుబ్రోలు గ్రామాన్ని 1957 జూలైలో నేను సందర్శించాను. అనేక పూల దండల బరువు భారంలో ఒక ఎద్దులబండిపై డాక్టరు రంగాజీ ప్రక్కన నేను కూర్చున్నాను. జన సముద్రంలోగుండా బండి కదిలింది. గ్రామం మధ్యలోకి వచ్చాం. అతి మనోజ్ఞంగా అలంకరించబడిన సామాన్యమైన పొడుగాటి కట్టడంముందు ఆగాం. "భారత రైతాంగ విద్యాలయం మిమ్ము గాఢంగా ఆహ్వానిస్తుంది." అని ఒక సుదీర్ఘమైన బానరు ఆ భవనంముందు కట్టబడివుంది. మరొకమారు పూదండలు మమ్మల్ని ముంచెత్తినవి. విద్యాలయపు ప్రతినిధులు మమ్మల్ని అమిత ఆప్యాయంగా ఆహ్వానించారు. నిడుబ్రోలు గ్రామస్థులు, ఆంధ్రప్రాంతమంతటి నుంచి వచ్చిన ప్రముఖ రైతులు మమ్మల్ని సుహృద్భావంతో ఆహ్వానించారు. ఇంటిలోపల ప్రజలు కూర్చుండేందుకు ప్రజలందరకూ సావకాశం లేనందున దానిని అంటిపెట్టుకు నేవున్న విశాలమైన సమావేశ స్థలానికి మమ్మల్ని తీసుకుపోయారు. వెంటనే భారత రైతులకు మక్కాలాంటి చోటు నేనున్నానని అభిప్రాయం పడ్డాను.

అంతర్జాతీయ రైతాంగనేతలతో స్నేహం : నేను ఆచార్య రంగాను 1952 లో వాషింగ్‌టన్ డి. సి. లో మొట్టమొదటిమారుగా కలుసుకున్నాను. కెనడాలోని అట్టావాలో జరిగిన కామన్‌వెల్తు రాజ్యాల పార్లమెంటేరియన్‌ల సమావేశంలో పాల్గొని తిరిగి ఇంటికి పోతూవున్నప్పుడు డాక్టర్ రంగాను అంతర్జాతీయ రైతుసమాఖ్య అధ్యక్షుడైన మిస్టర్. స్టానిస్లా మైకోలాజిక్, దాని ప్రధాన కార్యదర్శినైన నేను కలుసుకుని అత్యంత మైత్రీ పూర్వకమైన ధోరణిలో, మామధ్య సిద్ధాంత సంబంధంగా రాజకీయసంబంధంగా ఉండవలసిన

సామరస్యాన్ని గురించి ఉపయోగకరమైన సంభాషణలు సాగించాం. అంతర్జాతీయ రైతుసమాఖ్య (I. P. U) ఆసియాలోని రైతాంగానికి 1950వ అక్టోబరులో ఒక చరిత్రాత్మకమైన ప్రణాళికను (Manifesto) కమ్యూనిజంమీద ఒక చిన్న పుస్తకాన్ని తయారుచేస్తే, 1951 ఫిబ్రవరిలో భారతదేశంలో వాటిని ప్రకటించిన సందర్భంలో మాకు రంగాజీతో అత్యంత సన్నిహితమైన సంబంధం ఏర్పడింది. అది సన్నిహితత్వానికి దారితీసింది. 1954 లో న్యూయార్కులోనూ 1956 లో పారిస్‌లోనూ జరిగిన అంతర్జాతీయ రైతుసమాఖ్య సమావేశాలలో ఆచార్య రంగాసుహృద్భావ ప్రతినిధిగా పాల్గొన్నాడు. ఆ సమయంలో ప్రఖ్యాతమైన హంగరీ తిరుగుబాటు జరుగుతుంది, ఆయన ధీశక్తి, ఆయన పోరాటపు చొరవ, ఆయన మేధాసంపత్తి ప్రతి ఒక్కరికి వలె నాకున్నూ, ఆయన ఎంత ధైర్యంగా ఎంత క్రమబద్ధంగా మాట్లాడుతారో సాక్ష్యాలుగా కనుపించినవి. ఆర్థిక, సాంఘిక, రాజకీయ జీవనరంగాలలో అంతర్జాతీయ వాతావరణంలో, ఆయన కార్యక్రమాలు నేను గమనించాను. ఆ సంబంధమైన ఆయన గ్రంథాలను నేను చదివాను. అంతర్జాతీయ రైతు సమాఖ్య ఉపాధ్యక్షుడైన ఫెరెన్సినాగి 1954–1955 లో భారతదేశంలో పర్యటించారు. వారి ద్వారా, ఆచార్యరంగాగారికి భారతదేశంలో వున్న పలుకుబడిని గురించి నేను విని వున్నాను. 1957 లో నేను భారతదేశ పర్యటన జరుపుతున్న సందర్భంలో శ్రీరంగాఅంటే ఏమిటి అనే విషయం నేను ప్రత్యక్షంగా గమనించాను. ముఖ్యంగా భారత ప్రజలలో నూటికి 80 పాళ్ళుగావున్న భారత రైతుల దృష్టిలో ఆయన ఎటువంటివాడో నేను గమనించాను.

## ఆకర్షనీయమైన వ్యక్తిత్వం

తమ స్వాతంత్ర్యాన్ని, తమ మానవత్వాన్ని, తమ ప్రధాన రాజకీయ అవసరాలని, ధీరోదాత్తంగా నూటికినూరుపాళ్ళు పరిరక్షణకు కంకణధారియైన రంగాకు, భారత సమాజంలోని తదితర వర్గాలతో

పాటు సాంఘికంగా భారత రైతుకు సమానన్యాయం కావాలని డిమాండు చేసిన రంగాకు, గౌరవ చిహ్నంగా ఒక విగ్రహాన్ని భారత రైతులు అంకితం చేసుకుంటూ ప్రతిష్ఠించుకునే సందర్భంలో అంత ర్జాతీయ రైతు సమాఖ్యకు ప్రాతినిధ్యం వహించే నిమిత్తం భారత దేశానికి నన్ను ఆహ్వానించారు. మూడు కోట్ల మూడు లక్షలమంది తెలుగు మాట్లాడే ఆంధ్రప్రాంతానికి హృదయ మనదగిన కృష్ణానది ఒడ్డునవున్న విజయవాడ పట్టణంలో నిలువెత్తు విగ్రహం ప్రతిష్ఠాపించ బడింది. ఇది రంగాజీ జన్మస్థలానికి అనతి దూరంలోనే వుంటుంది. వందల వేలకొలది భారత రైతాంగం యొక్క ఉత్సాహానికిది ప్రతి బింబంగా కనుపిస్తుంది. వారి ప్రియ తమ నాయకుడైన యన్. జి. రంగాకు ప్రత్యక్షంగా తమ వినయ విధేయతలను తెలుపుకునేందుకు వారు తమ పొలాలలో పనులను కట్టిపెట్టి, గ్రామ గ్రామాలనుంచి ఆ సందర్భంలో వచ్చి చేరారు. ఆ ఉత్సవసమయంలో నేను ఈ రైతు లతో మాట్లాడాను. నేను ఎక్కడెక్కడైతే భారతదేశంలో మాట్లాడ వీలుకలిగిందో అక్కడల్లా, విజయవాడలో మాదిరే మాట్లాడాను. ఈ ప్రశాంత ప్రజలు తరచు చూపులకు జాలికరంగా కనుపిస్తారు. బీదతనం వలన, వాతావరణం వలన సర్వం ఒట్టిపోయినట్లుంటారు. కాని డాక్టరు రంగాపేరు వినిపించినంతనే ఏదో ఆశాజ్యోతి వారి కన్నులలో ఆకస్మికంగా మెరుస్తున్నట్లు నా పరిశీలనలో కనుగొన్న ప్పుడు నేను చలించిపోయాను. ఈ వ్యక్తిపేరు చెప్పినప్పుడల్లా ఇలా విద్యుద్ఘాత వేగజనితమైన ధోరణిలో వెలువడే ఈ స్వాభావికతకు హేతువేమిటో? మహాత్మా గాంధీకి చూపినంత అతి సన్నిహిత విధేయత ఈయనపట్ల గూడ చూపడానికి కారణం? ఈ విధేయత ఒక కాకతాళీయంకాదు. దాని పునాదులన్నీ డాక్టరు రంగా ప్రవర్త నలో వారు చూడ గలిగారు.

## బాల్యం - యువరదశ.

మధ్యతరగతి ఆదాయం వచ్చే కుటుంబంలో పుట్టిన డాక్టరు రంగాజీకి పొలాలలో కష్టపడి పనిచేసే రైతు శ్రమలంటే అర్థం

ఏమిటో చిన్నతనంలోనే తెలుసు. అతని కష్టపరిస్థితులలో, అతి స్వల్పమైన సాధనాలతో తన జీవనోపాధికోసరమై అతడు పనిచేస్తుంటాడు. బ్రిటీష్ పరిపాలనా హయాంలో రంగాజీ పెరగవలసివచ్చింది. వారు తమస్వంత దేశంలో ఎంత ప్రజాస్వామిక పరిపాలకులుగా వున్నారా అనే విషయంతో నిమిత్తంలేదు. వారి పరిపాలనా హయాంలో కోట్లాది రైతులు భూస్వాములక్రింద బానిసలుగా, భౌతికమైన నేరస్థులుగా, నిరక్షరాస్యులుగా, రాజకీయంగా కృంగిపోతూ ఆర్థికంగా దోచబడుతూవున్న రోజులవి. ఈ పరిస్థితులలో వివిధ విధాలుగా తమ ఆత్మగౌరవాన్ని కాపాడుకునేందుకు రైతులు సతమతమౌతున్న రోజులవి.

మహాత్మాగాంధీయొక్క వీరోచిత నాయకత్వాన స్వేచ్ఛాస్వాతంత్ర్యాల కోసరం, జాతీయోద్యమం ఆనాటికే బాగా బలపడివుంది. మానవత్వరీత్యా సాంఘికరీత్యా అభివృద్ధి పొందటానికి చేసే ప్రయత్నం అప్పటికే ప్రాధాన్యతకొచ్చి బలపడుతున్నది.

యువకుడైన రంగా తన స్వంత కుటుంబ జీవితాన్నే కాక తన ఇరుగు పొరుగువారు సహితం రైతులుగావుండి, అందులో అధిక సంఖ్యాకులు బీదరికంతోటి, ఆకలితోటి, భయంకరమైన ఈతి బాధలకు ఏవిధంగా గురిఔతున్నారో పరిశీలించాడు. ఈ వికృత దృశ్యం నుంచి ఆయన తన దృష్టిని మరల్చలేదు సరిగదా తన చిన్ననాటి జీవితంలోనె చురుకైన నివారణ చర్యలతో ఈ సమస్యల్ని ఎదుర్కొన్నాడు. తన పసపారవ ఏటనే, అవిద్యతో రంగా పోరాడాడు. రాత్రి పాఠశాలలు నిర్వహించి వయోజనులకు పాఠాలు చెబుతుండేవాడు. ప్రత్యేక గ్రంథాలయాలను నిర్వహించడంలోకూడా ఆయన కృతకృత్యు డయ్యాడు. తన వయోజన విద్యా కార్యక్రమాన్ని అనేక పరిసర గ్రామాలకుగూడ విస్తృతపర్చి చెప్పుకోదగిన విజయాన్ని సత్ఫలితాలతో పొందారు.

జాతీయ, రాజకీయ సాంఘిక సంబంధమైన తన ప్రజల సమస్యల్ని సమర్థవంతంగా పరిష్కరించే కృషిని దృష్టిలో పెట్టుకొని,

హెచ్చు విజ్ఞానాన్ని సముపార్జించుకోవాలనే తృష్ణతో రంగాజీ ఆక్స్ ఫర్డు యూనివర్సిటీ విద్యార్థిగా చేరాడు. వీలైనంత అత్యుత్తమ విద్యాభివృద్ధిని ఇవ్వడమేగాక ఇతరత్రా గూడా, ఆయనకు ఆక్స్‌ఫర్డ్ ఎంతో నేర్పింది. దాదాపు శాస్త్రీయ విజ్ఞానంలో సమానంగా ఆయన జీర్ణించుకోవలసినంత మేధాసంపత్తిని సముపార్జించి పెట్టింది. తన దేశాన్ని ఆవేశించి వున్న వలసపాలనకు సంబంధించి దాని బలమేమిటో – బలహీనమేమిటో అనే వాటికి చెందిన సరిక్రొత్త సమాచారం–విజ్ఞానం ఆయన పొందగలిగారు. కేవలం అది సిద్ధాంతరీత్యానే కాక ఆచరణరీత్యా ఎటువంటిదో గూడా అనుభూతిని పొందారు. అలాగే కేవలం సిద్ధాంతరీత్యానేగాక ఆచరణలో సహితం ఐరోపీయ ప్రజాస్వామ్యానికి చెందిన విజ్ఞానాన్నికూడా ఆయన పొందాడు. ఈ విధమైన నేర్పరితనాన్ని అనుభూతిని, తిరిగి తన దేశానికి వెళ్ళినప్పుడు తన జాతి వెన్నెముక అయిన వెనుకబడివున్న భారత రైతుకు–ప్రజలకు – అప్పగించేందుకు ఆయన తీసుకొని వెళ్ళాడు. ఈ అభిప్రాయాన్ని మనసులో పెట్టుకోబట్టే, పైగా విదేశపరిపాలకులచే ఆక్రమించబడి ఉన్న భారత సివిల్ సర్వీసులో విద్యార్థిగా చేరటానికి రంగా నిరాకరించి తన కృషినంతటినీ ఆర్థిక పరిశోధనలకు వెచ్చించాడు. ''లేబర్ పార్టీ'' ''విజ్ఞాన మందిరాల''లో ఉత్సాహంగా పాల్గొంటున్నందువలన ఆక్స్‌ఫర్డులోని అంతర్జాతీయ లేబర్ గ్రూపులకు కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు రంగా. ఆర్థిక పరిశోధనలో ఆయనకున్న శ్రద్ధ ఐరోపానంతటినీ సందర్శించటానికి దారి చూపింది. ఇక్కడ అమిత తెలివితేటలుగలిగి, సమాజ దృక్పథం కలిగిన ఆయన సతీమణి భారతీదేవి అనుసరించగా ఆయన ఐరోపీయ ప్రజాస్వామ్య ప్రభుత్వ విధానాలను. ఐరోపీయ ఆచరణలను ప్రత్యేకించి ఫ్రెంచి విప్లవాత్మక భావాలను ఆచరణరీత్యా గమనించాడు. రంగాజీ గిల్డ్ సోషలిజం గురించి ప్రత్యేకంగా ఐరోపీయ దేశాలలో సహకారోద్యమాన్ని గురించి దాని నిర్మాణం – అమలును గురించి పఠించాడు. సాంఘిక న్యాయమంటే అమితంగా విశ్వసించేవాడినిగా, అందుకై ధైర్యంగా

పోరాడేవానినిగా ఈ పరిశీలన ఆయనను తయారుచేయటమేగాక, స్వేచ్ఛాయుత సహకార సంఘాలు సాంఘిక న్యాయాన్ని అమలు పరిచే సాధనాలని ఆయన గుర్తించేటట్లు చేసింది. ఈ పరిశీలనలే రాజకీయంగా ఆయన నిర్ణయాలను బలపర్చుకునేందుకు దోహదమైనవి.

## చిన్ననాట రాజకీయ సాంఘిక కార్యక్రమాలు

శాస్త్రీయమైన సాంఘికమైన విజ్ఞానంతో – భావాలతో భారత దేశానికి వచ్చిన తరువాత రంగాజీ అనతికాలంలోనె తన ప్రజలకు వాటిని అందజేయ గలిగాడు. 1923 లో అప్పికట్ల రైతాంగంతో జరిపిన సమావేశం ఆయన ప్రథమ బహిరంగసభ. తమకై తాము యజమానులు కాగలిగినట్లు, తమ చారిత్రక లక్ష్యాన్ని అందుకునేట్లు, వారు సుసంఘటితం కావాలని ఆ సమావేశం ద్వారా ఆయన వీరోచితంగా ప్రకటించారు. "స్వప్రభుత్వం ద్వారా పరాయి ప్రభుత్వాన్ని తొలగించుకోవటమే గాకుండా సాంఘిక న్యాయాన్ని – సమానత్వాన్ని భ్రాతృత్వాన్ని కూడ స్థాపించుకోవా"లని ఆ రైతులతో పాటు యావద్భారత దేశానికి ఆసందర్భంలో ఎలుగెత్తిచాటాడు. వయోజన ఓటింగ్ కోసరమై ఆయన తక్షణం ప్రారంభించిన ఉద్యమం యొక్క ఆవశ్యకత మహాత్మా గాంధీజీచేత పొగడబడి ఆమోదించబడింది. ఈ యువ రాజకీయ పోరాటకుడు – మేధావి ప్రకటించే దేశభక్తి పూరిత ఆశయ నిర్వచనలకు ఆ ప్రముఖ జాతీయ నాయకుని ఆశీర్వచనాలు ఇంతటితో ఆగక ఎన్నోమారులు లభించాయి.

భారతదేశం ఒక రైతులదేశం అనే నిర్వచనలో రంగాజీ తన రాజకీయ సాంఘిక బోధలను ప్రారంభించాడు. రైతాంగపు ఆర్థిక స్థితిని పురోగమింప చేయటం ద్వారా అభివృద్ధి పర్చటంద్వారా, గ్రామాలను పునర్నిర్మాణం చేయటం ద్వారా మాత్రమే జాతి మొత్తానికి రాజకీయ సాంఘిక అభ్యున్నతి సంప్రాప్తం కాగలదని చాటాడు. తన ఈ మూలసిద్ధాంతాని కిరువైపులా "భారతీయ గ్రామీణ ఆర్థిక వ్యవస్థ" అనే పుస్తకాన్ని రంగాజీ రచించారు.

మద్రాసు కాలేజీలో ఆర్థికశాస్త్రాచార్యుడుగా ఉద్యోగం సంపాదించటానికి ఈ పుస్తకమే కారణం. 1927 లో అతిభయంకరమైన కరవు రాక్షసి ఆంధ్రరాష్ట్రంలోని చాలా ప్రాంతాలలో స్వైరవిహారం చేసినప్పుడు ఆచార్యరంగా ఆహారాన్ని గడ్డిని వసూలు చేయటానికి రైతులకు సహాయం చేయటానికి ఒక ఉద్యమాన్ని ప్రారంభించాడు. ఆయన చేసిన సేవకు ప్రతిఫలంగా వారు ఆయనను ''అన్నదాత'' అనే బిరుదిచ్చి పిలుచుకోనారంభించారు.

## రైతు ఉద్యమం

ఇంతటితో ఈ యువ ఆచార్యుడు ఆగలేదు. ఆయన జన్మతః ఏవిధంగా చూచినా అసలు అర్థం ప్రకారం ఒక సంపన్నుడు కానే కాడు. ఆయన కిసాన్ సభ్యత్వం ప్రారంభించి, కష్టజీవులైన రైతుల్ని దారుణంగా దోచుకుతింటున్న జమీందారులను వ్యతిరేకంగా పోరాడే ఒక బలమైన సాధనంగా, తయారుచేశాడు. ఈవిధంగా డాక్టరు రంగా జమీందారుల రద్దును కాంగ్రెసు ఆ సమస్యను తీసుకోవటానికి పదిహేను సంవత్సరాల క్రితమే, భారత దేశంలో ప్రారంభించాడు. ''జమీందారీ గ్రామాల ఆర్థిక స్థితిగతుల సమీక్ష'' అనే ఒక ప్రత్యేక పుస్తకాన్ని కూడా ఈ సమస్యను వివరిస్తూ ఆయన వ్రాశారు. దీనిద్వారా ఆయన ప్రదర్శించిన విజ్ఞానాన్ని పురస్కరించుకొని మద్రాసు శాసన సభ చేత ఏర్పాటుచేయబడిన విచారణ సంఘానికి ఆయన కార్యదర్శి అయ్యాడు. కొండజాతుల ఆర్థిక స్థితిగతుల్ని సమగ్రంగా పరిశీలించిన తరువాత ''నీలగిరి కొండజాతులు'' అనే ఒక పుస్తకం వ్రాశారు. అది మహాత్మాగాంధీజీ పొగడ్తల నెంతగానో అందుకున్నది.

## రంగాకు తొలి సంకెళ్ళు

మహాత్మాగాంధీ తన సత్యాగ్రహోద్యమాన్ని భారతదేశంలో పరాయి పరిపాలనను నిరోధించే నిమిత్తం తీసుకున్న చర్యలలో అత్యంత బలీయమైన చర్యగా 1930 - 32 లో ప్రారంభించినప్పుడు

ఆచార్య రంగా తన ఉద్యోగానికి స్వస్తిచెప్పి జాతీయ స్వాతంత్ర్యానికి తన అవకాశలను శక్తియుక్తులను పూర్తిగా వినియోగించ పూను కున్నారు. ఇంతకుముందే డాక్టరు రంగా, వేసిన పంటలు – తద్వారా లభించిన ఆదాయాన్నిబట్టి, భూశిస్తును మరల మదింపు కట్టాలనే ఆలోచనలను కొంతకాలంపాటు చెబుతూ వుండేవాడు. ఎవరైతే ఆదా యపు పన్నులను చెల్లిస్తున్నారో – చెల్లించవలసివుందో వారి మధ్య న్యాయమైన పంపిణీకి ఇది ఒకరకమైన ప్రతిపాదన. పరిపాలకుల వలన అమలుచేయబడుతున్న అన్యాయానికి వ్యతిరేకంగా నడిపిన ఈ పోరా టానికి ఆయన నాయకత్వాన్ని వెనువెంటనే రైతులు ఆమోదించారు. డాక్టరు రంగాను అధికారులు తక్షణమే బంధించారు. అయితే జైలులోగూడా అనేక పుస్తకాలు వ్రాయటంలో కృతకృత్యు డయ్యాడు. ''ఆధునిక రాజ్యాంగ సంస్థలు'' అనే పుస్తకం వాటిలో ఒకటి.

## భారత రైతాంగ విద్యాలయం

జైలునుంచి బైటబడిన తరువాత మరల రంగాజీకి విరామం లేదు. భారత స్వాతంత్ర్యపోరాటంలో యోధులను, విజయానంతరం భారత ప్రజాస్వామ్య పునరుద్ధరణ కర్తలను ఎన్నుకునే నిమిత్తం యువకులకు తరిఫీదు యివ్వటానికి పూనుకున్నారు. లక్షలాది భారత రైతాంగం ప్రోత్సాహవంతంగా యిచ్చే సహకారంతో తాను భారత రైతాంగ విద్యాలయం అనే ఒక సంస్థను తన స్వగ్రామమైన నిడు బ్రోలులోనే ప్రారంభించాలని అభిప్రాయపడ్డారు. ఈ ఆలోచన త్వరలోనే జయప్రదంగా కార్యరూపానికి వచ్చింది. 1933 లో మహాత్మా గాంధీ స్వయంగా ఈ విద్యాలయానికి ప్రారంభోత్సవం చేశారు. అప్పటినుంచి గ్రామ పునరుద్ధరణకు సంబంధించిన రాజ కీయ పరిజ్ఞానానికి, ఆర్థిక పాఠాలకు, ప్రణాళికలకు మాత్రమేగాక, భారత రైతాంగంయొక్క యాత్రలకు సంబంధించిన ఒక ఆశ్రమంగా అది మారిపోయింది. ఎందుకంటే తమ మహానాయకుడైన యన్. జి. రంగా జన్మస్థలంతో అది పెనవేసుకుపోయింది.

## పార్లమెంటులో

కేంద్ర పార్లమెంటుకు 1934 లో డాక్టరు రంగా ఎన్నికై తన నూతన రాజ్యాంగ జీవిత దశను ప్రారంభించారు. ఆయన అప్పటి వరకూ కొనసాగించిన స్థానిక కార్యకలాపాలు జాతీయ ప్రాధాన్యతకు చేరుకుని పోదకు దేశం ముస్త్యానిక వర్తింపేవిగా మారిపోయినవి. ఆయన పార్లమెంటరీ కార్యకలాపాలన్నిటినీ ఇక్కడ సమీక్షించుట పర్వటం అంత తేలికైన పని కాదు.

ఉదాహరణకు ఆయన రైతులకు ట్రేడ్ యూనియన్ లను ఏర్పర చాలని, రైతాంగోద్యమానికి జాతీయ ప్రాధాన్యతను సంపాదించే దృష్టితో ఒక బిల్లును ప్రతిపాదించారు. పండిత నెహ్రూచే బలపర్చబడిన 'వాహిని' అనే తెలుగు వారపత్రికను 1936లో ఆయన స్థాపించారు. గ్రామీణ ప్రజల హక్కులకు ఈ వారపత్రిక అంకితమై వాటిని అభివృద్ధి పర్చటానికి పనిచేస్తుంది. తమను తాము ఎలా రక్షించుకోవాలనే విషయంలో అది రైతులకు సలహాలను ఇస్తుంది. కొన్ని రాష్ట్రాలలోని రైతులకు డాక్టరు రంగాగారి కార్యక్రమాలు ఎంతో అభిలాషను రేకెత్తించినవి. ఉదాహరణకు మందసా ఎస్టేటులో రైతులు తిరుగుబాటుచేసి జమీందార్లకు పుల్లరి చెల్లించ నిరాకరించారు. బ్రిటీష్ అధికారులు జమీందారులకు రక్షణ యిచ్చారు. డాక్టరు రంగా ఆయనకు విశ్వాసపాత్రుడైన సర్దార్ లచ్చన్న నిర్బంధంలోనికి తీసుకోబడ్డారు. నిర్బంధంనుంచి బైటబడిన తరువాత, డాక్టరు రంగా ప్రజ్వరిల్లిన ధైర్యోత్సాహాలతో జమీందార్లకు వ్యతిరేకంగా రైతుల హక్కులను కాపాడే దానికి పరాయి ప్రభుత్వంనుంచి స్వాతంత్ర్యాన్ని పొందేందుకు తీవ్రమైన పోరాటాన్ని కొనసాగించారు. రంగాజీ 1942 లో రెండవమారు అరెస్టు చేయబడ్డారు. నాలుగున్నర సంవత్సరాలపాటు అనేక జైళ్ళకు మారుస్తూ శిక్షింపబడ్డారు. ఈ జైళ్ళల్లోవుండే రైతు కూలీ కళాకారుల బుద్ధిజీవుల రాజ్యానికి సంబంధించిన ఆలోచన

భారతదేశ రాజకీయ, ఆర్థిక, సాంఘిక, పురోభివృద్ధికి ప్రజాస్వామ్య యుతమైన అభ్యుదయకర మిశ్రమ సూత్రంతో "విప్లవ రైతాంగం" అన్న గ్రంథాన్ని రచించారు. సాంఘికంగా రైతులు విప్లవకారులు కారనే మార్క్సిస్టు దృక్పథమును చెందిన సిద్ధాంత భాగానికి జవాబుగా పురాతన భూస్వామ్యంతో – బానిసలుగా అణగగొట్టిన సిద్ధాంతా లతో జరిపిన పోరాటాలలో ప్రపంచమందంతటా రైతాంగం వెన్నె ముకవోలె ఎలా పోరాటాలు జరిపారో అసంఖ్యాకమైన చారిత్రక ఉదాహరణలు చూపుతూ ఆ గ్రంథం వ్రాశారు. ఇన్ని శతాబ్దాల కాలంనుంచి తమ సిద్ధాంత రాజకీయ పోరాటాల నన్నింటినీ సాంఘిక న్యాయం, స్వేచ్ఛాభాతృత్వం ఆశయాలుగా రైతులు ఎల్లప్పుడు ప్రకటించుకుంటూ వచ్చారు. ఇక్కడ రంగాగారి ప్రవర్తనచూచి నప్పుడు మనకు ఉత్సాహం పుట్టుకొస్తుంది. గాంధీజీ అహింసాయుత ఉద్యమానికి ఆయన విధేయుడైనప్పటికీ, రంగా రైతు మనస్తత్వంతో దృక్పథంతో అత్యంత సన్నిహిత సంబంధాన్ని కలిగివుండి గ్రామీణ ప్రజల ప్రత్యేక రాజకీయ ప్రవర్తనను, విప్లవ తత్వాన్ని నొక్కి చెబు తుంటారు. రైతాంగ శత్రువులు ఈ అంశాలను నిరాకరిస్తారు. అదేమాదిరి, కమ్యూనిస్టులు ఈ అంశాలను రైతాంగానికి వున్నవని ఆమోదించరు. పారిశ్రామిక కూలీ నియంతృత్వాన్ని సేవించటా నికి "కార్మిక తరగతిని" మాత్రమే విప్లవతత్వం ఉన్నట్లు సమర్థించు కుంటుంటారు.

## కమ్యూనిజానికి ప్రబల శత్రువు

1945 లో జైలునుంచి బైటకు వస్తూనే డాక్టరు రంగా తన ప్రజాస్వామికమైన ఆలోచనలను బహిర్గతం చేస్తూ కమ్యూనిస్టుల యొక్క నిరంకుశత్వంపట్ల, ప్రపంచాధిపత్యం సంపాదించటానికి కమ్యూనిస్టులు ప్రతిపాదిస్తున్న దుందుడుకు ప్రణాళికలపట్ల ఒక నిర్దుష్ట మైన చర్యకు నిలబడ్డారు. జైలులో ఆయన వ్రాసిన పుస్తకాలు : "జాతీయ విప్లవంయొక్క ప్రపంచపాత్ర"—"వలస రంగు జాతుల

ప్రజలు'' ఇత్యాదివి. ఇవి రెండూ ఆయన జరిపే పోరాటాలలో పరాయి ప్రభుత్వం పైననేగాక, ప్రపంచవ్యాప్త కమ్యూనిస్టుకుట్రపై కూడ అత్యుత్తమమైన - అతి సునిశితమైన ఆయుధాలు. 1945 జనవరిలో డాక్టరు రంగా కమ్యూనిజంపైన బాహాటమైన విమర్శను ప్రారంభించి కమ్యూనిస్టుల హింసాతత్వాన్ని ఎదుర్కొనటానికి వారికి జవాబివ్వటానికి రైతులెల్ల సన్నద్ధులై వుండవలసిందిగా హెచ్చరించారు. అది వారి రైతాంగపు సంస్థలన్నింటినీ బలపరచుకోవటం ద్వారా సంఘటితపరచుకోవటంద్వారా జరగాలని సూచించారు. రైతు, యువకుల, విద్యార్థుల కాంగ్రెసు సంస్థలలో వ్యవసాయదారుల సంఘాలలో కమ్యూనిస్టులు జొరబడకుండా నిరోధించే దానికి రంగా నిర్మాణాత్మక కృషితో కూడిన యువ, విద్యార్థి కాంగ్రెసు సంస్థల్ని వ్యవస్థీకరించి తద్వారా కమ్యూనిస్టు ప్రయత్నాలను అణగగొట్టే విషయంలో కృతకృత్యులయ్యారు.

1947 మే లో లండన్ లో జరిగిన అంతర్జాతీయ వ్యవసాయ ఉత్పత్తిదారుల సమాఖ్యయొక్క వ్యవస్థీకృత సభలకు హాజరైన తరువాత, డాక్టరు రంగాజీ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకు అధ్యక్షుడుగా ఎన్నికైనారు. దానితో ఆంధ్రలోని కాంగ్రెస్ సంస్థను యువ-విద్యార్థి-మహిళా ఉద్యమాలతో వాస్తవికమైన ప్రజా ఉద్యమ సంస్థగా మార్చివేశారు.

## భారత వ్యవసాయదారుల పార్టీ నిర్మాత

భారత స్వాతంత్ర్య సముపార్జనకు కాంగ్రెస్ పార్టీని వ్యవస్థీకరించి, బలపర్చి, పోరాటం నడిపించే విషయంలో ఆయన చురుకుగా వున్నప్పటికి రంగా తరచు కాంగ్రెసు పార్టీలోని అధికారవర్గంవారి ప్రవర్తనపట్ల విమర్శనాత్మకంగా వుండేవారు. ఆవర్గం దేశవ్యాప్తంగా రైతు సంస్థలపట్ల వివక్షత చూపుతుండేది. బహుళా రైతుజనావళి సంఖ్యలో చాల హెచ్చుగా వున్నందువలన, రంగా ప్రతిపాదించిన ప్రజాస్వామిక రైతాంగ ఆశయం అధికృతపొంది కాంగ్రెస్ పార్టీలో

రంగా వ్యక్తిత్వం ఒక కొరకరాని కొయ్యగా మారుతుందేమోనని వారు భయపడి వుండవచ్చు. మహాత్మా గాంధీ ఎంతకాలమైతే బ్రతికివున్నారో అంతకాలం డాక్టరు రంగా కాంగ్రెస్ అధిష్టానవర్గంపై చేసే విమర్శలు ఒక అంగీకారానికి వచ్చేందుకు, అవగాహన చేసుకునేందుకు అనుకూలంగా గ్రహించబడుతుండేవి. గాంధీజీ మరణాంతరం రైతాంగ ఉద్యమ అనుచరులలో అనేకమంది కాంగ్రెస్ పార్టీని వదలివేయవలసినంత మేరకు పరిస్థితులు దారితీసినవి. తుట్టతుదకు గాంధీజీ మరణాంతరం, రైతాంగ ప్రధాన కోరికలకు తదితర శ్రమజీవుల ఆకాంక్షలకు భారత సమాజంలో తగిన రక్షణకు కాంగ్రెస్ పూనుకోవటం లేదనే అభిప్రాయానికి డాక్టర్ రంగా రావలసివచ్చింది. అంతటితో ఆయన కాంగ్రెస్ పార్టీని వదలివేశారు. దాదాపు కాంగ్రెస్ పార్టీలోని నలభైమంది పార్లమెంటరీ బృందం మద్దత్తుతో కృషీకార్ లోక్ పార్టీ అనే రైతాంగపార్టీని స్థాపించారు. పార్లమెంటులో, దేశంలోనూ, అది అనతికాలంలో ఒక ప్రముఖ రాజకీయ శక్తిగా మారింది. ఏమైనప్పటికి, రాష్ట్రాలలో కమ్యూనిస్టు ప్రమాదం ప్రస్ఫుటితమైనప్పుడు డాక్టర్ రంగా కాంగ్రెస్ పార్టీలోనే వుండి, పార్లమెంటులోని ఇతర కాంగ్రెస్ పార్టీ సభ్యులతోపాటు తాను గూడ కలసి ఓటు చేసేదానికి ఒప్పుకోవలసి వచ్చింది.

## రైతులపార్టీ : కాంగ్రెస్‌తో దానికున్న సంబంధాలు

1955 లో జరిగిన ఎన్నికల సందర్భంలో ఆంధ్రరాష్ట్రంలో తన బలం తగ్గిపోయి, కమ్యూనిస్టులు జయించవచ్చునని గ్రహించిన నెహ్రూ డాక్టర్ రంగా వైపు తన దృష్టిని మళ్ళించి ఆయన లోక్ పార్టీని కాంగ్రెస్‌లో సంలీనం చేయవలసిందని కోరారు. రైతాంగ దృక్పథంరీత్యా వారి అభివృద్ధికి తాను చేయగలిగినదంతా చేస్తాననే ప్రమాణాలు చేశాడు శ్రీ నెహ్రూ. భారత రాజకీయాలలో రైతాంగానికి సముచిత స్థానం ఉండగలదని, వారి ఆర్థిక సాంఘిక హక్కుల సంరక్షణకు న్యాయబద్ధమైన స్థానం ఉండగలదని హామీ యిచ్చాడు.

నెహ్రూగారితో అటువంటి ధోరణిలో ఒక అంగీకారానికి రావటానికి అనేకమంది స్థానిక రైతునాయకులు తమ ప్రాతికూల్యం చూపారు. అయితే, రంగా ఎప్పుడూ భారతజాతి సంక్షేమానికి ప్రథమ ప్రాధాన్యత యిచ్చేవాడుగనుకనూ, ఆ తరువాతనే తన పార్టీకి ప్రాధాన్యతను యిచ్చేవాడుగనుకనూ, రెండవమారుగా, తాను ఏనిర్ణయం చేయాలనే విషయంలో, బాధ్యతను తానే తీసుకొన్నాడు. ఎంతో బాధను ఓర్చి, విపరీతంగా పోరాడి సంపాదించిన రాజకీయ గౌరవాన్ని సహితం ఆ నిర్ణయం నాశనంచేయనున్నదనే ఒక ప్రమాదాన్ని సహితం తెలుసుకొనికూడ ఆయన ఆ విధంగా ప్రవర్తించాడు. ప్రజాస్వామ్యయుతంగా చేతులు కలిపిన ఫలితంగా కమ్యూనిస్టులు ఓడిపోయారుగాని ఈమారు వెనువెంటనే, సామాన్య కార్యకర్తలనే గాక, స్థానిక గ్రామీణ నాయకులతో సహా రంగాకూడ నిస్పృహ చెందారు. భారత గ్రామీణ సంస్థకిచ్చిన తన హామీలను పండిత నెహ్రూగారు నిలుపుకోలేదు. ఒక వైపున అసంతృప్తి వున్నప్పటికీ రంగా, కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ కార్యదర్శి పదవిని నిర్వహిస్తూనే వున్నప్పటికి మరొకవైపున భారత గ్రామీణ సంస్థయొక్క జనావళిని బలపర్చటనే విషయంలో ఆయన కృషిచేస్తూనే వుండవలసివచ్చింది. ఎందుకంటే, ఏదో ఒక రకంగా అద్యతన భావిలో అది తన ప్రత్యేకతను ఋజువు పరుచుకోవలసిన ఆవశ్యకత వుండనే వుంటుందని ఆయన అభిప్రాయపడ్డారు. ఆయన మిత్రులలో కొందరు—ఆంధ్రరాష్ట్రంలోని తిమ్మారెడ్డిగారు, పంజాబు రాష్ట్రంలోని చౌదరి సురాజ్ మల్ గారు—ఇంకా స్థానిక మంత్రివర్గంలో స్థానాలను నిర్వహిస్తూనేవున్నారు.

ఇన్నింటిగా ఆయన ఎంతో ఉత్సాహవంతంగా పనిచేస్తూవున్న దానిలో భాగస్వామిగా డాక్టర్ రంగా "భారత అంతర్జాతీయ వ్యవహారాల సంఘాన్ని" (అంతర్జాతీయ సమస్యలపట్ల పరస్పర అభిప్రాయ ప్రకటనల కోసరం) స్థాపించి దాని తరఫున ఎన్నో వ్యాసాలు వ్రాశారు. "గ్రామీణ ప్రజాసంస్థల సమాఖ్య"కు ఆయన అధ్యక్షుడు గూడ. దీని శాఖోపశాఖలు దేశమంతటా వున్నవి. "అఖిల

భారత సహకారసంస్థకు'' ఆయన ఉపాధ్యక్షుడు. ఈ సంస్థయొక్క ప్రతినిధిగా ఆయన 1957 జూన్ మాసంలో కమ్యూనిస్టు రాజ్యమైన బల్గేరియాకు వెళ్ళి బల్గేరియన్ కో ఆపరేటివ్ యూనియన్ లో పాల్గొన్నారు. దురదృష్టవశాత్తు ఈనాడు అది కమ్యూనిస్టుల ఏక పక్ష నిరంకుశపాలన అజమాయిషీలో వుంది, అది కేవలం కమ్యూనిస్టులయొక్క రాజకీయ ఆర్థిక నియంతృత్వ సాధనకు ఒక పరికరంగా మాత్రమే ఉపకరిస్తుంది. అయితే స్వేచ్ఛాయుతమైన - ప్రజాస్వామికమైన సహకార సంస్థల ఆవస్యకతను అక్కడ నొక్కి చెప్పే విషయంలో రంగా అమితమైన నైతిక ధైర్యంతో వ్యవహరించారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ప్రచారానికి ప్రతిబింబ నృత్యాలను జాగ్రత్తగా వ్యవస్థీకరించే విషయంలో కావలసిన సమస్త సూచనలను చేసే మాస్కోలోని, సోఫియాలోని ఎర్ర నిరంకుశులను ఆయన కదిపివేశాడు.

వాస్తవం ఏమిటో తెలుసుకోవటం కోసరం రంగా భారత పార్లమెంటరీ ప్రతినిధివర్గ సభ్యుడుగా సోవియట్ యూనియన్‌ను గూడా సందర్శించారు. రైతుల్ని, స్వేచ్ఛాప్రపంచంలోని తదితరుల్ని కమ్యూనిస్టు ప్రమాదం గురించి హెచ్చరించే సందర్భంలో ఇప్పుడు ఆయన మరింత సాపేక్షకంగా మాట్లాడ గలుగుతున్నారు.

## కాంగ్రెస్‌పార్టీనుంచి చీలిక

కేవలం జీవించటం కోసరమే రైతులకు స్వాతంత్ర్యం అని గాకుండా, తమ చిన్నముక్కలకు తామే యజమానులుగా కుటుంబ కష్టంతో దానిని వారు సాగుచేసుకుంటారు గాబట్టి రంగా వారి స్వాతంత్ర్యానికి మద్దతుగా మాట్లాడుతూ, కమ్యూనిస్టు తరహాలో భూమిని సమిష్టీకృతం చేయటానికి అది మాస్కోతరహాలోవున్నా పెకింగ్ తరహాలోవున్నా ఆయన ప్రబల విరోధి. అందరు రైతాంగ ఆశయకర్తలమాదిరిగానే రంగాజీ భూమిపై వ్యక్తిగత యాజమాన్యాన్ని కలిగి, ఒకరిని దోచుకోకుండా స్వంతశ్రమను ఉపయోగ

పెట్టుకుని భూమిని దున్నుకునే రైతు స్వామ్యాన్ని నమ్ముతారు. అంతేగాకుండా, అది దోపిడీనుంచి రక్షించుకునే ఒక హామీగానూ, రైతుల స్వాతంత్ర్యాన్ని – గౌరవాన్ని – మానవత్వ విలువను పరిరక్షించ గల అజేయ కృషిగా, ఇతర సాంఘిక వర్గాలతో పాటు సాంఘిక రాజకీయ న్యాయాలకు పునాదిగానూ వుండగలదు. ప్రస్తుతానికి కుటుంబంయొక్క సంక్షేమానికి అది ఒక సాధనమే గాకుండా రానున్న తరాలవారికికూడా వర్తిస్తుంది. నెహ్రూగారి కాంగ్రెస్ పార్టీచే ప్రతిపాదించబడిన ప్రణాళికలను వ్యతిరేకించడానికి డాక్టరు రంగాకు ఈ అభిప్రాయాలే ప్రాతిపదికలుగా వుంటున్నవి. చైనా తరహాలో భారతదేశంలోని భూమిని సమిష్టికరణ క్రిందకు తేవాలని కాంగ్రెస్ అభిలషిస్తున్నది. ఈ ప్రణాళికలు కాంగ్రెస్ పార్టీతో డాక్టర్ రంగా, ఆయన రైతాంగ పార్టీ విడివడటానికి కారణభూతాలైనవి. వ్యవసాయాన్ని సమిష్టికరణ క్రిందకు తేవటం భారత రైతాంగానికే ప్రమాదకరం గానటమే గాక, భారత దేశంయొక్క జాతియొక్క స్వాతంత్ర్యానికే భంగకరమని రంగాజీ అభిప్రాయం. ఈ ప్రణాళికా బద్ధమైన సమిష్టికరణ డాక్టరు రంగాను ఆయన మిత్రులను మరొక గొప్ప భక్తుడు, రాజ్యాంగవేత్త అయిన శ్రీ రాజగోపాలాచారితో చేరి ఒక క్రొత్త పార్టీని భారత స్వతంత్ర పార్టీ అనే పేరులో స్థాపించటానికి దోహదమిచ్చింది. దీని ప్రాథమిక సూత్రంగా భారత ప్రజల స్వాతంత్ర్యం, వ్యక్తి, ఆస్తి పరిరక్షణ వున్నది.

## ప్రపంచ రైతాంగ ప్రతినిధి

ఆయన వ్రాసిన ముప్పది గ్రంథాలలో చిట్టచివరిదైన "ప్రపంచ రైతాంగవాణి" అనేది 1957లో ప్రకటించబడింది. భారతదేశంలో నేను వున్న చివరిదశలో ఈ గ్రంథంయొక్క ప్రతినొకదానిని నాకు బహూకరించారు. రైతాంగంమీద, వారి ఉద్యమాలమీద మార్క్సిస్టు – లెనినిస్టు – స్టాలినిస్టులు సాంఘిక వ్యతిరేకములనీ ప్రతీఘాతకములనీ చేసే దండయాత్రలకు ఇది ఒక జవాబు. ఈ పుస్త

కంలో, రైతాంగపు అతిప్రధానమైన చారిత్రక హక్కుల - అభిప్రాయాలకు అనుగుణంగా అత్యద్భుతమై పరిపక్వమైన వాదనలున్నవి. వాస్తవానికి, ప్రపంచ రైతాంగానికి ఇదొక ఆధునిక బైబిల్ అనే భావనకు దోహదమైందని నేను అభిప్రాయ పడుతున్నాను.

నేను మొట్టమొదటిమారుగా రంగాను కల్సుకున్నప్పుడు, నాలోవున్న రైతు రక్తకణాల ప్రజ్వలన జనితమైన అతిగాఢమైత్రి ఆయనపట్ల నాకు ఏర్పడింది. రంగా అంతర్జాతీయ రైతు సమాఖ్య సమావేశాలలో మాట్లాడుతూ వుంటే నేను విన్నప్పుడు నాకు ఆయనపట్ల సోదర భావం ఏర్పడి వెల్లుబికింది. అయితే నేను భారత దేశాన్ని సందర్శించినప్పుడు, ప్రత్యేకంగా విజయవాడలో జరిగిన ఉత్సవంలో భాగస్వామిని కాగలిగిన సదవకాశం నాకు లభించినప్పుడు, నిడుబ్రోలులోని రైతాంగ విద్యాలయంలో ప్రవేశించుచున్నపుడు, అటుపిమ్మట కుండపోతగా కురిసే వర్షపుధారలగుండా ఈ భారత రైతు ఉద్యమ పితామహుడు పుట్టిన జీర్ణగృహాన్ని తిలకిస్తున్నప్పుడు,(బల్గేరియాలోని స్టాలిట్సా అనేచోట అలెగ్జాండర్ స్టాంబోలిస్కి ఉద్భవించిన స్థలాన్ని నేను చూచాను. ఈ సందర్భంలో నాకు ఆ స్థలం గుర్తుకొచ్చింది.) ఆయన నాకు ఎంత ఆప్తుడైనాడంటే, నా స్వంత పితృభూమిలో వున్న వీరులు నా హృదయ ఫలకంపై ఎంతటి పవిత్ర జ్ఞాపక చిహ్నాలకు చెందిన ముద్రలు వేశారో వారి ప్రక్కననే రంగాజీకి స్థానమిచ్చి భద్రపర్చుకున్నాను.

భారత రైతాంగం యొక్క అసంఖ్యాక పుష్పమాలలకు మాత్రమే రంగా అర్హుడనిగాక యావత్ప్రపంచం యొక్క రైతాంగ పుష్పగుచ్ఛాలను సమర్పించుకోవటానికి ఆయన యోగ్యుడని నా మనసుకు విదితమైంది. తన స్వంత ప్రజల గౌరవాన్నేగాక - యావత్ ప్రపంచ ప్రజల గౌరవాన్ని ఆయన సముపార్జించుకున్నాడుగాన నేను ఈ మహావ్యక్తిని ఎలా గౌరవించుకోవాలనో నేర్చుకున్నాను.

సర్వశక్తి సమన్వితుడైన ఆ భగవంతుడు ఆయనకు, విశ్వాస పాత్రురాలు – ధీశాలిని అయిన ఆయన అర్ధాంగికి రానున్న అనేక ఏండ్లపాటు వారు అమిత చైతన్యవంతులుగా వుండేందుకు, తమ లక్ష్యాలను సాధించుకునేందుకు, ఆ సాధించిన ఆ మహోన్నత ఆశయాలను తాము స్వయంగా చూచి వాటిమధ్య జీవించేందుకు ఆయురారోగ్యాలను నైతికశక్తిని ప్రసాదించవలసిందిగా మనం ఆయనను ప్రార్థిద్దాం. వారి ఆశయాలే భారత రైతాంగ ఆశయాలు. అవే ప్రపంచమందంతటావున్న శ్రమజీవుల ఆశయాలు.

మానవ స్వాతంత్ర్యానికి, ఆనందానికేగాక, భవిష్యత్ భారత తరాలవారి కొరకు, ప్రపంచంలోని అన్ని జాతుల స్వేచ్ఛాప్రియుల కొరకు జీవితమంతా త్యాగాలకే అర్పితం చేసిన ఆచార్య రంగా ముందు వినమ్రతతో నేను తలవంచుతున్నాను.

జ్యోతి ప్రెస్, తెనాలి